# రాజర్షి

శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారి బంగాలీనవలకు

తెనుఁగు

శ్రీ గరిమెళ్ల. సత్యగోదావరిశర్మ గారిచే

విరచితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1922.



A

ఓం నమస్సర్వేశ్వరాయ.

# పితృగురుదేవతాభివందనము.

---

శా. పేర్మిన్ నన్గని పెంచినారు సుతుఁడే పెన్నోక్షమం చెంచినా
రామోదంబును గాంచినారు జగదీశాధీనులై మించినా
రామాన్యాత్ములఁ దండ్రినిన్ జననినే నర్చింతు నెల్లప్పుడున్
రామస్వామిని బుచ్చమాంబికను శ్రీరంజిల్ల సద్భక్తితోన్. 1

శా. నాపైఁ బ్రేముదలిర్ప నోన్నమయనన్ నంజేసి నాఁడాదిగాఁ
బ్రాపై యాంధ్రికళారహస్యముల సర్వస్వం బెఱింగించినాఁ
డా పాండిత్యనిధాను సద్గురునినే నర్చింతు మద్భావునన్
శ్రీపాదాన్వయునిన్ గృపానిలయునిన్ శ్రీసూర్యనారాయణున్. 2

మ. పరిపూర్ణాత్ముని నిష్కలాన్వయ సుధావారాశితారేశునిన్
సరసస్వాదుకవిత్వసత్త్వుని మహాసామ్రాజ్యదక్షోన్నతున్
చరితార్థవ్రతు రామజోగి బుధు భాస్వద్దివ్యవిద్యామనో
హరునస్మద్గురునిన్ భజించెదను యోగానందనాథున్ మదిన్. 3

క. కవిలిగకృష్ణాచార్యుని, నవిరళ మతియుతుని నస్మదజ్ఞానతమ
స్సవితృని సాహిత్యాచార్యవిరాజిత బిరుదుఁగొలుతు నస్మద్గురునిన్. 4

మ. అలఘూద్యత్ప్రతిభావిభాసితుని శబ్దార్థాగమాధ్యాపనో
జ్జ్వలమేధాంచితశిష్యసంయుతుని గీర్వాణాంధ్రసర్వస్వ వ
ఝ్ఝులవంశోన్నతు విద్విషత్ప్రకరగర్జన్మేఘఝంఝానిలున్
దలఁతున్ సద్గురు సంతతంబుఁ జినసీతారామశాస్త్రిన్ మదిన్. 5

క. ప్రకృతియె దైవంబందురు
ప్రకృతికిఁ బరుఁడందు రతని భావజ్ఞులు త
త్ప్రకృతికిఁ బరునకుఁ బరుఁడని
ప్రకటించెద రతని నెపుడుఁ బ్రణుతింతుమదిన్. 6

సీ. వేదశాస్త్రరహస్య విజ్ఞానియై సుధీమణులలో నెన్నఁగనియె నెవఁడు
కనదాంధ్రభాషావికాస నిదానమై వాది భారతిఁగన్న యయ్య యెవఁడు
సంస్కృతాంధ్రగ్రంథసారస్వతమ్ము ప్రకటించి సత్కీర్తి నార్జించె నెవఁడు
వైదికకులసుధావారాశినుదయించి యాంధ్రసద్గుణచంద్రుఁడయ్యె నెవఁడు
తే. ఆతని నఖిలవంద్యు ననఘు రామస్వామి
శాస్త్రివర్యు శైలజాసపర్యు
విబుధనిచయగేయు విశ్వసంస్తవనీయుఁ
దలఁతు నాదు కృతులు చెలఁగు కొఱకు. 7

గరిమెళ్ల. సత్యగోదావరిశర్మ.

# విషయసూచిక.

# ప్రస్తావన.

---

ఇప్పటి యాంధ్రులజీవితములందుఁ బలు తెఱఁగు లగు ప్రోత్సాహములు గలిగి యుక్తాయుక్తవివేచనములును, విలువలును (Values) దాఱుమాఱగుచున్నట్లే యాంధ్రులసాహిత్య చరిత్రమునందును సారస్వతదోషముల 'విలువలు' తాఱుమాఱగుచున్నవి. ఆంగ్లసాహిత్యశాస్త్రవిజ్ఞాననాగరకసంపర్కమున దిగ్భ్రమ గలిగి యాంగ్లానుకరణమే లెస్స యని తోఁచిన నాఁటనుండి యాంధ్రసాహిత్యమున కొక క్రొత్తయుగ మేర్పడినది. దానికిఁ గలగుణవిశేషము పాశ్చాత్యనాగరికసంశ్లేషము. అప్పటివిద్యాధికులకుఁ బ్రాచ్యపాశ్చాత్యనాగరికతల వైరుధ్యమే కాని సమన్వయ మెచ్చటను దోఁపలేదు. వారిరచనలయందును, బూర్వాచారపరాయణత్వమునకును నవమార్గానుసరణమునకును వైరుధ్యమే కాన నగును. ఇట్టిసందర్భ మాంగ్లులచరిత్రమందు క్రీ.శ. 16-వ శతాబ్దమునఁ గలిగినది. ఆంగ్లులానాఁటివిజ్ఞానవైషమ్యములనుండి వెలువడి సమన్వయములు చేసికొనినట్లే మనయాంధ్రులును సమన్వయప్రయత్నమును బలపఱచుకొనవలసియున్నది. ఇట్టిసమన్వయమును జీవితమందును గవనమునందును సాగించి చూపి, యభినవప్రపంచమున విశ్వజనీనము లగునభినుతులు గాంచిన శ్రీరవీంద్రనాథఠాకూరుగారి

'రాజర్షి' అనునవల నాంధ్రీకరింపించి యీసమన్వయయుగ ధర్మమును బెంపొందింప సాహసించితిని.

ఈ రాజర్షి, నవల యనుకావ్యవిశేషము. ఆంధ్రమందువలె నాంగ్లమందును నవలల వ్యుత్పత్తినిగూర్చి మతభేదములు గలవు. కొందఱు దీని నాంగ్లులితరులనుండి గ్రహించి రందురు; మఱికొంద ఱించుకరూపభేదమున నిట్టికావ్యములు మొదటినుండియు నాంగ్లమున నుండె నందురు. ఆంధ్రవిమర్శకులయందును నిట్టిమతభేదములే కలవు. పరిణామవాదులు (Evolutionists) నవలల కాఖ్యాయికలనుండియుఁ బ్రబంధములనుండియు సంతతిక్రమము నేర్పఱుపఁజూతురు. అనువాదవాదులు (Translationists and Adaptationists) ఇట్టికావ్యవిశేషము లాంగ్లము నుండి యాంధ్రమునకు దిగిన వందురు. భాషాసాహిత్యతత్త్వమును సూక్ష్మదృష్టిని జూచినవారు పరిణామక్రమమున కనువాదము నంగముగఁ జేర్చి మతభేదముల సమన్వయింతురు.

ఏసాహిత్యచరిత్రమునం దైనను గేవల మపూర్వము లగుగ్రంథములు పుట్టుట యసంభవము. అపూర్వము లనఁబడుకావ్యవిశేషములతత్త్వ మరసినచో నందుఁ బూర్వుల జాడలు కనఁబడకమానవు. నూతనాంశములు ప్రబలియుండుట వల్ల నట్టిభ్రమ కలుగుట సహజమే యైనను, బూర్వరచనల కేమాత్రమును సంబంధింపని క్రొత్తరచనలు కలుగనేర వని నిశ్చయింపవచ్చును. అట్లగుట నాంగ్లమం దననేల? ఆంధ్రమందును నవలలు మాటకుమాత్రము నవలలే యైనను వాస్తవముగ నవలలు గావు.

నవలలకు ముఖ్యాంశములు:— 1. కథనకౌశలము, 2. వివిధవస్తుసమ్మేళనము, 3. పాత్రనిరూపణము, 4. పరికరము, 5. చతురసంభాషణము, 6. తత్త్వవిచారము. ఇవి యన్నియుఁగాని వీనిలోఁ గొన్నిగాని యౌచిత్యానుసారముగను హృదయాకర్షకముగను జేర్చి రచన సాగింపవలె ననినఁ గవితాపటిమ గలుగవలయును. ఇట్టిరచనలకుఁ బద్యగద్యాత్మక మగురూప భేదముతో నంతగా వివాదము లేదు. తత్కాలికప్రోత్సాహమూలమున వీనికిఁ బద్యరూపమో గద్యరూపమో కలిగినను, శాశ్వతత్వముమాత్రము రూపభేదముచేఁ గాక కావ్యగుణములచేఁ గలుగుచున్నది.

నవల లిరుతెఱఁగులు:—1. యాథార్థ్యసూచకములు, (Realistic); 2. ఆశయోద్దీపికములు, (Idealistic); అట్లనియీభేద మవిలంఘ్యము గాదు. మఱి యేమనిన నొకతెఱఁగునవలలయం దొకకొన్నిగుణములకుఁ బ్రాముఖ్యము; వేఱొకతెఱఁగు నవలలయందు మఱికొన్నిగుణములకుఁ బ్రాముఖ్యము. అట్టిభేదములు కావ్యవిశేషములకు సామాన్యములు. అంతే కాదు. కొన్నిసాహిత్యములకు—లేక సాహిత్యములకుఁ గొన్నియుగములందు—యాథార్థ్యసూచకత్వమును,నిఁకఁ గొన్నిటికి నాశయోద్దీపితత్వమును గుణములు గావచ్చును. ఇట్టిభేదములు సాహిత్యకారకు లగుకవిబ్రహ్మలమనస్తత్త్వములందలిభేదముల ననుసరించును. ఇట్టిభేదములు వారిజననకాలములనుబట్టియు, స్థితిగతులనుబట్టియు, సాంగత్యములనుబట్టియు, విద్యావిశేషము

లనుబట్టియు, సాధనములనుబట్టియు నేర్పడును. కొందఱిబుద్ధి కిజగన్నాటకమంతయు దారితెన్ను లరయరాని గ్రుడ్డివారికడుపు లాటవలెఁ దోఁచి హాస్యాస్పదమును నిరుత్సాహకమును నగును. మఱికొందఱికి లోకవ్యవహారమందలి సంతోషదాయకము లగుభాగములో దుఃఖజనకము లగుభాగములో హృదయాకర్షములై ప్రపంచమునెడల వారిమనోవృత్తులను బురికొల్పును. ఇఁకఁ గొందఱి కీసంసారాంబుధియందలిలోఁతు పాఁతులు చక్కఁగాఁ గనులకుఁ గట్టినట్లు తేటపడుటయేకాక లోకయాత్రను బరమేశ్వరునిసాన్నిధ్యమునకు నిరాతంకముగను, నిర్భయముగను సాగించుటకు మార్గములు స్ఫురించును. కవులకుఁ గలయిట్టిభేదములు వారిరచనలయందుఁ గనఁబడక తప్పవు. అట్లు కానిచో నవి కల్లవ్రాఁతలు గాని రచన లనిపించుకొనవు. కొందఱిరచన లాశయోద్దీపితము లయ్యును యాథార్థ్యబోధకము లగును. మఱికొందఱిరచనలు యాథార్థ్యవర్ణన లయ్యును ఆశయోద్దీపితము లగును. ఆంగ్లకవివరుఁ డగుబన్యను రచించిన పిల్గ్రిమ్సుప్రోగ్రెస్ అనుగ్రంథ మాశయోద్దీపిత మైనను యాథార్థ్యబోధకత్వమునఁ బేరెన్నిక గాంచినయాంగ్లనవలలతోఁ దులతూఁగు నని సెయింట్స్బరీ పండితులయభిప్రాయము. ఆంగ్లమం దంతకుముం దాశయోద్దీపనమే కావ్యములందుఁ బ్రధానగుణమై యుండెను. అట్టిభేదమునకుఁ జాలవఱకు యుగధర్మము కారణము. ఆంధ్రమందు శ్రీవీరేశలింగముగారి రాజశేఖరచరిత్రమునకు మునుపటిగ్రంథములం దాశయోద్దీపనమే ముఖ్యమైయుండెను. రాజశేఖరచరిత్ర మాశయోద్దీపితమైనను యాథా

ర్థ్యబోధనముచే విశిష్ట మగుచున్నది. ఇట్లు వివిధగుణ శిష్టము లగు గద్యగ్రంథము లాంధ్రమునఁ గొంతవఱ కాంగ్లసాహిత్య ప్రోత్సాహవశమునఁ గలిగియుండుటచే నాంగ్లనవలాచరిత్రము నించుక యుపన్యసింపవలసివచ్చినది. సాహిత్యచరిత్రముతోను, బరిణామములతోను బని లేదనుకొనుపాఠకు లీపీఠికను జదువ నక్కఱలేదు. గ్రంథము చదివినఁజాలును. బన్యనుకవికిఁ బూర్వ మందున్నసాహిత్యమును విమర్శించుటకు మూఁడుయుగములుగ నేర్పఱుపవచ్చును. ఆదియుగము, మధ్యయుగము, పునరుజ్జీవన యుగము. ఆదియుగమునాఁటిగ్రంథము లాంగ్లులు క్రైస్తవమత మవలంబింపక ముందుఁ జేసిన వీరవ్యాపారములను గీర్తించును. మధ్యయుగమందలియాంగ్లసాహిత్యమున మతము, స్తోత్రము, శృంగారమును వర్ణితములు. పునరుజ్జీవనయుగమునందలిగ్రంథ ములందు ఐరోపీయ (గ్రీకు,రోమను,ఇటాలియను)సాహిత్యముల యనుకరణములును, అనువాదములును మెండు. ఈయుగత్రయ మున నాంగ్లమానవజీవిత మాయాకాలములందు విశ్వజనీన ములై యుండినయాశయముల ననుసరించుచు వచ్చెను. గ్రంథరాజములకు మండనాయమానము లగునాయికానాయక జనములవర్తనములును శీలవర్ణనములును ఈతీరున నుండవలె నని సిద్ధాంతము లేర్పడి యుండెను. ఆయాయుగములందలి కాలమానస్థితులను బట్టియుఁ, బ్రజలయభిరుచులనుబట్టియుఁ గవులు ఆశయోద్దీపితములో, యాథార్థ్యబోధకములో, ఎట్లై నను, హృద్యము లగుకావ్యముల రచించియుండిరి. ఆంధ్రమం

దిక్లే యుగవిభాగములును, బోలికలును జూపవచ్చునుగాని యా ప్రయత్న మీసందర్భమున నప్రస్తుతము.

గద్యరూపమున నున్నకల్పితకథలు (నవలలు) ఆంధ్రమున లేకుండుట గొప్పలోప మని యాంధ్రనవలారచయిత లిట్టిలోప మును దీర్చి యాంధ్రసాహిత్యమును బెంపొందింప యత్నించు చున్నారు; ఇది ప్రశంసార్హ మగునుద్యమమే కాని ఆంధ్రనవల అని యనిపించుకొనఁదగినగ్రంథ మింకను బయలువెడలవలసి యున్నది. ప్రస్తుతోద్యమ మట్టిశుభప్రసూతి కెట్లు సాయపడు చున్నదో తెలిసికొనఁగోరితి మేని ఆంగ్లనవలాచరిత్రమును విమ ర్శించి చూడవలయును. గద్యరూపమున నున్నకల్పనాకథలులేని లోపము పశ్చిమైరోపీయసాహిత్యములకుఁ జాలకాలమువఱకుఁ గలిగియుండుట లోకప్రసిద్ధము. అంతియకాక గ్రీకురోమకసాహి త్యములయం దట్టికావ్యములు లేవనియే చెప్పవచ్చును. అంత మాత్రమున నాసాహిత్యముల గుణగౌరవములకుఁ గొఱఁతలేదు.

పాశ్చాత్త్యులకథలయం దెల్ల గొప్పకథ ఇలియాడ్ యను గ్రీకుగ్రంథమునఁ గలదు. ఈగ్రంథము పాశ్చాత్త్యమనీషా ప్రభావకల్పిత మగుమహాకావ్యము; కాని దీని కుత్తరకాండ మనఁదగిన ఒడెస్సీకావ్యమునఁ గలకవిత్వపటుత్వమహత్త్వసం పద యనమానమే యైనను గథమాత్ర మంత చమత్కారముగ లేదఁట !

ఆంగ్లమునఁ గలనవలలలోఁ బ్రాచీనతమ మైనది అపో లోనియస్ ఆఫ్ టైర్ అనునది. ఇది యొకగ్రీకుప్రబంధము ననుసరించినది. నవలగా నేర్పడఁగలకావ్యవిశేషమున కిది దారి

చూపును. ఇందలిగుణములు.—1. అద్భుతచర్యాకీర్తనము, 2. నాయికానాయకుల పరస్పరానురాగపరిణామము. ఇంతకు మునుపటిగ్రంథములందువలె నొకదానితో నొకటి సంబంధింపని వివిధములగుకథల నొకప్రధానకథాకథనమున సందర్భానుసారముగ నిఱికింపక యీగ్రంథముఁ జెప్పినకవి పలుతెఱఁగు లగునద్భుతచర్యాకీర్తనముల ననురాగప్రేరితు లగు నాయికానాయకులయవస్థల కుద్దీపకముగఁ జేసెను. ఇందు పాత్రలశీలపరిణామములును, సంభాషణచమత్కృతులును నంతగా లేకున్నను నిట్టిలోపము లటుతరువాతిగ్రంథములందుఁ జాలకాలమువఱకుఁ గలిగియే యున్నవి. వర్ణనలకును, సంభవములకును(Incidents) మాత్రములోపములేదు. అంతకునుముఖ్యము ప్రబంధరసపోషకము లగుప్రోత్సాహము లైన (Romantic motives) అతిమానుషవర్తనాకీర్తనములును, శృంగారమును ప్రౌఢములై యున్నవి. క్రీ.శ.400సంవత్సరములప్రాంతమున మతప్రబంధములకు (Religious Romances) దారి తీసిన విషన్ ఆఫ్ సేయింట్ పాల్ వంటిగ్రంథములందుఁ గేవలమతబోధయే కాక కావ్యగుణము లనేకములు గలవు. వివిధములగుసంభవములు, ప్రపంచవర్ణనలు, హాస్యరసప్రధానము లగునుపాఖ్యానములును మెండు; కాని మధ్యయుగప్రారంభము నాఁటికథలలో ముఖ్యమైనది పూర్వోదాహృతమగు అపాలోనియస్ ఆఫ్ టైర్ అనునది. దీనియందలి ముఖ్యగుణ మగుకథాకథనకౌశల మప్పటి క్రైస్తవాశ్వారులచరిత్రములందే కాక బెయోవుల్ఫ్ వంటిపద్యకావ్యములందును గనఁబడును.

ఆంగ్లవిమర్శకులలోఁ గొందఱు నవలలకును బ్రబంధములకును భేదము గల దందురు. వీరిమతమున సంభవప్రాధాన్యము గలకావ్యము ప్రబంధము; పాత్రశీలపరిణామమును, ప్రోత్సాహబలమును బ్రధానముగఁ గలకావ్యము నవల; కాని యిట్టి భేదకల్పనము మన తత్త్వశాస్త్రవిరుద్ధము. వాస్తవముచేత రెండు మూఁడుపాత్రము లన్యోన్యసంబంధమునందును, సాహచర్యమునను సాగించునడవడిని గథాకౌశలమును జూపుచు వర్ణించినచో నవల యగుచున్నది. అది పాత్రలచేతనే చెప్పించినచో నాటక మగుచున్నది. ప్రతిప్రబంధమునందును నవలగుణము లిమిడి యున్నవి. నవల యనఁదగినప్రతికథనమునందును బ్రబంధగుణములు సూచితములై యున్నవి. ఆకాలమున గద్యపద్యాత్మకము లగురూపభేదముల కంతప్రాముఖ్యము లేకుండెను. కావ్యగుణములు గలరచన ధారాళముగ సాగించుట కానాఁటిగద్యకుఁ బరికరము చాలక యుండెను.

మధ్యయుగమునాఁటి యాంగ్లప్రబంధములతో నాంగ్లేయులకే యంతగాఁ బరిచయము లేదని యాంగ్లసాహిత్యవిమర్శకులయభిప్రాయమై యుండ నట్టిగ్రంథములనుగూర్చి యీసందర్భమున నంతవిపులముగ వ్రాయనక్కఱ లేదు; కాని వానిలోని గుణవిశేషములనుమాత్ర ముదాహరింతును. ఏలయన: ఈచర్చ యాంధ్రప్రబంధముల విమర్శించువారికిఁ గొంత యుపకరించును.

1. కావ్యవస్తు వితరగ్రంథములనుండి గ్రహించినది గాని కవికపోలకల్పితము గాదు. ఇది యొకలోప మనుకొనఁ దగదు.

కథాభాగము కవి యెందుండి గ్రహించె ననుట కాదు. విమ ర్శనీయ మగునంశము; ఆతఁ డట్టిటాయిటప్పలతో నట్టిదివ్య భవనమును నిర్మించె ననుట. ఈటాయిటప్పలకన్న మే లైనవి మఱియొకచోట దొరకవచ్చును. విమర్శనీయ మేమ నఁగా: అట్టిస్థలము కల దనుట యాతనికిఁ దెలియునా యను విషయము. ఒకప్పు డీదివ్యభవనమున మనబుద్ధికి నచ్చనిపలక లచ్చటచ్చటఁ గానఁబడవచ్చును; కాని యట్టిపలక లాతఁ డందేల యమర్చెనో తెలిసికొనఁ బ్రయత్నించుట యుక్త ము గాని మనరుచులనుబట్టి వానిని గర్హించుట విమర్శక ధర్మముగాదు.

2. ఇట్టిగ్రంథములందు వస్త్వైక్యము లేదని కొందఱందురు. యథార్థము విమర్శకులు తేటపఱుపవలసియున్నది.

3. ప్రబంధరనప్రోత్సాహకము లగు (Romantic motives) మత, తీర్థయాత్ర, శృంగారములసమ్మేళన మీగ్రంథములందుఁ గలదు. ఇట్టిసమ్మేళనము పూర్వు లెఱుఁగరు.

క్రీ. శ. 15-వ శతాబ్దాంతమునను 16-వ శతాబ్దప్రారం భమునను బ్రబంధములు పద్యరూపమును వదలి గద్యరూపము నకు మాఱుటలో వానిహృద్యత కొంత రూపఱినది. అప్పటి యాంగ్లసాహిత్యమునకు మార్గదర్శకములైన యైరోపీయ సాహిత్యములలో గణన కెక్కినవి స్పానిష్, ఇటాలియన్ సాహిత్యములు. కల్పనాకథారచనమున నాంగ్లప్రయత్నములఁ బ్రోత్సహించిన యిటాలియానవలలలో లోకాచారవ్యవహారవర్ణ నము, నీతిమూలకాభిప్రాయములును, చర్చలును ముఖ్యములుగ

నుండె నని యాథార్థ్యబోధకత్వము ప్రధానగుణ మని తోఁచును. సంభవములు లేవనుటకాదు. నూతనత్వము (ఆశ్చర్యజనకత్వము)ప్రధానము. క్రీ.శ.16-వ శతాబ్దమునాఁటి కిట్టినవల లాంగ్లములోనికి దిగినవి. ప్యాలస్ ఆఫ్ప్లెషర్ అనునది యాంగ్లపండితులనేకు లెఱిఁగిననవల; ఇది భాషాంతరములయనువాదము.

ఇట్టియనువాదములవల్ల నాంగ్లనాటకకవులకుఁ గావ్యవస్తువు గ్రహించుటకుఁ దగినమాతృక లేర్పడుటయే కాక కాలక్రమమున నిరుతెఱఁగుల గద్యకావ్యములు విశిష్టము లగుటకవకాశము గలిగినది. ఇవి పూర్వోదాహృతము లగుయాథార్థ్యబోధకములును, ఆశయోద్దీపితములును నగు కావ్యభేదములు.

క్రీ.శ. 16-17-వ శతాబ్దములందలి యాంగ్లులజీవితమార్గములకును ఆశయములకును నప్పటిసాహిత్యవిజృంభణమునకును జాల సంబంధము గలదు. ఆనాఁటిజనులజీవితమార్గములను గ్రొత్తదారులకుఁ ద్రిప్పినప్రోత్సాహములలో ముఖ్యమైనవి *'రినాసాన్స్', † 'రిఫర్మేషణ్' అనునవి. అప్పటివఱకు సాహిత్యము మతప్రచారమున కంగమై యుండెను. మతప్రచారకుల యభిప్రాయములను విరోధించుభావములు కాని, భక్తిరసప్రాధాన్యమును విరోధించురసములు కాని కావ్యములందు వర్ణింపఁబడుట కవకాశము లేకుండెను. రినాసాన్స్ మహాప్రయత్నము వలన నప్పటికైస్తవలోకమున కచ్చెరువు పుట్టించినకావ్యరాజములు గ్రీకు,రోమకసాహిత్యములందుఁగైస్తవగుణవ్యతిరిక్తము

* ప్రాచీనవాఙ్మయముయొక్క మార్పు. † ప్రాచీనమతముయొక్క మార్పు.

లగుప్రోత్సాహములవలన బయలువడఁగాఁ గ్రైస్తవమతసమ్మోహిత మగు పాశ్చాత్యబుద్ధిప్రభావము మేల్కాంచి కూపకూర్మావస్థను వదలి ప్రపంచమును దేరి గూడఁ గలిగినది. అల్లే ప్రజలకు సుబోధము గానిభాషయం దిమిడియున్న మతగ్రంథములాయాయైరోపీయదేశములందు వ్యవహారభాషలలోనికి ననువదింపఁ బడినతోడనే మతగురువులవిద్యాప్రభావమున సమ్మోహితమైన యైరోపీయజనసామాన్యబుద్ధులును మేల్కని నవవికసితములై క్రైస్తవమతమునకును మతాచార్యులయభిప్రాయములకును గలతారతమ్యము లెఱిఁగి జీవనమార్గములను సరిచూచుకొనఁ బ్రయత్నించినవి. కనుక నాకాలమున నాశయోద్దీపితము లగుగ్రంథములకును యాథార్థ్యబోధకము లగుగ్రంథములకును గూడ వ్యాప్తి గలిగియుండెను. ఆకాలపుజనులకు హృద్యము లైననవలావిశేషములలో ముఖ్యమైనది 'హీరోయిక్ రోమాన్స్' అను వీరరసప్రాధాన్యము గలప్రబంధవిశేషము. దీనియందుఁ బ్రాచీనుల వస్త్వైక్యతావిధానములును మధ్యయుగమునాఁటిప్రోత్సాహవివిధతయు నవయుగమునాఁటి పాత్రపరికరప్రాముఖ్యమును గలసియున్నవి.

ఈతెలుఁగునవలలయందు నాయికానాయకులపరస్పరానురాగపరిణామమును, దానికి నిరంతరమును గలుగు ప్రత్యవాయములును సరసమైనకథాంశము. కొంతవఱకీగ్రంథములందు శృంగారాతిరేకమును గలదు. ఇట్టిరచన లాకాలమునఁ గొంతవఱకు సాగి యంతరించినవి. కారణమెట్టిగ్రంథరచనయు ననుకరణముల యనుకరణమగుట. నవలకు ముఖ్యగుణములు—వివిధత, జీవితప్రతి

బింబనము. ఈగుణములే యిట్టిగ్రంథములందు మృగ్యములు. వీనితో బన్యనుకవికిఁ బూర్వము గలనవలలచరిత్రము ముగియును. ఈతనిగ్రంథములందు యథార్థతయు, అశరోద్దీపితత్వమును గల దని పండితులయభిప్రాయము. ఇట్టిగుణములు గద్యకథనమునందుఁ జూపి, చదువరులు విమర్శించి యానందించునట్లు కల్పితపాత్రముల శీలములు, భావములు, నడతలు, సంభాషణములును బూనగుర్తిచ్చినట్లు కట్టెనుట నడచుచున్నట్లు నీకవి వర్ణించినాఁడు. నవలల కిం కేమికావలయును? ఇంతవఱ కాంగ్లమున జరిగినవని నవలకు దారితీయుట. క్రీ. శ. 18-వ శతాబ్దమధ్యమునకుఁ గాని యిట్టివని ముగిసి యాంగ్లమున మొట్టమొదట నవల వెలువడలేదు. ఇట్లు క్రీ. శ. 18-వ శతాబ్దపూర్వార్థమునజరిగినప్రయత్నములలో డీఫో, స్విఫ్టు,రచయితలగ్రంథములు ముఖ్యమైనవి. ఇంతకుఁ బూర్వము గ్రంథరచన సాగించినవారు ప్రజలకుఁ గ్రొత్తయంశములు బోధింపఁదలఁచిరి. సాహిత్యము కాంతవలెఁ జదువరిమనస్సును మంచిమార్గమునకుఁ ద్రిప్పవలయు నను సిద్ధాంతము మనదేశమం దేర్పడి యుండినట్లే క్రీ. శ. 18-వ శ.కు పూర్వ మాంగ్లదేశమున సాహిత్యమువలనిఫలము జ్ఞానబోధమని యేర్పడియుండెను. అట్లు కాక తనగ్రంథమువలన బుద్ధి నాకర్షించి మనస్సును రంజించి వశపఱుచుకొనుటయే ఫలముగా నెంచుటకు సాహసించినవారిలోఁ బ్రముఖుఁడును మొట్టమొదటివాఁడును డీఫో. అతని రాబిన్సన్ క్రూసో అను గ్రంథము నెఱుఁగనివారుండరు. ఆకథ తెలుఁగువాచకపుస్తకములలోనికిఁ గూడ దిగినది. స్విఫ్టుగ్రంథము గలివర్ పర్యటనము (Travels).

శ్రీ వీరేశలింగము పంతులుగారి సత్యరాజా పూర్వదేశయాత్రల యందు దీనియనుకరణము కొంత గలదు. 18-వ శతాబ్దమున నవలారూపమును నిర్ధరించిన గ్రంథములలో పామేలా అనునది మొదటిది. కథ జగన్నాటకమునందుఁ జనువరులకట్టెదుట జరుగుచున్న నటనమునందు శుభాంత మగుకొంతభాగము. 'బహుమానితమగుఋజువర్తనము' అనుదీనిపర్యాయనామము కావ్యార్థసూచకము. ఒకయువకుఁ డొక స్త్రీని సర్వవిధములఁ జెఱుపఁ జూచి విసిగి వేసారి తుదకు బుద్ధిమల్లించుకొని యామెను శాస్త్రవిధిగా వివాహ మాడినవృత్తాంత మంతయు సరసముగను, సవిస్తరముగను, యాథార్థ్యవైరుద్ధ్యము లేకుండ నీగ్రంథకర్త వర్ణించెను; కాని యీతనిపాత్రలు నాయికానాయకవిశేషములుగాని, సత్త (Individuality) గలమనుష్యులుగారు. పామేలా గుణవిశేషము లొకకొన్ని చెప్పవలసియున్నవి. రూపమున నీగ్రంథముజాబులుగా వ్రాయఁబడినది. ఒకరి కొకరు వ్రాసికొనుజాబులలో వివిధకథాసమ్మేళనము చూపఁబడినది. ఇట్టిరచన మాంధ్రమున నిటీవల శ్రీ రెంటాల. వేంకటసుబ్బారావుగారు కమలజాబులయందు సాగించి పేరందిరి. పాత్రలగుణదోషములను జక్కఁగాఁ బరిశీలించి యెంచి స్వయంప్రకాశితములఁ జేయుటలో నీగ్రంథకర్త చూపిన నేర్పి ట్లుత్తరప్రత్యుత్తరరూపమునం దమరియున్నది. ఫీల్డింగ్ వ్రాసిన జోసెఫ్ ఆండ్రూస్‌నందుఁ బాత్రలసత్తయును, కథలయందుఁ గలుగు నడతలవివిధతయు, సంభాషణమువలనఁ గలుగుపాత్రలశీలప్రకాశమును రిచర్డ్సన్ పామేలాయందు కన్న నద్భుతము లై యున్నవి; కాని

యీతని గొప్పగ్రంథము టామ్‌జోన్సు అనునది. ఫీల్డింగ్ తన గ్రంథమునకు గద్యపురాణము (Prose Epic) అని పేరుపెట్టుట చేత రచనయం దైక్యమును (Unity) కావ్యవస్తువుతో సమ్మేళము చేయుట కనువైనయితివృత్తములను జేకూర్చుకొనఁగలిగెను. ఇట్టిరచన షేక్స్పియర్ కవి అవసానకాలమున రచించిన శుభాంతము లగుశోకరసప్రాధాన్యము గలకావ్యములను బోలియున్నది. పాత్రలగుణదోషములకుఁ బ్రాముఖ్య మధికమైనది. కథలు చిక్కుపెట్టి విప్పుటయు, స్త్రీపురుషులమనస్తత్త్వములను నడతలలో బయలుపెట్టుటయుఁ బ్రధానగుణములు గాఁగా వర్ణనలుచతురసంభాషణములుఁ దగురీతి సంగములై యొదిగియున్నవి. అంతకుమునుపటిగ్రంథములలో లేని క్రొత్తవింత యేమనఁగా: కవి కథాభాగము కొంతపర్యవసానమునకు రాఁగా, నొకవడి విశ్రమించి జరిగినవృత్తాంతమునుగూర్చి తనయభిప్రాయములను వ్రాయుటచే నవలాపరిణామమున కీతఁ డొనర్చినమేలు కొనియాడఁదగినది. అంతకుముందు నవలలయితివృత్త మొక్కమాదిరి లోకవ్యవహారమునుండియే గ్రహింపఁబడినది. ఈతఁ డట్టి నిర్బంధములను వదలించి రచయితలకుఁ గావ్యవస్తుగ్రహణమున స్వాతంత్ర్యమునకు దారి చూపెను. అంతకుముం దంతరించి పోయిన హాస్యరసమును నవలలయం దీతఁడు పునరుద్ధారణము చేసెను. చిత్రవిచిత్రము లగువర్తనములును, చరిత్రలును, వేషభాషలును, నత్తలును గల యనేకస్త్రీపురుషులగుంపులతో నవలల నింపెను. లెక్కలేనిపాత్రలు, వివిధములగు సన్నివేశములు, పాత్రలనిర్మాణములు, భాషాభేదములు, హాస్యములు, పరిహాసములు, తగవు

లాటలు, నవ్వులాటలు:—ఇది యది యననేల?—. నిత్యవ్యవహారములందు జరుగుచుండు నటనయంతయు నీతని గ్రంథముల యందుఁ బ్రతిబింబించి యున్నది. ఇట్టిరచనయందు నవలాగుణములును, ప్రబంధగుణములును గలవు. అంతకును ముఖ్యములు కావ్యార్థసూచనలు. ఈతఁడు రచించినయద్భుతదివ్యభవనమున కంతు లేదు. ఏవంకఁ జూచినను గదులలో గదులు, వసారాలలో వసారాలు,మిద్దెలమీఁద మిద్దెలు; భావమునుండి భావమునకు, రసమునుండి రసమునకు, నడతినుండి నడతకు, ఆగతమునుండి యనాగతమునకును సంబంధసూచన పలువిధముల నిరంతరముగఁ గలుగుచునే యుండెను.ఇట్టికావ్యగుణములకునన్ని వేశములును, పరికరమును జక్కఁగాఁ జేర్చినవాఁడు స్కాటట్. ఫీల్డింగీవిషయములందుఁ జూపినవని కీతఁడు మెఱుఁగుపెట్టెను. ఈమార్గమున నీతఁడు తరువాతివారికి దారి చూపినవాఁ డాయెను. ఈరచయితలమాదిరినే చాలవఱకనుసరించినది గోల్డుస్మిత్ కవి రచించిన వికర్ ఆఫ్ వేక్ఫీల్డు అనునది ఇది రాజశేఖరచరిత్ర యనునామాంతరమున నాంధ్రమం దనువదింపఁబడినది. ఈగ్రంథరాజముల మూలమున నాంగ్లనవలకుఁ గొంతస్థైర్యము గలిగినను రచనాచమత్కృతియం దనమానత గలుగలేదు. ఈగ్రంథములందును గద్యరూపము లగుకల్పనాకథలవలనఁ గేవల హృదయరంజనమే కాక ఫలాంతరము లపేక్షితము లగుచున్నవి. అటు గాక జీవితప్రతిబింబమును మది కెక్కునట్లు కల్పించుటయే నవలారచనమునకు ఫలముగాఁ గోరి కావ్యశిల్పము చూపఁగలమహాను

భావుఁ డంతవఱ కాంగ్లమున నుద్భవిల్లఁడయ్యె. దీనికిఁ గారణము లేక పోలేదు.

ఆకాలమున జనుల నీతిమూలకాభిప్రాయములందును భాషావిశేషములందును గ్రొత్తప్రాఁతలసంధియై యుండెను. రచయిత లనుసరింపఁదగినమాతృకలను మార్చియు వర్ణనీయములగు కావ్యవస్తువులను గూర్చియు నభిప్రాయములు మాఱుచుండెను. పూర్వులే సాహిత్యమునందు మంచి దనఁ దగినవని నన్నివిధములందును జూపిరని పండితులు నమ్మియున్నయప్పటిలోఁ బూర్వుల రచనలయనుకరణముల కాదరము లేకుండెను.

క్రీ. శ. 19-వ శతాబ్దమునందలి నవలాపరిణామములను వర్ణించుట సులభసాధ్యము కాదు. ఆంగ్లు లీయుగమున వివిధ విషయములం దభివృద్ధిఁ గాంచి ప్రపంచమందుఁ బేరు గాంచిరి. నాగరికతయందు వాసిఁగాంచి సామ్రాజ్యస్థాపకు లై యభినవ ప్రపంచమున నెల్లెడల నల్లుకొని తామరతంపరగా దినదినప్రవర్ధమానులగుచు వచ్చినవారిలోకవ్యవహారమునం గలవిచిత్రముల నరసి వర్ణించిన కవిపుంగవుల రచనలయందలిగుణము నెత్తి వ్రాయుట యన్న నెంతకష్టసాధ్యమో ఆంగ్లసాహిత్యవిజృంభణము నెఱిఁగినవారికిఁగాని తేటపడదు; కాని నవల కీయుగమునఁ గలిగినపరిణామములలో ముఖ్యమైనది చరిత్రమూల మగునవల యనునది యేర్పడుట. ఆంగ్లమం దిది ముఖ్యమే యైనను, ఆంధ్రనవలాపరిణామమున నిది ముఖ్యతమము. దీనికి దారి తీసిన యాతఁడు స్కాట్. ఆంధ్రమునను నీమార్గము ననుసరించిన వా రున్నారు.

క్రీ. శ. 19-వ శతాబ్దమం దాంగ్లనవలకుఁ గలిగినయభివృద్ధిని గుణవిశేషములను వానిని బట్టి యాంగ్లసాహిత్య చరిత్రమున క్రీ. శ. 16-వ శతాబ్దము నాటకయుగ మని చెప్పఁదగినట్లే యీశతాబ్దము నవలాయుగ మని యనఁదగినదని పలువురియభిప్రాయము. జనరంజకత్వమును బ్రధానముఁ జేసికొనినను, నవల పూర్వయుగములనాఁటిసాహిత్యధర్మమగు నీతిబోధకత్వమును బూర్తిగా వదలలేదు. 18-వ శతాబ్దపు నవలలయందు నవలాగుణములు ప్రసిద్ధముగ నుండినను, పాత్రనిర్మాణమునం దానాఁటికవులు కావ్యప్రకాశికయందలిసూత్రములనే పాటించి యుండిరి. కావ్యవస్తువును గ్రహించుటయందుఁ బూర్వుల నియమములే యింకను బ్రబలముగ నుండెను. పద్యకావ్యరచనమునందు క్రీ. శ. 19-వ శతాబ్దమునఁ గల్గినయాందోళనము నవలారచనమునందును గనఁబడి, లోకమును గూర్చియు, సృష్టివైచిత్ర్యమునుగూర్చియు, మనుష్యుల 'విలువ' లను గూర్చియు, మానవధర్మమునుగూర్చియు, ఆలంకారికుల మతములకును రచయితలస్వాతంత్ర్యములకును గలసంబంధములను గూర్చియు నూతనాభిప్రాయములు ప్రబలి యువజనసమాదరణీయము లైనవి. పాత్రనిర్మాణమున నీయుగమునాఁటినవల లాతితేఱి యున్నవి. ప్రపంచవృత్త మీగ్రంథములందు యాథార్థ్యవిరుద్ధము గాకుండ వర్ణింపఁబడియున్నది. అతిమానుష వర్తనములవర్ణన పూర్వప్రబంధములకు ముఖ్యమై యుండినది; క్రమక్రమముగ నీగ్రంథములం దంతరించి పోయినది. మధ్య

యుగమునాఁటిప్రోత్సాహములు కొంతవఱకీకాలమునఁ బుట్టిన దనఁదగినచరిత్రవిషయ మగునవలయందుఁ గనఁబడుచున్నవి. నవలలు పలురకములుగఁ బరిణమించి రచయితలబుద్ధివిశేషములను, పాత్రనిర్మాణకౌశలమును, ప్రపంచతత్త్వవిచారమును దెలుపుచున్నవి. ఆశయోద్దీపితములు కానినవలలే లేవని చెప్పవచ్చును. ప్రతిగ్రంథమునందును నిజమైనకవితాప్రభావము వెల్లడియగుచున్నది. స్కాటు, ఆస్టిన్, గోల్డ్‌స్మిత్, ఎలియట్, థాకరే, డికెన్స్, లిటన్, హార్డీ, రీడ్, మెరిడిత్, మున్నగుప్రసిద్ధ నవలానిర్మాతలొక్కొక రొక్కొకరకమునవలను వన్నెకుఁదెచ్చిరి. కొన్నికొన్ని ప్రధానగుణముల ననుసరించి నవలాకర్తలను గొన్నికొన్నిశాఖలకుఁ జెందినవారినిగా నేర్పఱుపవచ్చును. ఇట్టి గ్రంథవిశేషము లాంధ్రులకు క్రీ. శ. 19-వ శతాబ్దమునఁ బరిచయములై యుండుటను బట్టి యట్టిగ్రంథము లాంధ్రమున రచించిన మేలని తోఁచినది.

అప్పటిలో నవలారచనమునకు చింతామణిపత్రికాబహుమతులు ప్రోత్సాహకములై యుండెను. రచయితలు కొంతవఱకు స్కాటు మార్గమో, గోల్డ్‌స్మిత్ మార్గమో యనుసరించిరి; కాని మొత్తముపైన ఆంగ్లనవలలయందుఁగల పాత్రనిర్మాణకౌశలమును, జీవితప్రతిబింబనమును, సంసారతత్త్వవిచారమును, ఆంధ్రమునందుఁ గానరావు. కారణ మాంగ్లకావ్యరాజముల గుణాతిశయములను సవిమర్శముగ నెఱిఁగినవారు నవలారచనమునకు దిగకుంట కావచ్చును!

# ఆంధ్ర నవల.

ప్రపంచమందలి సాహిత్యములచరిత్రలలో దేనిని దీర్ఘముగఁ జూచినను, కావ్యము లకారణకల్పితములు కావని తోఁచును. కావ్యరచనము మొత్తముమీఁదఁ గవులయుఁ గవిపోషకులయుఁ గవిమండలులయు నభిరుచులనుబట్టి యేర్పడుచుంట సర్వసాధారణమేయైనను కావ్యరచనాప్రోత్సాహకములగునభిరుచులను స్థిరపఱుచు విశేషకారణములు ప్రతియుగమందును బ్రతిసాహిత్యమునందును గలవు. ఆంగ్లమున నాదియుగమందు గ్రీక్ రోమన్ విజ్ఞానము నాంగ్లమునకు దింపవలెననుటయు, మధ్యయుగమునఁ బాశ్చాత్యప్రపంచమునకు జ్ఞానాదర్శమై యుండినవరాసుసాహిత్యానువాదావశ్యకతయు, నూత్నోజ్జీవనయుగమున గ్రీక్, రోమన్, ఇటాలియన్ సాహిత్యానుకరణప్రాముఖ్యము నూతనోజ్జీవనమార్గ మగుటయు నాంగ్లావళికి సమ్మోద మొనరించుచు జ్ఞానప్రదానము చేయుటకుఁ బ్రసిద్ధమార్గము లాయెను. అట్లే యాంధ్రసాహిత్యము ప్రత్యేకసాహిత్యముగ నేర్పడిననాఁడు గీర్వాణభాషయందలివిజ్ఞానము నాంధ్రములోనికి దింపవలసినయవసర మేర్పడియుండెను. అట్టి యవసరమును దెల్పుచు ఎఱ్ఱాప్రెగడ.—

"భాసురభారతార్థములభంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లగఁ జేసినట్టియ
శ్వాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్."

అని వ్రాసెను.

(నృసింహ)

సూచన యేమనఁగా నన్నయకుఁ బూర్వమాంధ్రమునఁ జెప్పఁదగిన ప్రసిద్ధకథాంశములు గలకావ్యము లాంధ్రమున లేవనుట. అట్టికావ్యములు లేనినాఁడు జనులయం దంతగా విజ్ఞానవ్యాప్తి కవకాశ ముండి యుండదు. నన్నయకుఁ బూర్వ మాంధ్రదేశ మంత గొడ్డుపోయి యున్న దనుట యసంభవము. క్రీ. శ. 1-వ శతాబ్దమునకు ముందునుండియు నాంధ్రకళింగ రాజ్యములందు సాహిత్యప్రచారము గలిగియే యుండె ననుట కాకాలములం దీదేశములలో నుండిన బౌద్ధవిహారములే సాక్షి. అయిన, నన్నయ తరువాతి కవీశ్వరుల మతమున నాసాహిత్య ప్రచార మంతయు వేదబాహ్య మగుటచే 'గానటబీనటే చదివి గాధలు త్రవ్వుట' యైనది. ఈగాధలు బౌద్ధజాతకకథలైన నై యుండవచ్చును. ఇట్టి వ్రాఁతలు కేవలము మతావేశబోధితము లనుటకు నిదర్శనము నన్నయాది ప్రాచీనమార్గము నంటిన జక్కనవంటికవివర్యునకుఁ బ్రాకృతకావ్యకర్తలయెడఁ గలగౌరవమే ; కాని నన్నయప్రభృతులకాలమునఁ గావ్య రచనాకౌశలము వేదవిద్యాప్రచారమునకు సైదోడయ్యె ననుట నిర్వివాదాంశము. వేదవిద్యాప్రచార ప్రాముఖ్యమున కంగము లనఁ దగుసంస్కృతకావ్యరాజములందలి యితివృత్తము లాంధ్రకవులకుఁ గావ్యవస్తువు లైనవి. అప్పటియాంధ్రులు మేధావంతులై తమ కనువైనభాషలయందెల్లఁ గౌశలము సంపాదించి వివిధసాహిత్యములమార్గము లెఱిఁగి యాంధ్రకావ్య రచనమును బ్రోత్సహించిరి. జక్కన విక్రమార్కచరిత్రకు భర్త యగు జన్నయసిద్ధమంత్రి:—

"సకలదేశభాషావిశేషములయందు
వరుసఁ బ్రఖ్యాతమనఁగ నుత్పాద్యమనఁగ
మిశ్రమన నొప్పు సత్కథామేళనంబు
లెన్ని యన్నియు విన్నాఁడఁ బిన్ననాఁడ."

అని, సత్కథామేళనవిశేషములను దేటపఱిచెను. ఆనాఁటి సాహిత్యాభిరుచులకును విజ్ఞానప్రచారమునకును సాయపడున ట్లాంధ్రకవులు ప్రసిద్ధకథలను మిశ్రకథలను గావ్యవస్తువులుగ గ్రహించిరి. రానురాను గావ్యకల్పనమున నాదియుగముననే పురాణమార్గమును, ప్రబంధమార్గమును విశిష్టము లాయెను. ఇతివృత్తమునందును, రసవిశేషప్రాధాన్యమునందును ఈమార్గ ద్వయమునకు భేదము గలదు. పురాణముల యితివృత్తము ప్రసిద్ధకథాసమ్మేళనము; ప్రబంధములయితివృత్తము మిశ్రకథా సమ్మేళనము. పురాణములందు సంభవములును, కథాసరణియు, బోధమును ముఖ్యములు. ప్రబంధములందు రసప్రాధాన్యము విశేషాంశము. అయినను తిక్కన శ్రీమదాంధ్రభారతమును ప్రబంధ మండలి యనియే వర్ణించెను; కాని.—

"తలఁపఁ దదీయయేకకవితానముకంబెను పాహసక్రియా
కలితవదాన్యతాదిగుణగౌరవరేఖల విక్రమార్క భూ
తలపతి యొక్కఁడై నెగడెఁ దచ్చరితంబుఁ బ్రబంధకావ్యగాఁ
దెలుఁగునఁ జెప్పి యాకృతిపతిత్వము మా కొడగూర్పనేర్పునన్."

అని జన్నయసిద్ధమంత్రి చెప్పుట చూడఁగా నప్పటికే పురాణ కావ్యవ్యతిరిక్త మగుప్రబంధకావ్య యనునొకరచనావిధాన మేర్పడినట్లు తోఁచును. అయినను ఆంధ్రకవితాపితామహుఁ

డని పేరందిన యల్లసానిపెద్దన రచించిన మనుచరిత్రమే యాంధ్రమున మొదటిప్రబంధమనియు శ్రీవీరేశలింగకవికృత మగు రాజశేఖరచరిత్ర మాంధ్రమున మొదటినవల యనియుఁ గొందఱందురు. ఒకవిధమునఁ జూచిన నీయభిప్రాయములు సరియే. కొంతవఱకీకావ్యములాంధ్రమున నపూర్వములే కాని వీనియపూర్వత్వ మంతగా నపూర్వత్వము కానేరదని బ్రహ్మశ్రీ, వఝ్ఝల. చిన్నసీతారామస్వామిశాస్త్రులవారును, బ్రహ్మశ్రీ, కాశీభట్ట. బ్రహ్మయ్యశాస్త్రులవారును దేటపఱిచియున్నారు. ఆవిషయమిచట విపులముగఁ జర్చింపఁబని లేదు. చెప్పవచ్చిన దేమనఁగా: ఆంధ్రమం దాంగ్లమందువలె సాహిత్యాంతరములనుండియుఁ గ్రహించిన సామగ్రితోను, పరికరవిశేషములతోను కవిపుంగవులు హృద్యములును జోద్యములును నగు ప్రబంధములఁ జెప్పిరి. వానిని విమర్శించునపుడు జన్మవిశేషములఁ గూర్చి కాక గుణవిశేషములఁ గూర్చి ప్రసంగించుట ధర్మము.

ఉత్పాద్య మగుకథానమ్మేళనము, నాంధ్రకవు లంత ప్రశంసనీయముగ నెంచియుండలేదు. ఈవిషయమున వసుచరిత్రభర్త.—

"కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లార్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీర్చినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్."

అని చెప్పినవాక్యమునుబట్టి తొల్లింటియాంధ్రు లట్లుతలఁచుటకు గారణము తెలియుచున్నది. అందుచేత నితివృత్తగ్రహణ

విషయమునఁ గవితాప్రభావవశమున గ్రహింపఁబడిన యితివృత్తమునకుఁ గలిగినవన్నెల నెన్నుటయే కావ్యవిచారమందు విషయమగుచున్నది.

ప్రబంధమర్యాదను గొని ప్రధానాంశములందు స్వాతంత్రించి మార్చె ననఁదగిన పింగళిసూరనకవియు కళాపూర్ణోదయవస్తువును బ్రశంసించుచు "అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబును, శృంగారరసప్రాయంబును, బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును నగుకళాపూర్ణోదయం" బని విశేషించి చెప్పవలసి వచ్చెను. మొత్తముపైన క్రీ.శ. 18, 19-వశ. నాఁటి యాంగ్లనవలలయందుఁ గలవస్త్వైశ్వర్యము మన తెలుఁగు ప్రబంధములం దంతగాఁ గనఁబడదు. ఈసందర్భమునఁ దెనుఁగుప్రబంధములవంతకుఁ బూర్వముండిన యాంగ్లప్రబంధములతోఁ బోల్పుటన్యాయ్యము. రసపోషణము ప్రబంధములవియుఁ, జదువరులశ్రద్ధాగ్రహణశక్తిపలినవలలవియు గుణములని యాంగ్లనవలాచరిత్రమునుగూర్చిన పైప్రసంగమునఁ దేటపడినది గదా! ఆంధ్రప్రబంధచరిత్రమున నిట్టిభేదము కళాపూర్ణోదయమున మొట్టమొదట గనఁబడుచున్నది. ఆంధ్రకవులు తమప్రబంధములందలి గుణవిశేషములంగూర్చి ప్రశంసించినపద్యములను జదివి చూచినయెడల నీభేదము తేటపడును. చాలమంది యితివృత్తమునుగూర్చియు, రసప్రాధాన్యమునుగూర్చియు, నాయికానాయకగుణాతిశయమును గూర్చియు, కృతిపతినుది కెక్కినకారణములంగూర్చియు, రచనావిశేషములంగూర్చియుఁ జెప్పియున్నారు; కాని పింగళిసూరన:—

"ఏచే నొక్కమహాప్రబంధము గడు న్నిర్ని ద్ర సారస్యలీ
లాచిత్రంబగుదాని నోయనఘ ! వాలాయంబు సేయించుకో
మాచిత్తంబున వేడ్కయుండు నది యీమాధుర్యధుర్యోరువా
గ్వైచిత్రిన్ సఫలంబు సేయుమా సుధీవర్గంబు లోహో యనన్."

అని, కళాపూర్ణోదయమును గూర్చి సూచనగాఁ గృతిభర్త చేతఁ జెప్పించిన నిర్నిద్రసారస్య లీలాచిత్రత్వము, రాబిన్సన్ కూసో మొదలగు నాంగ్లనవలలగుణముగాఁ బండితులు విశేషించిన దానికిఁ దుల్యమగును; కాని యిట్టి కావ్యగుణములుగల తెలుఁగు నవల పుట్టుటకుఁ దగినతరుణ మింకను రాలేదు. గతశతాబ్దమందుఁ గ్రొత్తగఁ బుట్టిన తెలుఁగునవలలు మూఁడు తెఱఁగులు. 1. ఆంగ్లనవలలయనుకరణములు, 2. గద్యప్రబంధములు, 3. సంకరములు. ఈనవయుగమందలి నవలలకుఁ గూడ నిట్లే జాతివిభాగము చేయవచ్చును. తామరతంపరలై పెరుఁగుచున్నయీనవలలలో నిఁక నొకయర్ధశతాబ్దమున కేవి నిలుచునో యేవి విస్మృతము లగునో చెప్పుట కష్టము; కాని రాజశేఖరచరిత్ర హేమలత యను నవలలు వివిధము లగు రెండుమార్గముల నంటియున్నవి. రాజశేఖరచరిత్రమువలె లోకయాత్రావిధానమును విచారించి యాశయములను జూప నెంచునవలావిశేష మాంధ్రమున నాటుకొనలేదు. రచయితలకు సర్వసాధారణముగా నచ్చినది హేమలత చూపినమార్గము. ఇది గద్యప్రబంధమార్గము. ఆంధ్రమందుఁ గలపూర్వపుఁ బ్రబంధములలో నాయికానాయకులయనురాగపరిపాకము కథాంశమై ధీరవర్తనముల (ముఖ్యముగాఁ దురకల నెదిరించి) సలిపిన కృతిభర్తలవంశాను

వర్తనములును నభ్యుదయములును రసోద్దీపనము లగువృత్తములును నమరియున్నవి. హేమలతవంటిగద్య ప్రబంధములందుఁ దురకల నెదిరించి వీరవ్యాపారములు సలిపినప్రసిద్ధపురుషుల చర్యలు కృత్రిమ మగునొక శృంగారకథాంశమున కుద్దీపనము లగుచున్నవి. ఈరకము నవలలకు చరిత్రవిషయ మగునవల లని కొందఱు ప్రకాశకులు నామకరణముచేసిరి; కాని చరిత్రయు నవలాత్వమును నీగ్రంథములందు 'తీర్థమునకుఁ దీర్థము ప్రసాదమునకుఁ బ్రసాదము' అనున ట్లొకదాని కొకటి పొసఁగి యుండవు. శృంగారకథాంశవర్ణమునఁ బ్రసిద్ధ ప్రబంధముల జాడలును, కావ్యప్రకాశికాదిగ్రంథములందు నాయికానాయకులను గూర్చిచెప్పిన విభాగములును జక్కఁగా వీనియందు గనఁబడుచున్నవి; కాఁగా నవలకుఁ బ్రధానమైనపాత్రనిర్మాణము వ్యర్థమగుచున్నది. తురకలను దిట్టుటతోను, చరిత్రాంశములనుజక్కఁగా గ్రహింప నత్యవసర మగుజ్ఞానమును జేకూర్చుకొనకుండ దేశచరిత్రమునందుఁ బ్రసిద్ధులైనపురుషులవర్తనములను గూర్చి మాటలు పేర్చుటతోను, చరిత్రవిషయమగునవలలలోని చరిత్రభాగ మంతరించుచున్నది. అవ్యక్తమైన దేశాభిమానోత్సాహమునకుఁ దగినమాటలు రచయితలకు దొరకకపోయెను. రచయితలు రుచులు మార్చుకొని బంగాళానువాదానువాదములకో, నిరూపకనవలా (Detective Tales) రచనమునకో దిగుచున్నారు. ఈయుగధర్మ మాందోళన మని చెప్పియుంటిని. నవలానిర్మాణప్రోత్సాహములందును, సంవిధానములందును నీయాందోళనము పూర్తిగా స్పష్టమగుచున్నది. ప్రపంచ

యాథాతత్త్వవిచారము ముఖ్యమై నవలలకు క్షణభం గురత్వమును దాత్కాలికరంజకత్వమును గల్పించుచున్నది. ఆంధ్రనవల యిట్టిదశనుండి బయటఁ బడి యాంధ్రసాహిత్యచరిత్రమున గౌరవార్హము గావలెనన్న నాశయసమన్వయములజీవితమునందు సూచింపఁగల రాజర్షి వంటినవల కావలయును. సమన్వయనవలారచనమునకు మార్గసూచకముగ నీరాజర్షి యను లు వంగీయగ్రంథమున కనువాదముగ నాంధ్రీకరింపఁబడినది.

## రాజర్షి—గ్రంథకర్త

ఈరాజర్షి నవలు బంగాళీభాషను రచించినవా రభినవ ప్రపంచమునఁ గవిశేఖరత్వము గాంచిన శ్రీయుత రవీంద్రనాథ ఠాకూరు. వీరికవనమునందుఁ గలగుణవిశేషము ఆశయసమన్వయము. ఇది వీరికిఁ దండ్రిగా రగుమహర్షి శ్రీదేవేంద్రనాథ ఠాకూరులనుండి లభించినయాస్తి. దేవేంద్రనాథఠాకూరుగారు క్రీ.శ. 19-వ శ.నఁ బూర్వపాశ్చాత్యనాగరికతలకుఁగలిగినసంఘట్టనమును స్వయముగ ననుభవించి తమజీవితమునందు వీనికి సమన్వయము చేసికొన్నమహనీయులలోఁ బ్రసిద్ధులు. సగటునఁ జూచిన యెడలఁ బాశ్చాత్యనాగరికతయందుఁ జిత్తవృత్తిప్రవర్తనమునకును బ్రాచ్యనాగరికతయందుఁ జిత్తవృత్తినిరోధమునకును గౌరవ మధికము; కాని చిత్తవృత్తులను సత్యవ్యవహారములందుఁ బ్రవర్తింపఁజేయుచు, నిచ్చవచ్చినపుడు నిరోధింపఁ గలసామర్థ్యము తొల్లింటిహిందూమహనీయుల కల

వడి యుండెను. అట్టిసామర్థ్యము నుపనిషద్ద్రష్ట లగు మహర్షులవలెనే మననాఁడీ నాఁటివారిమనస్సుల నలరించు విధమున దేవేంద్రనాథఠాకూరులవా రలవఱచికొని తమజీవిత మందు రవీంద్రనాథులవంటితమపుత్త్రులకే కాక లోకమునకు వెల్లడించిరి. అట్టి మహర్షి కుదయించి వారితో సంతతసాహ చర్యము కలిగి వారు కల్పించినసాధనములను సంపూర్ణముగ నభ్యసించిన రవీంద్రనాథఠాకూరుగారిజీవితమందే కాక రచన లందును, కవనమందును నిట్టియాశయసమన్వయము విదితమగు చుండుట యొకవింతగాదు. వీరిగ్రంథములను గూర్చి విపులము గను సవిమర్శముగను వ్రాయుట కిదితరుణముగాకున్నను, ఆశయ సమన్వయము వీరిగ్రంథములం దెట్లు కనఁబడుచున్నదో మాత్ర ము కొంచెము వ్రాయుటవలన రాజర్షినిగూర్చి చెప్పినమాటలు కేవలము నిరాధారములు కావనునమ్మిక కలుగవచ్చును.

చిన్ననాఁటనుండియుఁ జింతనయందే కాని మానసు ధారా శముగఁ బ్రవర్తింపనికారణమునను, శాంతినికేతనమం దట్టిచిం తన కలవాటుపడియుండుటను, లౌకికవిద్యల నభ్యసించుటయం దంతకౌశలముఁ జూపఁజాలక రవీంద్రుఁడు తనజీవితమును సోపానవ దశయందే కవిత్వమున కరికట్టెను. క్రమక్రమముగా నీతని రచనలయందలి కవితాప్రభావము వంగదేశమందే కాక ఖండాం తరమందును వెల్లడి యయ్యెను. ప్రసిద్ధికెక్కిన వీరిగ్రంథము లలో ముఖ్యమైనవి గీతాంజలి, సాధన, తోటవాఁడు, చంద్రబింబము, పోష్టాఫీసు; ఇందు కడపటిరెండును నాట

క్రీడలను వర్ణించును; తోటవాఁడు అనుదానిలో శృంగార పద్యములు గలవు. గీతాంజలి యనునది భక్తిప్రధానమైనపద్యసముదాయము; జీవితమునుగూర్చి రవీంద్రనాథుని యభిప్రాయములిందిమిడి యున్నవి; సాధన యనునది జీవితాశయములను సాధించుమార్గములను దెలుపు నుపన్యాసమంజరి. మొత్తముపై నీగ్రంథములందు బాల్య, యౌవన, కౌమారావస్థలయందు మానవజీవితమునకుఁ గలుగు ప్రోత్సాహములను, ఆశయములను, సుఖదుఃఖములను, వైషమ్యములను సమన్వయదృష్టిని కవి వర్ణించెను. తనయభిప్రాయములను బోధించుట కావ్యరచనకు ముఖ్యముగా నుద్దేశింపకపోయినను రవీంద్రుని కావ్యములను జదువువారికి మాత్రము వానియందలి సమన్వయమార్గములు స్ఫురింపక మానవు.

కవితకు విషయము మానవజీవితము. హైందవసాహిత్యములందే కాక పాశ్చాత్యసాహిత్యములందును నీతికవితాధర్మము నుఱచి జీవితమందలికొన్నియంశములే కవిత కాధారము లనియు, కొందఱి జీవితములే వర్ణనీయము లనియుఁ బలువుకు భ్రమపడుట కలదు. రవీంద్రునికావ్యములం దట్టిభ్రమ తొలఁగించుటకుఁ దగినంత కథాభాగము గలదు. మానవజీవితముయొక్క వివిధతయుఁ బ్రపంచజీవితమున కది పొందియుండుటయుఁ బలువిధములఁ బ్రశంసింపఁబడి యున్నది.

అట్లే మానవజీవితమందలి వివిధము లగునాశయములు, ప్రోత్సాహములు, సుఖదుఃఖములు, వైరుధ్యములును, బరతత్త్వ

ముతో నాత్మతత్త్వమును లగ్నము చేయుటవలన సమన్వయము పొంది యాత్మకు మోక్షసాధనము లగుచున్నవి. ఇట్టిమోక్ష సాధనము నలవఱుచుకొనినప్పుడే జీవితమందును, రచనలందును, కవితాప్రభావప్రకాశమందును కవికి స్వాతంత్ర్యమును, సర్వ జనసమాదరణీయత్వమును గలుగుచున్నవి. ఈ వాక్యములు రవీంద్రులకావ్యముల నాంగ్లమునఁ జదివినవారికి యథార్థము లని తోఁచును. ఇట్లాత్మతత్త్వమును బరతత్త్వముతో లగ్నము చేసి జీవయాత్రను నడపి లౌకికవ్యవహారములందుఁ గలిగిన వైషమ్యములకు గుఱిగాక ఋషిత్వము ప్రకాశింపఁజేసిన మాణిక్యరాయ లనుబంగాళీప్రభువుజీవితమును రవీంద్రులీ రాజర్షి యనునవలయందు వర్ణించిరి. ఇట్టి యాశయోద్దీపితము లగుకథ లింకఁ గొన్నియు వీరు రచించియున్నారు.



## రాజర్షి

ఈ రాజర్షి యందలికథ ఔరంగజీబుపాదిషావారికాలమున జరిగి యుండెను. పాత్రము లగు స్త్రీపురుషులు బంగాళీలు. కథాంశమున నాశయవిరోధసమన్వయములే ముఖ్యములు కాని యిప్పు డాంధ్రమం దున్న నవలలయందువలె నాయికానాయకుల పరస్పరానురాగపరిణామముగాదు. గోవిందమాణిక్యరాయలు, నక్షత్రరాయలు ననునన్నదమ్ములును (రాజకుటుంబికులు), రఘుపతి యను వారిపురోహితుఁడును ముఖ్యపాత్రములు; కాని గోవిందమాణిక్యరాయలరాజర్షిత్వమే ప్రకాశితమైనగుణవిశే

షము. కాఁగా మాణిక్యరాయలగుణవిశేషములే యీగ్రంథము నందుఁ బ్రధానాంశము. తక్కినకథాభాగ మంతయు దీనిని పెంపుచేసి విశదపఱుచుట కేర్పడినదే.

మాణిక్యరాయలజీవిత మాశయోద్దీపిత మైననాఁట నుండియు వన్నె కెక్కుచు వచ్చినది. హాసీ యను బాలికను జూచుటకుఁ బూర్వ మాతనియం దణఁగియుండినగుణవిశేషము లప్పుడు విజృంభించి యేకఫలాపేక్షకు సాధనములై శీలము నకు బలమును స్థైర్యమును దెచ్చి జీవితమందలి వివిధప్రచోద నములకు సమన్వయము చేసికొనఁ గలుగుట కాధారమై వెల యుటకీ హాసీతో జరిగినసంభాషణమునందు స్ఫురించినయాశ యమే కారణమైనది. ఆశయములను సాధించుప్రయత్నమందు గలుగుకష్టము లీతనికిఁ గలిగినవి. తిరస్కృతులైనరఘుపతి వంటి శత్రులకుట్రలు, కాలానుసరణములగు ననావృష్ట్యాదిబాధలు, మొగలులదాడులు, ప్రజల పిచ్చినమ్మకములు అన్నియుఁ బ్రతి బంధకములే యైనవి. వీని నన్నిటిని గడచుటకు క్షాత్రమార్గ మును, సాత్త్వికమార్గమును గలిగియుండ, మాణిక్యరాయలు కాలోచిత మగుక్షాత్రమును విడిచి సాత్త్వికధర్మము నను సరించెను. ఇట్లు కులధర్మమును వదలి పరధర్మము ననుసరించుట యుక్తమా? ఇది రాజర్షిత్వ మగునా? రాజర్షు లని పేరుపొందిన జనకాదు లిట్టివారా? బ్రహ్మర్షిత్వమును సాధించినకౌశికుఁ డిట్టి వాఁడా? పూర్వపు పాశ్చాత్యనీతిశాస్త్రము లిట్టిప్రవర్తనమున నేమగును? అను నిట్టిప్రశ్నముల కీ నవలను జదివినవారిబుద్ధులు

లోనుగాక మానవు; కాని వాని కన్నిటికి నిచ్చట సమాధానములు చెప్పవలసినపని లేదు. చరిత్రాంశము కథాంశమున కెట్లు సంబంధించి యున్నదో, పాత్రలయందు వివిధత యెంతవఱకు స్పష్ట మగుచున్నదో, హాసీకుటుంబపుఁ గథ యిందలి ప్రధానకథాంశముల కెట్లుద్దీపక మగుచున్నదో, జీవితప్రతిబింబన మిందెంతవఱకుఁ గలదో నిశ్చయింపవలసిన బాధ్యతయుఁ జదువరులదే. మానవజీవితమందుఁ గలుగు ప్రోత్సాహములను సమన్వయించు ప్రయత్నములలో నిందొకరీతిఁ బ్రయత్నము చూపఁబడినది. అదియే సిద్ధాంత మని కాదు, వేఱగు సమన్వయ మార్గములు లేవని కాదు.

బంగాళీ దేశపు రాజకుటుంబములకు సంబంధించిన యాశయోద్దీపితము లగు కథలను రచించి తద్దేశీయులకు శ్రీరవీంద్రనాథ ఠాకూరు గారు చూపిన యాశయ సమన్వయ మార్గములను ఆంధ్రలోకమునకుఁ దెలిపి యాంధ్ర రచయితల నాంధ్ర రాజకుటుంబములనుండియు నిట్టి గాథల నెత్తి నూతనమార్గమున గ్రంథరచనఁ జేయుఁ బురికొల్పుటకుఁగా నీ రాజశ్రీ ప్రకాశిత మగుచున్నది. శృంగారచేష్టావర్ణనముల సంగముగాఁ జెప్పి యాశయోద్దీపితము లగు నవలల రచింప నాంధ్రకర్తలు ప్రయత్నించిన మేలగును. తొల్లింటి యాంధ్రుల గుణాతిశయములు దేశీయులకుఁ దెలియుటయే కాక దేశీయులును దమ జీవనమార్గములను ధర్మానుసారముగఁ జక్కఁ జేసికొనఁ గలరు.

ఈప్రస్తావన వ్రాయుటలో నాకు సహాయపడి, శ్రీ ఠాకూరుగారిజీవితమును ఇంగ్లీషున చక్కఁగ వ్రాసి నాకిచ్చిన నామిత్రులు మ.రా.రా.శ్రీ, కే వైకుంఠరావు, బి. ఏ. గారికిని, ఈనవలను తర్జుమాచేసిన బ్రహ్మశ్రీ, రాచకొండ. గానూ శాస్త్రిగారికిని, బ్రహ్మశ్రీ, కరిమెళ్ల. సత్యగోపాలశర్మగారికిని, ముద్రణమున సహాయపడిన మాపండితులు శ్రీమాన్, ఉప్పలం. వేంకటనరసింహాచార్యులుగారికిని కృతజ్ఞుఁడను.

తండయార్పేట,
చెన్నపురి.
1-5-1917.

వాకిళ్ల. వేంకటేశ్వరులు.



# రాజర్షి

## మొదటిపరిచ్ఛేదము.

శ్రీ భువనేశ్వరీ దేవీ మందిరము గోమతీతీరమునఁ జక్కని రాలచే గట్టఁబడి యుండెను. నదీజలాంతర్భాగమువఱకు సోపానములతో స్నానఘట్ట మామందిరమును గలిసియే యుండెను. జ్యేష్ఠమాసమునం దొకదిన ముదయమున త్రిపురానగరసామ్రాజ్యధురంధరుం డగుమహారాజు గోవిందమాణిక్యరాయ లాఘట్టమునకు స్నానముఁ జేయ విచ్చేసెను. అతనితమ్ముఁడగు నక్షత్రరాయలు నన్నగారితో విచ్చేసెను. ఆసమయమున నొకచిన్న బాలికామణి తనచిన్నితమ్మునిఁ దోడ్కొని యాఘట్టమునకు వచ్చెను. ఆముగ్ధబాలిక రాయలను జూచి పరుగుపరుగున వచ్చి యాతని చేలాంచలమును బట్టుకొని "నీవెవరు?", అని యడిగెను.

గోవిందరాయ లచ్చెరువంది "నేను నీసేవకుఁడను", అని బదులు చెప్పెను.

బాలిక.—"పూజకై నాకుఁ గొన్నిపూవుల నిమ్ము."

గోవింద.—సరియే! (మంచిది) నడువుము.

రాజుగారినౌకరు లందఱును భయపడి "మహారాజేంద్రా! తామేలపోవలయును? మేము పూవులను దెచ్చెదము. మేమెందుల కున్నారము!" అని యనిరి.

గోవింద.—"ఈబాలికామణి నన్నడిగెను గావున నేనే యిచ్చెదను."

అతఁడా బాలికాముఖకమలమును దదేకదృష్టితోఁ దిలకింపసాగెను. ఆదినముఖకాల మెంతరమణీయముగా నుండెనో యాబాలికావదనమునట్టులనే చూపఱహృదయములను జూఱఁగొనుచుఁ బ్రకాశించుచుండెను.

బాలిక రాజుగారిచేయిఁ బట్టుకొని మందిరోపాంతముననున్న పుష్పవాటికను బ్రవేశించెను. నల్గడల వికసించియున్న స్వచ్ఛములగు సూర్యకాంతికుసుమంబులననుకరించు నాబాలికాముఖసరోజ మొకవిధమగు సుగంధము నాపూఁదోఁటయందు వెదచల్లుచుండెను. చిఱుతవాఁడగు నామెతమ్ముఁడును దనసోదరీవసనాంచలమును జిన్నిచేతులతోఁ బట్టుకొని యామె వెంబడి నటునిటుఁ దిరుగుచుండెను. అతఁడు తనసహోదరిని మాత్రమే యెఱుంగును. రాజుగారితో నాబాలునకంతగాఁ బరిచయము కలుగలేదు.

రాజు.—(బాలికతో) "నీపేరేమి?"

బాలిక.—"హాసీ"

రాజుగారాబాలునిగూడ నట్టులే యడిగెను. ఆబాలుఁడు తనవిశాలములగునేత్రములను ద్రిప్పుకొనుచుఁ దనయక్కమోమును జూడసాగెను; కాని యేమియును బదులు చెప్పలేదు. ఆకుమారీమణి యాతనియొడలిపైఁ జేయివైచి "తమ్ముఁడా! 'నాపేరు తాత' అని చెప్పుము," అని బుజ్జగించెను.

ఆపిల్లవాఁడు తనచిన్నిపెదవులను విప్పి ముద్దుగా "నాపేరు

తాత!" అనిచెప్పి హాసీ చీరచెఱంగును మునుపటికంటె వేగముగాఁ బట్టుకొనియెను.

హాసీ రాజుగారితో నిట్లు పలికెను. "ఈతఁ డిప్పుడు పిల్లవాఁడు కదా! కావున నందఱు వీనిని "తాతా" అని పిల్చుచుందురు," అని తనచిన్నితమ్మునిఁ జూచి "మంచిది. పకీ 'మందిరము' అనుము."

బాలు.—"లదంద," అనెను.

హాసీ.—(నవ్వుచు) "తాత యిప్పుడు స్పష్టముగా మందిరమని యనలేఁడు. 'లదంద' అనుచున్నాఁడు. పోనిమ్ము. 'కలాయీ' అనుము."

బాలు.—"బలాయీ"

హాసీ.— (పకపక నవ్వుచు) "తాత మనవలె 'కలాయీ' అనలేక 'బలాయీ' అనుచున్నాఁడు," అని మాటిమాటికిఁ దన తమ్ముని ముద్దుపెట్టుకొనుచుఁ గిలిగింతలు వెట్టి యతనిఁ జలింపఁ జేసెను.

తాతకుఁ దనయక్కనగవునకును, దన్నింతగాఁ బ్రేమించుటకును గితంబెద్దిమో తెలియదయ్యెను. అతఁడు విశాలనును తనకందోయిని జలింపఁజేయుచుఁ జూచుచునే యుండెను. నిజముగ మందిరకలాయీశబ్దోచ్చారణ మతఁడప్పుడే నటించిపోయెను. ఇంకేమి వింత గలదు? తాత వయసున్నపుడు హాసీ మందిరమనుటకు 'లదంద' అన లేదు గాని 'పాలూ' అనుచుండెడిది. 'కలాయీ' యనుట కాబాలిక 'బలాయీ' యనుచుం

డనో పఱఁజి యేమనుచుండనో తెలియదు; కాని "కడ్" యనుటకు 'ఘుయి' అని మాత్రమనుచుండె. సరియే దాని కేమి? తాత యట్లు విచిత్రముగా మాటలాడుచుండుట వినినయామెకు నవ్వు తెరతెరలై వచ్చెను. ఇందేమి యాశ్చర్యమున్నది?

తాతసంబంధములగుచైదము లెన్నియో హాసీ రాజున కెఱింగింప నారంభించెను; "ఒకనాఁడొకముసలివాఁడొకనల్లని కంబళిని గప్పుకొని వచ్చెను. తాత వానినిఁజూచి యెలుఁగుబంటి యనెను. తాత కేమియుఁ దెలియదు. మఱియొకమాఱు తాత సీతాఫలమును జూచి యది యొకపక్షి యనుకొని గుండ్రనితన చిన్నిచేతులు తట్టి దాని నగురఁగొట్టఁ బ్రయత్నించెను." అని. హాసీకంటెఁ దాత యెంతయుఁ డెలియనియొకచిన్నబాలుఁడు. ఈ మాటనే మంచియుదాహరణములతో బాగుగ హాసీ రాజున కెఱుఁగఁజెప్పెను. తాత తనసంబంధము లగుమాటలయందు దృష్టినిలిపి వినుచుండెను. ఆమాటలలో నతఁ డెంతవఱకుఁ దెలిసికొనెనో కాని యందుచే నేమియుఁ గలఁత నొందలేదు. ఇట్లు లానాఁటి యుదయమునఁ బూవులను గోయువని పూర్తి యయ్యెను. రాజుగా రాబాలికయొడి పూలతో నింపి పూజ నమాప్తినొందెనని తెలిసికొనెను. రాజుగారాబాలికాబాలకుల మృదుల హృదయప్రేమానుబంధమును జూచి యట్టిపవిత్రహృదయసంబంధమగునానను బూరించి మరలఁ దాను బూవులను గోసికొని భువనేశ్వరి నర్చించెను.

---

## రెండవపరిచ్ఛేదము.

ఒకదిన మొక్కింతసేపు గలిగినపరిచయముచే నాబాల బాలికలయందు రాయలవారికిఁ గలిగినవాత్సల్య మింతింతన రాదు. వేయేల? తాను వారిముఖకమలములను బ్రాతఃకాలమునఁ జూచి వారిని ముద్దాడి ప్రక్కమీఁదినుండి లేపవలయును. పూవులను గోసి వారి కిచ్చి తాను స్నానమున కేఁగవలయును. వారునతనితో నట్టులే మెలంగుచుండిరి. రాజుగారిస్నానమగువఱకు నాసోదరీసోదరమణులు గట్టునఁ గూరుచుండి యచ్చటిస్నానపు వింతలను జూచుచుందురు. ఏకారణముచే నైనఁ దెల్లవాఱునరికి వారి ముద్దుమోములు గాన్పింపనిచో రాయలవారి యానాఁటి యాహ్నికకృత్యమయినను మన్ననఁ గలియుపలసినదే.

తాతకును వాసికిని పావము! తల్లిదండ్రులు లేరు. వారికిఁ బినతండ్రిమాత్ర మొకఁడు కలఁడు. అతనిపేరు కేదారేశ్వరుఁడు. ఆతనికిని బిడ్డలు లేరు. వీరే యాతనిజీవనమున కవలంబకులును సుఖమునకుఁ గారణసామగ్రియు నై యుండిరి.

ఇట్లొకసంవత్సరము కడచెను. ఇప్పుడు తాత, మంచిరమని బాగుగా నుచ్చరించుచున్నాఁడు; కాని కలాయియాయనుట కిప్పటికి బలాయియాయనుట తప్పినది కాదు. ఇంక నతఁడు బాగుగ మాటలాడలేఁడు. గోమతీతీరమునఁ దనసోదరిబలాయి కాళ్లు చాఁచుకొని కూర్చుండి చిన్నచిన్నకథలను జెప్పుచుండునప్పు డాతఁడు బహుజాగరూకతతోఁ జెవి యొగ్గి వినుచుండును. అతఁడు

తలతోఁకలేనికథలను విని యేమి తెలిసికొనుచున్నాఁడో మన కేమియుఁ దెలియదు. ఒకచెట్టుక్రింద గాలిలోఁ గూర్చుండి దిగంబరియై యుండుచిన్న బాలుని కోమలమగుమనంబున ముచ్చటలు వినుటవలన నెట్టియెట్టియూహ లుదయించునో మన కేమి తెలియును? తాత కింకొకవిచిత్ర మగుగుణము కలదు. అతఁడు మతి యేపిల్లకాయలతో నాడుటకును బోఁడు. తనసహోదరి వెన్నంటి ఛాయవలె నెప్పుడును దిరుగుచుండును.

ఆషాఢమాసమున ఉదయమునుండియుఁ బయోధరములచే నాకసముఁ గప్పఁబడియుండెను. వర్ష మింకను గురియలేదు; కాని తల్లతృణములు పొడఁగట్టుచున్నయవి. ఎక్కడనో దూరముగా నింకొకదేశమున నవశ్యము వర్షము కురియుచున్నది. లేకున్న వాయువునం దింత చల్లఁదన మెక్కడినుండి వచ్చెను? గోమతీనదీజలములందును రెండుదరులనుండు నరణ్యమున నంతటను నల్లనినీడ పడియుండెను. నిన్న యమావాస్య కావున భువనేశ్వరీదేవికి పూజామహోత్సవము జరిగెను.

హాసీ నొకచేతితోను దాత నొకచేతితోను బట్టుకొని రాయలవారు నియమితకాలమునకు స్నానఘట్టమును జేరిరి. నున్నని రాలచేఁ గట్టఁబడిన సోపానములపై నుండి ఒకరక్తధార ప్రవహించినజాడ చూపట్టుచు గోమతీజలమునఁ గలిసెను. నిన్నటి రాత్రి నూటయొక్కటి గాడెనుబోతులు బలియీయఁబడినవి. ఈరక్త మాబలిదానసంబంధ మైనదే. హాసీ యీరక్తపుజాడను జూచి యాశ్చర్యమంది రాజుగారితో "ఇది యేమిజాడ?" అని యడిగెను.

రాజు.—"ఇది రక్తపుజాడ" యనెను.

హాసీ.—"ఇంతరక్త మెక్కడిది?" ఇట్లు లక్ష్యైక్యమంది "ఇంత రక్త మెక్కడిది?" అని పలుమాఱు రాజుగారి నడిగెను.

రాజుగారిహృదయమునను సందియ ముదయించెను."నిజముగా నింకరక్త మెక్కడిది?" అని అతఁడు కంపింపసాగెను. ఎంత కాలమునుండియో యతఁడు ప్రతిసంవత్సరమును రుధిరప్రవాహమును జూచుచునే యుండెను,సహించెను; కాని నేఁ డా బాలికా ముఖమున నీప్రశ్నమును విని యాత్మ [illegible] నందియముదయించెను. "ఎందు కింకరక్తము?" అని దీనికి జవాబీయ మఱచిపోయెను. మఱియు సన్యాసుని [illegible] చేయుచుండియు నీప్రశ్నము నాలోచింపసాగెను.ఆ [illegible] దాను "గోమతీ! ప్రతిసంవత్సరము సహస్ర మపరాధరహితములగు జంతువుల రుధిరధారలతోఁ బ్రవహించియు నీ [illegible] లెట్లు కలిగియుంటివి?" అనుకొనుచుండెను. హాసీ మెట్లపైఁ గూర్చుండి తనవస్త్రమును నీటితోఁ దడిపి మెల్ల మెల్లగ రక్తపు మచ్చను తుడుచుచుండెను. ఆమెను జూచి తాత కూడ తన చేతులతో మచ్చను తుడుచుచుండెను. హాసీ కట్టుకొనిన వస్త్రముకూడ రక్తముచే నిండినయ్యెను. రాజుగారు స్నానము చేయుట ముగియునంతలొ రక్తపుజాడను పిల్లలిద్దఱును గడిగి పోఁగొట్టిరి. అక్కడనుండి యింటికి రాఁగానే హాసీకి జ్వరమంకురించెను. తాత యామెచెంతఁ గూర్చుండి తన చిన్నరెండువ్రేళ్లతో, మూయఁబడి యుండిన యామెకంటిఱెప్పలనెత్తుటకై ప్రయత్నించుచు నడుమ నడుమ అక్కా! అక్కా! అని పిలుచుచుండెను. ఆపిలుపును విని

యులికిపడి కొంత తెలివితో హాసీలేచుచు "తాతా యెందుకు?" అని పలుకుచు నతనిఁ దనదగ్గఱకుఁ దీసికొనుచుండెను. మరల నామె కన్నులు మూఁతబడినవి. తాత చాలసేపటివఱకామె మోమును జూచుచు మాటలాడక యూరకుండెను. మఱికొంతసేపటికి మెల్ల మెల్లన నామెకంఠమును గవుంగిలించుకొని మోముమోమునఁ జేర్చి మెల్లఁగా "అక్కా! నీవులేచెదవా," అని యడిగెను. హాసీ మరలఁ జెలిని దెచ్చుకొని యాతనిఁ దన యొమ్మున నానుకొని "బాబూ! లేవలేను" అనెను. పాప మామెకు లేవసామర్థ్య మెక్కడిది? తాతయొక్క యల్పహృదయమున నిజముగ నంధ కారము గ్రమ్మెను. దినమంతయు నాతని యాటపాటలు నాతని సంతోషాశయు నిశ్శేషముగా మన్నునఁ గలిసిపోయినవి. ఆకసము ఘోరాంధకారవ్యాప్తమయ్యెను. ఇంటికప్పుపై వర్షము కురియు చున్నట్లు ధ్వని వినవచ్చుచుండెను. అదిగో చూడుము. సమీప మున నుండుచెట్టు వానచేఁ దడిసిపోయెను. వీథిలో నెవ్వరునడుచు జాడ కాన రా దయ్యెను. కేదారేశ్వరుం డొకవైద్యునిఁ దనతోఁ దీసికొని వచ్చెను. వైద్యుఁ డాబాలికచేయిపట్టి నాడిఁ బరీక్షించి మితిమీఱిన దని తెలిసికొనెను.

అనుఱునాఁడు స్నానముచేయ మాణిక్యరాయ లరుగు దెంచెను. నాఁ డాతనికానందదాయకులగు నాపిల్ల లిద్దరు నామందిరమున లేరు. "మొన్నటి భయంకరమగు మార్పువలన వారిరువురు నేఁడు రారైరి," అని యాతఁ డనుకొనెను. స్నానము తర్పణము గావించి శిబికారూఢుండై బోయీలతో "కేదారేశ్వ రునియింటిపై పునకు నడువుఁడు," అని యాజ్ఞాపించెను. నౌకరు

లామాటవిని మిక్కిలి యచ్చెరు వందిరి. రాజాజ్ఞ కెదురాడఁ గలరా? కేదారేశ్వరుని గుమ్మముకడకుఁ బల్లకి వచ్చినంతలో నా యింటిలోఁ గలకల ముదయించెను.

ఈసందడిలో రోగియున్నవస్థత సందఱు మఱచిపోయిరి. ఒక్కతాతమాత్ర మచ్చటనుండి కదలలేదు. అతఁడు తెలివి తప్పి యున్న శీనయక్కసందిటిలో నుండెను. ఆమెవ స్త్రాపుఁజెఱఁగును మొగముమీఁదఁ గప్పుకొని మాటలాడక యూరకుండెను. రాజుగా రింటిలోఁ బ్రవేశించినతోడనే తాత యాతనిఁ జూచి "ఏమైనది," అని యడిగెను. ఉద్విగ్నహృదయుం డగుటచే రాజాతని కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. మరలఁ దల యాడించుచుఁ దొందరగా "ఏమీ? అక్కయ్యకు దెబ్బ తగిలినదా?" అని యడిగెను. అతనిపినతండ్రి కేదారేశ్వరుఁడు కొంచెము కోపించి "ఆఁ! అవును: దెబ్బ తగిలెను." అని చెప్పెను. తాత, యక్కదగ్గఱకుఁ బోయి యామెమోము నెత్తఁ బ్రయత్నించుచు గళము నానుకొని "అక్కా! నీకెక్కడ దెబ్బ తగిలినది?" అని యడిగెను. అట్లడుగుటకుఁ గారణ మాతనిమనమున నిట్లై యుండవచ్చును. "ఎక్కడ నామెకుదెబ్బతగిలెనో యక్కడ నూఁది చేతితో రాచి యామెబాధనంతయు బోఁగొట్టవలయును." అని; కాని యామెయుత్తరమీయకపోవుటచే నతఁడు మఱిసహింపలేక పోయెను. అతనిచిన్నిపెదవులు కదలుచుండెను. నిలువలేక శోకావేగమున నేడువసాగెను. "నిన్ననాఱుగంటలనుండియుఁ గూరుచున్నాను. నాతో నెందుకుమాటలాడవు? నే నేమంటిని? నామీఁద నీకింతకోపమేల?" అని యనుచుండెను. రాజుగారి

యెదుట నిల్చియుండి దుఃఖించుచున్న బాలునిచర్యఁ జూచి కేదారేశ్వరుండు వ్యాకులితుండై కొంచెము కోపముతో నాబాలునిచేయి పట్టికొని యెత్తి పొరుగింటికిఁ దీసికొనిపోయెను. అప్పుడును హాసీ మాటలాడలేదు.

రాజవైద్యుఁడు జ్వరము వీలు తప్పియున్నట్లు లిదివఱకే చెప్పి పోయెను. రాజుగారు స్వయముగా నామెశిరోభాగమున గూర్చుండి చూచుచుండెను. సాయంకాలమయ్యెను. అప్పుడు హాసీ "అహా! ఇంతరక్తమెందుకు?" అని పలవరింప సాగెను. రాజుగారు— "నేనీరక్తప్రవాహమును మఱి ప్రవహింపనీయను."

హాసి—మరల, "తమ్ముఁడా! రారమ్ము, తాతా! మనమిరువురము ను గలిసి యీరక్తప్రవాహము నణఁచివేయుదము," అని పలికెను.

సాయమైనతరువాత హాసీ యొక్కమూఁడు కన్నులు తెఱచెను. తెఱచి యక్కడ నెవ్వరినో వెదకుచున్నట్లు నల్లుదెసల చూపుల నొక్కసారి ప్రసరింపఁ జేసెను. ఆసమయమున తాత మఱియొకగృహమున సడ్చి యేడ్చి నిద్దురపోవుచుండెను. హాసీ కన్నులు విప్పి యెవనికై నాలుగుదిక్కులఁజూచెనో యాబాలుఁడు గాన్పింపలేదు. తెప్పున వెంటనే కన్నులను మూసికొనెను.

సరి, అప్పుడు మూఁతఁబడినకన్నులు మఱి తెఱవఁబడ లేదు. ఆరాత్రి రెండుయామములకు రాజుగారి భుజముపైఁ బడియుండి హాసీ తనప్రాణవాయువులను విడిచెను. జనులందఱు హాసీకళేబరమును సంస్కరించుటకుఁ దీసికొనిపోవుసమయమున తాత నిద్రలోనుండెను. అప్పుడు తాత మేల్కొనియుండెనా; వాఁడు తనయక్కగారితో ఛాయవలె వెన్నంటిపోవలసిన వాఁడే.

## మూఁడవపరిచ్ఛేదము.

రాజుగారు దర్బారున నుండిరి. భువనేశ్వరీదేవాలయమునఁ బూజారి యగునాతఁ డొకపని గలిగి రాజుగారికడ కరుదెంచెను. ఆతనిపేరు రఘుపతి. ఆదేశమునఁ బూజారి (పురోహితు)ని "ఠాంతాయీ" యని జనులు వాడుచుందురు. భువనేశ్వరికిఁ బూజ యైనపదునాల్గుదినములు గడిచినపిమ్మట నిశ్చయముగ నొకరాత్రియందుఁ బదునలుగురు దేవతలనుఁ బూజాపద్ధతి మామూలయి యుండెను. ఈపూజాదినమున రాత్రియందెవ్వరు నిలు విడిచి యావలకుఁ బోఁగూడదు. రాజుగారుగూడ నీనియమమునకు లోఁబడవలసినవారే. రాజుగారిల్లు విడిచి యారాత్రి వీథిలోని కరుదెంచినచోఁ బురోహితునిచే విధింపఁబడిన యొక్క దండమున (జరిమానా)కు బద్ధులై యుండవలసినదే. ఆరాత్రి నరబలి యీయఁబడునని యొకకింవదంతి కలదు. ఆపూజావిధి యందు నన్నిటికంటె ముందుగా నెన్నిపశువులబలి యీయఁబడల యునో యవి రాజభవనసంబంధములై యుండవలయునని చెప్పుచుఁ దీసికొనిపోవుచుందురు. పురోహితుఁ డిప్పుడాపశువుల నడుగుటకై దర్బారునకు విచ్చేసెను. ఆపూజ కింక నొకవారము గడువున్నది.

రాజు.—"ఈసంవత్సరము మొదలు దేవాలయమున నెట్టి జీవహింస జరగఁ గూడదు."

ఆమాటవిని యెల్లరును దలలువంచుకొని యూరకుండిరి.

పురో.—"ఏమీ! నేనిక్కడ స్వప్నము గాంచుచుంటిని కాఁబోలును"

రాజు.—కాదు కాదు! మహాశయా! ఇన్నిదినములవఱకు మేము స్వప్నమును గాంచుచుంటిమి. మా నేత్రములిప్పుడు తెఱువఁబడినవి. జగదీశ్వరి యొకబాలికారూపమున నాకు దర్శనమిచ్చెను. ఆమె, దయామయి యగుజగన్మాత యనియు, నిప్పుడు తనజీవరాసుల రక్తపాతమును జూడఁజాలననియు వచియించెను.

రఘు.—"అట్లయిన నిన్నిదినములనుండియు నాజగన్మాత జీవుల రక్తమునే పానము చేయుచుండెను."

రాజు.—"లేదు. ఆమె రక్తమును పానము చేయలేదు. మీర లందఱు జీవులను జంపుచు రక్తమును బ్రవహింపఁజేయుచుండిన నామె పెడముఖమును బెట్టుకొనుచుండెను."

రఘు.—"మహారాజా! తాము రాజకార్యములు బాగుగ నెఱిఁగేస్తుటలో మంచినేర్పఱులు. ఇందున కేమియు సందియము లేదు; కాని పూజావిషయమున మీ కేమియును దెలియదు. ఈబలిదానము జగదంబ కిష్టము లేకపోయినచో మొదట నాతోనే చెప్పియుండును," అనెను. నక్షత్రరాయలు మిక్కిలి జ్ఞానవంతునివలె దలనాడించుచు, "ఆహా! ఈమాట నిజము, దేవి కీవిషయమున నిష్టము లేకపోయినచో ముందుగాఁ బురోహితమహాశయునకే తెలిపియుండవలయును," అని పలికెను.

రాజు.—"ఎవనిహృదయము కఠోరత వహించి యుండునో యతఁడంబికావాక్యమును వినఁజాలఁడు."

నక్షత్రరాయలు పురోహితుని మొగమువంకఁ జూచు చుండెను. రాజుగారిమాటకవశ్యము జబాబీయవలయు నని యాచూపున కర్థమై యుండును. రఘుపతి యత్యధికక్రోధాగ్నిచే మండిపడుచు, "మీరు భ్రష్టాచారుండగు నాస్తికునిఠీరున మాటలాడుచున్నారు," అని పలికెను.

గోవిందమాణిక్యరాయలు క్రోధాగ్నిచే మండిపడుచున్న రఘుపతిముఖమును జూచి,"మహానుభావా! రాజసభాంతరమునఁ గూరుచుండి యూరక కాలమును వ్యర్థపఱుపనేల ? మందిరమునకరిగి తమపనిపాటులను జూచుకొండు. తాము వెళ్లిపోవు చున్నప్పుడు దారిలో నామాటగా 'ఈరాజ్యమున నెవ్వఁడైన దేవతాసన్నిధిని జీవబలి యొసంగ నేని యతఁడు తప్పక నీరాజ్యమునుండి వెడలఁగొట్టఁబడు' నని ప్రకటించుచుఁ బోవుదురు గాక," అనిపలికెను.

వెంటనే రఘుపతి కంపితగాత్రుండై లేచి నిలువఁబడి తనజందెమును బట్టుకొని: "పాము! నీకిప్పుడు చేటుకాలము మూడినది. నీవు శీఘ్రముగా నశింతువుగాక!"అనిశపించెను.పురోహితుం డిచ్చినశాపమునువిని నాలుగుదెసలనుండియు హాహారవము లానర్చుచు నెల్లరు నాతనిపైఁ బడ నుద్యుక్తులైరి. రాజు సంజ్ఞాభావంబున నెల్లర వారించెను. అందఱు వేఱువేఱుగాఁ బోయి నిలిచి యుండిరి.

రఘు:—"నీవురాజవు.నీకిష్టమైనచోఁ బ్రజలసర్వస్వమును పాలింపఁగలవు.ఇందుచే దేవీబలిదానమును హరింప నెంచితివిగా?

ఏమి నీసామర్థ్యము? దేవసేవకుఁడగునీరఘుపతి యుండఁగా నీవె ట్లు పూజావిధియందు విఘ్నమొనరింపఁగలవో, నేనును జూచె దను గాక!" అని కఠినోక్తులు వచించుచుండెను.

మంత్రి, రాజుగారిస్వభావమును బాగుగ నెఱుంగును. రాజుగారేది సంకల్పించిన నది పూర్తిచేయక విడువరని యతఁ డెఱుంగకపోలేదు. ఐనను మంత్రి చేతులు జోడించుకొని మెల్ల మెల్లన, "రాజకులచంద్రమా! స్వర్గమందున్న మీపూర్వపురు షులకాలమునుండియు దేవీసాన్నిధ్యమున బలిదాన మవశ్యకర్తవ్య మై జరుగుచు వచ్చుచున్నయది. ఈవిషయమున ఒకమారైన వేఱొకలాగున జరగలేదు," అని చెప్పి యతఁ డూరకుండెను. రాజేమియు మాటలాడలేదు.

మంత్రి—"నేఁడిన్నినాళ్లైనపిదపఁ దమ పూర్వ పు రు షు ల చే సంస్థాపితమైన పూజావిషయమున విఘ్నమొనరించినచో స్వర్గ మందున్న మీ పితృదేవతలు మీకు నప్రసన్నులగుదురు."

రాజుగా రాలోచించుచుండిరి. నక్షత్రరాయులు తన పాండిత్యమును వ్యక్తపఱచుమాటలతో "ఔ నవును! స్వర్గ మునయున్న పితృదేవత లప్రసన్ను లగుదురు," అని పల్కెను.

మంత్రి—(మరల) "రాజేంద్రా! ఒకపని చేయుఁడు. వేయుపశు వుల నిచ్చువట్లున నూఱుపశువుల నిచ్చునట్లాజ్ఞాపింపుఁడు."

సభాసదు లందఱీమాటలు విని పిడుగుపడినట్లరయఁ జలలు వంచికొని యుండిరి. రాజుగారును కూరుచుండి యూ

యంశము నాలోచించు చుండిరి. కుపితుండైన రఘుపతి యుద్ధై ర్యమున దర్బారునుండి లేచిపో నుద్యుక్తుం డయ్యెను.

అట్టిసమయమున ద్వారపాలకునిచేతినుండి యెట్లులో తప్పించుకొని యొకబాలుఁడు దర్బారునఁ బ్రవేశించెను. తలకుఁ బాగా గాని కాలునకుఁ జెప్పుగాని లేదు. రాజు సభాంతరమున నిలువఁబడి యాకర్ణాంతము లగుకనుదమ్ములతో రాయలను జూచుచు, "అక్క యేదీ?" అని యడిగెను. సభవా రందఱు నిశ్చేష్టితులై యుండిరి. కేవల మొకచిన్నికణ్ఠనికంఠధ్వనిచే నాసభాభవన మంతయు, "అక్క యేదీ? ఎక్కడ నున్నది?" అని ప్రతిధ్వనిచేయుచుండెను.

రాజుగా రతిత్వరితముగా సింహాసనమునుండి దిగి యా బాలుని నెత్తి కౌఁగిలియం దుంచుకొనియెను. మరల నతఁడు మంత్రితో "నేఁటినుండియు నారాజ్యమున దేవీబలిదానము మాఱి చేయఁబడదు. ఈవిషయమున మఱియేమియును బలుకకుము," అని యుత్తర మిచ్చెను.

మంత్రి.—"మహాప్రసాదము."

తాత.—"అక్కయేదీ? ఎక్కడ నున్నది?" అని మరల నడిగెను.

రాజు.—"దేవీసన్నిధి నున్నది."

తాత, చాలసేపువఱకు ముక్కుపై వ్రేలుంచుకొని యూరకుండెను. నిజముగ నిప్పటికిఁ దనయక్కగారుండుతావు తెలిసినటుల యెంచి తలఁచుకొనుచుండెను. ఆదివసము మొదలు రాజుగా రాబాలునిఁ దనయొద్దనే యుంచుకొనెను. మఱియు వృద్ధుం

డగునాతనిపినతండ్రి కేదారేశ్వరునకుఁ దనకుమారుని నొకచో నుండుట కుత్తరువు చేసెను.

సభాసదు లన్యోన్యము వాదానువాదముల నాడుకొను చుండిరి. "అన్నా! మనదేశము జైనమతావలంబన మయినది. బౌద్ధులు జీవహత్యను సహింప రని వినుచున్నాము. ఏ మిప్పుడు మనహిందూలోకమునఁ గూడ నీమతము వ్యాపించినదే!"

నక్షత్రరాయలును సభాసదులయభిప్రాయమున నేకీభవించి, "అయ్యో! మనహైందవజాతియందును జీవహత్య నిషేధింపఁబడవలయునా?" అని పలుక సాగెను.

"దేశ మవనతి నొందుట కింతకంటె నిం కేమి కావలయును? బౌద్ధులకును మనకు నిం కేమి భేదము గలదు?" అని లోకు లనుకొనుచుండిరి.

శ్రీ వేమన గ్రంథాలయము
తెనాలి (కృష్ణా)

## నాల్గవపరిచ్ఛేదము.

జయసింహుఁడు భువనేశ్వరీమందిరమునందు నొకసేవకుఁడు. అతఁ డుత్తమరాజకులసంజాతుఁడు. అతనితండ్రి సుచేతసింహుఁడు త్రిపురారాజధానియం దొకనౌకరుగా నుండెడివాఁడు. సుచేతసింహుఁడు కాలధర్మ మొందునాఁటికి జయసింహుఁ డేమియు నెఱుంగనిబాలుఁడై యుండెను. దీనఁ దగు

బాలకుని, రాజుగారు దేవీమందిరమున నొకసేవకునిగా నుండ నియమించిరి. జయసింహుఁ డది మొదలు పురోహితుం డగురఘుపతిచేతనే క్రమముగాఁ బాలింపఁ బడుచుఁ బెరుగుచుండెను. ఆతనికడఁ బనుపుకొనుచుండెను. చిఱుతతనమునుండియు దేవీమందిరముననే యుండుటచే నతఁడామందిరమే తనయిల్లనుకొనుచుండెను. మందిరమున నతఁడెఱుఁగని ప్రదేశము గాని రహస్యము గాని యెద్దియు లేదు. పాప మతనితల్లియును జనిపోయెను. భువనేశ్వరీవిగ్రహమే తనతల్లిగా నాతఁ డెంచుకొనుచుండెను. ప్రతిమాసమీపమునందుననే యతఁడు కూర్చుండి మాటలాడుకొనుచుండెను. ఆతఁ డెప్పుడును దాను దిక్కులేనివాఁడ నని యనుకొనలేదు. ఆతని కెందఱో మిత్రులు గలరు. ఆలయసమీపమున నుండు పూఁదోఁటలో నెన్నియో మొక్కలను నాఁటి పెంచి పెద్దతరువులుగాఁ జేసెను. ఆతనిచే నాఁటఁబడిన మొక్కలు నలుదెసల నావరించుకొని వృక్షము లనిపించుకొనుచున్నవి. ఆతరుసంతానమున లతావితానము లల్లుకొని యుండెను. తరుశాఖలన్నియు బాగుగఁ బూచి యలరారుచుండెను. చల్లనినీడ నొసంగుచుండెను. ఆకుపచ్చనితీఁగలెల్లెడ నల్లుకొనియుండుటచే నుద్యాన మంతయు నాకుపచ్చఁదనమును వహించెను; కాని యిదియంతయు జయసింహునిహృదయానందమునకు మూలకందమై యుండెను. లోకు లీతనికిఁ బ్రకృతియందుఁ గలయనురాగము నంతగాఁ దెలిసికొనలేకపోయిరి. అతఁడు తనకుఁ గల ప్రబల మైనబలముచేతను సాహసముచేతను లోకమునఁ బ్రఖ్యాతిని గాంచెను.

ఆలయమునఁ గలవనిపాటులను జక్కఁబఱచికొని జయసింహుఁడు ద్వారముకడఁ గూరుచుండెను. నదీతీరమునఁ బుష్పవాటిక చెలువొందుచుండెను. ప్రాగ్దిగంతము చిన్నయుండె. అతి వేగముగా మేఘము లావరించినవి. చల్లనిగాలి వీచఁజొచ్చెను. వాన కురియసాగెను. నూతనవర్షోదకమున జయసింహునితరు సంతానము తాన మాడుచుండెను. ఆకాశమునను వర్షబిందువులనృత్యోత్సవము జరగుచుండెను. వాననీరు చిన్నచిన్న కాలువలుగాఁ గలిసికొని ప్రవహించి ధ్వనిచేయుచు గోమతీనదిలోఁ గలియుచుండెను. జయసింహుం డత్యానందముతో నచ్చటఁ గూర్చుండి తనయుపవనశోభను దిలకించుచుండెను. నలుదెసల నల్లుకొనుచుండు మేఘమాలికావితానమును, అందలితటిల్లతాప్రతానమును, సౌందర్యమును వెదఁజల్లువనతరులతా సంతానమును, అనురాగస్ఫురితము లగుపల్లవప్రతానమును గనుచు, బెకబెకలాడు మండూకములధ్వనియును, జోఁడించి కురియుచున్న వర్షధారారావంబును, మేఘములఘుమఘుమధ్వనులును వినుచుఁ దత్సమయమున నున్నప్రకృతి నభినందించుచు నానందహృదయుండై జయసింహుఁడు మేను మఱచియుండెను.

అట్టివర్షమునఁ దడిసి రఘుపతి వచ్చుచుండెను. జయసింహుం డతనిఁ జూచి యత్యధిక మగుభక్తితో లేచి పాదములను గడుగుటకు నుదకమును గట్టుకొనుటకుఁ బొడివస్త్రమును దీసికొని వచ్చెను. రఘుపతి కోపించి "నిన్నువస్త్రము తెమ్మని యెవ్వరనిరి?" అని యావస్త్రమునెత్తి యింటిలోఁ బాఱవైచెను. పాదములను

గడుగవలయునని జయసింహుఁ డుదకమును దెచ్చి ముందు నిలువంబడెను. రఘుపతి క్రోధముతో "ఉండుముండుము. నీవాయుదకము నక్కడనుంచుము." అని పలికి కాలితో నాపాత్రమును దన్ని దొర్లించెను. హఠాత్తుగావచ్చిన యీరఘుపతికోపమునకుఁ గారణ మూరయు లేక జయసింహుఁడు నిశ్చేష్టితుఁ డయ్యెను. అతఁ డావస్త్రమును దీసి యథాస్థానమునను౦చుటకై యత్నించెను. రఘుపతి, మరలఁ గోపించి "ఆఁగుమాఁగుము. నీ నావస్త్రము నంటకుము" అని పలికి యావసనమును దీసికొని తాను స్వయముగా నీరు దెచ్చుకొని కాళ్లుకడుగుకొనియెను. అప్పుడు జయసింహుఁడు మెల్లమెల్లఁగా "అయ్యా! నేనేమియపరాధ మొనర్చితిని?" అనియడిగెను. రఘుపతి కొంత తగ్గి "నీవపరాధ మొనర్చితి వని యెవరన్నారు" అనెను. జయసింహుఁడు దుఃఖితుఁడై మాటలాడక యూరకుండెను. రఘుపతి వ్యాకులచిత్తుండై వాకిలిలో నిటు నటుఁ దిరుగుచుండెను. రాత్రియందుఁ గొంత భాగ మట్టులే గతించెను. మరల వర్షము కురియఁజొచ్చెను. తుదకు రఘుపతి జయసింహుని వీపుపైఁ జేయువైచి శాంతస్వరంబున "రాత్రి కడచుచున్నది. నీవు పోయి పండుకొనుము." అనెను. ఆమాట లాజయసింహునకు సుధాసేచనమై యలజడి మాన్ప "అయ్యా! తాముముందు శయనింప దయచేయుఁడు. వెనువెంట నేనువచ్చెదను" అనెను. రఘుపతి, "నే శయనించుట కింక వేళ యున్నది. చూడు, నేఁడు నీతో నేనెంతయు వికటముగాఁ బ్రసంగించితి నని మదిలో నుంచుకొనకుము. అప్పుడు నాచిత్త మెంతయుఁ బరితాపము నొందుచుండెను. నిద్రించి రేపు నీతో నాయుదంత మంతయు

నెఱింగించెదను. నీవు పోయి శయనింపుము" అనెను. "మహా ప్రసాదము" అని జయసింహుఁడు పోయి నిద్రించెను. రఘుపతి రాత్రియంతయు నిట్టులే తిరుగుచుండెను.

ఉదయమున లేచి జయసింహుఁడు గురువగురఘుపతికిఁ బ్రణమిల్లి సమీపమున నిలిచి యుండెను.

రఘు.—"జయసింహా ! దేవి కొసంగఁబడుబలిదాన మాఁపి వేయఁబడెను."

జయ.—"అయ్యా ! ఇదియేమిమాట?" అని యాశ్చర్యముతోఁ బలికెను.

రఘు)—"రాజుగా రిట్టులే యాజ్ఞాపించిరి."

జయ.—"ఏ రాజుగారు?"

రఘు.—(చీకాకుతో) "ఇచ్చో రాజుగాక మఱియెగండమృగ మున్నది ? గోవిందమాణిక్యరాయలు దేవమందిరమున జీవ బలి నీయవలదని శాసించినాఁడు."

జయ.—"నరబలియో?"

రఘు.—"నీకు దిగ్భ్రమగలిగెనా యేమి ? జీవబలియని నేఁజెప్పుచుండఁగా నీవు నరబలిమాట యడిగెదవేల ? నరులు జీవులు కారా?"

జయ.—"జీవజంతువును బలివేయఁగూడదా!"

రఘు.—"కూడదు."

జయ.—"ఏమీ! గోవిందమాణిక్యరాయలే యిట్లుశాసించె నా?"

రఘు.—"ఔను! ఒక్కమాటనే యిన్నిసారు లేలయడిగెదవు."

జయసింహుఁడు చాలసేపువఱ కేమియు నన లేదు. అతఁడు కేవలము తన మనమున నిట్లనుకొను చుండెను. "మహా రాజా! మాణిక్యరాయా! నీవు ధన్యుండవు." అని రాయ లను జయసింహుఁడు చిన్ననాఁటినుండియు దైవముగా నెంచు చుండెడివాఁడు. ఆకసమునం దలరారుసంపూర్ణపూర్ణిమాసు ధాంశునిపైఁ జిన్నిబిడ్డల కెట్టిస్వాభావిక మగుననురాగము కలిగి యుండునో మాణిక్యరాయలపై జయసింహుని మనోభావమును నిజముగ నట్టిదేయయి యుండెను. శాంతభావముతో నిండి యుండు రాయలసుందరవదనారవిందమును జూచి యాతనికై తన ప్రాణములనైన నర్పించుటకు సంసిద్ధుఁడై యుండెను.

రఘు.—"దీని కేదైన నుపాయ మవశ్యము చేయవలయును."

జయ.—"నిజము నేను రాజుగారికడ కేఁగి వినయపూర్వకముగా మనవి చేసివత్తునా?"

రఘు.—"ప్రయోజనములేదు."

జయ.—"అయిన మఱి యేమిచేయునగును?"

రఘు.—కొంతవఱ కాలోచించి "రేపు చెప్పెదను. నీవు రేపు ప్రొద్దున లేచి నక్షత్రరాయలకడ కరగి రహస్యముగా వచ్చి నన్నుఁ గలసికొనినట్లు చెప్పవలయును."

---

## ఐదవపరిచ్ఛేదము.

ప్రాతఃకాలమున నక్షత్రరాయలు వచ్చి రఘుపతికి నమస్కరించి, "నన్నెందుకుఁ బిలువ నంపితిరి ?" అని యడిగెను.

రఘు.—"నీవిషయమున దేవి ప్రసన్న యై యాజ్ఞాపించుచున్నది. ముందామెకు నమస్కరింపరమ్ము."

ఇరువురు దేవియాలయమునఁ బ్రవేశించిరి. జయసింహుఁడును వారివెనువెంట నరిగెను. . నక్షత్రరాయలు భువనేశ్వరీమూర్తికి సాష్టాంగముగాఁ బ్రణామ మొనరించెను.

రఘు.—"కుమారా! నీవు రాజ వగుదువు."

నక్ష.—"ఏ మనుచుంటిరి ? మహానుభావా! నేను రాజ నగుదునా ? మీ రనుచున్నమాట యథార్థము గాదు." అని యనుచు పకపక నవ్వ సాగెను.

రఘు.—"నేఁ జెప్పుచుంటిని. నీవు మహారాజ వగుదువు."

నక్ష.—"మీరు చెప్పుచుంటిరి. సరియే! నేను నిజముగ రాజ నగుదునా ?" అని రఘుపతిముఖమును ఱెప్పవేయక చూడ సాగెను.

రఘు.—"అయిన నేమి. నే నీతో నబద్ధము చెప్పుచున్నానా ?"

నక్ష.—"తమ రబద్ధ మాడరు; కాని నేరాజు నగు టెట్లు? గురువుగారూ! చిత్తగింపుఁడు. నిన్నటిరాత్రి కలలో నేనొక కప్పను జూచితిని. మంచిది. కప్పను గలలోఁ జూచినచో నే మగునో సెలవిండు."

రఘు.—(నవ్వుఁ జూపుకొని) "ఏలాటికప్పను జూచితివి? దానితల మీఁద మచ్చయున్నదా?"

నక్ష.—(తుందుడుకుగా) "ఆహా! దానితలమీఁద మచ్చమాత్ర మున్నది."

రఘు.—"సరియే. ఆలాగైన నీవు రాజు వగుట కింకేమియును సందేహము లేదు."

నక్ష.—"ఆలాగైన నేను రాజు నగుటకు సందియము లేదని మీరనుచున్నారుగదా? రాజ్యము నాకులభించునా? లేదా? ఈమాట చెప్పవలయును."

రఘు.—"ఏమీ నామాట యబద్ధమైపోవునా?"

నక్ష.—"లేదు, లేదు. గురువుగారూ! నేనామాటయనుగలేదు. నాకుఁ బ్రభుత్వము లభించునని మీరు సెలవిచ్చుచున్నారు; కాని క్షమింపుఁడు. ఒకవేళ కానిచో?—ఏమీ దైవవశమున నిట్లు కాఁగూడదా?"

రఘు.—(మాట కడ్డు వచ్చి) "కాదు, కాదు. ఈమాట వేఱొక విధముగా జరగఁబోదు."

నక్ష.—"తమ రింత ధైర్యముగాఁ జెప్పుచున్నప్పు డిది నిస్సందేహముగా జరిగియే తీరును. సరియే. నేను రాజు కాఁగానే తప్పక మీకు మంత్రిపదవి నొసంగెదను."

రఘు.—"ఈమాట చూచుకొందము లెమ్ము. రాజగుటకు ముందేమి చేయవలెనో యది చెప్పెదను వినుము. భువనేశ్వరీదేవి, రాజరక్తమును జూడ నిచ్ఛయించు చున్నది; నాకు స్వప్నమందా మె యిట్లాజ్ఞాపించెను."

నక్ష.—"ఏమీ? దేవి రాజరక్తమును జూడ నిచ్ఛయించు చున్నదా? స్వప్నమందుఁ దమ కిట్టు లాజ్ఞాపించినదా? ఈ మాటమాత్రము బాగుగా నున్నయది."

రఘు.—"నీవు మాణిక్యరాయలరక్తమును దీసికొని రావలయును."

నక్షత్రరాయలెట్టులో "ఆఁ" అనుచు వెలవెలఁ బోవుచుండెను. మొదటమాత్ర మతఁడు "మంచిమాట," అనెను; గాని యిప్పుడామాట మనమునం దాతని కంతమంచిమాటగాఁ దోఁచ లేదు.

రఘు.—(రిచ్చపడి)"ఏమి? నీహృదయమున భ్రాతృస్నేహ ముదయించుచుండెను గాఁబోలు?ను"

నక్షత్రరాయనికన్నగారిని వధింపనిష్టములేదు; కాని రఘుపతిమాట కాదన్నచో నతఁ డేమిచేయునో యనుభయముచే రానినవ్వును దెచ్చుకొని, మీఁదిమీఁది మనస్సుతో "ఆహాహా! భ్రాతృస్నేహ మఁట! మీరు బాగుగాఁ జెప్పుచున్నారు. ఓహో హో! భ్రాతృస్నేహమా? ఇంతచమత్కారము నింతహాస్యాస్పద మగుమాట యింకెద్ది గలదు? భ్రాతృస్నేహము. ఆహా! ఎంత సుఖకర మగుమాట చెప్పితిరి?" అని పలికెను. నక్షత్రరాయని హృదయమున భ్రాతృస్నేహము మేలుకొనియున్నదని యంతర్యామి యగుభగవంతునకే యెఱుక; దానిని నవ్వుచు నాతఁడు దీసివేయఁజాలఁడు.

రఘు.—"ఈ భ్రాతృస్నేహము నొంది మఱి నీవేమి చేయఁగలవు?"

నక్ష.—"నేనేమిచేయఁ గలను.? తమరే సెలవిండు."

రఘు.—"చెవియొగ్గి యీమాట వినుము. మాణిక్యరాయలను వధించి యాతనిరక్తమును దేవీసందర్శనార్థము నీవు తీసికొని రావలయును."

నక్షత్రరాయలు మంత్రోచ్చారణము చేయుతీరున, "మాణిక్యరాయల రక్తమును దేవీదర్శనార్థము తీసికొని రావలయును." అనుచు బలుమార్లు జపింప సాగెను.

రఘుపతి మిక్కిలి యనాదరముతో "ఛీ! నీచేత నేదియును గాదు." అని పలికెను.

నక్ష.—"ఏమీ? ఎందుకుగాదు? మీరేమి చెప్పిన నదియే చేయుదును. తమ సెలవైనదా?"

రఘు.—"ఓ! నే సెలవిచ్చుచున్నాను."

నక్ష.—"ఏమని సెలవిచ్చుచున్నారు?"

రఘు.—(కోపముతో) "దేవి రాజరక్తమును జూడఁగోరుచున్నది. కావున నీవు మాణిక్యరాయుల రక్తమును దెచ్చి దేవిని సంతర్పింపవలయును. ఇదియే దేవియాజ్ఞ."

నక్ష.—"నేనిప్పుడేపోయి నరహంతల నీపనికై సిద్ధపఱచెదను."

రఘు.—"కాదు, కాదు. ఈవిషయమున నించుకేనియు నొరుల కెఱింగింపరాదు. నీకు సాహాయ్య మొనర్ప జయసింహుని నే నంపెదను. రేపటియుదయమున రమ్ము. అప్పుడు నేను నీకుఁదగినయుపాయ ముపదేశించెదను."

నక్షత్రరాయలు రఘుపతిచేతిలో నుండి తప్పించుకొని బయటఁబడియెను.

---

## ఆఱవపరిచ్ఛేదము.

నక్షత్రరాయలు వెళ్లిపోయినతరువాత జయసింహుఁడు "గురువర్యా! నే నిట్టిభయంకర మగుమాట నీవఱకెన్నఁడును వినియుండలేదు. తాము జగదంబికాసన్నిధి నామె నామము నుచ్చరించుచుఁ దమ్మునిచేతులతో నన్నను జంపించుప్రసంగ మొనరించితిరి. నేను నిల్చి యీప్రసంగమును వినవలసి వచ్చెను."

రఘు.—"ఇదికాకింకేమి యుపాయము గలదో నీవే చెప్పుము."

జయ.—"ఉపాయమా? ఏమియుపాయము?"

రఘు.—"నీవు రెండవనక్షత్రరాయలవలెఁ గన్పట్టుచుంటివి. ఇంతవఱకు నీవేమి వినుచుంటివి?"

జయ.—"ఇంతదనుక మీకడ నివసించి మీవలన విద్యాబుద్ధు లెఱింగి పాప మెద్దియో నేఁ దెలిసికొనఁజాలనా?"

రఘు.—"వత్సా! వినుము. ఇప్పుడు నీకు మఱియొకయుపదేశ మిచ్చెదను. పాప మన నేమి? పుణ్య మన నేమి? ఏదియును లేదు. ఎవని కెవఁడు శత్రు? ఎవని కెవఁడు సోదరుఁడు? ఎవని కెవఁడును గాఁడు. హింసయే పాప మన్నచో నిజముగ నంతయు హింసయే. ఇట్లుండఁ బాప మని యెవఁ డన గలఁడు? ఎన్నియో చిన్నచిన్న జీవజంతువులు నిత్యము మనపాదచలనాదికములచే నలిగిచచ్చుచునే యున్నవి. వానికంటె మన మొక్కజ్ఞానమాత్రమున నధికులమై యుంటిమి. మనయుం మను హత్య ప్రతిదినము జరుగుచునే యున్నది. కొందఱు

శిలాఘాతములవలనను, కొందఱు ప్రవాహోదకమున మునుగుటవలనను, కొందఱు మహామారీముఖమునంబడుటవలనను, మఱికొందఱు ఖడ్గాఘాతము (కత్తిపోటు)లవలనను జచ్చుచునే యున్నారు. ఈతుచ్ఛజంతువుల కన్నిటికిని మరణకుతూహలముకంటె నింకేమిగలదు? కాలరూపిణియగు మహాశక్తినిటమునం బ్రతిక్షణమున ననంఖ్యాకము లగు జీవరాసులు బలి యగుచునే యున్నవి. లోకమున నలుదెసలనుండియు జీవగణములరక్తధార లామహాశక్తిముఖమునఁ బచ్చి పడుచునే యున్నవి. నే నారక్తధారలయం దొకబిందువు నిచ్చుచున్నచో నది యనుచితకర్మమా? ఎప్పుడో యొకప్పు డామహాశక్తి తనబలిదానమును దాను స్వీకరించుచునే యుండును. నే నందున నొకనిమిత్తమాత్రమే యగుచున్నాను."

తరువాత జయసింహుఁడు భువనేశ్వరీవిగ్రహము దెసం జూచి "ఏమీ? ఇందులకు నిన్నందఱుం దల్లీ! తల్లీ! యని పిలుచుచుందురు. పోయి పోయి, నీ నిట్టి కఠోరస్వభావయవా? నీవు రాక్షసులకునుదల్లివే కాంబోలును. ఏమీ? లోకములో నంకటి నెత్తురును ద్రావి పొట్టనింపుకొనుటకై చంచల మగునీ నాలుకను జాచుకొని కూర్చుంటివా? నీకో, స్నేహప్రేమను మతాసౌందర్యాదులకును ధర్మమునకును నుదకదానము చేసితివి కావలయు ననహ్య మగు క్షుధాపిపాసం దగిలియుంటివి? నీ పొట్ట నింపుటకై మనుష్యుఁడు మనుష్యునికంఠమును గత్తిగో నఱుకుచున్నాఁడు. తమ్ముఁ డన్నతల నఱుకుచున్నాఁడు. తండ్రిని బుత్రుఁ

డును బుత్రునిఁ దండ్రియు నక్కటిక మెఱుంగక నఱకు చున్న వారు. ఓనిష్ఠురహృదయా! నిజముగ నీ కింతటిరుధిరపిపాసయే గలిగి యున్నచో మేఘము లుదకమునకు మాఱుగా రుధిరము నేల వర్షింపకుండును? జీవప్రదాయినియయి దయారూపిణి యగు నది, రక్తమును బ్రవహించి సముద్రమున నేల కలియకుండును? అట్లైనచో నీజగంబున హింసావిద్వేషమహామారీ బిభీషికాసామ్రాజ్య మొక్కటియే యేల నిలిచి యుండగూడదు? కాదు, కాదు తల్లీ! నీవు ప్రత్యక్షమై జవాబిమ్ము. ఈయుపదేశము మిథ్య. ఈశాస్త్ర మసత్యము. నాతల్లి వగు నిన్నందఱు తల్లి యనక తనసంతానరుధిరమును బానమొనర్చిన రాక్షసి యనుచుండుట విని నే సహింపలేను” అని పలుకుచుండెను. ఇట్టులనుచుండఁగనే జయసింహుని రెండునేత్రములనుండియు నశ్రుజలము ప్రవహింపసాగెను. అతఁడు తనమాటలను దానే యాలోచించుకొనుచుండెను. ఇట్టిప్రసంగ మాతనిహృదయమున నీవఱకెన్నఁడును దలఁపునకు రాలేదు. రఘుపతి యాతనికట్టి నవీన శాస్త్రోపదేశ మీయకుండినచో నీమాట లన్నియు నతనిమనమునుండి బయలు వెడల నేరవు.

రఘు.—(నవ్వుచు) “ఆలాగైనచో బలిదానసంబంధములగు నన్ని
యాచారము లొక్కసారిగాఁ దీసిపాఱవేయవలసినవే?”

జయసింహుఁడు తన చిఱుతనాఁటినుండియు బలిదానములనిచ్చుటఁ జూచుచున్నవాఁడు. అందువలన నాలయమున బలిదాన మీసమయమున నాఁపివేయఁబడునా? లేక యాఁపివేయుట యుచితమా? అను నీమాటయం దాతనిమనస్సేమియు లగ్నము

కాదయ్యెను. ఆమాట తలంపునకు వచ్చినతోడనే యాతని హృదయమున విచారణకు మాత్రము చోటు దొరకకున్నది. కావున నాతఁడు రఘుపతిమాటల కిట్లు జవాబు చెప్పసాగెను. "ఆమర్యాద యేవేటు. దానియభిప్రాయమేవేటు. దానియం దేమి యుఁ బాపము లేదు; కాని తన్నిమిత్తమున నన్నదమ్ములు నఱుకు కొనవలసి వచ్చుచున్నది. ఆహేతువుచే మాణిక్యరాయలను.... గురువర్యా! నేను తమపాదములను బట్టుకొని ప్రార్థించు చున్నాను. నన్నువంచింప వలదని వేఁడుచున్నాను. ఏమి? నిజ ముగాఁ దమస్వప్నమున దేవి యట్లు వక్కాణించినదా? రాజు గారిరక్తమును ద్రావినఁ గాని యామెకుఁ దృప్తికలుగదా?"

రఘుపతి కొంతవఱకు మౌన మవలంబించి 'నిజము కాక పోయినచో నే నబద్ధ మాడుచుంటినా? ఏమీ నాపై నీకు నమ్మ కము లేదా?' అని పలికెను.

జయసింహుఁడు రఘుపతిపాదధూళిని శిరమున నలందు కొని, "క్షమింపుఁడు. నాకుఁ దమపై నుండునమ్మకము శిథిలమై పోలేదని తలంపుఁడు; కాని నక్షత్రరాయలును సుక్షత్రియవంశ మందుననే కదా జనియించెను? ఆతనిరక్తమనరాదా?"

రఘు.—"స్వప్నమందు దేవిసూచనమాత్రము చేసినది. అన్ని మాటలువినఁబడలేదు. చాలమాట లనుభవమునుబట్టి తెలిసి కొంటిని. గోవిందరాయలపై దేవి యప్రియముగా నుండుట మాత్రము ప్రత్యక్షముగాఁ దెలియ నయ్యెను. అప్రియము పుట్టుటకుఁ గారణము కలిగియే యున్నది. దేవి రాజరక్త

మును గోరియుండుటచేతను, మాణిక్యరాయులపై నామె కిష్టముకలుగమిచేతను దేవి యాతనిరక్తమునే కోరుచున్న దని నిర్ధారణ చేయఁబడెను."

జయ.—"ఇది నిజమయ్యెనేని నేనే రాజరక్తమును దెచ్చెదను. నక్షత్రరాయులను బాపమునఁ గూలఁ ద్రోయుట నాకిష్టము లేదు."

రఘు.—"దేవియాజ్ఞను బాలించుటయం దేమియుఁ బాపము లేదు."

జయ.—"పాపము లేకపోయినచో నిశ్చయముగఁ బుణ్యమే లభించును. ఆపుణ్యమును నేనే కొల్లగొనియెదను."

రఘు.—"అలాగైన నిజముగాఁ జెప్పెదను. వత్సా! వినుము. నేను నిన్ను జిన్నతనమునుండియు నెంతయు గారాబముగాఁ బ్రాణములకంటె నెక్కుడుగాఁ బ్రేమించి పాలనపోషణము లొనర్చియుంటిని. నిన్ను విడిచి నే నుండఁజాలను. నక్షత్రరాయులు మాణిక్యరాయులను జంపి రాజైనచో నతని నెవ్వ రేమియుఁ జేయఁజాలరు. నీవే రాజుపైఁ జేయి చేసి కొంటివేని నేను నిన్ను మఱి కానలేను. ప్రజలు నిన్నుఁ జంపుదురు."

జయ.—"నాపై నింతదయఁజూపించుచుంటిరి. నే నొకతుచ్ఛమనుజుండను. నాపై నుండుప్రేమను దలంచుకొంటిరేని తమలోకచీకుకైన సేపథ బగుపానను లిరింపఁజాలరు. ఇట్టియవస్థలో నన్ను బ్రేమించుచు మీరు పాప మాచరించినచో మీప్రేమను నే నెక్కుడుకాలము ననుభవింపలేను. ఆప్రేమకుఁ బరిణామము మొప్పుటకు మంచిదైయుండదు."

రఘు.—(త్వరితముగా) "సరియే! నీవనుమాట యింకొకసారి కాఁ
గలదు. రేపు నక్షత్రరాయలు వచ్చినంత నేదియో యొకటి
నిశ్చయింపఁబడును."

జయ.—(తనలో) "రాజరక్తమును నేనే తెచ్చెదను. దేవీసంతో
షార్థము గాని లేక గురుదేవుని యనుగ్రహార్థము గాని తమ్ము
నిచే నన్నను జంపించుమని నేనెప్పుడును జరగనీయను." అని
ప్రతిజ్ఞ యొనరించుకొనెను.

---

## ఏడవపరిచ్ఛేదము.

జయసింహునకు రాత్రియంతయు నిదుర రాలేదు. తన గురువు తోఁ గావించిన ప్రతివాదము లిప్పుడు శాఖోపశాఖలుగాఁ బెరిగి యాతని గమనమును నావరించుకొనుచుండెను. ఎట్టిదైనఁ బని యొనరించుటకై మన కెక్కువవేళ చిక్కును గాని యావని పూర్తిగాఁ గావించుటమాత్రము మనవశమున లేదు. ఆలోచనా సంబంధమగునను నిది వర్తించును. జయసింహుని భావనాప్రపంచ మున నతివేగముగా నీవిధమున నొక్కటొక్కటిగ నన్నియూహాలు నుదయించుచుండెను. ఆయూహాలు కుఠారధారలై చిరకాలము నుండియు వృద్ధిఁ బొందుచున్న యాతనిపిచ్చినమ్మకమను వృక్షమును మూలచ్ఛేదము చేయుచుండెను. అతఁ డెంతయో దుఃఖించుచు

ఖిన్నుండై యుండెను; కాని యాతనిదుఃఖ మెట్టులును నశింప దయ్యెను. ఏకాళికాదేవి నాతఁడింతవఱకుఁ దల్లి యని భావించు చుండెనో యాదేవియందుఁ గలమాతృభావమును రఘుపతి యెం దుకుఁ బోఁజేసెను. ఆమెనిర్దయురాలని చెప్పుచు నిందులకు వర్ణిం చెను. "శక్తికిఁ బ్రసన్నతాప్రసన్నత లెక్కడివి? ప్రకృతికిఁ గన్నులు లేవు. చెవులు లేవు. ప్రకృతియో మిక్కిలి పెద్దదగు నొకరథము వంటిది. అది యసంఖ్యాకములగు తన చక్రముల క్రిందఁ బ్రపంచ మును నొక్కి పట్టి ఘర్ఘరశబ్ద మొనరించుచు నెప్పుడును నడచుచునే యుండును. దానినూఁతగాఁ జేసికొని యెవ్వఁడు నడుచుచుండెనో, దాని క్రిందఁ బడి యెవఁడు నలుగుచుండెనో, దానిపై నధిరోహించి యెవఁడు సంతుష్టి నొందుచుండెనో, దాని క్రిందఁబడి యెవఁడేడ్చుచుండెనో యీసంగతులన్నియు నారథమున కేమి దెలియును? ఆప్రకృతియను రథమును నెవ్వఁ డును లాగు చుండలేదా? లోకమునందలి నిరపరాధు లసహా యులు భయకంపితులు నగు ప్రాణికోటులరక్తమును పానము చేయునదియుఁ గాలరూపిణియు, నిష్ఠురశక్తియును గదా! ఏమీ? ఆమెతృష్ణ దీర్చుటయే మాపనియా? ఎందుచేత? ఆమె యోర్చుకొనుచునే యున్నది. ఆమెకడ నెన్నియో యుపకరణ ములు గలవు. దుర్భిక్షము, భూకంపము, జరావస్థ, మహామారి, అగ్నిదాహము, మఱియు నిర్దయహృదయులగు వారియందలి ఘాతుకబుద్ధి మొదలగునవి యెన్నియో నిత్యము పనిచేయు చునే యుండును. ఇందునకై క్షుద్రజంతువు నగునాసహాయ మామెకుఁ గావలయునా?"

ఆ మఱునాఁటిప్రాతఃకాల మెంతయో రమణీయముగాఁ గన్పట్టుచున్నది. వాన వెలిసిపోయినది. తూర్పుదెస మేఘములు లేవు. ఉదయభానునికిరణము లుదకమునఁ గలిసి మిక్కిలి ప్రకాశించుచున్నవి. వర్షోదకముచేతను సూర్యకిరణములచేతను దశదిశలును దళతళ యని మెఱయుచున్నవి. ఆనందదాయక మగునా ప్రొద్దుపొడ యాకాశమందును, నిరాలంబ మగుమైదానమందును, వనమునందును, నదీప్రవాహమందును బాగుగా వికసించిన తెల్లని సహస్రపత్రకమలమువలె బ్రస్ఫుటితమై యలరారుచున్నది. నల్లనిచీమలబారు లంతట నిటునటు దిరుగుచున్నవి. ఇంద్రధనుస్సు పలువిధము లగురంగులను వెదచల్లుచు నలరారుచున్నది. చిలుకలగుంపొకచెట్టుపై నుండి మఱియొకచెట్టుమీఁది కెగురుచున్నది. ఒకటిరెండుకుందేళ్లొకచెట్టుక్రిందినుండి బయలు వెడలి మిక్కిలి భయముతో నటునిటు చూచుచుఁ బరువిడుచు దాఁగుకొనుటకై మఱియెద్దియైనఁ బొదను వెదకుచున్నవి. చిన్నచిన్నమేఁకపిల్లలు దుర్గమ మగునొకకొండపై కెక్కి లేఁబచ్చికను లేఁతయాకులను దినుచు గంతు లిడుచున్నవి. దున్నలును నెద్దులును నేఁడు మిక్కిలి యానందమున నొడళ్లు మఱచి చెలంగుచున్నవి. పక్షులన్నియుఁ బలువిధము లగు పాటలను బాడుచున్నవి. నందిట బిందియ లుంచుకొని నీరుకై బయలుదేఱుతల్లులచీరచెఱంగులను బట్టుకొని పిల్లలును నిప్పుడిల్లు వెడలు చున్నారు. వృద్ధులు దేవతార్చనకై కుసుమములను గోయుచున్నారు. నదీస్నాన మొనరింప నేఁ డనేకులు వచ్చి యొకచో గుమిగూడి యున్నవారు. వారిలో వారు మాటలాడుకొనుచున్నారు. ఈవైపున నదియొక్క కలకలధ్వని యడఁగ

లేదు. ఆషాఢమాసమున నొకదినమున దనంతరజీనధారిణి యయి యానందమయి యగునిట్టిభువనేశ్వరీదేవియం దనాదరణ వహించి జయసింహుం డొకనిట్టూర్పు విడిచి దేవీమందిరమును బ్రవేశించెను.

జయసింహుఁడు నిటలతటఘటితాంజలిపుటుండై భువనేశ్వరీవిగ్రహమును జూచి "ఏమమ్మా! నేఁ డిట్టి కాఠిన్యము నేలవహించితివి? ఒక్కదినమున నజీవులరక్తము చిక్కకపోయిన చో నీ కింతబాధముడిపాటేల? మాహృదయములఁ బ్రవేశించి, బాగుగాఁ బరిశీలింపుము. భక్తిలవము దర్శనమాత్రమున లభించునా? భక్తులహృదయమును గ్రహించియే నీ వానందము నొందక సహోదరాధులరక్తమును జవిచూడఁ గోరుచుంటివా? మంచితల్లి వమ్మా! నిజముచెప్పుము. ధర్మదేవతావతారం బగు మాణిక్యరాయల నీలోకమునుండి వేఱుచేసి యీదేశమున రాక్షసప్రభుత్వమును స్థాపించుటయే నీముఖ్యాభిప్రాయమా? నీవు నిజముగ రాజరక్తమును గోరుచుంటివా? నీశ్రీముఖము నుండి ప్రత్యుత్తరము నొందక నే నెప్పటికిని రాజహత్య జరగ నీయను. మఱియు నీకార్యమున విఘ్న మొనరింపక మానను. ఔనా? కాదా? ఒక్కమాట చెప్పుము."

ఒక్కమాఱుగా జనశూన్య మగుచామందిరముననుండి 'ఔను' అని యొకధ్వని వినవచ్చెను. జయసింహుఁ డులికిపడి వెనుకఁదిరిగి చూచెను. ఎవ్వరును గాన్పింపరైరి; కాని యొకనీడ చలించుచు మందిరమునుండి బయలువెడలినట్లుమాత్రము కానవచ్చెను!

మొదట నది గుహావులోని కంఠధ్వని యని యతఁ డనుకొనియెను; కాని తరువాత దేవియే రఘుపతికంఠస్వరమున నాజ్ఞయిచ్చె నని యూహించెఁ గాఁబోలు. ఈమాట నిజము; కాని యాపలుకు వినినంతన యతనియొడ లంతయు గగుర్పా టొందెను. మరల జయసింహుఁడు దలవంచి దేవికిఁ బ్రణామ మొనరించి ఖడ్గమును ధరించి మందిరమునుండి బయలువెడలెను.

---

## ఎనిమిదవపరిచ్ఛేదము.

గోమతీతీరమునకు దక్షిణభాగమున నొకచో విశాలమగు నున్నతప్రదేశ మొండు గలదు. వర్షధారలును జిన్నచిన్నయూట జలములు నందం దాయున్నతప్రదేశమున మడువులుగా మారి యెన్నియో యున్నవి. అచ్చటనుండి కొంతదూరమువఱకు నర్ధ చంద్రాకారముగా నాప్రదేశమును జుట్టుకొని పెద్దపెద్దచెట్టు లలరారుచున్నయవి; కాని దానిపైభాగమునఁ బెద్దచెట్టొక్క టియును లేదు. అచ్చటచ్చట నాదిబ్బపైఁ జిన్నచిన్నపసుగు మొక్కలు మాత్రమున్నవి. అవియు నెదుగుఁబొదుగు లేక నల్లగా మాడి యెండి పోవుచున్నవి. శిలాశకలములు కుప్పలుకుప్పలుగా నిటునటు చెదరి పడి యున్నవి. ఒకటిరెండుగజములు వెడల్పు గాఁ జిన్నప్రవాహము లు (బక్టెంలు) నిమ్నోన్నతము లగుప్రదే శములను జుట్టి తిరిగి సహస్రాయిని గలిసికొని గోమతీనదిలోఁ

గలియుచున్నవి. అచ్చోటు జనవిరహితమై యుండును. చూపున కడ్డు కాఁగలవృక్షము లెవ్వియు నాగుట్టపై లేవు. ఇక్కడ నుండి చూచువారికి గోమతీనదియును, దానియిరుదరులనుండు చిత్రవిచిత్రములయి సుందరము లగు ధాన్యవ్యవసాయము లును మున్నగునవి చాలదూరమువఱకుఁ గన్నులపండువుగఁ గన్పట్టుచుండును. మాణిక్యరాయలు ప్రతిదినము ప్రాతఃకాల మున నిచ్చటికి వచ్చుచుండును. వెంట నొకనౌకరు నైనఁ దీసి కొని వచ్చుట వాడుక లేదు. అతఁ డప్పు డప్పుడు గోమతీనది యందు జాలరులు చేపలను బట్టువినోదమును దూరమునుండి చూచుచుండును. ఆజాలరుల ప్రసన్నరూపమునుజూచి రాయలు యోగివలె స్థిరభావముతోఁ గన్నులను మూసికొని కూర్చుండి "వార లందఱిముఖములపైఁ బ్రాభాతికతేజము ప్రాల్క మాడు చుండెనా ? లేక వారలయాత్మజ్యోతియే యిట్టికళకు నిచ్చు చుండెనా?" అని యాలోచించుచుండెను; కాని 'ఇదమిత్థ' మని నిర్ణయింపలేకపోయెను. ఈదినములలో వర్షములు గురియు చుండుటచే నతఁడు ప్రతిదిన మచ్చటికి వచ్చుటలేదు; కాని నిర్మ లాకాశమై యున్నదినమునమాత్రము రాకమానలేదు. అతఁ డప్పుడు వచ్చినను జిన్నిబిడ్డఁ డగుతాతనుమాత్రముఁ దోడ్కొని వచ్చుచుండెను.

తాత నిప్పుడు తాతయని పిలుచుటకు నాలుక యిష్టపడ కున్నది. ఏమనెదవా? తాతా! యనుసంబోధన మెవరియొక్క నోటనుండి వచ్చునప్పుడుమాత్ర మెంతయుఁ బ్రేమాస్పదమై తోఁచెడినో యావ్యక్తి యిప్పు డీప్రపంచమున లేదు. పాఠక

మహాశయులకడ దాతశబ్దమున కర్థ మేమియును లేదు! కాని హాసీ ప్రాతః కాలమున సంగీతపుఁదోఁటలోఁ బెంకెతనమునకై యాచెట్లగుంపుచాటున దాఁగుకొని మధుర మగుతనకంఠ స్వరము తారమున కెక్కించి "తాతా!" అనిపిలుచునప్పుడును దానికి జవాబుగాఁ బక్షులు ప్రతిశరువునను పిలిచి కూయు చున్నప్పుడును మఱియు దూరమున నుండు వనాంతర్భాగము నుండి "తాతా!" అని ప్రతిధ్వని వచ్చునప్పుడును "తాత" శబ్ద మర్థముతోఁ బరిపూర్ణత నొంది వనము నంతయు నావరించు కొనియుండెడిది. అప్పు డాతాతా యనుశబ్ద మొకబాలికహృద యమునందలి నిరుపమానకోమలస్నేహరూప మగునివాసమును వీడి పక్షివలె స్వర్గము దెస కెగిరిపోయెను. ప్రేమసంసిక్త మగు నొక్కయామధురసంబోధన మప్పుడు పక్షిజాతులు ప్రాతఃకాల మునఁ జేయుమధురరవము నపహరించు చుండెడిది. మఱియు నాహ్లాదమయ మగు ప్రాభాతికప్రకృతియందలిశోభతో నానంద మయ మగు నొకచిన్నయాఁడుబిడ్డయొక్క ప్రేమను నైక్యము నొందించి కన్పట్టఁ జేయుచుండెడిది. ఇప్పు డాబాలిక లేదు. ఆ బాలుఁ డొక్కఁడుమాత్ర మున్నవాఁడు; కాని తాతమాత్రము కానేరఁడు. లోకమున లోకులకందఱి కన్నిరూపముల నతఁ డిప్పుడు బాలకుఁడే. హాసీకి మాత్రమే తాత.

మహారాజగోవిందమాణిక్యరాయలుగా రాతని "ధ్రువా!" అని పిలుచుచుండెడివారు. కావున మనమును నారీతినే యనుస రింతముగాక.

రాయలు పూర్వము గోమతీనదికొఱకుండును మాత్రమే వచ్చుచుండువాఁడుక. ఇప్పుడు ధ్రువుని వెంటఁబెట్టుకొని వచ్చుచుండువాఁడుక యైనది. పవిత్రమై స్వచ్ఛమైన యాబాలకుని ముద్దుమోమున నానందమయ మగుశోభ నృత్యమొనరించుచుండెను. ఆమోమును నిత్యమును గన్నులారఁ జూచురాజుగారికి స్వర్గసుఖ మన్నను రుచింప దయ్యెను. మధ్యాహ్న మారాజచంద్రుఁడు రాజకార్యపరతంత్రుఁడై యుండునపుడు పెద్దబుద్ధిమంతు లని ప్రసిద్ధి నొంది కాలము గడపినమంత్రులాతనిఁ బరివేష్టించి నిలిచి సలహా నిచ్చుచుందురు. ప్రాతఃకాలము మొదలు మధ్యాహ్నముకువఱకును ధ్రువునియాటపాటలలోనం బొంగియాతఁడీలోకచక్రమును దాఁటి యానందించుచుండును. సోగలై వీనుల కొనలనంటి ప్రశాంతభావములను వెదఁజల్లు ధ్రువునికన్నుల యెదుట కుటిలములగు రాగద్వేషాదిద్వంద్వములు సంకుచితములగుచుండును. ఆబాలకునిచేయిఁ బట్టుకొని నిజముగ నారాజసత్తముఁడు సంసారమధ్యవర్తియై దూరముగా వ్యాపించియున్న యొకచిన్నని పెద్దరాచబాటకేఁగి నిలిచియుండును. అప్పటనుండు నాతని కంతర్హితమై సుందరమై నల్లనియాకాశరూప మగుశమే నా క్రిందను విపుల మగునొకబ్రహ్మాండసభ యగవడుచుండెను. భూర్భువస్స్వర్లోకాదిసప్తలోకములయుం దొనరించుగాన మచ్చటికిఁ గొంచెముకొంచెముగా వినవచ్చుచుండును. మఱియు నా చిన్నసిరాజమార్గమున నన్నివస్తువులును నిర్మలములై స్వభావసుందరములై గోచరించుచుండును. ముందునకు నడుగిడ నొకవిధ మగునుత్సాహ ముదయించుచుండును. తీవ్రము లగుచింతా

రోగశోకాదులన్నియు దూర మగుచుండును. ఆరాజశేఖరుండా ప్రభాతమున నట్టిచిన్ని కాననమును నదీతీరముల నరికట్టిన యాకాశమునను నొకబాలకుని ప్రేమయందు నెంతయు నున్మగ్నుండై నిజముగ నపార మగుప్రేమ యనుసముద్రముయొక్క మార్గము నరయుచుండును.

మాణిక్యప్రభుకులావతంసుండా ధ్రువుని నొడిలోఁ గూర్చుండఁజేసి యతనికి ధ్రువోపాఖ్యానమును జెప్పుచుండెను. ధ్రువుని కేమియు నిక్కలి బోధింపవలయు నని యాతనియభిప్రాయము కాదు; కాని యాబాలునినోట నాచరిత్రము నస్ఫుటిత మగుస్వరమున వినవలయు నని యాతని కాశయము.

ఆకథను వినుచు వినుచు నాధ్రువుండు "నేను వనమున కేఁగెదను." అనెను.

రాజు.—"వనమున కేమి చేయ నేఁగెదవు?"

ధ్రువు.—"హాలి(రి)ని జూచుటకు."

రాజు —"నేను హారిని జూడవలయుననియే యీవనమున కేఁగుదెంచినాను."

ధ్రువు.—"హాలి(రి) యెక్కడ నున్నాఁడు?"

రాజు.—"ఇక్కడనే యున్నాఁడు."

ధ్రువు.—"అక్క యెక్కడ నున్నది?" అని పలికి లేచి నిలువంబడి వెనుకఁ దిరిగి చూచుచుండెను. పాప మతఁడు మునుపటి వలెనే వెనుకనుండి తనకన్నులను మూయుటకుఁ దనయక్క వచ్చియుండు ననికొనియెను; కాని యెవ్వరును రాకుండుటఁ

జూచి తల యూఁచుచుఁ గనుదమ్ములెత్తి రాయలను "అక్క-
యేదీ?" అని యడిగెను.

రాజ.—"మీయక్కను హరి పిలుచుకొనిపోయి యున్నాఁడు."

ధ్రువు.—"హరి(రి)ఏఁడీ ?"

రాజ.—"వానిని బిలువుము. నీకుఁ నేఁ జెప్పిన యీగీతములను బాడుము."

ధ్రువుఁడు తలఁద్రిప్పుచు గీతముల గానము చేయు నారంభించెను.

తే. బాలుఁడను నేను దోడ నెవ్వరు(లు)ను లేరు (లు)
ఘోర(ల)వనమునఁ జిక్కితి దారి(లి) యెఱుఁ(లు)గ
నేమి చేయుదుఁ దెల్పవే యీవిపత్తుఁ
బాపి ర(ల)క్షింపవే నన్నుఁ బర(ల)మపురు(లు)ష!. ౧
కాలరా(లా)తి(లి)రి నిర(ల)తంబుఁ గాంచియుండు
ననుచు భయమందుచుండె నాయంతరా(లా)త్మ
యీవు గాక యింక నన్నావ నెవరు(లు) గలరు(లు)?
దీనపరి(లి)పాల! రార(లాల) సుధీవిలోల ! ౨
కలవు మార్గ(ల్గ)ము లెన్నని గాని నిన్నుఁ
గనఁగఁ జాలిన దొకటియుఁ గాన నైతి
భక్తులకుఁ గూర్చు(ల్చు) చక్కని బాటఁ జూపి
నన్ను ధన్యునిఁ జేయు మోయన్న శౌరి! (లి). 3
మునులు యోగులు సిద్ధులు ముక్తికోఱ(ల)కు
నిన్ను నర(ల)యుచుఁ బోడఁగాన కున్నవారు(లు)
జడుఁడ నే బాలుఁడను గాని చక్రధారి(లి)!

నిన్నుఁ గనియెద నని పొంగుచున్నవాఁడ. ౪

ఘోర(ల) మయి దుర్గ(ల్గ)మం బయి క్రూర(ల) మైన
తుచ్ఛసంసార(ల)మునఁ బడి దొర్లి(ల్లి)జాల
నీదుపదభక్తి తోడుగ నిత్య మేను
దిరు(లు)గునట్టులుక రు(లు)ణింపుహరి(లి)మురారి(లాలి)!.
మహితగుణశీలి యోవనమాలి జాలిఁ
దూలినాఁడను బిడ్డఁడ ధ్రువుఁడ నయ్యా!
యున్నతం బగుపదవి యీయుర్వి(ల్వి) నెద్ది
యద్ది పడయంగ నిఁక జేరి(లి) తయ్య! జయ్య! ౬
మత్స్యకూర్మ(ల్మ)వరా(లా)హవామననృసింహ
పర(ల)శురా(లా)మర(ల)ఘురామబలనుబౌద్ధ
కలికి మూరు(ల్తు)ల నలరా(లా)రు(లు)ఘనుని నిన్ను
నామదిని నుంతు శ్రీర(లీ)మానాథ! నాథ!. ౭

అని 'ర' అనుచోట 'ల' అనుచు నింక మఱికొన్ని యక్షర ముల నస్పష్టముగాఁ బలుకుచు ముద్దులొలుక నన్నుశోమయ మగు స్వరముతో గీతములను జదివెను. అది విని మాణిక్య రాయ లానందమునఁ దేలెను. ఎప్పటికంటె నాదినమున ద్విగు ణముగా నాతనికిఁ బ్రేమ ముదయించెను. నలుదెసల నదీవనవృక్ష లతాదులు నవ్వుచున్నట్టు గన్పట్టెను. సూర్యునిసువర్ణకిరణజాల మనునమృతసేచనమున స్వచ్ఛ మగునాకసంబున సుందరమై యనుపమానమై యొకవిధ మగునవ్వుతోఁ గూడియున్న రాయల ముఖసరోజము శోభాయమానమై కన్పట్టసాగెను. ధ్రువుం డెట్లు తన యొడిలోఁ గూర్చుండి యుండెనో యట్టులే తన్నుఁ

గూడ నెవ్వరో రెండుచేతులతో నెత్తి సందిటిలో నుంచుకొని నట్టు లయ్యెను. రాయలకుఁ దానును దనకు నల్లడల నుండు వారలును నింక నీలోకమున నుండుచేతనములును నచేతన ములును నెవరి కౌఁగిటిలోనో యున్నట్టు పొడఁగట్టెను. అతని పేర్మియు నానందమును దివాకరునికిరణ జాలము వలె దశదిశలను నిండియుండెను. నలుదిక్కులును బ్రేమానంద ములనే చూపింపసాగెను. అనుంతరముననఁ గరవాలము గర మలంకరించి యుండ జయసింహుఁడు గుప్తమార్గమునఁ దటా లున వచ్చి గోవిందరాయలయెదుట నిలువఁబడెను. రాజుగా రును రెండుచేతులు చాఁచి "రమ్ము జయసింహా! రమ్ము" అని పిలిచెను. బాలునితో నాడుకొనుచుండుటచే నప్పు డాతఁడును బాలునివిధమునఁ బ్రవర్తింపసాగెను. ఇట్టిసమయమున రాజ మర్యాద యెక్కడిది? జయసింహుఁడు భూమిపై సాగిలి నమ్రుం డై నమస్కార మొనరించెను. రాజుగా రాతనిఁ బ్రత్యభినం దించి "జయసింహా! నీవును నాకు నమస్కారార్హుఁడవే. నీవు నుత్తమరాజకులసంజాతుండవు. క్షత్రియుండవు గదా!" అని గౌరవించెను.

జయ.—"మహారాజేంద్రా! నాచిన్నవిన్నప మొండు గలదు."

రాజ.—"అది యేదో చెప్పుము."

జయ.—"భువనేశ్వరీదేవికిఁ దనుపై నాగ్రహము వచ్చెను."

రాజ.—"ఎందుచేత? నే నామెకు నాగ్రహము వచ్చుట కేమి యొనర్చితిని?"

జయ.—“మహారాజా! తాము బలిదానము నాఁపివేసి దేవీపూజకు విఘ్న మొనర్చితిరి.”

రాజ.—“ఏల? జయసింహా! ఇంత హింసాతృష్ణ యేల? నేఁడిట్టి సుందరమును సుఖావహము నగు ప్రాతఃకాలమున నుత్కట మగునీహింసా ప్రసంగమేల? ఆలోచించిచూడుము. జగన్మాత యగు దేవిభుజములసందున నీలోకమునందలి జీవజంతువులెల్ల నెంతయో సుఖమున నొడలు మఱచి తిరుగుచున్నవి. అనఁదిటిలో భయము, శోకము, హాహాకారమును నెలకొల్పి యాజనని యంకభాగమున శోణితమును బ్రవహింపఁజేసి నీ వామెను బ్రసన్నఁగా నొనరింపఁ గోరుచుంటివా? లోకమునందలిశాంతిని శమియింపఁ జేయుట కిట్టి యభిలాష యేల? హింసారూపమగు విషకంటకవృక్షమూలమున జీవగణశోణితమును నింపి యత్నపూర్వకముగ దాని నేల వృద్ధినొందించెదరు? హాహా! దయారూపమగు కల్పతరు వెండఁజనెనో? ప్రేమరూప మగుపారిజాత మేమయ్యెనో?”

జయసింహుఁడు మెల్ల మెల్లన నాజననాథునిపాదముల కడ కరుదెంచి కూర్చుండెను. ధ్రువుం డాతనికరవాలముఁ దీసికొని చూచుచుండెను.

జయ.—“మహాత్మా! నరపాలశేఖరా! ఏమీ? శాస్త్రమునం దీబలిదాన మంగీకరింపఁబడి యున్నదే. అది యెట్లు?”

రాజ.—“నిజముగ శాస్త్రమునందలియాజ్ఞ నెవరు పరిపాలించు

చున్నారు? లోకులందఱుం దమతమయిష్టానుసారము శాస్త్రము నుపపాదించుచున్నారు. దేవీసన్నిధి ననాథప్రాణుల భయకంపిత గాత్రులం గటికవారలం దలదన్నినఱకుటయును, తద్రక్తపంకావలిప్తసర్వశరీరులై యున్మత్తులై యిష్టము వచ్చినట్లు కేకలు వైచుచు భయానకరసమును మూర్తీభవింపఁజేయుచు నుల్లాసముతో నృత్య మొనరించుటయును దేవి నర్చించుటయా? కాదు కాదు! తనహృదయమున నుండుహింసారూపిణి యగు రాక్షసి నర్చించుటయా. సాధుజంతువులతలలు కరకర కోసి యా రాక్షసిపోట్ట నించుచు దాని బలిగాఁ జేయుచున్నారు. హింసారాక్షసీసన్నిధిని జీవబలిదానమిండని శాస్త్రము లాజ్ఞాపింపలేదు. బలి యనఁగా హింసారాక్షసినే బలియిచ్చుట. దీనిని శాస్త్రము లాజ్ఞాపించుచున్నవి.—

## 'అహింసా పరమో ధర్మః'

జయసింహుఁ డెంతయుఁ బ్రొద్దు మాటలాడక యూరకుండెను. కడచినరాత్రినుండియు నతని కిట్టియూహ లెన్నియో జనించియున్నవి. తుద కాతఁడు "అయ్యా! నేను బ్రత్యక్షముగాఁ బరమేశ్వరీముఖమున వినియున్నాను. అందుచేత నీవిషయమున నిప్పుడు నాకేమియు సందేహింప నవసరము లేదు. దేవి స్వయముగా 'నేను రాజరక్తము నిచ్ఛయించుచున్నాను' అని పలికినది." అని యుదయమున మందిరంబున జరిగినయుదంతము నంతయు రాజున కెఱిఁగించెను.

రాజు.—"ఇది దేవీవాక్యము కాదు. ఇది రఘుపతి వచించిన

దని తెలిసికొనవలెను. రఘుపతి లోపల దాఁగియుండి వా క్యమునకుఁ బ్రత్యుత్తరమిచ్చియుండును."

ఇటుల వచించినరాయలవచనమును విని జయసింహుఁ డొక్కసారిగాఁ ద్రుళ్లిపడెను. అతనిమనంబున నిట్టినందేహ మొక్కమా ఱుదయించియుండెను; గాని యది మెఱపువలెఁ బొరుగ వెంటనే విలీన మయ్యెను. రాజుగారి యీవాక్యమును విని మరల నానందేహము బలపడియెను. జయసింహుఁ డెంతయు నధీరుండై "కాదు, మహారాజా! నానందియమును వృద్ధిఁబొందింప వలదు. ఒడ్డునుండి నన్ను నడిసముద్రంబునఁద్రోయవలదు. ప్రభువువారివాక్యములవలన నన్నుఁ జుట్టుకొని యున్నయంధకార మింకను హెచ్చుచున్నది. నాభక్తియు విశ్వాసముమాత్రము నన్ను విడిచిపోలేదు. వానిపరివర్తనమునకై నే నీగుహాయందు బడియుండ నిచ్ఛగింపను. దేవియాజ్ఞయైనను గురువుగారియాజ్ఞయైనను నాకొక్కటియే? నే నవశ్య మాయాజ్ఞను బాలింపక తీరదు" అని పలికి జయసింహుఁ డతిత్వరితముగా నచ్చటనుండి లేచి నిలువంబడి తనఖడ్గమును చేత నలంకరించెను. సూర్యకిరణములయందు దాకరవాలము మెఱపు మెఱసినట్లు తళుకు లీను చుండెను. అది చూచి ధ్రువుండు భయభ్రాంతుండై భోరున నేడ్చుచు రాజుగారిపైఁ బడి తనచిన్నిచేతులతో నాతనిఁ గౌఁగిలించుకొని యుండెను. రాజుగారు జయసింహునిదెస దృష్టినిలుపక ధ్రువునిఁ దనరొమ్మున నాన్చుకొని యుండెను.

జయసింహుఁడు కత్తిని దూరముగాఁ బాఱవైచి ధ్రువుని వీపుపైఁ జేయివైచి "ఏమియును భయము లేదు. కుఱ్ఱా! ఏమియును భయము లేదు చూడు. నే నిప్పుడే పోవుచున్నాను. నీ వీయుదారునినీడ నుండుము. ఆతనివిశాలహృదయమున విరాజిల్లుము. నిన్నెవ్వరు నడబావరు." అని పలికి రాజుగారికిఁ బ్రణమిల్లి జయసింహుఁడు సెలవు గైకొని పోవుచు నేదియో యంతలో నాలోచించి వెనుకకుఁ దిరిగి "రాజేంద్రా! మీ తమ్ముఁడు నక్షత్రరాయలు మిమ్మీలోకమునుండి వేఱుచేయఁ బ్రతిజ్ఞఁ బట్టియున్నవాఁడు. ఆషాఢశుద్ధచతుర్దశీనిశిని దేవీపూజ జరగఁ గలదు. ఆనాఁడు తాము సావధానులై యుండుదురుగాక యని హెచ్చరించుచున్నాఁడను" అనెను.

రాజు.—(నవ్వుచు) "నక్షత్రరాయలు నన్నెట్టులును వధింపలేఁడు. అతనికి నాపై నెంతయో భక్తి" అనెను.

జయసింహుఁడు సెలవు గైకొని వెడలిపోయెను.

రాజుగారు ధ్రువునిం జూచి యెంతయుఁ జాలిగా, "నేఁడు నీవు చనిపోక మిగిలితివి. తండ్రీ! ఈ యాభిప్రాయములోడనే నీనవలోకరి నిన్ను నాకడనుంచినది." అని పలుకుచు నారాజచంద్రుఁడు బాలునికంఠమునఁ బ్రవహించుచుండు బాష్పధారను దుడిచివైచెను. ధ్రువుఁడు మరల మొగమెత్తుకొని "అక్కయేదీ?" అని యడిగెను.

ఈసమయమున మేఘములు చుట్టి సూర్యుని గప్పివైచెను. నద్యుపరిభాగంబున నల్లనిఘనచ్ఛాయలు పడుచుండెను.

దూరముగా నున్నవనప్రాంతములు మేఘములవలె శ్యామలవర్ణములయ్యెను. వర్షము గురియు లక్షణములను దిలకించి మాణిక్యరాయలు భృత్యునితో మరలి వచ్చి రాజభవనమును జేరెను.

---

## తొమ్మిదవపరిచ్ఛేదము.

మందిర మెక్కుడుదూరము లేదు; కాని జయసింహుడు నిర్జన మగు గోమతీఘట్టమున నటునిటుఁ దిరుగుచు మెల్లమెల్లన మందిరమువైపునకు నడుచుచుండెను, ఆతనిమనమున నెంతయు విచార ముదయించుచున్నయది. ఆతఁ డానదీతీరమున నొకచెట్టు క్రింద నొకచోటఁ గూర్చుండి రెండుచేతులతోఁ దనముఖమును మూసికొని "ఒకవఏిమాత్రము నేనొనర్చినాను. రెండవది సందేహముచే నైనదికాదు. నేఁటినుండి నాసందేహనివారణ మెవ్వరు గావింతురు? మంచిదియో? చెడ్డదియో? యిది కెఱుఁగ రెవ్వరు నాకు బోధింతురు? లోకమున నుండుచుండ్లవారుల నడుమ నిలిచి 'ఏది మంచిమార్గము?' అని యెవని నడుగుదును? ఇట్టి యద్భుతపు మైదానమున నే నంధప్రాయుండనై నిలిచి యున్నాఁడను. నేఁడు నాయూఁతకఱ్ఱ విఱిగిపోయెను." అని యాలోచించు చుండెను.

జయసింహుం డచ్చటనుండి లేచినతోడనే చిన్నచిన్న చినుకులుగా వర్షముగురియ నారంభించెను. చినుకులలోఁ దడి

యుచు నతఁడు మందిరముదిక్కున కేఁగెను. ఎండ తెండలో ప్రజలు గుంపుగుంపులుగా మందిరపుడెన నుండి కోలాహల మొ నరించుచు వచ్చుచుండిరి. వారిని జయసింహుఁడు చూచి వారాడు కొనుమాటలను వినుచుండెను.

ముసలివాఁడు.—"తాతతండ్రులనుండియు వచ్చుచున్న యీ యాచారము నొక్కసారిగా మాన్పింప రాజుగారియభి ప్రాయ మేమైయుండునో తెలియదయ్యె."

పడుచువాఁడు.—"ఇప్పుడు మందిరమునకుఁ బోవుటకే యిష్టము లేకున్నది. మఱి పూజానముద్యోగ మెక్కడ?"

మఱియొకఁడు.—"నిజముగ నిది తురకలయాచార మయి పోయినది. బలిదానవిషయమున ముసల్మానులమతమున ద్వైధీభావ ముత్పన్నము కావచ్చును; గాని హిందూమత మును భావాంతర మొందుట యాశ్చర్యము."

స్త్రీజనము.—"ఈరాజ్యమున కిప్పుడు వినాశకాల మాసన్న మైనది."

ఒకఁడు.—"మూఁడు మాసములలో నీదేశమంతయు మహా మారిచే నాశనము చేయఁబడు నని పండితరఘుపతిజీవారికి స్వప్నమున దేవి సాక్షాత్కరించి చెప్పినదఁట. ఈసంగతి వారు స్వయముగా సెలవిచ్చియున్నారు."

లలితా.—"ఇది కనుఁగొనరాదా? పదునెనిమిదిమాసములనుం డియు రోగిమై బ్రతికి వచ్చుచున్నయధుఁ డీబలిదాన మాఁపి వేయునంతనే చనిపోలేదా?"

శాంత.—"వాఁడేనా? తల్లీ! నాపెద్దకొడుకు చనిపోవు నని యె వనికెఱుక? వాఁడు చచ్చిపోఁదగినవాఁడా? •ఆచార్యులుగారి• భృగువటిని దినుచుఁ గన్నులు తేలవైచినాఁడు." అవృత్తి శోకముచేతను దేశారిష్ట మగు ననుభయముచేతను శాంత యెంతయు నధైర్యపడుచుండెను.

తినకాడి.—నాఁడు మధురహాటీ బజారున నగ్ని ముట్టి కొంప లన్నియుఁ బరశురామప్రీతికాలేదా? చింతామణి యనువ్యవ సాయదారుఁడు తనతోటి వ్యవసాయదారునితో "ఎందు కధికప్రసంగము? చూచుచున్నాము కామా? ఈయేఁడు నత్తిగ ధాన్యముపండిన ట్లేయేఁడును బండలేదు. ఈయేఁడు వ్యవసాయదారుల యదృష్ట మెట్టులు మాఱునో యెవ్వఁ డెఱుంగును?" అని పలికెను.

బలిదాన మాఁపివేసినపిమ్మట నంతకు ముందటివిపత్తుల కును నదియే కారణమయ్యెను. ఆదేశమునువిడిచి మఱియెచ్చటి కేనిఁ బోవుట మంచి దని యెల్లరును నాలోచించుకొనిరి; కాని యాయాలోచనవలనఁ బ్రయోజన మేమియును లేక పోయెను. ఎవరును దేశమును విడిచి యెచ్చటికిని బోరైరి. ఎచ్చట నున్న వారచ్చటనే యుండిరి.

జయసింహునికిఁ జిత్తస్థైర్యము లేకుండుటచే నామాట లంతఁగా బాటింపక తిన్నగా మందిరమున కేఁగెను. దేవీపూ జను సమాప్తి నొందించి వెలుపలఁ గూరుచున్నరఘుపతిని జూ చెను. జయసింహుఁడు రఘుపతిని సమీపించి, "గురుదేవా!

నేఁటియుదయమున దేవియాజ్ఞ నొందుటకై వచ్చి నే నడిగిన ప్రశ్నకుఁ దామేల యుత్తరువు నొసంగితిరి?" అని యడిగెను.

రఘుపతి, కొంచె మిట్టట్టు గోడమీఁదిపిల్లి వాటముగా "దేవి నాగుండ తనయిష్టమును బ్రకటించినది. ఆమె తన నోటితో నేమియుఁ బలుకదు." అని తడఁబడుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

జయ.—"తాము సమీపమునకు వచ్చి చెప్పరాదా? లోపల దాఁగియుండి నన్ను వంచింప నేల?"

రఘు.—(కోపముతో) "నోరు మూయుము. నే నేమి యాలోచించి యేపని యొనర్తునో నీ కేమి తెలియును? వాచాలుని విధమున నోరికి వచ్చిన ట్లెల్ల వదరకు. నే నే మాజ్ఞాపించెదనో నీ వటు నడుచుకొనుము. మించి నుఱేమియుఁ బ్రశ్నింపకుము."

జయసింహుఁడు మూఁగకుండెను. ఆతనిసందేహము మఱింత మురిగెను. మఱికొంత సేపు పోయినతరువాత నిట్లు పలికెను.

జయ.—ఈయుదయమున నేను దేవితో "నీ నోటితో నీ వాజ్ఞాపింపనియెడల రాజహత్య యెట్టులును జరగనీయను. ఈయుద్యమమున విఘ్న మొనరింపక మానను." అని పలికి యుంటిని. "దేవి యేమియు నాజ్ఞాపింపలే దని నిశ్చయముగాఁ దెలిసికొని వెంటనే మహారాజుతో నకుత్ర రాయని ప్రతిజ్ఞ నెఱింగించి జాగరూకతతో నుండుమన ట్లానర్చినాను."

రఘుపతి కొంతసేపు ఊరకుండి తీవ్ర మగు తనకోపము నడంచుకొని యుచ్చైస్స్వరముగా "మందిరములోనికి బద" అనెను. ఇరువురును జనిరి.

రఘుపతి.—"ఆషాఢశుక్లచతుర్దశీదివసమున రాజ రక్తమును దెచ్చెదనని భగవతీపాదపద్మములనంటి శపథ మొనరింపుము." అని జయసింహుని కాజ్ఞాపించెను.

జయసింహుఁడు తలవంచుకొని కొన్నినిముసము లూరకుండెను తరువాతఁ దలయెత్తి యొకమాఱు గురువుగారి ముఖమును మఱియొకమాఱు దేవీముఖమును జూచెను. పిమ్మట దేవీవిగ్రహము నంటి మెల్ల మెల్లఁగా "ఆషాఢశుక్లచతుర్దశీదివసమున రాజరక్తమును దెచ్చి యీపాదములయం దుపహార మిచ్చెదను." అని శపథ మొనరించెను.



---

## పదియవపరిచ్ఛేదము.

రాజభవనమునకు విచ్చేసి మాణిక్యరాజు లాదినమునఁ జూడవలసిన రాజకార్యములను సమాప్తి నొందించి విశ్రాంతిగలవాఁడయ్యెను. మేఘములు మూరలఁ గ్రమ్ముటచేఁ జీకటి యల్లుకొనెను. మహారాజుగారి హృదయము మొకయుఁ గలవర మగుచుండెను. ప్రతిదినమున దర్బారునకు వచ్చునక్షత్రరాయలు లానాఁ

డు రాఁడయ్యెను. మాణిక్యరాయ లాతని రమ్మని కబురంపెను. తనశరీరమున బాగులే దనియు, రాఁజాల ననియుఁ జిన్నరాయ లన్నగారికిఁ దెలియఁజేసెను. స్వయముగాఁ బెద్దరాయ లాతనికడ కరిగెను. తలయెత్తి చిన్నరాయ లన్నగారిని జూచుటయైనను లేదు. వ్రాసి యున్న కాకిత మొకటి చేతఁ బట్టుకొని యేమో మిక్కిలి వ్యాకులచిత్తుఁడై యున్నట్లు నటించెను.

రాజు.—"నక్షత్ర! ఏమి? నీశరీరస్థితి చెడియెనా?"

నక్షత్రరాయ లాయుత్తరము వెనుక ప్రక్క నొకమాఱును ముందుప్రక్క నొకమాఱును జూచుచు నటునిటు ద్రిప్పుచుఁ గాలిబొటనవ్రేలిని జూచుచు నిట్లని పలికెను.

క్ష.—"చెడియెనా! లేదు. చెడు పేమియును లేదు. ఇంతవఱకవసర మైనపని యుండెను—ఔనౌను! శరీరస్థితియును జెడి యుండినది. ఆయవస్థయు దాఁటిపోయెను; కాని యింకను గొంచెమట్టులేయున్నట్లున్నది."

నక్షత్రరాయ లెంతయు నధైర్య మందెను. గోవిందరాయలు ఖిన్నుఁడై యాతనిముఖమును జూచుచుఁ దనలో నాలోచింపసాగెను. "ఆహాహా! ప్రేమాస్పద మగునింటిలో హింసాపిశాచము ప్రవేశించెను. అది సర్పమువలె నణఁగియుండఁ గోరుచున్నది గాని మొగము చూపింప నిష్టపడ కున్నది. మన కరణ్యమునఁ జూపట్టు ఘాతుకమృగములే భయజనకములు. ఐననేమి? ఇప్పుడు మనుష్యుఁడును మనుష్యుని జూచి భయపడవలసి వచ్చెను. ఆహా! యేమి? సోదరుఁడును సోదరునికడ నిర్భయుఁడై

యుండ నోచుకొనలేదు కాఁబోలును. ఇతఁడు నాతమ్ముఁడు. ఇతనితోఁ గలిసి నిత్య మొకయింట వసియించు చున్నాను. ఒక యాసనమునఁ గూర్చుండుచున్నాను. ప్రసన్నవదనమున మాటలాడుచున్నాను; కాని యీతఁడు నాకడనుండి నాకొఱకై మనసులోఁ గత్తి పద నెక్కించుచున్నాఁడు” అని యనుకొనెను. గోవిందమాణిక్యునియెదుట నానమయమున నీలోకము ఘాతుకమృగసంకుల మగునుహారణ్యముపలెఁ దోఁచుచుండెను. నిబిడాంధకారమధ్యమున నలుదెసలను దీక్ష్ణములగు కోఱలయొక్కయు గోళ్లయొక్కయు కాంతులు పొడగట్టు చుండెను. మాణిక్యరాయలు వడిగా నొకయుచ్ఛ్వాసమును బీల్చి తనమనమున మఱియు నిట్లు వితర్కించుకొనియెను.

రాజు:—“భక్తిభావవిహీనమును హానికారకము నగునీరాజ్యమున నేమిగిలె, నాజాతినసహోదరులమానసంబునఁ గేవలహింసాలోభశాస్త్రవాగ్నుల దఱికొల్పుచున్నాఁడను. నాసింహాసనమునకుఁ జుట్టును నా ప్రాణములకంటె నధిక ప్రియులగు నాత్మీయులు నావైపుఁ జూచుచుఁ దమంతఁ దామే ముఖములను ముడుచుకొనుచున్నారు. పండ్లు గొఱుకుచున్నారు. బంధింపఁబడియున్న భయంకరము లగుమర్త్యములతీసున నల్గడలనుండి నాపై కుఱికిపడఁ దఱివేచుచున్నారు. వీరలతీవ్రనఖాఘాతములచే ఛిన్నాభిన్నమగుటకంటె నింక వీరిరక్తపిపాస నణఁచుటకై ప్రయత్నించుటకంటె నిచ్చటనుండి యెచ్చటికైన మఱియొకచోటికిఁ బోవుటయే శ్రేయము.”

ధ్రువునితోఁ గలిసి నదీతీరమున వినోదముల నానందిం
చుచున్నప్పుడు ప్రాతఃకాలమున నిర్మలాకాశమునఁ బ్రకాశమా
నమై వెలుఁగొందు రాజరాయలముఖశోభ యిప్పు డెందు
డాఁగెనో!

మాణిక్యరాయులు లేచి నిలువంబడి గంభీరభావముతో—

"నక్షత్ర! నేఁటిమూఁడవయామమునను నానిరువురము
ను గోమతీనదీప్రాంతమున నుండు నిర్జనాలయమునకుఁ బ్రయాణమునకై
పోవలయును."

గంభీరభావగర్భితమగు అన్నగారియాజ్ఞకు నక్షత్రరాయం
డేమియు మాఱుపలుకలేకపోయెను; కాని యనేకము లగు
శంకాసందేహములచే నాతనిహృదయము ఘూర్ణిలమగుచుండెను.
ఆతనిమనమున ననేకవిధములగుతరంగములు లేచుచుండెను. "అన్న
గారింతవఱకు స్థిరభావముతో నామనస్సును గని పెట్టుచున్నారు.
అతనిహృదయమున నున్నయాలోచనలు చీఁకటిలోనుండు పు
రుగులవలెఁ బ్రకాశమును జూచి యొక్కమాఱుగాఁ జంచలము
లై యిచ్చోటఁ బైకివెడలినవి." నక్షత్రరాయలు భయపడుచు
రాజుగారిముఖము నొకసారిచూచెను. రాజుగారిముగముపై
గంభీరములై ఖిన్నతయు శాంతమును గప్పికొనియున్నవి; కాని
క్రోధము రవంతయును లేదు. కేవలము మనుష్యహృదయ
మందలికాఠిన్యమును క్రౌర్యమును జూచి యాతనిహృదయ
మున నగాధమగుశోకము వ్యాపించియుండెను.

ప్రయాణమునవేళ సమీపించెను. ఇంతవరకును మేఘము లావరించియే యుండెను. నక్షత్రరాయనితోఁ గలిసి సూరోక్య రాయలు కాలినడకనే యరణ్యమార్గమును బట్టెను. సాయం కాలమగుట కొంకెంత ప్రొద్దుతరువాయియుండెను; కాని మేఘా వరణకృత మగునంధకారముచే సాయంకాలమైనదను భ్రమము గలుగుచుండెను. కాకము లరణ్యమధ్యమున నటునిటునుండి వచ్చి విశ్రాంతముగాఁ గావుకావు మని యఱచుచుండెను. ఒకటి రెండు గ్రద్ద లంతటను జుట్టి తిరుగుచుండెను. ఇన్నగాను లిరు వుగును నిబిడాంధకారలిప్త మగునరణ్యమును బ్రవేశించి నంతన నక్షత్రరాయని శరీరము గడగడ వడఁకసాగెను. పెద్ద పెద్దమునలిచెట్లు జటిలములై నిలిచి యుండెను. వారేమియు మాటలాడలేదు. చీమచిటుక్కు మనుశబ్దము గూడ వినిపించు చునే యుండెను. వారు తిమిరమునీడలవైపునను దట్టమగునం ధకారము వైపునను తెప్పవాల్పక చూచుచుండిరి. జటిలమును రహస్యమయమును నగు నట్టి యరణ్యమధ్యమున నక్షత్రరా యలు ముందున కడుగిడలంచెను గాని కాలు సాగలేదు. నాలుగుదిక్కుల నగాధమగు శాంతిభావమును స్పష్టముగను జూచి యాతనిగుండెలు కొట్టుకొనసాగెను. అతని సందేహమును భయమును వృద్ధిబొందెను. భయంకరమగునరణ్యము తీరున రాజుగారు మాటలాడక యీసంధ్యాసమయమున నీ పహాట వీమధ్యమున నెచ్చటికి కెంకులకుఁ బోవుచుండెనో యా సంగతి నక్షత్రరాయని కేమియుఁ దెలియకుండెను. తనవెంట నతఁడు తాను రాజుగారిసన్నిధిని జిక్కితి ననియు, నిశ్శబ్ద మగుశాంతి

నొసంగుటకై తన్నీవనమున కాతఁడు దీసికొనివచ్చె ననియుఁ దెలిసికొనియెను. నక్షత్రరాయలు తటాలునఁ బరుగెత్తిపోయి నచోఁ దప్పించుకొనఁ నోవును; కాని తన్నెవరో కాళ్లు కట్టి యీడ్చుకొని పోవుచున్నట్లును తనరక్షణమునకై మఱియేయుపాయము నిప్పుడు లేదనియును నతఁడు దలఁచెను.

ఆవనమునఁ గొంతప్రదేశము తిప్పలు, లతలు, చెట్లును లేక రిత్తగా నుండెను. వర్షోదకముచే నిండియున్న యాప్రదేశముప్రాకృతిక మగు నొకకొలనువలెఁ దోఁచుచుండెను. ఆకొలనినడుమ గాలివాటినభూమి యగవడుచుండెను. అచ్చటికిఁబోయి తిరిగి నిలువంబడి రాజుగారు—"నిలువుము" అనిరి. నక్షత్రరాయ లదరిపడి నిలిచిపోయెను. రాజుగారి యీయాజ్ఞను విని నిజముగ నావనముమందలి కాలగతియడ్డుపోయె ననుకొనెను. ఆసమయమున నిశ్చయముగా నాయడవియందలివృక్షము లన్నియు వంగి నిలిచియుండెను. క్రిందను భూమియును మీఁద నాకసమును శ్వాసముల నన్నిటిని బిగఁబట్టి స్థిరభావముతోఁ జూడఁదొడఁగెను. కాకులకలకలము కట్టిపోయెను. వనమునం దంతటను నల్లనితెఱ కప్పెను. ధ్వని లేశమైన నెచ్చటనుండియు వినరా దయ్యెను. కేవలము " నిలువుము " అను నొక్కశబ్దమే మెఱుపు మెఱసినట్లు ప్రతివృక్షమందును బ్రతిశాఖయందును నంతటను వ్యాపించెను. వనమందలి యాకులన్నియు నొక్కటొక్కటిగ నా శబ్దమువలని దెబ్బతినుటచేఁ గాఁబోలు నల్లల నాడకుండెను. నక్షత్రరాయలు నొక విగ్రహమువలె చంచలభావ మెఱుంగక నిలిచియుండెను.

అప్పుడు రాజుగారు మర్మాంతికమును విషాదయుక్తము నగు తనదృష్టిని జలింపనీయక నిశ్చలభావముతో "నక్షత్ర! నీవు నన్ను జంపఁ దలంచుకొంటివా?" అని యడిగెను.

చిన్నరాయలు పిడుగుమోదినచందమున నిలువఁబడియుండెను. ప్రత్యుత్తరము నొసంగుట కైన నతనికిఁ జైతన్యము లేక పోయెను.

రాజు.—తమ్ముఁడా! న న్నెందుకుఁ జంప నెంచితివి? రాజ్యలోభముచేత నేనా? రాజ్యము కేవలసువర్ణమయ మగుసింహాసనమందును మాణిక్యఖచిత మగుకిరీటమునందును, శ్వేతచ్ఛత్రమునందును నిలిచి యున్న దనియేనా నీయభిప్రాయము? ఈముకుటమువలన నీరాజచ్ఛత్రమువలన నీరాజదండమువల న నెంతకష్టము గలదో యెఱుంగుదువా? నాముద్దుతమ్ముఁడా! లక్షలకొలఁదిగ మనుష్యులవిచారము లీముకుటముచేఁ గప్పఁబడియున్నవి. నీకు రాజ్య మేలుటయే యిష్టమయ్యె నేని యెల్లరకష్టములు నీకష్టములుగను, నెల్లరవిపత్తులు నీవిపత్తులుగను భావించి రాజ్యమును స్వీకరింపుము. ఎల్లరదరిద్రతను నీదరిద్రతగాఁ దలంచుకొని దానిని దలనిక్కించుము. ఇట్టు లెవ్వఁడు సేయ సమర్థుఁడో వాఁడే నిజముగ రాజనఁ దగినవాఁడు. వాఁడు గుడిసెలోనుండుఁగాక! మహాలునుండుఁ గాక! ఎవఁడు "ఆత్మవత్సర్వ భూతాని" అనున్యాయము ననుసరించి మెలంగునో వానినందఱును బ్రేమింతురు. మఱియు నతని యైశ్వర్యమును గాని ప్రతిష్ఠను గాని సుఖమునుగాని

యసంఖ్యాసేనాసమేతుండై యెదిరియు నెవ్వఁడు నపహరింప నేరఁడు. మఱియుఁ బృథ్వీసంబంధ మగుసుఖము నెవ్వఁడు నశింపఁ జేయునో యాతఁడే పృథ్వీనాథుఁడు; కాని పృథ్వీసంబంధ మగుసంపత్తియుఁ దదంతర్గతము లగునాగరాదుల నెవ్వఁ డపహరింపఁ జూచునో యతఁడు సామాన్యము కత్తెర దొంగయే. వానితలపై నసంఖ్యాకులగు నభాగ్యుల యశ్రుధారలు రాత్రిందివములు వర్షించుచుండును. అభిశాపజనకము లగునట్టితీక్ష్ణధారల ధరించి వాని రక్షింపనసమర్థమయినంతటి విశాలరాజచ్ఛత్ర మొందును లే దని యెఱుంగుము. అధికాధికములగు నాతనిరాజభోగములలో నుఱిమియాఱిన క్షుధాతురులయాఁకలి కలసి మెలసి యడంగియుండును. వాఁ డనహాయము లగులోకులదారిద్ర్యమును గణించి సువర్ణనిర్మాణము లగుభూషణములఁ జేయించుకొని యలంకరించుకొనుచుండును. భూమిపై జీరాడు నమూల్యము లగు వానిచీని చీనాంబరములలో జాడ్యముచేఁ బీడింపఁబడి తెగ్గిన మాఱిన యగులోకుల శిథిలములినవస్త్రములు చుట్టుకొనియుండును. నక్షత్రతమ్ముఁడా! రాజును జంపినమాత్రమున రాజ్యము లబ్బునా? పృథ్వీదేవతను వశ మొనరించుకొని రాజ్య మొందుట శ్రేయస్కరము.”

గోవిందమాణిక్యరాయ లింతవఱకు వక్కాణించి విరమించెను. నక్షత్రరాయ లవనతశిరస్కుండై మాటలాడక యూరకుండెను.

మాణిక్యరాయలు మొలనుండి కరవాలము దీసి నక్షత్ర రాయనిముందుంచి "సోదరా! ఇప్పు డిచ్చో నెవ్వరును లేరు. సాక్షిగా నెవ్వఁడును లేఁడు. సహోదరుని సహోదరుఁడు చంప నెంచినచో నిదియే యుపయుక్తమగుస్థలము. ఇదియే మంచి సమయము. ఇచ్చో నిన్నెవ్వరును నిందింపరు. నీనాదేహములం బ్రవహించురక్త మొక్కటియే. తల్లి యొక్కతెయే. తండ్రి యొక్కఁడే. తాతయుఁ దాతతండ్రియును మనకిరువురకు నొక్కరే. వారిరక్తమే మనయిరువుర శరీరముల సంచరించుచున్నయది. నీ వట్టిరక్తము నితరులచేత నొలకప నిశ్చయించుకొంటివేని; కాని, యిట్టిపని మనుష్యసంచార ముండుపట్లఁ జేయుము. ఎందువల్ల నన నిట్టిచోట రక్తబిందువులు పడును. ఆస్థలమును గుప్తరీతిని బవిత్రమగుభ్రాతృభావబంధనము సడలిపోవును. పాపమున కంత మెంతయో యెవ్వఁ డెఱుంగును. సాక్షి యొక్కటియైన నిచ్చోఁ బడినను నద్దానిఁ దాఁప నెంత ప్రయత్నించినను జూడఁజూడ నచ్చోట సహస్రసంఖ్యాకము లగుచు మొలక లుత్పన్నములై పిచ్చిపికిరి పరిశ్రాంతములై చేన లావరించును. అతిసుందర మగుమనుష్యసమాజము నెల్ల మెల్లన నెట్టి లరణ్యమునఁ గలసికొనునో యానంగతి నెవ్వఁడును నెఱుంగఁజాలఁడు. కావున నిశ్చలనిశ్శంకభావంబుల నన్నదమ్ములొండొరులఁ బ్రేమించుకొను జనావాసముల నిట్టి భ్రాతృవధ నొనరింపరాదనునుద్దేశముతో నిన్ను నేఁ డిట్టియరణ్యమునకుఁ బిలిచికొని వచ్చినాఁడను." అని చెప్పి ఖడ్గము తమ్ము

నిచే నిచ్చి నీవని నీవు గాపించికొను మనెను. నక్షత్రరాయని చేతినుండి ఖడ్గము జాఱిపడెను.

నక్షత్రరాయలు రెండుచేతులతో ముఖమును మూసికొని రోదన మొనర్చుచు గద్గదగళుండై "అన్నగారూ! నే నపరాధిని గాను. నామనమున నిట్టియూహ యెప్పుడును జనింపలేదు." అని పలికెను.

అన్నగారు దమ్ముని గౌఁగిలించుకొని "ఆనంగతి నేనెఱుంగుదును. నీవు నన్నెప్పుడైనఁ జంపఁగలవా? దురాత్ములు నీకు దుర్బోధచేసి రని నే నెఱుంగుదును. ఇందు నీ కేమియును దోషములేదు."

నక్ష.—"మఱియెవ్వరును గారు. రఘుపతియే నాకిట్టియుపదేశ మిచ్చినాఁడు."

రాజు.—"రఘుపతికి దూరముగానుండుము. అతనికడ కరుగకుము."

నక్ష.—"నే నెక్కడికిఁ బోదును? తామే సెలవిండు. నేనిప్పుడీనగరమున నుండనోపను. నేనెచ్చటికైనఁ బోనిశ్చయించికొంటిని."

రాజు.—"నీవు నిత్యము నాకడనే యుండుము. మఱియెక్కడికిని బోవలదు. రఘుపతి నిన్నేమి చేయఁగలఁడు?"

నక్షత్రరాయ లన్నగారిహస్తమును గట్టిగాఁ బట్టుకొనియెను. నిజముగఁ దన్ను రఘుపతి లాగుకొని పోవుననుభయము మాత్ర మాతని విడువ దయ్యెను.

---

## పదునొకండవపరిచ్ఛేదము.

నక్షత్రరాయ లన్నగారిచేయి పట్టుకొని తిరిగి యింటికి వచ్చెను. అప్పటికి నాకసంబున నించుక వెలుఁతురు గలిగియున్నది; కాని యడవి క్రిందిభాగముమాత్ర మంధకారమయమైయుండెను. ఇప్పు డొక్కచెట్లపైభాగముమాత్ర మావెలుఁతురున నగపడుచున్నయది. కొన్ని నిముసములలో నదియుఁ గానరాదు. తరువాత నంధకారము పరిపూర్ణముగా వ్యాపించి భూమ్యాకాశముల నొక్కటిగాఁ జేసివేయును.

రాజుగారు, రాజభవనమార్గమున వరుగక యాలయముదెస కరిగెను. దేవీమందిరమున సంధ్యాకాలమున నారతి యిచ్చి రఘుపతియు జయసింహుఁడును నింటిలో నొకదీపమును బెట్టికొని కూర్చుండిరి. ఇరువురు నతిగంభీరభావములతోఁ దమతమ యాలోచనలఁ గొనలు సాగించుచుండిరి. దీపపువెలుతురున వారిరువురిముఖచ్ఛాయలు నెంతయుఁ బ్రకాశించుచుండెను. నక్షత్రరాయలు రఘుపతినిజూచి యాతనియెదుటఁ బడుటకు మోమోట మొందెను. చిన్నరాయ లన్నగారినీడలోఁ దనదేహమును మాటుపఱుచుకొని యధోముఖుండై యుండెను. రాజుగా రాతనిఁ దనదగ్గఱఁ జేర్చుకొని ప్రేమతో నతని చేయి పట్టుకొని నిలుపం జేసెను. మఱియు నిశ్చల మగుదృష్టితో నొకసారి రఘుపతి మోమువంకఁ జూచెను. రఘుపతి నక్షత్రరాయనిపైఁ దీవ్రముగాఁ గోఱచూపులను నిగిడించెను. తరువాత గోవిందరాయలు రఘు

వచ్చిఁ బ్రణామ మొనరించెను. నక్షత్రరాయలు నన్నగారి నమన రించెను. రఘుపతి నమస్కారము లందుకొని గంభీరస్వరముతో “జయము మహారాజ! రాజ్యమునఁ గుశలమా” అని యాశీర్వాదయుక్తముగఁ గుశలప్రశ్న మొనరించెను.

రాజుగా రొక్కింతతడ వూరకుండి “రాజ్యమున నేయశుభము రాకుండఁ దా మాశీర్వదింపవలయును. ఈరాజ్యమున జగదంబాసంతానము సుఖముగాఁ గలసిమెలసి ప్రియభావమున నుండవలయు ననియు, నన్నదమ్ములతో నంతఃకలహము లుదయింపకుండ వలయు ననియుఁ, బ్రేమాస్పద మగుచోట హింసాపిశాచ మావేశింపకుండవలయు ననియుఁ దా మాశీర్వదింపవలయును. నేను రాజ్యమున నశుభమును శంకించి యిప్పటికి వచ్చినాను. పాపసంకల్పములరాయిడిచే దావాగ్ని ప్రజ్వరించుచున్నయది. మీరు దానిని శాంతింపఁజేయుఁడు. ప్రేమరూపమగునుదకమును వర్షింపుఁడు. భూమిని చల్లపఱుపుఁడు.”

రఘు.—“దేవీకోపాగ్ని యుద్రేకించి మండుచున్నప్పుడు దానినెవ్వరు శాంతింపఁ జేయఁగలరు? అపరాధియగు నొక్క మనుజునికారణంబున వేలకొలఁదిగ దీనజను లాయగ్ని కాహుతులై భస్మమగుచున్నారు.”

రాజు.—“ఈమాటలు మాత్రము నేనెంతయు భయమందుచున్నాను. ఇందువలన నాకుఁ గంప ముదయించుచున్నది. ఈమాటనెఱింగియు నెవ్వరు నేలొకో యజ్ఞానమున మూఁగుచున్నారు? తాముమాత్ర మెఱుంగరా? ఈరాజ్యమునందు

దేవిపేరుగా దేవతానియమమునకూ భంగము కలుగుచున్నది. అందుచే రాంగల యశుభమును శంకించుచు నేనిప్పు డిప్పటికి వచ్చినాను. ఈస్థలమున పాపస్మృతమును నెలకొల్పి ధన ధాన్యయుక్తమగు నాయీసౌఖ్యరాజ్యమునం దాము కాళీ కోపమూపమగు పిడుగు నాహ్వానించి నాశన మొందింపకుందు రుగాక! మీకీమాట చెప్పియేయుంటిని. స్పష్టముగాం జెప్పు టకై నేం డిందువచ్చియున్నాను.” అని పలికి రాయలు రఘుపతిముఖమున మర్మభేదములగు చూపులు నిగిడించెను. రాజుగారినోటనుండి వెడలిన యావాక్యములు గిఱ్ఱునం దిరుగు సుడిగాలితీరున నామందిరమున గోరువెట్టెను. రఘుపతియలవి ప్రత్యుత్తరమేమియు రాదయ్యెను. అతండు యజ్ఞోపవీతము చేతతోం బట్టుకొని కంపింపసాగెను. రాజు గారాతనికిం బునఃప్రణామంబొనర్చి నక్షత్రరాయలచేయిం బట్టుకొని యచ్చటనుండి వెలుపడెను. ఆయింటిలో నొక్క దీపమును, రఘుపతియును, నిదుపగునాతనినీడయుం దక్క మఱేమియును లేదు.

అనంతమున నాశనమున వెలుతురు నాకుమాత్రమున నైన లేదయ్యెను. జలధరములు నక్షత్రగణముం గప్పివచ్చెను. అధమాంధకారమునం బురవీధియుం దెప్పటనుండియో వచ్చి కదంబపుష్పపుసుగంధముమాత్రము విరుగుచుండెను. మఱియు సమీపారణ్యమునందలి మర్మరధ్వనులు వినవచ్చుచున్నవి. చింతలో మునింగియున్న రాజుగారు పరిచితమగు నారాజ

మార్గమున నిర్భయుండై పోవుచుండెను. వెనుకనుండి యెవ్వరో "మహారాజా!" అని పిలుచుచున్నట్లు వినఁబడెను. రాజుగారు వెనుకకు మరలి "నీవెవ్వఁడవు?" అని యడిగెను.

పరిచితకంఠస్వరుండగు రెండవవాఁడు "స్వామీ! నేను మీదాసానుదాసుండనగు జయసింహుఁడను. మహారాజా! తామె నాకు గురువును నేలికయును; తాముతక్క నాకెవ్వరును లేరు. మీరు మీతమ్మునిఁ జేయి బట్టుకొని యీ యంధకారమునం దెట్లు దీసికొనిపోవుచుండిరో నన్ను నట్లే చేయిపట్టుకొని తమతోఁ దీసికొనిపొండు. నే నత్యంధకారమునఁ బడియున్నాఁడను. ఏమొనరించిన మంచియో యేమొనరించినఁ జెడుగో నే నించుకయు నెఱుంగఁజాలకున్నాఁడను. నే నొకసారి యెడమవైపున నింకొకసారి కుడివైపునను బోవుచున్నాఁడను. నన్ను దరిఁ జేర్చువా రెవరును లేరు." ఆచీఁకటిలో జయసింహునికన్నులు బాష్పధారలను వర్షించుచున్నవి గాని యవి యెవ్వరికిని గాన్పింపవయ్యెను. ఉద్వేగముతో నిండి కరుణోత్పాదకమగు నాతనికంపితకంఠస్వరముమాత్రము రాజుగారి శ్రవణేంద్రియమునఁ బ్రవేశింపసాగెను. మహావాయుఘట్టనమునఁ జనించుచు నల్లకల్లోలమగు నుదధింబోలి యా గంభీరఘోరాంధకారము జయసింహుని యార్తస్వరఘట్టన మొంది కంపింపసాగెను. రాజుగా రాతనిచేయిని దనచేతితోఁ దెముఁబ్బుచు "రమ్ము! నాతోఁ గలిసి నాయంతఃపురమునకు రమ్ము!" అని పలికిరి.

---

## పంద్రెండవ పరిచ్ఛేదము.

మఱునాఁడు జయసింహుఁడు తిరిగి మందిరమునకు వచ్చునరికిఁ బూజానమయ మతిక్రమించెను. రఘుపతి దీనవద నుండై రొంటరిగాఁ గూర్చుండియుండెను. ఇంతకుముం దిట్లు పూజావిషయమున నేమియు భంగము కలిగియుండలేదు.

జయసింహుఁడు తనగురుదేవునిసన్నిధికరుగక తిన్నఁగాఁ దనపూఁదోఁటకుఁ బోయెను. పాతకసోదరులు నాతోఁటలో నొక్కించుక విహరింతురుగాక. అతఁ డివ్వు డొకలతావితానమున జొంపమగు పొదరింటను గూర్చుండెను. అతనికి నల్దెసలనుండియు వృక్షములన్నియు నావరించుకొని గాలిచేఁ గదలుచు నీడలను నృత్యము చేయించుచుండెను. అతనిచుట్టును బూలతో నిండి పచ్చని తెరలపగిది నలరారు పత్త్రప్రచయముపై నారంగులోనే తెరలమీఁదఁగట్టు చిన్న తెరలపగిదినున్న లేఁతయాకుల మొత్తమును, నీడలచేనిండి చూడఁజూడ వేడుకగానున్న ప్రేమరూపమగు నాచ్ఛాదనమును, చక్కనియాకర్షణమును ఇవి రెండు నొండొంటితోఁ జేరిన ప్రీతిపూర్వమగు ప్రకృతి నమ్మేళనము నహృదయహృదయాహ్లాదకరంబై కరం బలరారు చుండెను. ఈప్రదేశమున నివియన్నియు నతని నపేక్షించుచున్నవి గాని యేమియుఁ బ్రశ్నింప వయ్యెను. విచారమును బోఁగొట్ట లేకపోయెను. చూచెనేని చూచుచుండును. మాటలాడెనేని మాటలాడు చుండును. ఇట్టి శాంతిమయమగు

సేవావసరమునఁ బ్రకృతి సంబంధమగు నీలోవలి మహలులోఁ గూర్చుండి జయసింహుఁడు విచారింపసాగెను. రాజుగా రాతని కిడినయువదేశములన్నియుఁ దనమనస్సులోఁ బరిశీలన మొనర్చు చుండెను.

ఇట్టిసమయములో రఘుపతి మెల్లమెల్లఁగా వచ్చి యాతని వీఁపుపైఁ జేయివైచెను. జయసింహుఁ డులికిపడెను. రఘుపతి యతనికడఁ గూరుచుండి ముఖమువంకఁజూచి కంపితస్వరుండై, "నీభావము మఱియొకతీరునఁ గన్పట్టుచున్నది. నీవు మెల్లమెల్లన నన్ను విడిచి తొలఁగిపోవునంతటి యపకృతి నీకే మొనరించినా ను?" అనెను.

జయసింహుఁ డేమియో పలుకయత్నించెను గాని యడ్డు వచ్చి మరల రఘుపతి "ఒకగడియయైన నెవ్వాడైన నీపై నా ప్రేమాభావమును గాంచితివా ? జయసింహా ! నీకు నేనేమైన యపకార మొనరించినాఁడనా ? ఒనరించితిని పో నీకు గురుం డను. నీకుఁ బితృతుల్యుఁడను. క్షమింప నిన్ను వేఁడుచున్నాఁడను. నాకు క్షమాప్రదాన మిమ్ము." అనెను.

జయసింహుఁడు వజ్రాహతునివలె మర్మాహతుండై గడ గడవడఁకుచు లేచెను. మఱియు నాతఁడు గురువుగారి పాదములను బట్టుకొని యేడ్చుచు, "నే నేమియు నెఱుంగను. తెలిసికొనఁ లేకున్నాను. ఎక్కడకు వెళ్లి యుంటినో యదియు నేనెఱుంగను." అని పలికెను.

రఘు.—(జయసింహునిచేయిఁబట్టుకొని) "పుత్త్రా! నేను చిఱుతతనమునుండియు నీపై ప్రేమయుంచి దల్లివలెఁ బెంచితిని. శాస్త్రములను జదివించితిని. నిన్ను నమ్ముకొని నాయాలోచనలన్నిటిలో నిన్నుఁ గూర్చియే యోజించుచుంటిని. నేఁడు నిన్ను నాకడనుండి యెవ్వఁ డీడ్చుకొని పోయెను? ఇన్నాళ్లనుండి వృద్ధి నొందుచున్న స్నేహమమతాబంధన మెవ్వండు భగ్న మొనర్చుచుండెను? దేవతాప్రసాదలబ్ధమనే యధికారము నీపై నాకుఁ గలదో పవిత్రమగు నాయధికారముపై నెవ్వండు చేయిచేసికొనెను? చెప్పుము పుత్త్రా! ఆమహాపాతకుని నామధేయమును జెప్పుము."

జయ.—"దేవా! మీకడనుండి నన్నెవరును దొలఁగింపలేదు. మీరే నన్ను దొలఁగించినారు. నేనింటిలోఁ బడియుంటిని. తామే నన్ను హఠాత్తుగా నింటిలోనుండి పైకీడ్చి దారిలోనికిఁ దెచ్చినారు. మీరే సెలవిచ్చియుంటిరి గదా. 'ఎవని కెవఁడు తండ్రి? ఎవని కెవ్వతె తల్లి? ఎవని కెవఁడు సోదరుఁడు?' అని; మఱియుఁ దామే 'లోకమున నెవ్వనితోడను సంబంధములేదనియు, స్నేహమునకుఁగాని ప్రేమకుఁగాని పవిత్రమగు నధికారము లేదనియు సెలవిచ్చుచున్నారు. నేనెవ్వరిని దల్లియని తలంచుచుంటినో దానినే మీరు శక్తియని నిరూపించితిరి. ఘాతుకజాతులెచ్చటనుండునో, రక్తపాత మెచ్చట జరుగుచుండునో, అన్నదమ్ములెచ్చటఁ గలహించుచుందురో, ఇరువురుమనుష్యులెచ్చట జగడమాడుచుందురో యాయా

చోటుల నీపిపాసాప్రకృతి రుధిరలాలసమై తననోరు తెఱచుకొని నిలువంబడియుండును. ఏమీ ? మీరు తల్లియొడినుండి నన్ను వేఱుపఱిచి రాక్షసరాజ్యమునఁ బడవేయలేదా ?"

రఘుపతి పెద్దయుంబ్రొద్దు స్థిరభావమునఁ గూరుచుండెను. తుదకొక పెద్దనిట్టూర్పు విడిచి, "సరియే! నీవు స్వతంత్రుఁడవైతివి. బంధనమునుండి విముక్తుఁడ వైతివి. నీపైనుండి నాసంపూర్ణాధికారమును మరలించుకొంటిని. ఇందువలన నీవు సుఖముగా నుండఁ గలిగినచో నదె నాకిష్టమే." అని పలికి యతఁడు లేవఁ బోయెను.

జయ.—(రఘుపతి పాదములను బట్టుకొని) "లేదు. లేదు. దేవా! మీరునన్ను బరిత్యజించినను నేను మిమ్ము ద్యజింపనోపను. తమచరణతలముననే నివసించెదను. తమరేది తలంచిన నదె కాఁగలదు. తాము చూపినమార్గముతక్క నాకిఁక నేమార్గమును లేదు." అని పలికెను.

రఘుపతి జయసింహుని గవుంగిలించుకొనియెను. అతని కన్నీరు కాల్వలై జయసింహునికంఠమునఁ బడి ప్రవహింపసాగెను.

—

## ⟶ పదుమూఁడవపరిచ్ఛేదము. ⟵

మందిరమందుఁ బురజను లనేకులు చేరిరి. కోలాహల మెక్కువగా నున్నది. రఘుపతి వారినందఱి నదలించుచు "మీరంద ఱెందుల కిందు వచ్చితిరి?" అని యడిగెను.

పౌరులు.—"మేమందఱము భువనేశ్వరీదర్శనమునకై యిట వచ్చినారము" అని యంద ఱన్నిస్వరములతోఁ బ్రత్యుత్తర మొసంగిరి.

రఘు.—"దేవి యెక్కడనున్నది? దేవి యీరాజ్యమును విడిచి పోయినది. మీరెల్ల రామె నుంచఁగలిగితిరా? అందుచే నామె వెళ్లిపోయినది."

పెద్దయల్లరి కాఁజొచ్చెను. నల్గడలనుండియు వివిధములగు మాటలు వినిపించుచున్నవి. "పురోహితుఁడా! తా మెందు కిట్టు లనుచున్నారు?" అని వారడిగిరి.

ఒకఁడు.—"మేమందఱ మేమియుపకార మొనర్చినాము?"

ఇంకొకఁడు.—"జగజ్జనని మఱి యేవిధముచేతను బ్రసన్నురాలు కాదా యేమి?"

మఱియొకఁడు.—"నాపెద్దతండ్రి రోగియై యున్నాఁడు. నేనొక దినముననైనఁ బూజచేయుటకు రాలేదు." (అందుచే నాయవమానమును సహింపక దేవి యీదేశముననుండుట కిచ్చగింపలేదని యతని నమ్మకము.)

వేఱొకఁడు.—"నేను జగదంబకు రెండుమేకలను బలియీయ
సంకల్పించికొంటిని. నేను మిక్కిలిదూరములో నుండుటచే
రాలేకపోయినాను. రెండుమేఁకలను మ్రొక్కు చెల్లింపక
పోవుటచే దేశమున కిట్టియిక్కట్టు కలిగెను." ఈమాట
మనంబున నెంచుచు నతఁ డధీరుండై యుండెను.

గోవర్ధనుఁడు "తాను మ్రొక్కిన మొక్కు చెల్లింపకపో
యెను. కావుననే దేవియును వాని కింతకష్ట మొసగూర్చెను.
ఆతనియుదరమున బల్లమై వృద్ధినొంది మిక్కిలి బాధింపసాగెను.
ఆఱునెలలనుండియు నతఁడు మంచము పట్టెను. గోవర్ధనునిబల్ల
యధికమై వాఁడు శ్మశానమున కేఁగుఁగాక. దేవి దేశమున
నుండుఁగాక" అని యొకఁడు ప్రార్థించుచుండెను. తక్కిన ప్రజ
లందఱు "నిర్భాగ్యుఁడగు గోవర్ధనునిబల్ల మిక్కిలి వృద్ధినొంది
మరణించుఁగాక" యని కోరుచుండిరి.

ఆజనసమ్మర్దమున దీర్ఘకాయుఁడగు నొకమనుష్యుఁడుండెను.
అతఁ డందఱి నదలించి యూరుకొనఁజేసి చేతులు జోడించుకొని
రఘుపతితో "పూజారిగారూ! దేవి యెందుకు వెళ్లిపోయెను?
మావలన నేమి యపరాధము కలిగెను?" అని యడిగెను.

రఘు.—"మీరందఱు దేవికై యొకరక్తబిందువైన నీయలేక
పోయితిరి. ఇదిగో యిట్టులున్నది మీభక్తి."

అందఱు మాటలాడ కూరకుండిరి. తుదకు మరల గున
గునలు బయలువెడలెను. ఒకానొకఁడు గట్టిగా నిట్లు చెప్పం
దొడంగెను. 'రాజుగారిశాసన మిట్లున్నది. మేమేమిచేయుదుము?'

జయసింహుఁడు రాతిబొమ్మవలె స్థిరభావమునఁ గూర్చుండి యుండెను. "దేవీశాసనము" అనుమాట మెఱుపువలె నాతని నాలుకతుదకు వచ్చెను; గాని యతఁ డాఁపుకొని మాటలాడక యూరకుండెను.

రఘు.—(తీక్ష్ణమగుస్వరముతో) "రాజెవఁడు? దేవిసింహాసనము రాజసింహాసనమునకు లోఁబడియుండెనా? అయినచో మీ రందఱు మాతృహీనమగు దేశమున రాజుగారినే పట్టుకొని యుండుఁడు. మిమ్ముల నెవ్వరురక్షింతురో చూచెదను గాక." అని పలికెను.

జనసమాజమున గుసగుసలు ఘూర్ణిల్లసాగెను. అందఱు భయభ్రాంతులై మాటలాడుకొనుచుండిరి.

రఘు.—(లేచి నిలుచుండి) "రాజునధికునిగాఁ దలంచి మీ రంద ఱంబికా దేవి నవమాన మొనరించి మన దేశమునుండి వెడలనడిచితిరి. మీరు సుఖముగా నుండుట కిచ్చగింపరైతిరి. చూచెదరు గాక. మూఁడుసంవత్సరములలో నింతటి దేశ మందును మీనివాసస్థలములచిహ్నమైన నుండదు. మీవంశ ములు నిర్మూలములగును"

ప్రజామండలిలో సముద్రతరంగములతీరున గుబగుబధ్వ నులు మెల్లమెల్లన వినవచ్చుచుండెను. జనసమ్మర్ద మంతకంత కధిక మగుచుండెను. దీర్ఘకాయుండగు నాతఁడే మరల లేచి చేతులు మొగిడ్చి రఘుపతితో, "అయ్యా! సంతానమువలన నెద్దియైన నపరాధము వచ్చినచోఁ దల్లి దానిని క్షమించి తత్కారణ

మెత్తించి బుజ్జగించును కాని యొక్కసారి సంతానమును విడిచి తల్లియెచ్చటికిఁ బోఁగలదు. దేవా! యొక్కవలుకాన తిందు. ఏమొనరించిన దేవి తిరిగి మనదేశమునకు వచ్చును?" అని పలికెను.

రఘు.—"మీకందఱకు రాజగుగోవిందమాణిక్యరాయ లీదేశ మునుండి బహిర్భూతుఁడై నంతన దేవి వారల నీదేశమునకుఁ దిరిగివచ్చును."

ఈవాక్యమును విని జనసంఘమందలి కలకల మొక్కసారి యాఁగిపోయెను. నాలుగుదిక్కులు నిశ్శబ్దముగానుండెను. తుద కొకరిమొగ మొకరు చూచుకొనుచుండిరి. ఎవరికేమి మాట్లాడు టకును సమయముచిక్కలేదు. అప్పుడు రఘుపతి మేఘగంభీర భీషణంబులగు భాషణంబుల నిట్లు చెప్పసాగెను. "మీరంద ఱతిదూరమునుండియు వింత వింత యాశలతో దేవీసందర్శనా యత్తచిత్తులై యిటకు వచ్చితిరిగదా! నావెనువెంటనే రండు. దేవీమందిరమునఁ బ్రవేశింపుఁడు."

ఆమాటలు వినినంత నందఱును గుమిగా మందిరో పాంతమును జేరిరి. మందిరద్వారము మూయఁబడియుండెను. రఘుపతి సంశయించుచు నాద్వారమును దెఱచెను. కొంత దనుక నెవ్వరినోటనుండియు నొకమాటయైన బయల్పడ దయ్యెను. అందఱును జిత్తరువునందలిప్రతిమలవలెనే నిశ్చేష్టి తులై తలవంచుకొని నిలువంబడియుండిరి. చూపఱకుఁ బరాఙ్ముఖయై దేవి కానవచ్చెను. ఆజగజ్జనని యట్లుండ నాగుంపులోనుండి

రోదనధ్వనులు కేకలు నొక్కమాఱు వెలువడినవి. "తల్లీ! ఒక్కమాఱు నీవదనసరోజము నిటుద్రిప్పి మాపై నీదయారసమును జల్లుము. నీవిషయమున మే మేయపరాధ మొనర్చితిమి?" అనువంతలో వారిదృష్టికి దేవి యదృశ్యయాయెను. ఒక్కసారిగా "తల్లి యేది? అమ్మ యెక్కడ?" ననుకోలాహల మన్నిదిశలనుండియు వెడలి మిన్నుముట్ట సాగెను. దేవీవిగ్రహము శిలామయము గదా! ఎట్లు తిరుగఁగలదు? అందు ననేకులు స్మృతిఁదప్పి నేలకొరగిరి. ఏమియు నెఱుంగని బాలబాలికాజన మేడువసాగెను. అందునఁ గొందఱు వృద్ధులు, అమ్మా! అని తల్లి లేని పిల్లలవలె విలక్షణముగ నేడువఁదొడంగిరి. "ఓతల్లీ! ఓతల్లీ! దీనులముగు మమ్ము విడిచి ఎందరిగివావు?" యువతీమణులకొప్పులు వీడి చీరచెఱఁగులతో నేలజీరాడుచుండెను. వారందఱు వికలమనస్కలై యేడువసాగిరి. ఱొమ్ములను గొట్టుకొనుచుండిరి. వయోవంతులగుపురుషులును మిక్కుటమగు రోదనధ్వనులతో నామందిరమును ఘూర్ణమానముగ నొనర్చుచు వణంకుచు, "తల్లీ! నిన్ను మరలఁ దీసికొని వత్తుము. నిన్ను విడిచి యుండఁజాలము." అని యచ్చటికి వచ్చినవా రెల్లరు శోకసాగరంబున మునింగి తేలుచుండ "ఎవరివెఱ్ఱి వారికానంద" మనునటు లొక వెఱ్ఱివాఁ డీప్రకారము గానము చేయ నారంభించెను.—

తే. గీ. వెలయఁగా మాకు నీశిలావిగ్రహమ్మె
తల్లి యని నమ్మియుంటి మే మెల్లరమును
నింతకంటెను మముఁగావ నెవరు గలరు?
పిల్లలను గావఁ దల్లికే చెల్లుఁ గాక.

తరువాత నెల్ల రాదేవీమందిరద్వారమున నిలిచి 'తల్లీ! తల్లీ!' అనియేడువనారంభించిరి; కాని దేవిమూర్తిమాత్రమిప్పటి యట్లు విముఖత్వమునొందియే యుండెను. అప్పుడు రెండుయామముల ప్రొద్దగుటచే నెండ వేఁడిమిమిక్కుటముగానుండెను. ఐనను నిరాహారులై యుండు నాజనుల రోదనధ్వనిమాత్ర మిసు మంతయునణఁగ లేదు. ఆసమయమున మెల్ల మెల్లన నడుఁగులిడుచు జయసింహుఁడువచ్చి రఘుపతితో నిట్లుచెప్పసాగెను. "స్వామీ! నే నొకమాటయైనను జెప్పుటకు వీలులేదా?" వెంటనే రఘుపతి తన చేయి యెత్తి, "వీలు లేదు, ఒకమాటయైన ననుటకు వీలులేదు." అనెను.

జయ.—"ఏమీ! ఇందున నేమియును నం దేహమునకుఁ గార ణమే లేదా?"

రఘు.—"ఏమియును లేదు" అని బిగ్గరగాఁ జెప్పెను.

జయ.—గట్టిగావిడికిలి బట్టి "ఏమీ! అందఱును దీనిని విశ్వసిం తురా?"

రఘు.—తీక్ష్ణములగు తనదృష్టిప్రసారములచే జయసింహుని నీఱు చేయునట్లు భీకరముగాఁజూచుచు, "ఔను" అని చెప్పెను.

వెంటనే జయసింహుఁడు తనగుండెలపైఁ జేయి వైచి కొని "నాగుండియ లవియుచున్నవి" అనిచెప్పి తత్క్షణమే యాజన సమూహమును దప్పించికొని యావలకేఁగెను.

---

## పదునాల్గవపరిచ్ఛేదము.

నేఁడాషాఢశుక్లచతుర్దశి. నేఁటిరాత్రియే పదునాలుగు దేవతలకును బూజామహోత్సవము జరగనున్నది. నేఁటియుదయము తాటితోఁపులనడుమనుండి బాలసూర్యకిరణప్రసారమంతటను వ్యాపించుచున్నది. మేఘావరణ మొకించుకయును లేదు. ప్రభాకరునిసువర్ణకిరణజాలముచే నావరింపఁబడి యానందమయమయియొప్పు నుద్యానవనమున కేఁగి జయసింహునిఁ దుపస్థితుండనై నంతన యాతనియాలోచనావిషయంబున నదినటకు జరగిన యంశములన్నియుఁ బ్రత్యక్షములయ్యెను.

మఱియు నీయుపవనమున నీశిలానిర్మితమగు మందిరమునఁ బాషాణరచితములయిన మెట్లనడుమ నీగోమతీతీరమున నీ విశాలవటచ్ఛాయయందును నా ఛాయాంతర్భాగములనుండి వ్రేలాడునూడలయందును దనచిన్ననాఁడాడుకొనిన యిసుంతయు సౌఖ్యావహమయిన యొకస్వప్నమువలె నాతనిమనస్సునఁ దోఁచెను.

మనోహరములై ప్రియములై చూడఁదగినవై చిన్ననాఁటనుండి స్నేహవితానము నల్లిన నాతరువితానము లాతనిఁ దమసన్నిధికి మరల రమ్మనిపిలుచుచున్నవి. వారి కాతనిమాత్రము ప్రత్యుత్తరము నొసంగుచున్నది. "నేఁ దిరిగితిరిగి యీావలకు వచ్చినాను. నే విడుదలచేయఁబడితిని. నే నిప్పుడు తిరిగి పోను." వజ్రశిలానిర్మితమగు నామందిరముపై సూర్యకిరణములు వ్యాపించుచున్నవి. మఱియు నామందిరమున కెడమవైపు

నంబడిన పొగడచెట్టునీడం దాండవమాడుచున్నది. చిన్నతనమున నాజయసింహుఁడామందిరమును జీవము గలదానిగా నెన్ను కొనుచుండెడివాఁడు. ఈసోపానములందేఁ గూర్చుండి యాడు కొనుచున్నప్పుడు సోపానములఁ బ్రియమిత్రములనియే తలఁచు చుండెడివాఁడు. నేఁటియుదయమునను సూర్యకిరణములచే నావ రింపఁ బడిన యట్టిమందిరమును సచేతన మనియు నట్టిసోపానము లను మిత్రములనియు ననుకొని చిన్ననాఁటిదృష్టినే యప్పుడును వినియోగించుచుండెను.

ఆయాలయములో భువనేశ్వరిని నేఁడు మరల నమ్మా!యని పిలుచుట కాత్మ తన్నుచ్చరించుచున్నది; కాని దుఃఖము తన మనంబునఁనిండి పొంగి పొరలివచ్చుచుండుటచే నట్లు లుచ్చరింప లేక పోయెను. మఱియు నాతనిరెండునేత్రముల నుండియు నశ్రుజలము వెల్లువయై రాఁదొడంగెను.

ఇంతలో రఘుపతి యచ్చటికి వచ్చు చుండెను. ఆతనిం జూచి జయసింహుఁడు కనులను దుడిచికొని గురువునకు నమస్క రించి నిలువఁబడి యుండెను.

రఘు—"నేఁడు పూజా మహోత్సవముజరవు సుదినము. నీవు దేవీపాదమును బట్టి యేమో ప్రతిజ్ఞ నేసితివి. జ్ఞప్తియం దున్నదా?"

జయ.—"ఆఁ! జ్ఞప్తియం దున్నది."

రఘు.—"ప్రతిజ్ఞాపరిపాలన మొనర్చెదవా?"

జయ.—"ఆఁ! తనుసెలవుప్రకారమే చేసెదను."

రఘు. — "కుర్తా ! ఆలోచించి సావధానముగాఁ గర్తవ్యము నొనర్పవలెను. ప్రమాదమునొందునేమో యని భయపడు చుంటిని. నీరక్షణమే మనంబున నిడి రాజునకును బ్రజలకు నన్యోన్యవిరోధము వృద్ధినొందించినాఁడను." జయసింహుఁ డూరక రఘుపతిముఖమును జూచుచుండెను. అతఁ డేమియుఁ బ్రత్యుత్తరము నీయలేదు. రఘుపతి యాతనిశిరమునఁ గరం బిడి "నాయాశీర్వాదముచే నీవు నీకార్యములను నిర్విఘ్న ముగఁ జక్కఁబఱుచుకొని జగదీశ్వరియాజ్ఞ నెఱవేర్పఁ గలవు" ఇట్లని రఘుపతి తనదారిని పోయెను.

ఆదినము మూఁడవయామమున నొకప్రదేశంబునఁ గూ ర్చుండి రాజుగారు ధ్రువునితోఁ బ్రసంగించుచుఁ గాలయాపన మొనర్చుచుండిరి. ధ్రువుని యాజ్ఞానుసార మొకసారి కిరీటమును దీసివేయుచు నొకసారి మరలఁ బెట్టుకొనుచుండెను. ఆనరేంద్రుని యిట్టిక్లిష్టవ్యాపారమును జూచి ధ్రువుండు నవ్వుచు వ్యాకుల మనస్కుఁడాయెను. ఆనరపాలుఁడు నవ్వుచు "నే నిట్లభ్యాస మొనరించుచున్నాను. ఎవనియాజ్ఞావశంబున నీముకుటము నిట్లు శిరమున ధరించుచుంటినో యాతని యాజ్ఞాబలంబున నీ ముకుటము తలనుండి యిట్లు తీసి వేయుచున్నాను. ఈముకుట మును ధరియించుటయుఁ గష్టమే ! దీనిని దీసివేయుటయు నంతకన్నఁ గష్టమే." అని పలికెను.

ధ్రువునిహృదయంబున నొకయూహ జనించెను. కొంత వడికూరకుండి తరువాత నరేంద్రునివదనము చూచి తనహస్తాం

గుళి నతని ముఖమునందునిడి "నీవు లాజవు" అని రాజశబ్దమున రేఫము నొక్కసారి తీసివేసియు ధ్రువుం డించుకేనియు విచారింపఁ డయ్యె. రాజు కట్టెదుట "లాజా! లాజా!" యని పలువురా ఉచ్చరించుచు నాతఁడు పరిపూర్ణానంద మగ్నమానసుండయ్యె. ఆభూపాలుం డది చూచి యాతని ధార్ష్ట్యమును సహింపలేక "నీవు లాజవు! ధ్రువుఁడా! నీవు లాజవు" అని పలికెను. ఈవివాదము తుదముట్ట లేదు. ఎవరి మాటయందైనను సత్యమిది యను సంశయము తేలలేదు. కేవలవాగాడంబరమునఁ గాలము గతించుచుండెను. తుద కాభూపాలుఁడు తన శిరోవేష్టనమును దీసి ధ్రువునిశిరంబున నిడెను. అప్పుడు ధ్రువుండేమియుఁ బ్రత్యుత్తరమీయలేకుండె. సంతోషమవడి పూర్ణమై యాశ్చర్యమనము నలంకరించెను. ఆశిరోవేష్టనమున ధ్రువుని ముఖమండల మర్ధభాగము కప్పఁబడియుండెను. ముకుటముచే నతిభారమైన తనశిరస్సు నెగురవైచుచు నాతఁ డారాజేంద్రు నిట్లని యాజ్ఞాపించెను. "ఏదియైన నొకకథ చెప్పుము." ఏమి కథయని రాజడుగఁగ నాతఁడు "అక్క చెప్పుచుండెడి కథను జెప్పుము" అనియాజ్ఞాపించెను. 'కథ' యనిన నాతని యభిప్రాయము లోకమునఁ దనయక్క చెప్పెడి కథ యనియే. హాసీ తన కేకథలను జెప్పినదో యవి తప్ప లోకమున వేఱొండుకథ లేవనియే యాతఁడనుకొనియెను.

అప్పు డారాజేంద్రుఁడు పురాణమందలి యొకపెద్దకథ చెప్ప నారంభించెను. "హిరణ్యకశిపుఁ డనునొక రాజుండెడివాఁడు." 'రాజా' యనునామమును వినినంతన ధ్రువుండు "నేనే లాజను"

అని తనశిరమునకు మిక్కిలి వదులుగా నుండి ముఖము నాక్ర మించిన ముకుటము నెగురవైచుచు హిరణ్యకశిపునిరాజ్యా మాతఁ డంగీకరింపఁడయ్యెను. సంతోషస్వాంతులైన సభాసదుల వలె గోవిందమాణిక్యరాయం డాకిరీటధారియగు ముద్దుబాల కుని సమాధానపఱువ నెంచి "నీవును రాజవు. హిరణ్యకశిపుఁడు ను రాజే" అనెను. ధ్రువుండు తనయనిష్టమును స్పష్టముగాఁ జెప్పనెంచి "కాదు నేనే లా(రా)జును" అని చెప్పెను. తుదకారా జేంద్రుఁడు "ఆ! నీవు లాజవు. హిరణ్యకశిపుఁడు లాజు కాఁడు. అతఁడు లాక్కసుఁడు. (రాక్షసుఁడు)" అని పలుకఁగా నామా టకు ధ్రువుండేమియు మాఱు చెప్పక తనయంగీకారమును సూచించెను. ఇంతలో నక్షత్రరాయం డాసభాభవనమునకు వచ్చి "రాజుగారియాజ్ఞయైనదని విని వచ్చినాను. తమయాజ్ఞానుసారము వర్తింప సంసిద్ధుఁడనై యున్నాను" అని పచించెను.

రాజు —"కొంచె మాఁగుము. ఈకథను ముగించుచున్నాను."

అని చెప్పి యారాజచంద్రుం డాకథను సమాప్తి నొందించె ను. "ధ్రువుఁడు, లాచ్చసుఁడు (రాక్షస) దుష్టుఁడు" అనుచు నీ యుదంతమునంతయు విని తసకంతయుఁ దెలిసిన ట్లంగీకారసూ చకములగుచిన్నెలతోఁ దనముఖకమలమును వికసింపఁజేసెను.

ధ్రువుశిరంబున ముకుటముండుట నక్షత్రరాయని కేమి యు నిష్టము లేకుండెను. నక్షత్రరాయని యనిష్టసూచకము లగు దృష్టులఁ బరికించినంతన యతిధైర్యంబున ధ్రువుండు "నే లాజు ను" అని చెప్పెను.

నక్షత్రరాయుం డది విని "ఛీ! ఇట్లుచెప్పుట కేవల మను చితము" అని పలుకుచు నాతని తలనుండి యామకుటమును దీసి నరపాలునిశిర మలంకరించుట కుద్యుక్తుఁడాయెను. మఱియు నతని యుద్దేశమును దెలుపుచు రాజుపై తనదృష్టిని బ్రసరింపఁ జేసి కేకలువైచెను. గోవిందమాణిక్యరాయ లది చూచి యా బాలునికి రానున్నయాపత్తును దొలఁగించి నక్షత్రరాయుల యు ద్యమమును మాన్పెను.

తరువాత నారాజచంద్రుఁడు నక్షత్ర రాయనిం జూచి "భ్రాతా! రఘుపతిఠాకూ రనుచితముగ నాకును బ్రజలకును బారవులు పుట్టిం చెను. నీవుస్వయముగాఁ బురిలోనికరిగి దీనియాథార్థ్యమునెఱింగి వెంటనే నాకెఱింగింపుము" అనెను. దేవరవారియాజ్ఞానుసారము వర్తించెదనని చిన్నరాయలు వెడలెను; కాని ధ్రువునితలపై నా కిరీటముండుట యాతనికేమియు నిష్టము లేకుండెను. ఇంతలోఁ బ్రతీహారివచ్చి "జయము, జయము, మహారాజా! ద్వారముకడఁ దమసెలవునకై ప్రతీక్షించుచు రఘుపతి యనుచరుండగు జయ సింహుఁడు వేచియున్నాఁడు. ముదలయయ్యేనేని వానిఁ బ్రవేశ పెట్టెదను" అని పలికెను. రాజుగా రాతనిరాకకు సమ్మతించిరి. వెంటనే యాతఁడు జయసింహుని రాజసన్నిధిం జేర్చెను. జయ సింహుఁడు సాష్టాంగముగా మహారాజునకు నమస్కరించి చేతులు జోడించి "స్వామీ! నేనిప్పు డతిదూర దేశగమనాభి లాషినై యుంటిని. నాకుఁ బ్రభువులును గురువులు నగు దేవర గారి యాశీర్వాదమును సేకరించుకొని వెడలిపోవఁ దమసమ్ముఖ మున కిట్లు వచ్చినాఁడను" అనెను.

రాజు.—"జయసింహా! నీ వెచ్చటి కరుగ నిశ్చయించుకొంటివి?"

జయ.—"ప్రభూత్తంసమా! నే నెచ్చటి కరుగుదునో నాకుఁ దెలియదు. కాన నేనెట్లు చెప్పఁగలను?" ఆరాజచంద్రుఁ డేమియూ పలుక నుద్యుక్తుండై యుండుటఁ గని జయసింహుఁడు "మహారాజా! దేవరవారీకీను నేమియు నాటంకపఱుపవలదని ప్రార్థించుచున్నాఁడను. మీ రాటంకపఱిచినచో నాకీప్రయాణము జయప్రదము కానేరదు. శుభాశీర్వదించి నన్నంపినచో నానందేహము లన్నియు నిర్మూలములగును. నాకష్టములన్నియుఁ బటాపంచలై పోవును. ప్రభువుగారివలె న్యాయపరిపాలకుండగు వేఱొకరాజేంద్రునినగరమును జేరి సుఖించెదను."

రాజు.—"నీ విప్పు డిప్పట్టణమును వీడఁ దలంచితివి ?"

జయ.—"నేఁటిసాయంకాలమే. రాజేంద్రా! నే నేఁగుటకు వేళయైనది. నే నాజ్ఞఁ దీసికొనుచున్నాఁడను." అని చెప్పి యతనికి మరలఁ బ్రణమిల్లి యాతని పాదరజంబును దనశిరంబునఁ దాల్చి యాతనిచరణసరోజంబులఁ దనయశ్రుధారలతో నభిషేకించెను. తరువాత లేచిపో నుద్యోగియైయున్న యాజయచంద్రునికడకు మెల్లమెల్లన నరిగి ధ్రువుం డాతని యుత్తరీయమును బట్టి 'నీవు పోవలదు' అని ధైర్యముగాఁ బలికెను.

జయసింహుఁడు నవ్వుచు నిలువఁబడి యాతని నెత్తికొని ముద్దాడి "నే నెవరిసన్నిధి నుందును ? నాకెవరు దిక్కు ?" అని వచించెను.

ధ్రువ.—"రాజును నేను" అనెను.

జయ.—"నీవు రాజరాజవు. నీవు నీప్రేమచే నెల్లర వశపఱచుకొం టివి." అని యాతని డించి యాసభాస్థానమునుండి బయలు వెడలెను. ఆరాజేంద్రుం డందుల కేమికారణమని కావలయు నతిదీర్ఘముగ నాలోచించుచు విచారించుచుండెను.

---

### పదునైదవపరిచ్ఛేదము.

నేఁడే చతుర్దశి. పయోధరము లాకాశంబున నల్లుకొని వచ్చుచున్నవి. చంద్రోదయమైనది. సగము వెల్తురు సగము చీఁకటియునై యున్నది. చందురుం డొకసారి ప్రకాశించుచుం డెను. మఱియొకసారి మేఘముల మాటున దాఁగికొనుచుండెను. కావుననే కొంతసేపు వెన్నెలయుఁ గొంతసేపు చీఁకటియు నై మనుజునికలిమిలేము లిట్టులే యుండునని కాలము బోధించుచు న్నట్లున్నది. గోమతీతీరమున నట్టి సుధాకరు నవలోకించుచుఁ దమయం దుండెడి యజ్ఞానాంధకారము నెగురఁగొట్టుకున్నట్టు లాంధ్యకులు నడుమనడుమ దీర్ఘములగు నిశ్వాసవాయువులను విడుచుచున్నారు. నేఁటిరాత్రి రెవ్వరును గృహములను దాఁటి యీవలకు రాఁగూడదని యాజ్ఞయైనది. రాత్రులయం దెవ్వరు తిరుగుదురు? అనియును గాక నేఁ డిట్టికట్టుపాటు కలిగినది. కావున రాజమార్గములు జనశూన్యములై మిక్కిలి విశాలములై యున్నట్లు తోఁచుచున్నవి. పత్తనమం దందఱును దమతమ గృహకవాటములను మూసి యర్గళములను బిగియించిరి. మార్గ

మందు రాజభటునిజాడ యెచ్చటను గానరాకున్నది. నేఁడు చోరులైనను దమయిండ్లనుండి బయలుకు రా సాహసింపలేదు. ఎవ రెచ్చటఁ గాలధర్మ మొందినను వారి బంధువులు శివజాగరము నొనర్చుచు నారాత్రి దహనాదికము లొనర్చుటకు వీలులేక సూర్యోదయమును బ్రతీక్షించుచుండిరి. తమ చిన్నిపాపలు రోగార్తులై గతింపకున్నను జననీజనకు లూరకుండవలసినదే కాని వైద్యుని బిలుచుటకైన సీవలకు రావీలులేదు. భిక్షమెత్తికొనుచు నహోరాత్రములు రోడ్లపై దొరలు కుంటిగ్రుడ్డివారలు గృహస్థులగోశాలలకుఁ బోయి నిద్రించుచుండిరి. ఇట్టి రాత్రియందు నక్కలును గుక్కలును మాత్రము వీథులలో నటునిటు దిరుగుచున్నవి. ఒకచిఱుతపులియు నొకపెద్దపులియు నొకగృహస్థుని గుమ్మముకడ నుండి రోజుచున్నవి. అప్పుడు మనుష్యులలో నొకవ్యక్తిమాత్రము వీథిలోనున్నది; కాని మఱి యెవ్వరును లేరు. వాఁడు నదీతీరంబున నొకఱాతిపైఁ దనకత్తిఁ బదనెక్కించుచునే మఱియేదియో యాలోచించుకొనుచుండెను. కత్తి కొంచెము పదనెక్కినది. కత్తి వాఁడియగుచున్న వెనువెంటనే యాతని మనోవిచారమునందును వాఁడి హెచ్చుచున్నది. కావున నింకనంత యావని ముగిసినది కాదు. ఖడ్గమా శిలను గొంచెము కొంచెముగాఁ దీసివేయుచు హింసాపరత్వమునఁ గావలయు నది 'హేస్ హేస్' అని ధ్వని చేయుచు వేఁడి మెక్కుచున్నది. ఆయంధకారమున నంధకారభార యట్టులే గతించుచున్నది. లోకమునుండి యంధకారమయములై రాత్రిసంబంధములగు జాములు నట్టులే గతించుచున్నవి. తలపై

నాకసంబున నల్లనిగొప్పమేఘములు నట్టులే పరుగెత్తుచున్నవి. వర్షము కురియ నారంభించెను.

వర్ష మంత కంతకు హెచ్చి ఏనుఁగు తొండము లంతలేసి ధారలుగాఁ గురియసాగెను. అప్పుడు జయసింహుని కాయానము హెచ్చెను. అంత నాతఁడు వేఁడియెక్కినకనకత్తి నోర నిడి లేచి నిలిచెను. పూజాసమయము సమీపించెను. అతనికిఁ దనశపథము స్మరణకు వచ్చెను. ఇప్పు డేమియాలస్యమొనరించి నను గార్యము మించిపోవును.

వేలకొలఁదిదీపములచే. నేఁడు మందిరము ప్రకాశమానమైయుండెను. త్రయోదశదేవతామధ్యవర్తినియై కాళికాదేవి మనుష్యరక్తపానమునకై నాలుకలు దీటుచుండెను. తక్కినపనివాండ్రను బొమ్మని రఘుపతి యొక్కఁడట్టె దేవీసమీపమునఁ గూర్చుండియుండెను. ఆతనికి ముందు పెద్దఖడ్గ మొంచుండెను. అది దీపములవెలుతురునఁ దళతళ యని వజ్రాయుధమువలెఁ బ్రకాశించుచు దేవ్యాజ్ఞను బాలించుటకై యెదురుచూచుచుండెను. రెండుయామముల రాత్రియైనందునఁ బూజాకాల మతిక్రమించుచుండెను. రఘుపతి యతివ్యాకులచిత్తుఁడై జయసింహునిరాకకై ప్రతీక్షించుచుండెను. గాలి యొక్కమాఱుగా జోరున వీవఁ జొచ్చెను. మునలప్రమాణములగు ధారలతో వర్షము కురియుచునే యుండెను. గాలివిసరున మందిరంబున నుండు దీపశిఖ లల్లలనాడుచుండెను. పెద్దతలవారున మెఱపులు గంతులు వైచుచున్నవి. పదునాలుగుదేవతల యొక్కయు రఘు

పతిరెయొక్కయు నీడలు చేతనములవలెఁ జలించుచు దీపపుఁబంక్తుల మీఁదను మందిరపుగోడలమీఁదను దాండవమాడుచున్నవి. ఒక శవముయొక్క శిరోభాగము గాలివిసరున నింటియందంతటను దొర్లుచుండెను. జీర్ణవర్ణ్యంబులభాతిని రెండు గబ్బిలము లా మందిరము దూఱి రెయొక్కనూఱు నెగిరిలిరుగులాడుచుండెను. వానినీడయును గోడలపై నాడుచుండెను.

రెండు యామములైనవి. అచ్చటచ్చట నక్కలకూఁతలు వినఁబడుచుండెను. వాని ననుసరించి గాలియును హాహాశబ్దాయమానమై రోదన మొనర్చుచుండెను. పూజానమయము మించినది. రఘుపతి యశుభభయంబునఁ దల్లడిల్లుచుండెను. ఆసమయమున మెఱపు మెఱసినట్లు జయసింహుఁ డంధకారమున బయలుదేఱి మందిరమునఁ బ్రవేశించెను. అధికాయాసంబున నాతని దేహము పరితపించుచుండెను. శరీర మందంతటనుండియు వర్షజలము జాఱుచుండెను. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసము లతితీవ్రగతిని వచ్చుచుఁ బోవుచుండెను. నేత్రములనుండి యగ్నికణము లురలుచున్నవి ; రఘుపతి యాతనిఁ బట్టుకొని చెవిఁ జేరి మెల్లన "రాజరక్తమును దెచ్చితివా?" అని యడిగెను.

జయసింహుఁ డాతనిహస్తమునుద్రోసివేసి పెద్దయెలుంగున "తీసికొనివచ్చెదను. రాజరక్తమును దెచ్చెదను. మీరు తొలఁగియుండుఁడు. నేను దేవినిఁ బ్రార్థించుకొనియెద." అతని యీవాక్యములతో నామందిరమంతయును గంపింప సాగెను. కాళికాసన్నిధి నాతఁడు నిలువంబడి "జగదంబికవైననీవు నిజ

ముగ బిడ్డరక్తమును పానముచేయుదువా? రాజరక్తమును ద్రాగినఁగాని నీదాహము తీఱదా? నేజన్మించినది మొదలు నిన్నుఁ దల్లి యని తలంచుచు గౌరవించుచుంటిని. నే నెవరి కేవిధమైన హానియును జేసి యెఱుంగను. వేఱొకయుద్దేశము నాకేమియును లేదు. నే నుత్తమక్షత్రియకులసంజాతుఁడను. రాజపుత్త్రుఁడను. నాముత్తాత రాజ్య మేలుచుండెడివాఁడు. నామాతామహావంశమువా రిప్పటికిని రాజ్యమును శాసించుచున్నారు. కావున నారక్తము నీసంతానరక్తమేకదా? రాజరక్తమే కదా?" అనుచున్నంతలో నాతని దేహమునుండి వల్లెవాటు జాఱినది. నడుముకట్టునుండి ఖడ్గమును (చురకత్తి) మెఱుపుమెఱయించు నటులతీసెను. ఒక్కపోటు నాతఁడు తనవక్షఃప్రదేశమున నాఖడ్గముతోఁ బొడుచుకొనెను. మృత్యుదేవతాకములగు నాలుగు దంతము లాతనియెద నాటినవి. అతఁడు హా యనుచు దేవీ పాదసన్నిధి నొఱగెను. పాషాణమయమగు నాదేవీవిగ్రహ మేమియును జలింపలేదు.

రఘుపతి గొల్లున లేచెను. జయసింహుని లేవనెత్తుటకుఁ బ్రయత్నించెను గాని కార్యములేకపోయెను. తుదకాతనిపైఁ బడెను. రక్తము చిమ్మనగొట్టములతోఁ జిమ్మినట్లులు శిలామయమగు నా మందిరము నెల్లఁ దడిపెను. ఒక్కొక్కటిగా దీపములన్నియు నాఱిపోయెను. ఆచిమ్మచీఁకటియం దా రాత్రి చాల భాగము వఱకొక్కప్రాణియొక్క శ్వాసమువచ్చుశబ్దమే వినిపించుచుండెను. రాత్రి మూఁడవజామున చల్లగాలి వీచుచుండెను.

నాలుగుమూలలజనులయులికిడి వినవచ్చుచుండెను. నాల్గవయా మమున మేఘములు చెదరుటచే వెన్నెల యాగృహమునఁ బ్రవే శించెను. చంద్రకిరణములు జయసింహుని వివర్ణముఖమునఁ బ్రసరించెను. పదునాలుగు దేవతావిగ్రహములు జయసిం హుని శిరస్సుపడినవైపు చూచు చున్నట్టు లుండెను. పక్షులు చహా, చహా యని శబ్దము చేయుచు నెగురుచుండెను. అప్పుడు రఘుపతి జయసింహుని మృతకళేబరమును విడిచి వెడలెను.

---

## పదునాఱవపరిచ్ఛేదము.

మహారాజాజ్ఞానుసారము ప్రజల కేల యనూయ కలి గెనో తెలిసికొనుటకై నక్షత్రరాయలు స్వయముగాఁ బ్రయ త్నింప నుదయమున బయలు వెడలెను. అతఁ డిట్లు విచారింప సాగెను. "నే నిప్పుడు దేవీమందిరమున కేలపోవలెను. రఘుపతి కడ కిప్పుడు నేఁబోయితినేని యతఁడు చంచలచిత్తుఁడు గావున నన్నెట్టులయినఁ దనమతమున దిగుమని నిర్బంధించును. కావున నచ్చటికిఁ బోవక యాతని కగపడక జయసింహునిగృహమును బ్రవేశింతును. జయసింహునివలన నీయుదంతమంతయు నున్న దున్నట్లు తెలిసికొననగును." అని నిశ్చయించుకొని మెల్ల మెల్లన జయసింహునిగృహమును బ్రవేశించెను. ప్రవేశింపఁగానే యచటినుండి తక్షణము పోవుట శ్రేయమని యాతనికిఁ దోఁచెను. జయసింహుని పుస్తకములు, వస్త్రములు మొదలగు నన్నివస్తు

వులు నాలుగుమూలలఁ జిందరవందరలై పడియున్నవి. గృహ మధ్యభాగమున రఘుపతి కూర్చుండి యుండెను. జయసింహుని జాడ యేమియుఁ గానరాలేదు. రఘుపతినేత్రము లగ్నికణముల ట్లతిభయంకరములై యున్నవి; జుట్టు వీడి యుండెను. నక్షత్ర రాయునిఁ జూచినతోడనే రఘుపతి లేచి యాతనిచేయి బలము గాఁ బట్టుకొని బలవంతముగా నేలఁ గూర్చుండఁబెట్టెను. మఱియు మిణుంగురులు రాలుతీన నేత్రములతో నాతనియవ యవముల నన్నిటిని దగ్ధము చేయువానివలెఁ జూచుచు వెఱ్ఱి వానిరీతి "రక్తమేదీ ?" అని యడిగెను. నక్షత్రరాయునిహృద యమున రక్తతరంగము లెగురఁ జొచ్చెను. మనంబు భయకంపిత మయ్యె. నోట నేమాటయు రాకపోయెను.

రఘు.—ఉచ్చైస్స్వరమున "రక్తమేదీ ? నీప్రతిజ్ఞ యేమైనది?" అని యడిగెను.

నక్షత్రరాయలు చేతులతోఁ బాదములను దులిపికొని యాతని కెడమదిక్కునఁ గూర్చుండి తనయుత్తరీయము చెంగు చేతితోఁ బట్టుకొని యాలోచింపసాగెను. అతని దేహము నుండి చెమ్మటసోనలు గాఱుచుండెను. కొంతతడవయ్యాటి పోవ "గురూజీ" అనునంతలో, రఘుపతి "ఈదినమున దేవి ఖడ్గమును స్వయముగా నెత్తుచున్నది. నేను నాలుగుదెసలను రుధిరప్రవా హములు వెడలుననుటకు సందియము లేదు. నేఁడు మీయెల్లర వంశమున నొకరక్తబిందువైన నుండదు. అప్పుడీనక్షత్రరాయుని భ్రాతృస్నేహమును జూచెదఁగాక." అని పలికెను.

నక్ష.—"భ్రాతృస్నేహము! హా! హా!! హా!!!" అని వివర్ణము ఖుఁడై నవ్వెను. పూర్వ మెవ్వఁడు నిట్టులు నక్షత్రరాయుని ముఖమునుండి నవ్వు వెల్వడలేదు. అతనికంఠ మెండి పోయినది.

రఘు.—"నేను గోవిందమాణిక్యరాయునిరక్తమును గోరలేదు. ఈసంసారమున నాతనికిఁ దనప్రాణముకన్నఁ బ్రియతరమైన వాఁడెవఁడో, యాతనిరక్తమును గోరుచున్నాను. అతనిరుధిర మునుబట్టి గోవిందమాణిక్యరాయునిశరీరమున నలఁదవలయు నని కోరుచున్నాను. దానివలన రాజుగారి యొమ్ము రక్తవర్ణ మగును. ఆరుధిరపుమచ్చ యెట్లును పోదు. ఇదిగో చూడుము. కన్నులు విప్పి బాగుగాఁ జూడుము!" అని చెప్పుచుఁ దన శరీరమునుండి కప్పుఁదీసెను. శరీరమంతయు రక్తముచేఁ బూయఁబడి యుండెను. యొమ్మున నొక్కొకచోట రక్తము చేరుకొనుచుండెను.

నక్షత్రరాయ లది చూచి యడలుకొనెను. అతని కాలు సేతులు వడఁకసాగెను. రఘుపతి వజ్రాయుధప్రతిమానమగు తన హస్తమున నతనిఁబట్టుకొని "వాఁ డెవ్వఁడు? గోవిందరాయునికిఁ బ్రాణముకంటెఁ బ్రియతరమైన వాఁడెవ్వఁడు? ఎవఁడు మృత్యు ముఖంబునఁ బడిన గోవిందరాయునిదృష్టికి లోకమంతయు శ్మ శానముపలెఁ గనుపట్టునో, మఱియు నాతనిజీవనాధార మెట్టు లగిరిపోవునో, శయ్యనుండి యుదయమున లేచునంతన యెవని మొగ మాతనిమానసముకురమునఁ బ్రతిఫలించునో, యెవనిని స్మరించుచు నాతఁడు నిదురపోవునో తనహృదయమురూపమైన

మందిరమున నెవ్వఁడు సంపూర్ణకళాశోభియై ప్రకాశించుచుం డునో, ఆతఁ డెవ్వఁడు? ఏమి? యాతఁడవు నీవేనా?" అని యిట్లు గర్జిల్లుచు భయముచే వడంకులేడిపిల్లను జూచువ్యాఘ్రిమువలె నాతని దెస నిరీక్షించుచుండెను.

నక్షత్రరాయలు ఖండితముగా "అట్టివాఁడను నేను గాను" అని చెప్పెను; కాని రఘుపతిచేయి విడిపించుకొనలేకపోయెను.

రఘు.—"నీవు కాకపోయిన వాఁడెవఁడో చెప్పుము."

నక్ష.—"మాణిక్యరాయలకుఁ బ్రాణాధికుండు ధ్రువుండు."

రఘు.—"ధ్రువుం డెవండు?"

నక్ష.—"వాఁడొక బాలుఁడు."

రఘు.—"నే నెఱుంగుదును. వాని నెఱుంగుదును. మహారాజునకు సంతానములేదు. వానిని దనపుత్త్రినిగా భావించి సంరక్షించుచుండెను. లోకులు తమసంతానము నెట్లు ప్రేమించుచుందురో యాసంగతి నేనెఱుంగను; కాని రక్షితసంతానమును దన ప్రాణముకంటె నెక్కుడుగఁ బ్రేమించు నుండురనుసంశయము మాత్రము నే నెఱుంగనిది కాదు. తనసంపత్తుల నన్నిటిని రాజేంద్రుఁ డాకుఱ్ఱనిసుఖమునకే యెక్కుడుగఁ బ్రేమించుచున్నాఁడు. తనయుత్తమాంగమునఁ గిరీటమును ధరించుటకంటె నాబాలునిశిరమున ముకుటముంచుటయే యతని కెక్కువ సంతోషదాయకముగా నున్నది.

నక్ష.—అధికాశ్చర్యయుక్తుఁడై "ఆమాట నిశ్చయము" అని చెప్పెను.

రఘు.—"నిశ్చయము కాకున్నచో నేమి? రాజాబాలునెంత వఱకుఁ బ్రేమించుచుండెనో నేఁ దెలిసికొనలేనా? నాచే నది తెలిసికొనఁజాలనిదా? నేను నదియే కోరుచున్నాను."

నక్ష.—"ఔను" అని రఘుపతిదెసఁ జూచుచుండెను. మఱియుఁ దనమనంబున నిట్లనుకొనెను. "నేను నదియే గోరుచున్నాఁడను."

రఘు.—"ఆకుఱ్ఱని దీసికొని రావలెను. నేఁడే తీసికొని రావలెను. ఈరాత్రి యవశ్యము వానిని దీసికొనిరావలెను." అనునంతన ప్రతిధ్వని తీరున నక్షత్రరాయలును,"నేఁటిరాత్రి యవశ్యము వానిని తీసికొనిరావలెను." అని పలికెను.

రఘుపతి యాతనిమొగమునఁ గొంతదనుకఁ దనచూడ్కి నిలిపి మృదుమధురభాషణముల నిట్లువన్యసించెను. "ఆబాలుఁడే నీకుఁ బరమశత్రుఁడు. ఏమి? నీవు నట్లే తలంచుచుంటివా? నీవు త్తమరాజవంశసంభూతుఁడవు. ఎక్కడనుండి యో కులగోత్రము తెలియంగనియపరిచితుఁ డొకబాలుఁడు మీయుత్తమాంగముల నలంకరించు మాణిక్యముకుటమును ధరింప వచ్చి యున్నాఁడు; అది నీవేమిగాఁ దలంచుచుంటివో? ఏ రాజసింహాసనము నీకై ప్రతీక్షించుచున్నదో, యట్టిసింహాసన మిప్పుడాబాలుఁ డధిష్ఠింప నిర్దేశమై యున్నది. కన్నులుండియు నీవిది తెలిసికొనలేవా?"

నక్షత్రరాయని కీమాటలు క్రొత్తవి కావు. ఇంతకుఁ బూర్వ మీయంశము లతఁ డాలోచించి నిశ్చయించుకొనినవే. "మీ

రేమియుఁ జెప్ప నవసరము లేదు. ఈసంగతులన్నియు నేనెఱుం
గనివి కావు" అని తొందరగాఁ జెప్పెను.

రఘు.—"అయినచో నింకేమి? వానిఁ దోడ్కొని రమ్ము. కంటక
ప్రాయుండగు వానిని సింహాసనదూరునిగాఁ జేయుదును. ఈ
దినశేషము నెట్టులో గతింపఁ జేసి నీవు వాని నెప్పుడు
తీసికొని వచ్చెదవు?"

నక్ష.—"నేఁటిసాయంకాలము. చీఁకటిపడినపిదప."

రఘు.—(కోపముతో) "నీవు వానిఁ దీసికొని రాకపోయినచో
బ్రాహ్మణకోపము నిన్నుచుట్టుకొనవేచియున్నదిసుమా! ఏము
ఖమునఁ బ్రతిజ్ఞ యొనరించితివో ప్రతిజ్ఞాపూర్తి యొనరింప
కున్నచో నాముఖమాంసమును మూఁడుదినములలోపల నే
గ్రద్దలు పొడిచిపొడిచి తినునని తెలిసికొనుము." అని
గద్దించి పలికెను.

ఆమాటలు విని యశం దనవ్యాకులతోఁ దనముఖమును
హస్తములతో మూసికొనెను. కోమలమైన తనముఖకమలమును
గ్రద్దలు పొడుచుననుమాట యతఁడు సహింపలేకపోయెను.
రఘుపతికి నమస్కరించి రాయలచ్చటనుండి వేగముగా సెలవు
దీసికొనియెను. ఆమందిరము వీడి మంచిగాలియును, వెలుతురును,
జనసమూహమును గలప్రదేశమును జేరి రాయలు పునర్జీవితుని
గాఁ దన్ను భావించుకొనెను.

---

## పదునేడవపరిచ్ఛేదము.

ఆ సాయంసమయమున నక్షత్రరాయనిం జూచి ధ్రువుండు "బాబూ! బాబూ!" అని పరుగెత్తుకొని వచ్చెను. తనచిన్నిచేతులతో నాతనికంఠమును గౌఁగిలించుకొని యాతనిగళమునగళమును మొగమున మొగము నుంచి ముద్దులొలుకునట్లుగా 'బాబూ' అని పిలిచెను. "నోరు మూసికొనుము. ఆమాటమాత్రమనకుము. నేను నీబాబును గాను" అని గద్దించెను. ధ్రువుం డంతదనుక నాతని నట్లులే పిలుచుచుండువాడుక. హఠాత్తుగాఁ దన్నట్లు పిల్వవలదనునామాట విని యాతఁడు నిర్విణ్ణుఁ డయ్యెను. కొంతవఱకు బాలుఁ డతిగంభీరముగా మౌన మవలంబించెను. తరువాత నక్షత్రరాయనివదనమునఁ జూడ్కి నిలిపి "ఐన మఱి మీరు నాకేమయ్యెదరు?" అని ముద్దుముద్దుగా నడిగెను. అంత నక్షత్రరాయలు "నేను నీకు బాబునుగాను" అని చెప్పెను. ఆమాట విని యాబాలుఁడు పకపకనగియెను. ఇంత యసంబద్ధపుఁబలుకు నాతఁ డింతవఱకు వినియుండలేదు. నవ్వుచు మరల "మీరు నాకు బాబుగారగుదురు?" అని రాయ లెంత నిరోధించుచుండెనో యంత పట్టుదలతో నా బాలుఁడును బలుకసాగెను. "మీరు బాబుగారే" అని మఱియు నవ్వుచుండెను. అంతకంత కాబాలుని నవ్వధికమగుచుండెను. ఒక్కొక మాదిరిగా రాయలను జూచుచు నవ్వుచు 'బాబూ' అని పిలుచుచునే యుండెను. అంత నక్షత్రరాయ లాధ్రువుని

జూచి "ఓరీ! నీయక్కను జూడఁబోయెదవా?" అని యడిగెను. వెంటనే యాబాలకుండు రాయలగళమును వీడి "అక్క యెక్కడ నున్నది?" అని యాతురతతో నడిగెను.

నక్ష.—"దేవీసన్నిధానమున నున్నది."

ధ్రువ.—"దేవి యెచ్చటనున్నది?"

నక్ష.—"దేవి యొకచోట నున్నది. నేనచ్చటికి నిన్నుఁ దోడ్కొని పోఁగలను."

ధ్రువ.—"చేతితోఁ జప్పట్లుకొట్టుకొనుచు "బాబు! నన్నిప్పుడు తీసికొనిపోయెదరు?"

నక్ష.—"ఇప్పుడే."

ధ్రువుం డతిసంతోషంబున గంతులు వైచుచు "మాయక్కను జూచెదను." అని పాటలు పాడుచు రాయలకంఠమును మరలఁ దనమృదుహస్తములతోఁ బట్టుకొనెను. నక్షత్రరాయలాబాలుని జంకనిడికొని శాలువను గప్పి గుప్తద్వారమున బయలునకుఁ దీసికొనిపోయెను.

నేఁటిరాత్రియుఁ బురవాసులు తమగృహములవీడి వీథిలోనికి రాఁగూడదని నిర్ణయింపఁబడెను. ఇందుచేతనే పురవీథులయందు గస్తితిరుగువారును లేకుండిరి. బాటసారు లెవ్వరును లేరు. ఆకసంబునఁ బూర్ణచంద్రుఁడు విరాజిల్లుచుండెను. నక్షత్రరాయలు దేవీమందిరమున కరిగి ధ్రువుని రఘుపతిచేతికీయఁ దలంచుచుండెను. రఘుపతిని జూచి యాబాలుఁడు రాయలకంఠమును మఱింత గట్టిగాఁ బట్టుకొనియె. రఘుపతియు

నాతని బలాత్కారముగా రాయల కౌఁగిలినుండి వేఱుపఱచెను. ధ్రువుండు 'బాబూ' అని పిలుచుచు నేడువసాగెను. రాయల కన్ను లశ్రుజలపూరితములయ్యెను. తన దయాహృదయ మా రఘుపతికడ నెఱింగింప నాతఁడు మిగుల లజ్జించుచుండెను. ఆబాలు నాతని కధీనునిఁ జేసెను. నిజముగా నాతనిహృదయము పాషాణనిర్మితముగా నున్నఁదగినదే. బాలకుం డేడ్చుచు "అక్కా, అక్కా, ఎక్కడనున్నది? ఎక్కడనున్నది?" అని పలుమాఱు లడుగఁ జొచ్చెను. ఆమె ఎక్కడనున్నది? అని రఘుపతివజ్రకాఠిన్యమును మీఱు తన కంఠస్వరమున నాతని యదలించెను. భయముచే నాబాలునిరోదన మాఁగిపోయెను. అట్టులుండి యుండి యాతఁ డాడుకొనఁజొచ్చెను. చతుర్దశదేవతాసముదాయ మున్నదున్నట్టులు చూచుచుండెను.

గోవిందమాణిక్యరాయలు మధ్యరాత్రియందుఁ దన స్వప్నమున రోదనధ్వనివిని యులికిపడి లేచెను. క్రిందనుండి 'మహారాజా! రాజేంద్రా!' అని దీనస్వరమున నెవ్వరో పిలుచుచున్నట్టులు వినవచ్చెను. తత్క్షణమే లేచి యారాజచంద్రుఁడు వెన్నెలలోనికి వచ్చి ధ్రువుని పిన్నతండ్రియగు కేదారేశ్వరునిగా నెఱింగి "ఏమి జరిగినది?" యనెను.

కేదా.—"రాజచంద్రమా! నాబాలుఁడు ధ్రువుఁ డేడీ?" నేఁడు పగలు మూఁడవయామమున నాబాలుఁ డీగృహంబున లేకుండుటచూచి నేను వెదకుచుండఁగా నక్షత్రరాయనిసేవకుఁడు "బాలుఁడు మారాజుగారియొద్దనున్నాఁ"డని చెప్పెను. ఆమాటవిని నే నిశ్చింతతో నూరకుంటిని.

రాత్రి యతికష్టమున విచారించుచుండఁగా నామనంబున సంశయ ముత్పన్నమైనది. వెంటనే నక్షత్రరాయ లెచ్చట నుండెనో విచారింపఁగా నాతఁడు దనసౌధంబున లేఁడని తెలిసినది. ప్రభువు గారి కీసంగతి తెలియఁజేయువలె నని యెన్నిసార్లు చెప్పినను ద్వారపాలురు వినుపించుకొనరైరి. అందుచే నేనే 'కిటికీ క్రిందిభాగమునుండి ప్రభువుగారిని మేలుకొలిపితిని. నాయీయపరాధమును క్షమింపవలయునని వేఁడుకొనుచున్నాను" అని విన్నవించెను.

మాణిక్యరాయలబుద్ధిని మెఱపుమెఱసినట్లు లోకయూహ స్ఫురించెను. నలుఁవురు పహరాదవానులను బిలిచి "ఖడ్గములను ధరించి మీరు నావెనువెంట రండు." అని యాజ్ఞాపించెను. ఆనలుఁవురిలో నొకఁడు "మహాప్రభూ! నేఁటిరాత్రి వీథిలోని కివ్వరును బోఁగూడదు గదా!" అనెను.

రాజు.—"నే నాజ్ఞ యిచ్చుచున్నాను." అని చెప్పి తనవెంట రానున్న కేదారేశ్వరుని మహాలున కరుగ నాజ్ఞయిచ్చి తక్కిన వారలను జనశూన్యమగు నామార్గమున వెన్నెలకు మఱుగుపడి దేవీమందిరమున కరుగఁ దనతో రమ్మని చెప్పి బయలుదేఱి యాప్రదేశమును జేరెను.

మందిరకవాటము తెఱవఁబడెను. అందు రఘుపతియు నక్షత్రరాయలును దగ్గఱ ఖడ్గము నిడుకొని మద్యపాన మొనర్చుచుండిరి. తేజోవంతములగు దీపములు లేక యొకచిన్నదీపము మాత్రము వెలుఁగుచుండెను. "ధ్రువుం డెచ్చటనున్నాఁడు?

ఆబాలుఁడు దేవీసన్నిధిని బండుకొని నిదురించుచుండెను. ఆతనిగళ మున నశ్రుజలములచేఁ గట్టిన మచ్చ యెండియుండెను. నిద్రావశంబున నధరోష్ఠము తెఱవఁబడియుండెను. మొగమునందు భయచిహ్నము లేవియును గానరావు. ఏమియును బ్రమాదము కలుగలేదు. నిజముగ నతఁడు శిలామయమగు శయ్యపై నిద్రింపలేదనియుఁ, దనయక్క యొక్క కౌఁగిలిలో నిద్రించుచుండెననియు, నుద్గాడి యతని కన్నీళ్లామె తుడిచివేసి యుండవచ్చుననియు నూహింపవచ్చును.

మద్యపాన మొనరించినంతన నక్షత్రరాయనిమానస్సు వికసించెను (అనఁగా నతఁడు నిషాలో మునింగియుండెను). రఘుపతి యో యతిజాగరూకతతోఁ బూజానమయమును బ్రతీక్షించుచుండెను. నక్షత్రరాయని పకపకనవ్వులయం దాతని కేమియును ధ్యానము లేదు. నక్షత్రరాయలు నవ్వుచు “పురోహితమహాశయా! సీమనంబున నీవు భయము ననుభవించుచుంటివి. మఱియు నేనును భయపడుచుంటి ననుకొనుచుంటివి. నిజముగ నాకేమియును భీతిలేదు. భీతి యెందువలన? ఎవనికిభయము? నేను నిన్ను రక్షించెదను నేను రాజుగారికడ భయపడుచుంటిననియా నీయభిప్రాయము? నే శాహాశుజా వలననైన భయమొందను. నీవేలమాటలాడవు? నేరాజును బట్టి తెచ్చెదను. దేవిని ప్రసన్నురాలిఁగాఁ జేసెదను. ఇట్టిచిట్టిపావనినెత్తు రేపాటి యగును?” అని మాటలాడఁ జొచ్చెను.

ఆసమయమున హఠాత్తుగా మందిరముయొక్క గోడపై నితరులనీడ పడెను. నక్షత్రరాయం డది చూచి తటాలున వెను

కకుఁ దిరిగి చూచెను,—రాజుగారు!!. నిషాదుండును నొక్క-మాటుగా పరాయనుయ్యెను. గోడపైఁ బ్రసరించిన నీడ యెవరిదని మఱిచూడనక్క-ఱ లేకపోయెను. తనఛాయయు సంకుచితమయ్యెను. గోవిందమాణిక్యరాయ లతిత్వరితముగాఁ బోయి దేవీసన్నిధి నున్నధ్రువుని లేవనెత్తి యెత్తుకొని, "ఈయిరు వురిని ఖైదీలనుగాఁ బట్టుకొనుఁడు." అని జవానుల కాజ్ఞ యిచ్చెను. వెంటనే వార లాయిరువురిచేతులను బంధించిరి. ధ్రువుని దన భుజమ్మున నమర్చుకొని జనశూన్యమగు దారిని వెన్నెలయుండుఁగున బయలుదేఱి తనమహలునఁ బ్రవేశించెను. రఘుపతియు నక్షత్రరాయలును నాఁటిరాతిరియంతయు గారా గృహమునఁ గడపిరి.

---

## —— పదునెనిమిదవ పరిచ్ఛేదము. ——

ఆబాలఘాతకులయభియోగము నేఁడే విచారింపఁ బడును. దర్బారున జనులు గుంపు గుంపులుగా వచ్చి చేరిరి. ఆకేసు విచారణ చేయుటకై నరేంద్రచంద్రుఁడు న్యాయస్థాన మున సింహాసనాసీనుఁడై విరాజిల్లుచుండెను. సభాసదులు నలుగడలను నిండియుండిరి. రాజసన్నిధి నపరాధు లిరువురును నిలువఁబడియుండిరి. ఎవరిహస్తములను నాయుధములు లేవు. ఖడ్గపాణులై సిపాయీ లాయపరాధుల యిరుప్రక్కలను నిలిచి యుండిరి. రఘుపతి శిలావిగ్రహమువలె నిలువఁబడి యుండెను. నక్షత్రరాయలు తలవంచుకొని నిలిచియుండెను.

రాజేంద్రుఁడు రఘుపతిచేఁ బ్రమాణవాక్యములు చెప్పించి "నీ వేమి చెప్పుకొనియెదవు." అని యడిగెను.

రఘు.—"నన్ను విచారించుటకు మీ కధికారము లేదు."

రాజ.—"ఐన మఱెవ్వరు తమ్ము విచారించువారు?" అని ప్రశ్నించెను.

రఘు.—"నేను బ్రాహ్మణుండను. దేవీభక్తుఁడను. నన్ను దేవియే విచారించును."

రాజ.—"పరమేశ్వరుఁ డందఱిని విచారించుచునే యుండును. మేము న్యాయవిచారణమున నాతని నవలంబించువారము. మాచేతనే యాతఁ డపరాధులను శిక్షింపఁజేయుచుండును. పాపులను శిక్షించుటకును బుణ్యులను రక్షించుటకు నాతని యనుమతి ననుచరులు చేనవేలీపురమిని గలరు. నేనందున నొకఁడను. ఆతనియాజ్ఞానువర్తినై నీమీఁద నెక్కువ శిక్ష విధింప నే నిచ్చగింపను. నేనింతియే యడుగుచున్నాను. నిన్నటిసాయంకాలము దేవీబలికై యొకశిశువుని ఖండింప సిద్ధపడితివా? లేదా?" అని యడిగెను.

రఘుపతి.—"ఆ! ఔను!"

రాజ.—"నీ వపరాధివైనట్టు లంగీకరించితివిగదా?"

రఘు.—"అపరాధ మపరాధ మనుచుంటివి. అదియెట్టులు? నే దేవియాజ్ఞను బాలించుచున్నాను. దేవీకృత్యమును నెఱ వేర్చుచున్నాను. దానికి నీ వభ్యంతరపెట్టుచుంటివి. కావున

నీవే యపరాధివి. నేను దేవీప్రతినిధిని. నీయం దపరాధము నిలుపుచున్నాను. ఆమెయే నీయపరాధమును విచారింపఁ గలదు." అని ప్రత్యుత్తరమొసంగెను. రాజాతనిమాటల కేమియు మాఱుపలుకక 'నానియమ మిది. ఎవఁడు దేవికై బలి యిచ్చెద నని జీవహింస చేయునో, లేక హింస చేయ నుద్యమించునో, వాని నీదేశమునుండి వెడలఁగొట్టవలయును.' అని శిక్ష మీకిప్పుడు విధింపఁబడినది. ఎనిమిదివత్సరములు నీ కీనిర్యాసనశిక్ష విధింపఁబడినది. శత్సంఘమువారు నిన్నిచ్చట నుండి తీసికొనిపోయి ద్వీపాంతరమున విడిచివచ్చెదరు.

సిఫాయిజన మతనిని దర్బారునుండి వెలుపలకుఁ బంపించుటకు నంసిద్ధులై యుండిరి. రఘుపతి వారిని "నిలువుఁడు." అని యదలించి ప్రభువుగారిదెసఁ జూచి, "నీవు విచారించుట పూర్తియైనదికదా. నేనిప్పుడు నిన్ను విచారణచేయుచున్నాను. సావధానమనస్కుఁడవై యాలకింపుము. పదునలుగురు దేవతలపూజ జరగుచుండు నీరెండురాత్రుల నెవ్వఁడు వీథిలోని కరుగునో వాఁడు పురోహితుని సమక్షమున శిక్షింపఁబడును." అని నామందిరముయొక్క నియమము. పురాతనమైన యీనియమము ననుసరించి, నాయెదుటను నీవు శిక్షార్హుండవైతివి."

రాజా.—"నీవానరించుదండనకు నేను బద్ధుండనై యున్నాను." అనెను.

"ఈయపరాధమునకుఁ గేవల మొక్కఁజరిమానా విధింపఁ బడియున్నది." అని సభాసదులు నుడివిరి.

రఘు.—"సరియే. దీనికి రెండులక్షలరూపికల నపరాధమును విధించినాఁడను. నీ వవి మాకిప్పుడే చెల్లింపవలెను."

రాజు.—కొంచె మాలోచించి "తథాస్తు" అని కోశాధ్యక్షుని బిలిపించి రెండులక్షలరూపాయీలను వీరిద్వారా యిచ్చి వేయవలెనని యాజ్ఞాపించిరి. రాజకీయసంఘమువారు రఘుపతిని దీసికొనిపోయిరి.

రఘుపతివెడలినతరువాత నక్షత్రరాయలం జూచి రాజేంద్రుఁడు "ఏమి నీయపరాధము నొప్పుకొనియెదవా? లేదా?" అని యడిగెను.

నక్ష.—"రాజేంద్రా! నేను నిజముగ నపరాధినే. తమరు క్షమింపవలయునని ప్రార్థించుచున్నాఁడ" నని పరుగెత్తికొనిపోయి యాతనిపాదపద్మములపైఁ బడెను.

మహారాజుగారి మనస్సు కొంచెము చలించెను. కొండొకతడ వాలోచించి తనమనస్సును దృఢపఱచుకొని "నక్షత్రరాయా! లెమ్ము. నామాట వినుము. క్షమించుటకు నే నెవ్వఁడను? నియమము నతిక్రమించి యడుగిడుటకు నాశక్యము కాదు. అపరాధి చట్టమున కెట్లు బద్ధుఁడో న్యాయాధిపతియు నట్టులే బద్ధుఁడై యుండక తప్పదు. నేరమొక్కటియే, ఒకరిని దండించి యొకరిని మన్నించుట న్యాయమా? నీవే విచారింపుము." అని పలికెను.

సభాసదులు లేచి, "రాజోత్తమా! నక్షత్రరాయలు మీకు సోదరుఁడు; ఈతని మన్నింపుఁడు." అని విన్నవించిరి.

రాజు.—ఉచ్చైస్స్వరమున "మీరెల్ల రూరకుండుడు. ఎంత వఱకు నేనీయాసనమునఁ గూర్చుండి యుందునో యంత దనుక నాకెవ్వఁడు సోదరుఁడు లేఁడు. మిత్రుఁడును లేఁడు." అని చెప్పెను.

సభాసదులు పలుదెసల నిశ్శబ్దముగా నూరకుండిరి. రాజేంద్రుఁ డిట్లుతీర్పు చెప్పసాగెను. "మీరెల్లరు సావధానచిత్తులై యాలకింపఁవలెరిగదా! ఎవఁడు దైవికి బలియని జీవహత్య చేయునో, చేయఁ బ్రయత్నించునో, వాని నీదేశమునుండి వెడలఁగొట్ట వలయునని చట్టము నియమింపఁబడియున్నది. నిన్నటిరాత్రి రఘుపతితోఁ గలిసి నక్షత్రరాయలు షడ్యంత్రవిధిని దేవికి బలిగా నొకబాలకునిఁ జంపఁ బ్రయత్నించెను. ఈయపరాధ మీతని పై నిశ్చయింపఁబడినది; కావున నెనిమిదివత్సరము లీతనికి ద్వీపాంతరవాసము విధింపఁబడెను."

ఈమాటలు వినినంతన రాజకీయోద్యోగులు నక్షత్రరాయని దోడ్కొనిపోవ నుద్యుక్తులైయుండ, మాణిక్యరాయలు గద్దియ దిగి తమ్ముని గౌఁగిలించుకొని గద్గదకంఠుఁడై "ప్రియసహోదరా! ఈశిక్ష నీకొక్కనికే కాదు. నాకుగూడ నీశిక్షయుందలి ఫలమున్నది. పూర్వజన్మమం దేమి యొనర్చితిమో తెలియదయ్యె. నీవెంతకాలము మమ్మెల్లర విడిచి ద్వీపాంతరమున నుండుదువో అంతకాలము జగదీశ్వరి నిన్ననుసరించుచు నీకు శుభములనిచ్చుచుండుఁగాత." అనునంత నీయుదంతి మంతటను వ్యాపించుటచే మహాలులోనుండి రోదనధ్వనులు వినవచ్చెను.

రాజుగారొక్కగదిలోఁ దలుపుమూసికొని కూర్చుండిరి. వాఁడియు నంజలిశిరంబునఁ గీలించి, "హేమహాప్రభూ! జగదీశ్వరా నేనిం దేమైననపరాధ మొనర్చితినా! నన్ను క్షమింపవలదు. నాపై నించుకంతైన దయచూపింపవలదు. నాపాపమునకై నన్ను శిక్షింపుము. పాపమునకు శిక్ష విధించిన నాభార మెట్టిదయిన వహింపవచ్చును గాని క్షమించినచో నాభారమింతమాత్రము సహింపలేను." అని పరమేశ్వరుని బ్రార్థించుచుండెను. నక్షత్రరాయలయం దాతనిమనంబునఁ బ్రేమ యధిక మగుచున్నది. తన తమ్ముని జిన్ననాఁటిముద్దుమొగ మాతనికి జ్ఞప్తికివచ్చెను. తమ్ముని యాటపాటలు, ముద్దుమాటలు, పనిబాటు లొక్కొక్కటిగా నాతనిహృదయమునఁ బ్రతిఫలింపఁ జొచ్చెను. పగలు సూర్యుని వెలుఁగునను రాతిరి వెన్నెలలోను తమ్ముని త్రిక్కొని తిరుగుచుండు తనరూపము తనహృదయాంతరాళమునఁ గానవచ్చెను. ఇంతిం తనరానిదుఃఖముపొంగి కన్నులు బాష్పజలపూరితములయ్యెను.

---

## పందొమ్మిదవపరిచ్ఛేదము.

రఘుపతి దేశాంతరగతుండగుటకు సంసిద్ధుఁడయ్యెను. రాజకీయుఖులు లాతని "మీరే దిక్కునఁ బోయెదరు?" అని యడుగఁగా నతఁడు 'పశ్చిమమును' కని ప్రత్యుత్తర మొసంగెను. వారాతనితోఁ బ్రయాణము సాగించిరి. పశ్చిమమార్గమున నట్లు తొమ్మిదినములు నడిచినపిదప వారు ధారానగరమున రఘు

వతిని విడిచి తమనగరమునకు మరలిరి. రఘుపతి తనమనంబున నిట్లని వితర్కింప నారంభించెను.

"కలియుగమున బ్రాహ్మణశాపములు ఫలింప నేరవు. విచారించినచో బ్రాహ్మణునిబుద్ధిచే సేవని చేయనగును? గోవిందమాణిక్యరాయ లెట్టిరాజు? నే నెట్టిపురోహితుఁడను?"

త్రిపురానగరమున మొగలురాజ్యతంత్రము లేవియు వ్యాపింప లేదు. కావున రఘుపతి ధారానగరంబున కరిగి మొగలులరీతినీతులను రాజ్యతంత్రములను దెలిసికొన నుద్యుక్తుం డయ్యెను. ఆసమయమున మొగలుషాదుషా షాజహాను రాజ్యమును బాలించుచుండెను. అతనిమూఁడవకుమారుండగు ఔరంగజేబు దక్షిణపుదిక్కున నున్నబీజపురముమీఁద దండెత్తి పోయెను. ఆతనిరెండవ కుమారుఁడగు శుజా, బంగాలున సుబేదారుగా నుండెను. శుజా రాజధాని రాజమహాలు, చక్రవర్తిపుత్రులలో నందఱికంటెఁ జిన్నవాఁడగు మురాదును, గుజరాతును బాలించుచుండెను. పెద్దకుమారుఁడును భావిచక్రవర్తియు నగుదారా ఢిల్లీపట్టణముననే నివసించుచుండెను. అప్పుడు చక్రవర్తి వయస్సుఱువదితొమ్మిది వత్సరము లయియుండెను. ఆతనిశరీరమున నస్వస్థతగా నుండుటచేత నతఁడు నిర్వహింపఁదగిన సమస్తరాజ్య భారము దారాపైఁ బడెను. రఘుపతి కొన్నిదినములవఱకు ధారానగరమునుండి ఉరుదు భాష నభ్యసించెను. అటుతరువాత రాజమహాలువైపునకుఁ బ్రయాణ మయ్యెను. రాజమహాలును బ్రవేశించినప్పుడు హిందూస్థాన

ములో నొకకలవరము దయించెను. షాజహాను మరణావన్నుఁడై యుండె నను వార్త యంతటను వ్యాపించెను. ఈయుదంతమును వినినంతన శుజా సేనలనన్నిటినిఁ దీసికొని ఢిల్లీనగరమున కతిత్వరితమునఁ బ్రయాణము సాగించెను. చక్రవర్తితనయులు నలువురును షాజహానుతలపైనుండి చక్రవర్తిత్వము నెగురఁగొట్టి యపహరింపఁ బ్రత్యేకముగాఁ బ్రయత్నములు చేయుచుండిరి.

బ్రాహ్మణుఁడగురఘుపతి శుజా లేనిరాజమహాలును శీఘ్రముగా విడిచి శుజావెనువెంటనే బయలుదేఱెను. అతఁడు తన తోఁగూడ నున్నవారి నంపి వేసెను. పిమ్మటఁ దనకడ నున్నరెండు లక్షలరూపికలను రాజమహాలునకు సమీపమున నున్నయడవిలో నొకస్థలమునఁ బాతిపెట్టి కప్పివేసెను. మఱియును దానిపై నొకగుఱుతు నిడెను. తనవెచ్చములకుఁగాఁ గొంతధనమును గైకొనెను. ఆవలకు శుజాసైనికులచేఁ దగులఁబెట్టఁబడిన యిండ్లను, జనశూన్యములగు గ్రామములును, నాశనము చేయఁబడిన పరిపాలములను జూచుచు వారు పోయినమార్గ మిద్దియే యని నిశ్చయించి యాదారిని సన్యాసివేషమును ధరించి ప్రయాణము సాగించెను; కాని సన్యాసివేషముధరించినను నతని కన్నపానములు దొరకుట కతికష్టమాయెను. ఏలయన: శుజాసైన్యములు చిందఱవందఱగా నాదారిని గొల్లకొట్టుటచే నిరుదెసల నన్నము లభించుట దుర్ఘటముగా నుండెను. సైనికులు సస్యములను మొదలంటఁ గోసి గుఱ్ఱములకు నేనుఁగలకును వేసియుండిరి. కర్షకులకొఱకుఁ గొంచె మయినను ధాన్యము మిగుల లేదు.

నలుగడలు కొల్లపెట్టుటచే వ్యవసాయమునకు మిగుల దీనస్థితి వచ్చెను. గొప్పగొప్పవారందఱు గ్రామములను వీడి పలాయితు లయిరి. ఒకరినొకరాధారము చేసికొని యెచ్చటనైన నొకరిద్ద ఱున్నను వారిముఖముల నౌదాసీన్య మావహించెను. మంద హాసము మందునకైన లేదు. వారందఱు చకితహరిణములవలె నిశ్చేష్టితులైరి. ఎవ్వరియందును వారికి నమ్మకము లేకుండెను. ఎవ్వరిమీఁదను వారికి దయాలేశమైనను లేకుండెను. జనశూన్య మగు నొకమార్గమున నొకచెట్టుక్రింద నలుగురైదుగురు చేతు లతో లాటీలను బట్టుకొని కూర్చుండి యుండునట్లగపడుచుం డెను. వారాబాటను బోవువారికొఱకై దినము తయును గాచు కొనియుండిరి. ధూమకేతువు వెనుకనుండు నుల్కారాసులవలె దొంగలు సేనలుపోయిన వెనువెంట బయలుదేఱి దోపిడికి మిగిలిన సొత్తును దోఁచుకొనుచుండిరి. కోడిపిల్లలనుబట్టుటకై గ్రద్దలకును గుక్కలకును బోట్లాటజరగునట్లు నడుమనడుమ నాదొంగలకును సైనికులకును యుద్ధము జరగుచుండెను. నిర్దయాత్వము సైనికుల కాటనస్తువుగా నుండెను. దీనులై సైనికులబాధలు పడలేక స్త్రీలు తప్పి మార్గముల కిరుదెసలను బడియుండు వారిపొట్టలపై ఖడ్గములతోఁ బొడుచుటయును, వారిగుడ్డల నూడఁబెఱికి నిలువు గాఁ గత్తులతోఁ జీలుటయును సైనికులకుఁ గ్రీడా విలాసములు గా నుండెను. పట్టణములందుండువారాదండును జూచి భయ భ్రాంతులగుచుండిరి. అది చూచినవారు మిక్కిలి యానందము నొందుచుండిరి. కొల్లగొట్టుటకు ముందు వర్తకులను నగరీకుల బాధించుచు మనంబుల గలంచుచుండిరి. గౌరవవంతులను నిరు

వుర బ్రాహ్మణులవీథులపై నెక్కి సవారిచేయుచుండిరి. గుఱ్ఱలను బట్టి వారినాసికలయందు గాటగునస్యమును బోయుచుండిరి. రెండు గుఱ్ఱములపై నొక్కని నెక్కించి గుఱ్ఱములను గొరడాలతోఁ గొట్టి పరువెత్తించుచుండిరి. ఆరెండుగుఱ్ఱములను రెండువైపులకుఁ బరువెత్తించుటచే దానిపై నెక్కింపఁబడినవాఁడు నేలఁ గూలి కాలుసేతులు విరిగి బాధపడుచుండెను. ఆసైన్య విల్లు ప్రతిదినమును గ్రొత్తక్రొత్తయాటలను గల్పించుకొని వినోదించు చుండెను. వారు నిష్కారణముగాఁ బల్లెలన్నింటినిఁ గాల్చి చేయు చుండిరి. ధామపాగారిగొరవార్థ మిట్లగ్నిలీలలు గావించుచుంటి మనిచెప్పసాగిరి. మార్గమందంతట నాసైనికదురాచారములచిన్నె లగుపడుచుండెను. ఇట్టిప్రదేశములలో మనరఘుపతి కేవ్వరాతిథ్య మిత్తురు? కొన్నిదినము లుపవసించుచుఁ గొన్నిదినములు గొంచెమేదియోనిఁ దినుచు నతఁడు కాలమును బుచ్చుచుండెను. ఒకనాఁటిరాత్రి చీఁకటిలో జనశూన్యమై శిథిలమైన యొకమం దిరమున నాతఁడు శయనించినిద్రించెను. ఉదయమున నతఁడు లేచి చూచునప్పటికిఁ దనకుఁ దలగడగాఁ బెట్టుకొనినది యొకపును జానికపాలముగా నుండెను. ఒకదినము రెండుయామములవేళ నతఁ డాఁకలిచే బాధింపఁబడి యొకనియింటికేఁగి చూడఁగా నచ్చట నొకప్రాఁతపెట్టెయులో నొకఁడు పడియుండెను. అతఁడు తనధనము కొల్లఁబోయినందుకు విచారించుచున్నట్లు కనఁబడెను. దగ్గఱకుఁ బోయి చేతితో నాపెట్టెపైఁ గొట్టఁగా నంతలి మనుష్యుఁడు క్రిందఁ బడెను. అదియొకని కళేబరముమాత్రమే! ప్రాణములంతకు ముందెన్నిదినములనాఁడో పోయెను.

రఘుపతి మఱియొకదినమున నొకయింటిలోఁ బండుకొని యెను. రాత్రియంతయు నింక గతింపలేదు. తెల్లవారు జాముగా నున్నది. ఇట్టిసమయమున మెల్లమెల్లనఁ దలుపు తెఱవఁబడెను. ఆశరద్రాత్రియందలి వెన్నెలకాంతులతోఁ గలిసి మనుష్యుల ఛాయ లామందిరమును జొచ్చెను. మెల్లమెల్లన మాటలాడుమను ష్యులపలుకులు వినఁబడసాగెను. రఘుపతి యులికిపడి లేచి కూ ర్చుండెను. ఆతఁడు గూర్చుండినంతన కొందఱు స్త్రీల భయయు క్తములగుమాటలు బయలువెడలెను. ఒకమనుష్యుఁడు ముందు నకు వచ్చి ఎవ్వఁడవురా నీవు ? అనెను.

రఘు.—“నే నొకపథికుఁడను. బ్రాహ్మణుండను. మీ రెవ్వరు ?”

జనులు.—“ఇది మాయిల్లు మే మెల్లర మిల్లువిడిచి పాఱిపోయి యుంటిమి. మొగలులదండు వెళ్లిపోయెనని విని మరల మా యింటికి మేము వచ్చినాము.”

రఘు.—“మొగలులసేన లేదిక్కునకుఁ బోయినవి ?”

జనులు.—“విజయగడముదిక్కునకుఁ బోయినవి. ఇప్పటికి వారు విజయగడసమీపారణ్యమును బ్రవేశించి యుందురు.”

రఘుపతి మఱేమియును మాట్లాడక లేచి వేగముగాఁ దనయిచ్చ నేఁగెను.

---

## ఇరువదియవపరిచ్ఛేదము.

విజయగడరాజధానికి సంబంధించిన విశాలమైనయరణ్యము దొంగల కునికిపట్టయి యుండెను. ఆవనమధ్యమునుండి పట్టణమున కెవ్వరు పోయినను వారి కిరుతెఱంగులనుండియు హానిసంభవించుట వాడుకగా నుండెను. అందుచే నావన మతి భయంకరముగా నుండెను. ఎవరేమి యొనరించిన నితరుల కట్టి చిన్నిలైన నెఱుంగ నలవికావు. ఆవనము తుమ్మ నిమ్మ దానిమ్మ మొదలగు చెట్లతో నిండి యుండెను. నాలుగుదెసలనుండి లతలతో నావరింపఁబడి యుండెను. మధ్యప్రదేశములయం దచ్చటచ్చట గోతులు గానవచ్చుచుండెను. నిరంతర మాకులు రాలి కుళ్లుచుండుటచే నాగోతులయందలినీరు కొంచెము పచ్చగా పాచిపట్టియుండెను. చిన్నచిన్నయుడుములు పాములవలెనే మెలికలుగాఁ బరువులెత్తుచు వనమంతయును దిరుగుచుండెను. వృక్షశాఖలయం దుయ్యేల లూఁగుచు నొకశాఖపై నుండి వేఱొకశాఖకుఁ దాఁటుచుఁ గోఁతులు విస్తారముగాఁ బ్రకాశించుచుండెను. పెద్దచెట్లయొక్క కొమ్మలపై నుండి మఱ్ఱియూడలవలె నాకోఁతులతోఁకలు వ్రేలాడుచుండెను. పాడుదేవాలయములముందఱ శృంగారవంతము లగుతరువులు కాంతులను వెదఁజల్లుపూవులతోను వానరములదంతకాంతులతోను గొంతకొంత శోభ నిచ్చుచున్నవి. సంజవేళ పెద్దపెద్ద జువ్విచెట్లమీఁద నుండి వేనవేలు చిలుకలు మొదలగు పక్షిజాతులు కూయుకూఁతలలో నాకాననమం దంధకారము ఛిన్నాభిన్నములుగాఁ జెదరిపోవుచుండెను కాఁబోలును !! నేఁడీయరణ్యమున సుమా

రిరువదివేలసైనికులు గలదండు నిలిచెను. చెట్లు, శాఖలు, లతలు, సేనలు మొదలగువానిచే నావరింపఁబడి వాఁడిగలగోళ్లతోడను ముక్కులతోడను రాజిల్లు వజ్రపక్షివలెనే యాకాంతారమంత యు నొక పెద్దగోళముగాఁ గానవచ్చె.

ఒకమూఁతింత సైన్యము వచ్చుటఁ జూచి కాకులన్నియు నొకమూఁకగాఁజేరి "కావ్-కావ్" మనికూయుచు నాకసమునఁ దిరుగుచుండెను. వృక్షశాఖలపై వ్రాలుటకు సాహసింప లేకున్నవి. ఏవిధమైనయల్లరియును జేయవలదని సేనానాయకునకు నుత్తరువు వచ్చెను. సైనికులు సాయంసమయమున నరణ్యమునఁ దిరిగి యాకులు, పుల్లలు, వంటచెఱకు మొదలగుపదార్థములను దెచ్చుకొని వండుకొనుచుండిరి. నడుమనడుమ మెల్లమెల్లఁగా మాటాడుకొనుచుండిరి. వారిగుసగుసలతో వనమంతయు నాకుల మగుచుండెను. ఇందువలననే సాయంసమయమునందును దుమ్మెదల రొదలు వినవచ్చుటలేదు. చెట్లయందుఁ గట్టఁబడిన గుఱ్ఱము లుండి యుండి తెక్కలతో ధూళినెగురఁగొట్టుచు నెగురుచున్నవి. అందుచే నామహారణ్యమంతయుఁ గంపించుచున్నట్లుండెను. పాడు గుడిముందఱ మైదానమున శుజావారిగుడారము కల్పింపఁబడెను. తక్కిన వారందఱు చెట్లక్రింద నివసించియుండిరి.

దినమంతయు నొక్కరీతి నడిచి రఘుపతి యరణ్యమున నలఁగిడెను. అప్పటికిఁ గొంత రాత్రియైనది. సైన్యమున నెక్కువమంది గాఢనిద్రాపరవశులై యుండిరి. కొందఱు మాత్రము మాటలాడక వహారా గాయుచుండిరి. అచ్చటచ్చట నగ్ని ప్రజ్వ

లించుచున్నది. అంధకారదేవత యతికష్టమున నిద్రాభరంబున నెట్టిసికన్నులను విప్పుచుండెనేమో యని తోంచుచున్నది. అరణ్యమున నడుగు పెట్టంగానే రఘుపతికి సుమా రిరువదివేలమంది విడుచుసిశ్వాసశబ్ద మొక్కసారి వినవచ్చెను. వేలకొలంది వృక్షజాతులు తమశాఖలను జూచుకొని వనమునకు బహారా యిచ్చుచుండెను. గుడ్లగూబ లెట్లు దమపిల్లలమీంద రొమ్ముల నాను కొని తెక్కలు సాచి కూర్చుండియుండునో యట్లులే వనమునకు వెలుపలనుండు దీర్ఘ మగురాత్రి వనాంతర్భాగమున నుండు రాత్రిని పొదివికొని తెక్కలచేం గప్పి నిశ్శబ్దముగా నున్నట్లు దోంచుచుండెను. అరణ్యమధ్యమున నుండువారు రాత్రి నోరు మూసికొని నిద్రించుచుండిరి. అరణ్యమునకు వెలుపల నుండు వారు రాత్రి శిరస్సునెత్తుకొని మేలుకొని యుండిరి. రఘుపతి వనమునకు వెలుపలనుండుభాగమున నిద్రించు చుండెను.

ఉదయమునఁ దెలివి తప్పి వండుకొని నిద్రించుచున్న రఘుపతి నొకానొకఁడు వచ్చి తలపైఁ గొట్టెను. రఘుపతి త్రుళ్లి పడిలేచెను. పగిడీచుట్టుకొని తనపెద్దగడ్డమును సవరించుకొనుచు నొకమొగలాయీ సైనికుఁడు తన వేమభాషతో నేమిరో రఘుపతినడుగఁ జొచ్చెను. ఆమాటలు వినినంత నతఁడు తన్నుఁ దిట్టుచున్నట్లు గ్రహించెను. రఘుపతియును తమ దేశభాష యగుబంగాలీలో వారికి, "సాలా" అని చెప్పి వారితోఁ దనకుఁ గలసంబంధపరిచయమును వ్యక్తీకరించెను. మొగలాయి లందఱు నాతనిఁ గేలిచేయ సాగిరి. రఘుపతి "ఏమీ! మీరందఱు

నన్ను గేలిచేయుదురా?" యని యడిగెను. వారాతనికిఁ జేసిన పరిహాస మిట్టిదట్టిదని చెప్పుట కలవి కాదు. వనములో నుండి యాతనిని బలాత్కారముగాఁ గట్టియీడ్చుకొని పోవుచుండిరి. రఘుపతియు ననేకవిధముల వారికిఁ దనయనిష్టమును దెలుపుచు "అయ్యలారా! నన్నెందుల కిట్లు లీడ్చుకొని పోయెదరు? నేను నడిచి రాఁగలను. ఇంతదూర మిట్టులు వచ్చినాను?" సైనికు లందఱు నవ్వసాగిరి. ఆతనిబంగాలీమాటల ననుకరించుచు వెక్కిరింపసాగిరి. మెల్లమెల్లఁగా నాలుగుమూలలనుండివచ్చి సైనికులు గుంపుగాఁ జేరిరి. వానిని పట్టుకొని మిక్కుటమైన యల్లరిసేయఁ జొచ్చిరి. అతని దుర్దశ కప్పటికి నంతములేకున్నది. ఒకదుర్మార్గుఁ డాతనితలపైనిఁ బెంటతెచ్చి పోసెను. శుద్ధక్షౌరము చేయించు కొను నాతఁడు తనతలను గడిగికొని తినునో లేదో చూడవల యు నని యిట్లు సేయఁదలపెట్టెను. మఱియొక దుష్టుఁ డాతని నాసికారంధ్రమున నొకలావగు చేఁపబెత్తు ముక్కపెట్టి యది తీసివేసినచో ముక్కుఁగోసెదనని సంజ్ఞ చేసెను. ఆదుర్మాతుల నవ్వులతో వనమంతయు నల్లకల్లోలముగా నుండెను. నేఁడు రెండుయామములు గడచిన పిదప యుద్ధము జరుగనున్నది. కావున నుదయమునఁ జిత్తవినోదమునకై రఘుపతి నట్టిబాధ లనుపెట్టుచు వినోదించుచుండిరి. వారికిఁ జిద్విలాసములుగా నున్నయాబాధలన్నియు ముగిసినతరువాత నాతని శుజానన్ని ధికిఁ గొంపోయిరి. శుజా నాతఁడు కాంచి వానికి సలాము చేయ లేదు. ఆరఘుపతి దేవభూదేవులకుఁ దక్క నితరులకు నమస్కరిం పని నియమము గలవాఁడు. అందువలన నాతఁడు తనశిరము నెత్తు

కొని నిలిచి యుండెను. రెండుచేతుల నెత్తి "షాజహానుబాదు షాకు జయము కుఁ గాక" అని యాశీర్వదించెను.

శుజా, మద్యమును బోసినగిన్నె నొకదాని చేతితోఁ బట్టి కొని కూర్చుండెను. నిశ్శబ్దముగా నున్నయానపుయము న శుజా నెమ్మదిగా "ఏమి పని?" అని యడిగెను.

సైనికులు.—"రాజరాజేంద్రా! వీఁడు మాఱువేషము వేసికొని మనలోని గుట్టుమట్టులను దెలిసికొనుటకై వచ్చినాఁడు. అందుచే మేము వీనిఁ దెచ్చి యేలినవారిసన్నిధిని హాజరు చేసినాము."

శుజా.—"ఔనౌను! వీఁడు మనగుట్టుమట్టులను దెలిసికొనుటకే వచ్చియున్నాఁడు. వీనికడ నున్నయన్నివస్తువులను బరీక్షించి విడిచి పెట్టుఁడు. వానితోడు దొంగలతోఁ గలిసికొని యీ యుదంత మంతయుఁ జెప్పుకొనును." అనెను.

రఘు.—ఆతనిమాటలకు వ్యతిరిక్తముగా హిందీభాషలో "మహాప్రభూ! హుజూరువారి పరివారములో నన్నొకనిగా నంగీకరించుట కొకయర్జీ పెట్టుకొనుచున్నాను." అనెను. శుజా నెమ్మదిగా "వీని నావలకంపి వేయుఁ" డని హస్తసంజ్ఞ చేసెను. "ఎంతమిక్కిలి వేఁడిగా నున్నది." అనెను. ఆమాటవిని పంకా లాగుచున్నవాఁ డంతకంటె రెండింతలు వేగముగా లాగుచుండెను.

దారాయనునతఁడు తనపుత్రుని సులోమానుని జయసింహునిరక్షణకై శుజాసైన్యము లతిక్రమించి రాకుండఁ జేయు

మని సేనలతో నంపెను. ఆతనిసైన్యమునకు మితి లేకుండెను. వానిసైన్యములు మొగలాయీలను నమీపించుచున్నవి. ఈ వార్త శుజా చెవులఁబడెను. అందుచేత నాతఁడు విజయగడదుర్గ మును స్వాధీనపఱుచుకొనుటకచ్చటఁ దనసైన్యము నొకకొంచో గూర్చుటకునై యాతురుఁడై యుండెను. విజయగడదుర్గమును గోశాగారమును శుజాకు స్వాధీనపఱుపవలయు నను నమాచార మును దీసికొని తద్దుర్గాధిరాజగువిక్రమసింహునికడకు దూత వెళ్లియుండెను. విక్రమసింహుఁ డాదూతకు నరియైనజవాబిచ్చి పంపెను. "నేను ఢిల్లీబాదుషా యగుషాజహానుని మాకులదైవ మును కైలాసవాసియునగు శంకరునితో నమానునిగా మన్నిం చుచున్నాను. శుజా యెవఁడు? వారి నే నెఱుంగుదును" అని.

ఆమాట విని నంతన శుజా మండిపడి "ఏమీ? గర్వము మిక్కిలిమీఱినదే! తిరిగి వీనికై యుద్ధ మగుఁ గాక." అని పలికెను.

రఘుపతి యీమాటల నన్నిటిని వినెను. తన్ను విడి చిన తోడనే యతఁడు విజయగడదుర్గమునకు దారి తీసెను.

---

## ఇరువదియొకటవపరిచ్ఛేదము.

విజయగడ మొకకొండపై నున్నది. తత్సంబంధమగు నరణ్యము రాజమందిరమువఱకును వ్యాపించియుండెను. రఘు పతి యరణ్యమును వీడి యావలకుఁ బోవునరికి జ్యోతితోఁ గట్టఁ

బడిన యున్నతమగు రాజభవనము నిజముగ నల్లనియాకసమున నైక్యమొందియున్న ట్లాతనికిఁ దోఁచెను. వేలకొలఁదిగఁ దరుసంతానములచే నావరింపఁబడిన మహారణ్యమువలె నాకోటయును దనక్రిందిభాగమునఁ జెక్కడపుశిలలచేఁ గట్టఁబడియుండెను. అయ్యడవి నిశ్శబ్దముగానున్నచోఁ గోటయును నిశ్శబ్దముగానే యుండును. అరణ్యము వ్యాఘ్రమువలె గుప్తముగాఁ జోఁకనత్తుకొని కూర్చున్నట్లున్నచోఁ గోటయును సింహమువలెనే ఘననేత్రములను విప్పికొని గర్జిల్లుచు నిలిచియున్నట్లుండును. అడవి భూమిపైఁ జెవియుంచి వినుచుండెను. కోటయు నాకసంబునకుఁ దలయెత్తి చూచుచుండెను.

రఘుపతి యా కాననమును విడిచినపిదపఁ గోటమార్గముపై నుండురక్షకభటులు జాగరూకతతో నిలిచి యుండిరి. భేరి మ్రోగుచుండెను. కోటయంతయు నొక్కమూఁకగ సింహమువలె గర్జించుచు వాఁడియగు ఘననఖములను దంతములను విప్పి నటలను విదర్చి నిలిచియుండెను. రఘుపతి యజ్ఞోపవీతమును జూపించి చేతితో సంజ్ఞ చేసెను. రాజభటు లాతఁడు బ్రాహ్మణుఁడని తెలిసి సావధానచిత్తులై యూరకుండిరి. రఘుపతి కోట దగ్గఱఁ జేరినంత 'నెవ్వఁడవు ?' అని సైనికు లడిగిరి.

రఘు.—"నే నతిథియగు నొక బ్రాహ్మణుఁడ" నని ప్రత్యుత్తరమిచ్చెను.

దుర్గరక్షకాధిపతి "అయ్యా! మహారాజు విక్రమసింహుఁ డతిథివ్రాత్ముఁడు. దేవతలను విప్రులను నతిథులను బూజించుట

యం దాతఁడు మిగుల శ్రద్ధాళువు. జన్నిదముండినచోఁ జాలును. రాజభవన మంతయును శంకాతంకములు విడిచి తిరుగివచ్చును. పరిచయ మీవలకు లేదని యనుమానింప నవసరము లేదు; కాని యిది యుద్ధసమయమగుటచే నీవిషయమున నేమి చేయ వలయునో నిర్ణయింప నీసైనికులు స్వతంత్రులు కారు."

రఘు.—"మీరు నన్ను సంరక్షింపకవీడినచో నీకటికుతురకలచే నిప్పుడు నాకుఁ జావు తప్పదు." బ్రాహ్మణుం డొకఁ డతిథియై వచ్చె నని విక్రమసింహుఁడు వినినంత నతనికి దుర్గములో నుండుట కాజ్ఞ యిచ్చెను. కోటగోడమీఁదినుండి యొకసో పానమార్గము క్రిందికి దిగి యున్నది. ఆమార్గమున నతఁడు లోనికిఁ దీసికొని పోఁబడెను.

కోటలో నందఱు యుద్ధమగునని వ్యగ్రమనస్కులై యుం డిరి. ఆయతిథిని సత్కరించుభారమును స్వయముగా మునలివాఁ డగు కాకాసాహేబు వహించెను. అతని నిజమగు నామధేయము ఖడ్గసింహుఁడు; కాని యాతనిఁ గొందఱు "కాకాసాహేబు" అనియుఁ, గొందఱు "సుబేదార్" అనియును బిలుచుచుందురు. జను లిట్లు లీతనిం బిలుచుట కేమియుఁ గారణములేదు. లోక మున నతని కన్నదమ్ములు లేరు. మఱియు వారిపిల్లలు లేరు. కా వున 'కాకా' అని పిలుచుట కేమియును గారణములేదు. ముందు కలుగుదురేమో యని యనుటకు నట్టిసంబంధ మేమియును లేదు. ('కాకా' అనఁగా హిందీలో పెద్దతండ్రి అని యర్థము.) మఱియు నీతని 'సుబేదార్' అనుటకును వేఱుకారణ మేమియుఁ

గానరాదు. అతనికొకఁడును తాబేదార్ లేఁడు. 'సుబా' అనఁగా నధికారము. అది లేనిచో సుబేదా రెటు కాఁగలఁడు ? ఐన నింతదనుక నాతని కేవిధమైన యధికారనిర్బంధ మెట్టు లైనఁ గలదో లేదో యనుసందేహ మునవసరము. తమ్మునిపిల్లలు లేక పోయినను 'కాకా' అనుటచేతను అధికార మెవరిపైఁ జూపింప లేకపోయినను 'సుబేదార్' అనుటచేత నెవ్వరి కేమియుపాయమును సంభవించు ననుభయమును లేదు. అనిత్యత్వముతో లోకమునకును, జంచలత్వముతో లక్ష్మికిని సంబంధ మేమిగలదో యట్టిసంబంధమే యధికారితతో నీతనికిని గలదు. కారణమే లేకుండినఁ గార్య మెక్కడిది?

కాకాసాహేబ్.—"వహవా! ఇతఁడు నిజముగు బ్రాహ్మణుఁడు."

అనిచెప్పుచు భక్తిపూర్వకముగా రఘుపతికి నమస్కరించెను. దీపశిఖాసదృశమై రఘుపతి వర్చస్సు మిక్కిలి ప్రకాశించు చుండెను. ఆవర్చస్సును జూచియే మనుజశలభములందుఁ దగు లొక్కెందురు. కాకాసాహేబు ప్రస్తుతము లోకమునఁ జరగు చున్న యాచారముల శోచనీయముగు యవస్థకు మిక్కిలి చింతించి, "భూసురోత్తమా! ఈదినములలో మిమ్ముఁ బోలిన శుద్ధశ్రోత్రియులగు బ్రాహ్మణు లెందఱు కలరో?"

రఘు.—"మిక్కిలి తక్కువగా నున్నవారు."

కాకా.—"పూర్వము బ్రాహ్మణులముఖములం దగ్నియుండెడివి. ఇప్పు డది గర్భము నాశ్రయించినది."

రఘు.—"అదియైనను మొదలింటిమాదిరి నున్నదా?"

కాకా.—(తలయూఁచి) "సత్యము! అగస్త్యమహామునిసముద్ర జలమును ద్రావినరీతిని భోజనము చేయఁగలిగినచో నేమయి యుండును? ఈమాటను దమరొకపరి జాగరూకతతో నాలోచింపుఁడు?"

రఘు.—"ఇంక నొకయుదాహరణమున్నది."

కాకా.—"ఆ ఉన్నది. ఎందుకు లేదు? జహ్నుమునియుఁ బిపాసాయుక్తుఁ డనుమాట వింటిమి; కాని వారి కాఁకలియున్న దెచ్చటను వ్రాసియుండలేదు. ఆలోచించిచూడుఁడు. కుత్తుక నిండునట్లు భుజించిననేకాని యాఁకలి తగ్గదనుమాట విశ్వసనీయము కాదు."

రఘు.—(బ్రాహ్మణులమహిమలు స్మరించుచు గభీరస్వరమున) "లేదు బాబు! భోజనముపై వారి కంతగా ధ్యానము లేదు."

కాకా.—(దంతములచే నాలుకను గఱచుకొని,) "రామ! రామ! యేమియిట్లనుచుంటిరి? వారికి జఠరాగ్ని మెండుగా నుండెడిది. దీనికి సరియైనప్రమాణమును గలదు. మీరెందుకు నమ్మరు? కాలవ్యత్యాసముచే నంతకంతకు జఠరానలము తగ్గిపోయినది. హోమాగ్నియును బ్రజ్వలింపకున్నది." అని పలికెను.

రఘు.—(కొంచెము విచారించి) "బాబూజీ! హోమాగ్నియెందు కీకాలమునఁ బ్రజ్వరిల్లును? మ్లేచ్ఛులు గోవులను బట్టి చంపి తినుచుండుటచే నేయియు నంతగా లేకున్నది. హోమ

ద్రవ్యము లిప్పు డెచ్చట లభించుచున్నవి? హోమాగ్నులే ప్రజ్వరిల్లు చుండిన బ్రాహ్మణతేజమిప్పు డింతగా దీనావస్థయం దుండునా?" ఇట్లు చెప్పుచు నాతఁడు మిగులతక్కువమై గూఢముగా నున్నతసుశక్తి ననుభవమునకుఁ దేఁ బ్రయత్నించెను.

కాకా.—"మహాత్మా! మీరు నిజము వక్కాణించిరి. ప్రతినొందుచున్నగోవులు మనుష్యయోనియందు జనించుచున్నవి. అట్టులుండఁగా వానికడనుండి మనకు నేయి యెట్లు లభించును? ఇందుచే నెవరికిని ధైర్యము లేదు. తా మిప్పు డెచ్చట నుండివచ్చుచుంటిరి?"

రఘు.—"త్రిపురారాజధానినుండి."

విజయగడరాజధాని కవ్వలనుండు హిందూస్థానమునందలి భూగోళవిశేషములు నితిహాసవిశేషములు కాకాసాహేబునకుఁ గొంతవఱకుఁ దెలియును. తనరాజధానికంటె హిందుస్థానమందలియితిహాసములు తెలిసినను వానియం దాతనికంతగా నమ్మకములేదు. కొంచెమనుమానించుచు, "త్రిపురారాజధానీ పరిపాలకుఁ డుదారపురుషుఁ డని వినుచున్నాము" అని యడిగెను.

రఘుపతి పరిపూర్ణమగునిష్టముతో నామాట ననుమోదించెను; "ఔను"

కాకా.—"తా మక్కడ నేమి చేయుచుంటిరి?"

రఘు.—"నేనచ్చట రాజపురోహితుఁడనై యుంటిని."

కాకా.—కొంతదనుకఁ గన్నులు మూసికొని తల యెగుర

వైచుచు, "తామిచ్చటికి విచ్చేయుట కేమి కారణము." అని యడిగెను. ఆతనికి రఘుపతియందు భక్తి యధికమైనది.

రఘు.—"పుణ్యతీర్థదర్శనాభిలాషినై వచ్చితిని."

ఇంతలో నొకవైపునుండి, "శత్రువులు దుర్గము నాక్రమింతురు." అని యొకగొప్పధ్వని వినవచ్చెను.. కాకాసాహేబు నవ్వుచుఁ గన్నులుచికురించుచు "ఏమియును లేదు. చిల్ల పెంకులు వేయుచున్నారు." విజయగడదుర్గముపైఁ గాకాగారికిఁ గలిగియున్నంత దృఢవిశ్వాసమచ్చటిజాలకైనను లేదు. అట్టిదుర్గమున కెవ్వఁడైనఁ బారదేశికయాత్రికుఁ డతిథియై వచ్చి యుండెనేని యట నతనిపైఁ గాకాగారియధికారాభిమాన మంతయును జేరియుండును. మఱియు నాదుర్గసమాచారము లన్నియు నాతనికిఁ జెప్పవాడుకయును గలదు. త్రిపురారాజధానినుండి మనరఘుపతి వచ్చియుండెను. ఇట్టియతిథి యీలోకమున దొరకుట యసంభవము. కావుననే కాకాగారాతనియంతరాశయమును గనుఁగొనలేకపోయిరి. విజయగడమందలి సారవంతము లగుప్రాచీన విషయములను సంభాషింపఁ జొచ్చెను. "ఈ బ్రహ్మాండమును విజయగడదుర్గము నొక్కసారియే యుత్పన్నములై యుండును. మఱియు మనుచక్రవర్తియనంతరమునుండియు విక్రమసింహాని పూర్వపురుషు లీదుర్గమును బాలించుచుండిరి. ఇందుకు నందియు మొందు ననవసరము." ఈకోటకుఁ బరమేశ్వరుఁడు ప్రసాదించిన వరమును, ఈకోటయందే సహస్రార్జునుం డెట్లు కారాగృహబద్ధుఁడయ్యెనో యీసంగతియు నింక ననేకాంశములను

గాఁగాఁగాను రఘుపతికి వినుపించిరి. జరగినయంశములలో నే దానిని గప్పిపుచ్చలేదు.

శత్రువులు కోటకేమియు హానిచేయలేరని సాయంకాలమునకు వర్తమానము వచ్చెను. వారు తుపాకులను గాల్చిరి; కాని యాగుండ్లు కోటవఱకు రాలేదు. కాఁగా నవ్వుచు రఘుపతి దెనఁజూచెను. అతనియభిప్రాయమిది.—"మార్గ మహేద్యమునిపరమేశ్వరుండిచ్చినవరము గల దనుట కింతకంటె నింకేమి ప్రత్యక్షప్రమాణము కావలయును? వారి తుపాకిగుండ్లను నందీశ్వరుం డడ్డుపడి తీసికొనిపోవుచుండును. ఆగుండ్లతోఁ గైలాసమునందు గణేశ్వరుఁడును గార్తికేయుఁడు నాడుకొందురు" అని.

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

ఇరువదిరెండవపరిచ్ఛేదము.

విజయగడదుర్గము నెట్లులైన శుజాకు స్వాధీనపఱుపవలెనని రఘుపతియభిప్రాయము. శుజాకోట నాక్రమింపఁ బ్రయత్నించుచుండె నని విని, "మిత్రభావమునఁ గోటలోనిగుట్టుమట్టులన్నియుఁ దెలిసికొని యీకార్యమును నేవిధమున శుజాకుఁ దోడ్పడి యాతనిదయను సంపాదింపఁగలను." అని రఘుపతి తన మనంబునఁ దలపోయుచుండెను. బ్రాహ్మణుండీయుద్ధసమాచారము లేమెఱుంగును. ఏమిచేసిన శుజాకు సహాయకారి యగునో యది నిరూపింప నతని కేమియును దోఁపలేదు.

రెండవదినమున మరల యుద్ధమారబ్ధమైనది. శత్రు సేనలు ఫిరంగులతోఁ గోటగోడ నొకదెసఁ గొంతభాగమును బడఁగొట్టిరి. కాని మీఁదనుండి పడుచున్న తుపాకిగుండ్లవర్ష ముచే వారు దుర్గముయొక్క క్రిందిభాగమును జేరలేకపోయిరి. పడిపోయినగోడభాగము వెనువెంటనే కట్టఁబడెను. చిన్నచిన్న రవలు కోటలోనికి వచ్చి పడుచుండెను. దుర్గరక్షకులలో నలుపు రైదుగురు హతులైరి.

"మహాత్మా! ఏమియును భయము లేదు. ఇది కేవల వినోదమాత్రమే." అని పలుకుచుఁ గాకా రఘుపతిని దోడు కొని దుర్గముయొక్క నాలుగుభాగములును జూచుచు నతనికిఁ జూపించుచుఁ దిరుగఁ జొచ్చెను. ఎచ్చట నాయుధశాల యున్న దో, యెచ్చట భాండాగార మున్నదో, ఎచ్చట యుద్ధమున గాయములు తగిలినవారలకుఁ జికిత్స చేయుదురో, ఎచ్చటఁ గారాగార మున్నదో, మఱియు నెచ్చట దర్బారు చేయఁబడునో యాయాస్థలముల నెల్ల విలాసముతో వర్ణించుచు రఘుపతికిఁ జూపించెను. మాటిమాటి కతని మొగమును జూచుచుండెను.

రఘు.—"బాగుబాగు కాకాజీ! ఈదుర్గమునఁ జేయఁబడిన యేర్పాటులన్నియు మిక్కిలి చమత్కారముగా నున్నవి. త్రిపురానగరమందలి దుర్గ మీదుర్గమునకీడుగా నుండునని చెప్పుటకు వీలులేదు; కాని యీదుర్గమున రహస్యముగాఁ బరువెత్తిపోవుట కొకసొరంగ మత్యాశ్చర్యజనకముగా

నున్నది. ఈదుర్గమున నెచ్చట నట్టిరహస్యమార్గ మున్నట్లు తోఁపదు." అని యనెను.

కాకాజీ యేమో చెప్పుట కుత్సహించెను గాని యా యుత్సాహము నణఁచుకొని, "లేదు. ఈదుర్గమున నట్టిమార్గ మేదియును లేదు." అనెను. రఘుపతి యత్యాశ్చర్యమగ్నుఁ డైనట్లు నటించుచు, "ఇట్టి మహాదుర్గమున నట్టిరహస్యమార్గ మొకటియును లేదా?" అని యడిగెను.

కాకాజీ కొంచెము తడఁబడుచు, "కాదు. అటుల కాదు. సొరంగ ముండియుండవచ్చును. దాని యావశ్యకతయుఁ గలదు; కాని యది వేఱుమాట. మాకది తెలియదు" అని నొడివెను.

రఘు.—(నవ్వి) "అయినచో లేని మాటయే నిజము. తమకే యెఱుకలేనప్పుడు మఱియెవ్వరికిఁ దెలియ శక్య మగును?" అని పలికెను.

కాకాజీ కొంత దనుక నతిగంభీరభావముతో నుండెను. తరువాత మరలఁ గొంచెము సేపాఁగి "హారేరామ రామ" యనుచుఁ జిటికలువైచుచు నావలించెను. పిమ్మట గడ్డమును మీసము నొకటి రెండుసారులు చేతితో దువ్వుచు, "మహాత్మా ఎద్ది యైన నొకపూజాస్తోత్రమును జదువుఁడు. మీ కెఱింగించుటలో సంశయమేమియును లేదు. కోటలోనుండి వచ్చుటకును బోవుటకును రెండుగుప్తమార్గములు కలవు; కాని యీ సంగతి నెవ్వరికిని జెప్పఁగూడదు." అని యెఱిఁగించెను.

రఘు.—ఇంచుక సందేహమును తెలియఁజేయు స్వరముతో "ఆ! కావచ్చును." అని పలికెను.

శాకాజీ యారహస్యము నెఱింగించుట దోష మని యెఱుంగును. ఒకమాఱు లేదనియు నింకొకమాఱు కలదనియు నుడువుటచే లోకమునకు నిజముగా సందేహము గలుగకమాన దు. ఒక విదేశీయునిదృష్టికిఁ ద్రిపురాదుర్గముకంటె విజయగడ దుర్గ మేయంశముననైనఁ దక్కువ యని తోఁచుట యితని కిష్ట ము లేక పోయెను.

శాకా.—"మహానుభావా! నే నెఱుంగుదును. మీ త్రిపురా దేశ మిచ్చటి కతిదూరమున నున్నది. మీ రుత్తమకులసంజా తులు. బ్రాహ్మణులు. ఇంతియే కాక మీరు దేవపూజాధురం ధరులు. తమమూలమున నీమాటలు వెల్లడియగు ననుట కేవల మసంభవము."

రఘు.—"బాబూజీ! నాకీలౌకికవ్యవహారములతో నేమి ప్ర యోజనము? కాకున్న మీ కేమైన నభ్యంతరమున్న నా ప్రసంగ మింతతో నిలిపివేయుఁడు. నేను బ్రాహ్మణుండను. నా కీదుర్గకార్యములతోను మాటలతో నేమి సంబంధము."

శాకా.—(నాలుకఁ గఱచికొని) "శ్రీరామ! రామ! అయ్యా! తమవలన సందేహింపనవసరమేమి గలదు? పదండు. తమ కొకసారి యదంతయుఁ జూపించి తీసికొనివచ్చెద."

కోటకు వెలుపల నొకభాగమున శుజాసేనలకోలాహల మధిక మగుచుండెను. అరణ్యమధ్యమున శుజానొక్క గుడార

ముండెను. సులేమాన్ అనునాతఁడును జయసింహుని సేనలు నొక్కుమ్మడిగా వచ్చి శుజాను జుట్టుముట్టి యాతనిఁ బట్టుకొని రహస్యమార్గమున దుర్గముమీఁది కేగఁ బ్రాకు శుజాసేనలపై నొక్కపెట్టునఁ బడిరి. శుజాసేనలు యుద్ధము చేయలేక యిరువదితుపాకులు వెనుకభాగమునఁ జేర్చి పలాయనసూత్రమును బఠించినవి.

కోటలోపల ధూమ్, ధామ్ అనుధ్వని బయలు దేఱెను. సులేమానునిచే నంపఁబడిన దూతలు శీఘ్రగమనమునఁ గోటఁ జొచ్చి ద్వారమును దెఱచిరి. వారు స్వయముగాఁ బోయి సులేమాను జయసింహులకు ముందుగానే శుజాను సేనలను దీసికొని వచ్చిరి. ఢిల్లీపాదుషాయొక్క సేనలతోను గుఱ్ఱములతోను నేనుఁగులతోను గోట నిండి పోయెను. దుర్గముపై విజయధ్వజ మెత్తఁబడెను. శంఖధ్వనులును వాద్యవిశేషములును జెలరేగినవి.

కాకాజీ గారి తెల్లనిమీసమునకుఁ గ్రిందను స్వచ్ఛమైనసగవు పూర్వరూపముతో వెలుఁగొందెను.

---

## ఇరువదిమూఁడవపరిచ్ఛేదము.

కాకాజీ గారికి నేఁడు చెప్పనలవిగాని యానందమగు దినము. నేఁడు ఢిల్లీశ్వరునిపక్షమున నుండురాజపుత్రసైనికులు విజయగడదుర్గమున నిండుకొనిరి. అవక్రవిక్రముండును, ప్రతాపశాలియునగు శాహశుజా విజయగడదుర్గమున నేఁడు ఖైదీగాఁ

జేయఁబడెను. సహస్రార్జునుని తరువాత నిట్టి ఖైదీ విజయునకును న కెప్పుడును లభింపలేదు. సహస్రార్జునబంధనమును స్మరణమునకుఁ దెచ్చికొని కాకాజీ దీర్ఘములగు నుచ్ఛ్వాసనిశ్వాసములను బట్టి విడుచుచు రాజపుత్రుండగు సుచేతసింహునికి, "జాగరూకతతో వినుము. వేయిచేతులకు సంకెలలు వేయునప్పుడెంత ప్రయత్నమొనర్పవలసియుండును ? కలియుగప్రారంభమునుండి నేఁటికిని యుద్ధమనునది పటాటోపమాత్రమే మిగిలినది. రాజపుత్రులు లేకేమి? వేనవేలుగలరు. రెండుచేతులకంటె నెక్కువచేతులుగల వారు బజారున వెదకినను దొరకుట లేదు. రెండుచేతులకు సంకెలలు వేసిన నేమి? ఇంచుకసుఖములేదా ? ఇంచుక వినోదము లేదా." అని పలికెను.

సుచేతసింహుఁడు నవ్వి తనచేతులను జూచుకొని, "ఈ రెండుచేతులే స్వేచ్ఛావిహారము గలవి." అని చెప్పెను.

కాకా.—కొంచె మాలోచించి, "ఆ! ఔను! ఇది నిజమే. సహస్రార్జునుని బట్టునపు డెక్కువ పని గలిగినది ఇప్పు డీతనిఁ బట్టుటలో నీరెండుచేతులకే సరియైనపని లభింపలేదు. చేతు లెక్కువగా నుండినచో నింకను మీసములు దువ్వుటకుఁ బనికివచ్చును."

కాకాజీవారి వేషమున కీదినమున నేమియుఁ దక్కువలేదు. పండినజుట్టుముడి క్రిందనుండి మలిచి చెవులలోని కాతని పొడవగు దాడీ (గడ్డము) తగిలింపఁబడెను. రెండుమీసములును బాగుగ మెలివెట్టి కర్ణములవఱకు నిగిడింపఁబడెను. తలపై వంకరయైనపగిడీ చుట్టఁబడెను. మొలలోఁ గైజా రిముడ్చఁబడెను. వృద్ధమైనకాలి

జోడుయొక్క ముంగలిభాగ మెత్తయి కొమ్మువలె దిరిగి మీఁదికి లేచియుండెను. ఈదినమున నతని నడకఁ జూచినవారికి విజయ గడదుర్గమహిమయంతయు నతనిసర్వాంగములను వ్యాపించి యున్నట్లు దోఁపకపోదు. ఈదినమున నిందఱి నరదారులయె దుట విజయగడసామ్రాజ్యమహిమము నిర్ణయింపఁబడును; ఇట్టి సంతోషసమయమున వారికాహారనిద్రాదులు రుచింప లేదనిన నతిశయోక్తి యేమిగలదు?"

సుచేతసింహుని దోడుకొని కాకాజీ పగలంతయును దుర్గమును జూపించువ్యాపారమున నుండెను. ప్రస్థలమునందైన సుచేతసింహుం డట్టియాశ్చర్యమును బ్రకటింపకపోయినచో నాస్థలమం దతఁడు స్వయముగా'వహా వా! వహావా! !'అనుచుఁ దన యుద్దేశ్యము నారాజపుత్రవీరునిహృదయమున నంచరింపఁజేయు టకుఁ బ్రయత్నించు చుండెను. విశేషముగా వారికిఁ గోటగోడను జూచుటయం దధికశ్రమగలిగెను. కోటగోడ నిశ్చలమై యుండు నట్లే సుచేతసింహుండు నట్టులే స్థిరభావమును వహించి నిలిచి యుండెను. ఆతనిముఖమున నెట్టిభావమును బకటింపఁబడలేదు. కాకాజీ మరల తిరిగితిరిగి యొకమాఱు గోడకెడమువైపునను మఱియొకసారి దక్షిణభాగమునకు నింకొకసారి మీఁదిభాగము నను మఱియొకమాఱు క్రిందివైపునను నతనిఁ ద్రిప్పి తీసికొని మరలఁ దీసికొనివచ్చుచు నతనితో, "ఏమనియెదరు? ఎట్టులున్న దీదుర్గము?" అనియడుగుచుండెను; కానియతఁడు సుచేతసింహుని హృదయరూపమైన దృఢదుర్గమునిఁదఁద నేమియు నధికారము నెఱపలేకపోయెను. తుదకు సాయంసమయమున సుచేతసింహుం

డలసి "అయ్యా! నేను భరతపురమందలికోటను జూచినాను. దానివలె నిది నాదృష్టిని సంతోషింపఁ జేయలేను." అని ప్రత్యుత్తర మొసఁగెను.

కాకాజీ యెప్పు డెవ్వరితోను వివాదము చేయుస్వభావముకలవాఁడు కాఁడు. మిక్కిలిచిన్నవోయి, 'ఔనౌను! ఆమాట నిజమైయుండవచ్చును' అని నుడివెను. మఱియు నతఁడు దీర్ఘమగు నిట్టూర్పు విడిచి దుర్గసంబంధమగు ప్రసంగమును వీడి విక్రమసింహుని పూర్వపురుషుఁడగు దుర్గాసింహుని ప్రసంగమెత్తి "అయ్యా! దుర్గాసింహునికి మువ్వురుపుత్రులు కలిగియుండిరఁట! వారియందుఁ గనిష్ఠుఁడగు చిత్రసింహునికి విచిత్రతరమగు నభ్యాస మొకటుండెనఁట. అతఁడు ప్రతిదినమును 'అందాజనము' అను పేరుగలయౌషధము నఱసేరు పాలలోఁ గలిపి త్రాగుచుండెనఁట. అతనిశరీరము నంతబలిష్ఠమై యుండెనఁట! అయ్యా! మీరు భరతపురదుర్గము మిక్కిలి బలిష్ఠమై యుండునని చెప్పిరి. అదియట్లులనే యుండవచ్చును! కాని బ్రహ్మావైవర్తపురాణమున దానిమాటయైనఁ జెప్పఁబడలేదేమి?"

సుచే.—(నవ్వి) "అందు వ్రాయఁబడకపోవుటచేఁ బనిలో నేమియును దానికి లోటులేదు."

కాకా.—(నవ్వుచు) "ఆ!ఆ! ఆలాగైననరియే! అదినిజమే! నీకేమి తెలియును? త్రిపురానగరమందలి కోటయును సాధారణమైనదికాదు; కాని విజయగడకోటకంటెఁ గొంచెము...."

సుచే.—"త్రిపురానగర మెచ్చటనున్నది?"

కాకా.—అది మిక్కిలి గొప్పదేశము. ఇన్నిమాటలతో నేమి ప్రయోజనము? ఆ నగరమునందలి రాజపురోహితుఁడు అతిథియై వచ్చి మాకోటలోనున్నాఁడు. ఆయననోటను మీరు వినవలయును."

కాని యీదినమం దతఁ డేమయ్యెనో వెదకినను గానరా లేదు. కాకాజీవారిహృదయ మాతనికై పరితపించుచుండెను. అతఁడు తనమనమునఁ దానిట్లు తలంచుచుండెను. "ఈరాజపుత్రస్థానమందలి విప్రులకంటె నాబ్రాహ్మణుం డెక్కువవాఁడని చెప్పిన బాగుండును." అతఁడు సుచేతసింహునియెదుట ననేకవిధముల రఘుపతిని బ్రశంసించెను. విజయగడదుర్గవిషయమున రఘుపతికిఁ జెప్పినవిషయములను బ్రకటించెను.

---

## ఇరువదినాల్గవపరిచ్ఛేదము.

కాకాజీ వారిచేతినుండి విడివడినతరువాత సుచేతసింహునకు మఱియేమియు నధికమైన పని తగులలేదు. రేవటియుదయము ఖైదీగా పట్టుకొనఁబడిన శుజాతో ఫాదుషాసేనలు పోవుట కేర్పాటుచేయఁబడెను. సేనలు ప్రయాణపు సామానులను సిద్ధపఱుచుకొనుచున్నవి. కారాగారంబున శుజాగా రతి చింతాక్రాంతులై చిన్నఁబోయి తనలో తానిట్లు వచించుకొనుచుండెను. "ఏమి యీజను లింత నిర్దయగలవారుగా నుండిరి?

శిబిరమునుండి నాగుడుగుడీకాయ (హుక్కా) నైనఁ దెచ్చి యిచ్చుటకు వీరిమనంబుల నాలోచన తోఁపదయ్యె."

విజయగడపర్వతముక్రింద నీరు పాఱుచుండు నొక కాలువ గలదు. ఆకాలువ దరి నొకస్థలమునఁ బిడుగుపడి యెండి పోయినరావిచెట్టొకటి కలదు. ఆచెట్టునకు సమీపమున నడి రాత్రియందు రఘుపతి గోఁచి కట్టుకొని సంసిద్ధుఁడై యుండెను.

రహస్యముగాఁ గోటలోనికిఁ జొచ్చుట కుండుమార్గమున కీకాలువయొక్క మధ్యభాగముననే ప్రవేశద్వార మొండుగలదు. ఆమార్గమునుండి వెళ్లి క్రిందనుండి బలముగాఁ ద్రోసినంతన యొకఱాతిపలక మీఁదికి లేచెను; కాని మీఁదినుండి యెవ్వరా ఱాతిపలకను దీయవలెనని ప్రయత్నించినను వ్యర్థప్రయాసమే కాని దానిఁ దీయుట కలవడదు. అందుచేఁ గోటలో నున్నవారి కాదారి సవ్వలకుఁ బోవుటకు వలనుపడదు. శుజా కారాగృహంబున నొకపక్కపైఁ బరుండెను. అది తప్ప వేఱేవిశేషమగుపఱపు లచ్చట లేవు. ఒకదీపము వెలుఁగుచున్నది. హఠాత్తుగా నాకారాగారమున సురంగద్వారము తెఱవఁబడెను. రఘుపతి మెల్ల మెల్లనఁ దలయెత్తి క్రిందినుండి మీఁదికి వచ్చెను. అతనిదేహ మంతయుఁ దడిసి యుండెను. అతని తడిసినవస్త్రమునుండి నీరు ప్రవహించుచుండెను. రఘుపతి నెమ్మదిగా శుజాశరీరమును దన చేతితోఁ దాఁకెను. శుజా యులికిపడి కన్నులు నులుముకొనుచుఁ గొంతసేపటికి లేచి కూర్చుండెను. మఱియు దీనస్వరమున "ఏమి చీకాకు వచ్చెను? ఈజనులు నన్ను రాత్రియందైన నిదురఁబో

నీయరు. అయ్యో! మీగడబిడలచే నాబాధకు మేరలేకున్నది." అని వినువుకొనెను.

రఘు.—(మృదువులగుమాటలతో) "శాహాశుజాసాహెబ్! లేది పదంకు. నేను మీనౌకరులచేఁ బట్టుకొనఁబడి మీచే విడిపింపఁబడిన యీ బ్రాహ్మణుండను. జ్ఞప్తికిఁ దెచ్చుకొని నన్ను జూడుఁడు. సంతతము నన్ను మదిలో నుంచుకొనుఁడు." అనెను.

మఱునాఁడుదయము పాదుషాగారి సేనలు బయలుదేఱుటకు సంసిద్ధములై యుండెను. శుజాను నిద్రనుండి మేలుకొలువుటకు స్వయముగా జయసింహుఁడు కారాగృహంబునకు వచ్చెను. ఇంకను శుజా ప్రక్కమీఁదినుండి లేవలేదు. దగ్గఱకుఁ బోయి ప్రక్కపైఁ జేయివైచెను. శుజాగారు లేరు. ఆతనిపై వస్త్రము మాత్ర ముండెను. శుజా యేమయ్యెనో తెలియదయ్యె. గృహమధ్యమున సురంగద్వారము తెఱవఁబడియుండెను. దానిపాఁతి పలక వేఱుగా నచ్చటఁబడియుండెను.

ఖైదీ పాఱిపోయినవార్త కోటలో నంతటను జుట్టుకొనియెను. వెదకుటకుఁగా నంద అన్నిదిక్కులకుఁ బరువులెత్తసాగిరి. రాజావిక్రమసింహునికిఁ దలవంపు లాయెను. ఖైదీ యెట్లుపాఱిపోయెనో విచారించుట కొకదర్బారు చేయఁబడెను.

కాకాగారి యీ యానందసహితమైనగర్వమంతయు నొక్కనిమిషములో పాఱిపోయెను. అతఁడు వెఱ్ఱివానివలె "బ్రాహ్మణుం

డెక్కడ? బ్రాహ్మణుం డెక్కడ?" అని పలుకుచు నలుదెసలకును బరువెత్తఁజొచ్చెను. బ్రాహ్మణునిజాడ యేమియుఁ దెలియదయ్యె.

కాకాజీ తలపై నుండి పాగా తీసివేసి కొంతదనుకఁ దల మీఁద చేయినుంచుకొని కూర్చుండెను. సుచేతసింహుఁ డాతని కడకువచ్చి, "కాకాజీ! ఏమిది? మిక్కిలి యాశ్చర్యముగా నున్నదే! ఏమి? యిదియంతయు భూతములవ్యాపారము కాదు గద?" అని యడుగఁగాఁ గాకాజీ యత్యంతోదాసీనభావంబునఁ దల నెగురవైచుచు, "సుచేతసింహుఁడా! కాదు. ఇది భూతములవ్యాపారము కాదు. ఇదియంతయు మిక్కిలి బుద్ధిహీనుఁడగు నొకముసలివానిచేతను, విశ్వాసఘాతుకుఁడగు నొకపాపాత్మునిచేతను జేయఁబడినపని." సుచేతసింహుఁడు విస్మితుఁడై "నీవాతని నెఱిఁగియుండినచోఁ బట్టుకొని తీసికొనిరాలేదేమి?" అని ప్రశ్నించెను.

కాకా.—"ఆయిద్దఱిలో నొకఁడు పలాయితుం డయ్యె. రెండవ వానిని వెదకి రాజదర్బారునఁ బ్రవేశపెట్టుచున్నాను." అని చెప్పుచు మరలఁ దనపగిడినిఁజుట్టుకొని దర్బారునకుఁ బోవునప్పటి డ్రస్సు తొడుగుకొనెను. ఈసమయమునఁ బహారా జవాను జనులను బరీక్షించుచుండెను. కాకాగారు దలవంచుకొని దర్బారున హాజరయ్యెను. అతఁడు విక్రమసింహునిపాదములదరిని దనఖడ్గము నుంచి, "మహారాజా! నన్ను ఖైదీగా బంధించుట కనుజ్ఞయీఁబడుఁగాక! ఈద్రోహ మొనర్చిన వాఁడను నేనే" అని పలికెను.

రాజా.—విస్మితుఁడై "కాకాసాహబ్ ! ఏమి సమాచారము ?"

కాకా.—"ఆబ్రాహ్మణుఁడే. యీపనినంతయుఁ జేసినవాఁ డా బంగాలీబ్రాహ్మణుఁడే? "

రాజా.—జయసింహుఁడు "నీవెవ్వరు?" అనియడిగెను.

కాకా.—"నేవిజయగడమున నుండుముసలినౌకరును. నన్నుఁ గాకాసాహేబందురు."

జయ.—"నీవేమి చేసితివి? "

కాకా.—"విజయగడ దుర్గమునందలి మైకమత్యమును జెడఁగొట్టి విశ్వాసఘాతుకమగు కార్యము నొనరించినాఁడను. నేను నిజముగ మూర్ఖునిరీతిని నమ్మి, యాబంగాలీబ్రాహ్మణునితో నీసురంగమార్గము మాట వచించినాను." ఆమాటలు వినినంతిన యొక్కసారి మండిపడి విక్రమసింహుఁడు, "ఖడ్గ సింహా!" అనిపిలిచెను. కాకా యదరిపడెను. తనపేరు ఖడ్గ సింహుఁడనుమాట మఱచెఁగావలయును.

విక్రమ.—"ఖడ్గసింహా! వయస్సుమీఱినను నీవు బాలునివలె నిట్టి పనియొనర్చితివి."

కాకా.—సిగ్గుచేఁ దలవంచుకొని యూరకుండెను.

విక్ర.—"కాకాసాహబ్ ! నీవే యీపనియొనర్చితివా? నీవలన విజయగడదుర్గమునకు నేఁ డప్రతిష్ఠ వచ్చెను."

కాకా.—మాటలాడక నిలిచి యుండెను. అతనిచేతులు గడగడ వడంకుచుండెను. చేతులతోఁ దలమొత్తుకొనుచు, "నాదుర దృష్టము" అని తనలో ననుకొనెను.

విక్ర.—"నాకోటనుండి పాదుషా విరోధియగు శుజా తప్పించు కొనిపోయెను. నిజముగ ఢిల్లీశ్వరునివిషయమున నన్నపరా ధిఁగా నీవొనర్చితివి."

కాశా.—"అపరాధిని నేనొక్కఁడనే. ప్రభువు నపరాధిగా ఢిల్లీ శ్వరుఁడు దలంపఁడు."

విక్ర.—క్రుద్ధుండై "నీవెవ్వఁడవు? నీమాట పాదుషాగారి కేమి తెలియును? నీవు నాకొలువులో నున్నవాఁడవు. నాచేతు లతో నే నాతని విడిచినట్లు నిశ్చయింపఁబడును."

కాశాగా రేమియు సమాధానము చెప్పలేకపోయిరి. ఆతని కన్నులనుండి వచ్చుబాష్పజలప్రవాహ మాఁగినది కాదు.

విక్ర.—"నీ వేశిక్షను గోరెదవు?"

కాశా.—"ప్రభువు వారియిష్టము."

విక్ర.—"నీవు ముసలివాఁడ వైతివి. నీకింతకంటె నెక్కువ శిక్ష యేమికావలయును? విజయగడమునుండి వెడలఁగొట్టుటయే నీవిషయమునఁ గఠినశిక్ష యగును."

కాశా.—సాష్టాంగపడి విక్రమసింహునిపాదములను బట్టుకొని ప్రార్థింపఁజొచ్చెను. "విజయగడమర్గమునుండి వెడలఁగొట్టు టయా? వలదు మహాప్రభూ! నే వృద్ధుండను. నాబుద్ధి వికలత నొందియున్నది. నాకును శిక్ష విధించి నన్నీమట్టిలోనే కలిపి వేయుఁడు. ఇట్టివార్ధకమున క్షుద్రజంతువులవలె నన్నిచ్చటి నుండి వెడలఁగొట్టవలదు."

జయ.—విక్రమసింహమహారాజా! "నేనీవిషయమంతయు పాదు షావారి కెఱింగించెదను. కావున నామాటప్రకారము మీవృద్ధుని క్షమింపుఁడు." కాకాజీవారినేరము మన్నింపఁబడినది. దర్బారునుండి యీవలకు వచ్చునప్పుడు పాపమతఁడు వడఁకుచు నడువలేక పడెను. ఆదినము మొదలు కాకాయంతగా నందఱకుఁ గనుపించుట లేదు. అతఁడు ఢిల్లీ విడిచి వచ్చుటయే లేదు. ఆతని వెన్నెముక విఱిగి యుండెను.

---

## ఇరువదియైనవపరిచ్ఛేదము.

బ్రహ్మపుత్రానదీతీరమున "గుజురుపారా" అనునొక గ్రామము కలదు. అందునొక చిన్నజమీందారుఁ డుండెను. ఆతని పేరు పీతాంబరరాయుఁడు. పట్టణమున జననము నాతఁడు నంతగా లేదు. పీతాంబరుఁడు తన ప్రాచీనదేవీమందిరమున నుండి తాను "రాజు" అని పిలువఁబడుచుండెడివాఁడు. ఆగ్రామమందలి ప్రజలాతని 'రాజా' అని పిలుచుటయే వాడుక. అతనిరాజగృహాశ్వము వృక్షసమూహములతో నిండియుండునరణ్యమునఁ దిరుగుచు సమీపమున నుండువల్లెలయందును వ్యాపించి యుండెను. ఆతనికీర్తి యాగ్రామారణ్యముల నిండి యుండెను. ఆగ్రామసమీపప్రదేశములయందును వ్యాప్తమగుచుండెను. లోకమున నుండు మహారాజాధిరాజుల యఖండప్రతాప మీదిఃఖుత

గూడెములలోనికి రాఁజాలదయ్యెను. ఆ బ్రహ్మపుత్రా నదియొద్దున మాత్రము త్రిపురానగరాధీశుం డగు గోవిందమాణిక్యరాయల జపమందిర మొండుండెను; కాని చాలదినములనుండియుఁ దీర్థ స్నానమున కెవరును రారైరి. ఏది యెట్లయినను ద్రిపురానగర వాసులయం దిదమిద్ధమని చెప్పనలవి గాని పుక్కిటిపురాణము మాత్ర మొకటి బయలువెడలెను. "భాద్రపదమాసమున నొక దినమునఁ ద్రిపురారాజధానియందలి రాజపుత్రుం డొకఁ డీపు రాతనమందిరమున నుండుటకై వచ్చియుండెను." అని యీగు జరుపాదాగ్రామమున దెలిసెను. కొన్నిదినములు గతించినతరు వాతఁ గొందఱు మంచిమంచిపగిడీలను జుట్టుకొని యీమందిర మునకు వచ్చి యల్లరి చేయుచుండిరి. ఇంక నొకవారము గతిం చినపిమ్మట నేనుఁగులను నశ్వములను గాల్బలములను సేనగాఁ గూర్చుటకై నక్షత్రరాయల నాగ్రామమునకు రప్పించెను. ఆతని వేషభాషలను డాబునుదర్పమునుజూచియాగ్రామమందలిప్రజల నోటనుండి యేమాటయు బయలువెడలలేదు. ఇన్నిదినములు లా ప్రజలు పీతాంబరరాయలనే పెద్దరాజుగాఁ దలంచుచుండెడి వారు; కాని యాదినమందుమాత్ర మామాట వారిలో నొ క్కరియందైన స్థిరభావమును వహింపదయ్యె. నక్షత్రరాయల ను జూచి యెల్ల రొక్కమాటగా, "ఆహా! రాజకుమారుఁ డన్న నిట్టులే యుండవలయును" అనుకొనసాగిరి. నక్షత్రరాయునిం గని యాతని తేజస్సుముందఱ పీతాంబరరాయలును, నాతని తేజస్సు ను, దక్కువగా నుండెనని దేవీమందిరమువఱకు వ్యాపించినను

పీతాంబరునియానందమునకు మేర లేకుండెను. అతఁడు తన రాజమర్యాదల నన్నిటిని నక్షత్రరాయలపాదములకడ సమర్పించి యత్యానందము నొందుచు నాతని రాజేంద్రునిగాఁ దలంచుచుండెను. నక్షత్రరాయల నేనుంగు నెక్కించి బయలుదేఱించి తనప్రజల కతఁ డిట్లు చెప్ప సాగెను. "మీరందఱు రాజుగారిని జూచితిరా? చూడుఁ డీమహాపురుషుఁడే మనరాజు" అని. పీతాంబరుండు ప్రతిదినమును దినుబండములను దీసికొనిపోయి నక్షత్రరాయుల కర్పించుచు వచ్చుచుండెను. నక్షత్రరాయుల క్షాత్త్రాధికారమును, తేజోసౌందర్యములను దిలకించి పీతాంబరుఁ డధికానందపారావారమునఁ దేలుచుండెను. ఆతనిప్రేమ యింతయంత యని చెప్ప నలవికాకుండెను.

నక్షత్రరాయలే గుజురుపాడాగ్రామమునకు రాజయ్యెను. పీతాంబరుఁడు ప్రజాకోటిలోఁ జేరెను.

దినమునకు మూఁడుసారులు నౌబత్తు మ్రోగుచుండెను. గ్రామమార్గమున నేనుఁగులును హయములును బయలుదేఱుచుండెను. ద్వారముకడ దావారికునిహస్తమున మెఱపుమెఱసినట్లు ఖడ్గము మెఱయుచుండెను. వీథులు, బజారులు శోభాయమానములై యుండెను. పీతాంబరుఁడును దక్కినప్రజలు నత్యానందమునఁ బ్రసన్నులై యుండిరి. నక్షత్రరాయలు దేశనిర్వాసనశిక్షయం దీరాజ్యము నేలుచుఁ దనదుఃఖమంతయు మఱచిపోయెను. ఇందానికి రాజ్య మేలుపనిపాటు లేమియును లేవు; కాని రాజభోగము లనుభవించుట మాత్రము కలదు. ఇందాకఁ

డన్నిట సర్వస్వతంత్రుఁడు. త్రిపురారాజ్యమునం దీతని కింత స్వాతంత్ర్యములేదు. ఇప్పటికి నీప్రాంతమున రఘుపతి నీడ యైనను గానరాలేదు. నక్షత్రరాయుఁ డుల్లసితమనస్కుండై భోగవిలాసముల నిమగ్నుండయ్యెను. ఢాకానగరమునుండి నాట్యవిద్య యందు నేర్పరులగు కొందఱు స్త్రీపురుషు లిచ్చటికి వచ్చిరి. నక్షత్రరాయనికి నాట్యమునందును గానమందును వాద్యమందును లేశమాత్రమయిన నరుచిలేదు.

నక్షత్రరాయలు సర్వవిధములఁ దనయన్నయగుగోవింద మాణిక్యరాయలవలె రాజ్యపాలనమునఁ బ్రవర్తించు చుండెను. తనపరిజనులలో నొకని మంత్రిగాను మఱియొకని సేనాధిపతిగా నుండ నియమించెను. పీతాంబరుని దివానుపదవియందు నిలిపెను. జనులందఱు పీతాంబరుని 'దివాణ్‌జీ' యని పిలుచు చుండిరి. పరిజనులందఱు భయవినయములతో దర్బారున మెలంగఁ జొచ్చిరి. రాయ లతిగుప్తముగా నివి యన్నియుఁ జూచుకొను చుఁ బ్రవర్తించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు నకులుం డనువాఁడు దర్బారున కేతెంచి మధురుం డనువాఁడు నన్నుఁ 'గుక్కయని యన్నాఁడు' అని ఫిర్యాదుచేసెను. రాయలు మధురుని బిలిపించి విధ్యుక్తముగా నతని విచారణ చేసెను. మధురుని రెండుచెవులు నలిపివేయుఁ డని యతిగంభీరముతో రాయలాజ్ఞాపించెను. ఈప్రకారము నాతఁడు కాలమును సుఖముగాఁ బుచ్చుచుండెను. ఒకానొకదినమున నేమియును రాజకార్యములు లేనితఱి నేదియైనఁ జిత్రతరమగు క్రొత్తవినోదమును జేయింప మంత్రిని బిలిపించెను. మంత్రియు సభాసదులనందఱి నొకచోఁ

గూర్చి వ్యగ్రమనస్కుండై యట్టి క్రొత్తవినోదమును జూపించుటకై ప్రయత్నింపసాగెను. అగాధమగు చింతకును విచారమునకు నంతము లేకుండెను. ఒకదినమునఁ గొందఱు రాజభటులనుదీసికొని పీతాంబరుఁడు దేవీగృహమును బ్రవేశించెను. అతని తటాకమునుండి చేఁపలను తోఁటలోనుండి కొబ్బరిపండ్లను దీయించి యాతనిసర్వసామగ్రిని బట్టించుకొని యతిపటాటోపముగా వాద్యములు మ్రోగుచుండ రథముపై వచ్చుచుండెను.

ఈవిధమగు వినోదమందు నక్షత్రరాయునిపైఁ బీతాంబరునికిఁ బ్రేమయింకను నధికమయ్యెను. నేఁడు రాజభవనమునఁ "బిల్లికిఁ బెండ్లి" యగును. నక్షత్రరాయునికడ నొకచిన్నపిల్లి కలదు. దానితో మండలదేవునికడ నున్నమగపిల్లికి వివాహముచేయుఁబడును. ఈపెండ్లిని గుదిర్చినచూడామణి యనునాతఁడు మూఁడు వందలరూపాయీలను, గొప్ప విలువగలశాలువ నొకదానిని బహుమతిగాఁ గొనెను. పసుపు, నూనె, మున్నగువానిసేకరించుటకుఁ దగినయేర్పాటులు చేయఁబడినవి. నేఁటిసంధ్యాసమయమున శుభముహూర్తమున వివాహము జరుగనున్నది. ఈయుత్సవకారణమునఁ గొన్నిదినములనుండియు రాజభవనమున నూపిరితీయుటకైన నెవ్వనికిని వీలులేకుండెను. సంధ్యాసమయమున వీథులలో దీపములు వెలుఁగుచుండెను. నౌబత్ శాలయందు వాద్యములు మ్రోగుచుండెను. మండలదేవునియింటినుండి పల్లకిలోఁ గూర్చుండి పెండ్లివేషముతో మగపిల్లి యత్యంతదీనస్వరమున "మ్యావ్, మ్యావ్" అని అఱచుచు బయలుదేఱెను.

మండలదేవునియింటియందుండు నొకబాలకుఁడు తోడిపెండ్లి కొడుకువలె నామార్జారవరుని కంఠమునఁ గట్టఁబడినత్రాడు చేతితోఁబట్టుకొని వెనువెంట నడుచుచుండెను. స్వస్తివాచకుల తోను శంఖధ్వనులతోడను వివాహమండపమునకుఁ దీసికొని రాఁబడెను. పురోహితునిపేరు "కేనారాముఁడు." నక్షత్రరాయ లాతనికి 'రఘువతి' యని పేరుపెట్టెను. రాయలు నిజముగురఘుపతి వలన మిక్కిలి భయపడుచుండెడివాఁడు. కావున నీతని కాపేరు పెట్టి పరిహసించుచు వినోదించుచుండెను. ఇంతియకాక యాతని మాటిమాటికి నవమానించుచుండెను. దీనుఁడును దరిద్రుఁడు నగునా కేనారాముఁడు బాధల నన్నింటిని సహించి యూరకొని యుండెను. మఱునాఁ డాతఁడు తనదురదృష్టవశమున దర్బారునకు రాలేకపోయెను. ఆతనికుమారుఁ డధికమగుజ్వరతాపముచే మర ణింప నుద్యుక్తుఁడై యుండెను. నక్షత్రరాయ లతికఠోరస్వరంబున "రఘువతి యెక్కడ? " నని యడిగెను. "ఆతనియింటఁ నెవ్వ రికో మిక్కిలి జ్వరబాధగా నున్నదఁట." అని నౌకరు జవాబు చెప్పెను. నక్షత్రరాయలు ఉగ్రరు క్తముగా "వానిని దీసికొని రమ్ము." అని యాజ్ఞాపించెను. పరిజనులు పరువెత్తిరి. ఆసమయ మున గట్టిగా మొఱపెట్టుచున్న మార్జారవధువుసన్నిధి నాటపా టలు చెలంగుచుండెను. నక్షత్రరాయలు "శహానా పాడుము" అని సెలవిచ్చెను. శహానారాగ మాలాపింపఁ బడుచుండెను. ఇంతలో నౌకరులు వచ్చి "రఘువతివచ్చెను. " అని మనవి చేసి కొనిరి. రాయ లతిక్రుద్ధుండై "తీసికొనిరమ్ము " అనెను. పురో హిత మహాశయుఁ డతిత్వరితముగా లోనికి వచ్చెను. పురోహి

తుని గనినంగోడనే యాతనిభ్రూకుటి విడిచిపోయెను. ఆతనిభావ లక్షణములు మాఱిపోయెను. ముఖము మలినత్వము నొందెను. శరీరమంతయు స్వేదజలపూరిత మయ్యెను. శహానాగానము, సారంగము, తబలా మొదలగు వాద్యము లన్నియు నొక్కసారి యాఁగిపోయెను. నిద్రపోవు చున్నట్లు నిశ్శబ్దముగా నున్నయా మందిరమునఁ గేవలమార్జారవధూస్వరము మాత్రము "మ్యావ్, మ్యావ్" అని నిండియుండెను.

ఆ! అట్లయిన నిజముగ నతఁడు రఘుపతియే. ఇందున నేమియు సందేహము లేదు. పొడుగుగాను, సన్నముగాను తేజస్విగా నున్నరఘుపతికిఁ జాలదినములనుండియు నాఁకలితో వేగుచున్న కుర్కురమునకువలెనే నేత్రములయందే బలముండియుండెను. అతఁడు ధూళిధూసరితములగు తనపాదములరెండింటిని వివాహమంటపమున నిడి తలయెత్తి చూచుచుండెను. "నక్షత్రరాయా!" అని పిలిచెను. నక్షత్రరాయ లేమియు మాటలాడలేదు. "నీవు రఘుపతిని బిలిపించితివి. నేనువచ్చితిని." నక్షత్రరాయలు హీనస్వరంబున "ఆఁ" అనెను. రఘుపతి "లెమ్ము! ఇటురమ్ము!" అని పిలిచెను. నక్షత్రరాయలును మెల్లమెల్లగా నాసనమునుండి లేచెను. పిల్లియొక్క పెండ్లి, శహానా రాగము, సారంగము మున్నగునవి యున్నవియున్నట్టులే మాయ మయ్యెను.

---

## —— ఇరువదియాఱవపరిచ్ఛేదము. ——

రఘు.—"ఏమీ! జరగుచున్నదంతయు?"

నక్ష.—(తలవంచుకొని) "నాట్యము జరగుచున్నది."

రఘు.—(దయతో ముక్కుఁ జిట్లించుచు) "ఛీ! ఛీ!!"

నక్ష.—(అపరాధివలె నిలువఁ బడియుండెను.)

రఘు.—"నీ విచ్చటనుండి బయలుదేఱవలయును తత్ప్రయత్నమున నుండుము" అనెను.

నక్ష.—"ఎచ్చటికి ప్రయాణము?"

రఘు.—"ఆమాట చెప్పెదను. ఇప్పు డిచ్చటినుండి నాతోఁ గలిసి రమ్ము."

నక్ష.—"నేనిచ్చట సుఖముగా నున్నాఁడను."

రఘు.—"సుఖముగా నుంటివా? నీవు రాజవంశమున నుదయించితివి. నీపూర్వులందఱు రాజ్యభోగముల ననుభవించిరి. రాజ్యమునేలిరి. నీ విచ్చట నేఁ డీయరణ్యప్రాంబల్లెలో మృగాలములకు రాజవై యుంటివి. ఇట్టు లుండియు, "నే నిచ్చట సుఖముగా నున్నాఁడ ననుచుంటివి. ఇదియు క్తమార్గమేనా?" అనెను. రఘుపతి, కఠినవాక్యములతోడను, తీక్ష్ణము లగుకటాక్షపాతములతోడను నక్షత్రరాయ లుచితపదవియం దుండలేదని సూచించెను.

నక్షత్రరాయ లాతనిభయంకర మగు ముఖతేజముచే నాకర్షింపఁబడి కొంచె మెక్కువ తక్కువగా నాతఁడు చెప్పిన

మాట లుచితము లనియె తలంచెను. "అయ్యా! అటుల యిన యుక్తపదవి యేది? ఎట్లులు నే నుండవలయును? ఇప్పుడు నేఁ జేయవలసినదేమి? దానికుపాయ మెద్ది?" అని యడిగెను.

రఘు.—"ఉపాయము లనేకములు కలవు. ఉపాయముల కేమి కొదువ? నేను నీకవి చెప్పెదను. నీవు నావెంట రమ్ము." అని వచించెను.

నక్ష.—"దివాణజీతో నొక్కసారి చెప్పి వచ్చెదను."

రఘు.—"అవసరము లేదు."

నక్ష.—"ఇచ్చటినావస్తువు లన్నియు విడిచిపెట్టవలయునే?"

రఘు.—"వానితో నేమియును బ్రయోజనము లేదు."

నక్ష.—"ఒకనౌకరు నైన?"

రఘు.—"ఏమియు నక్కఱ లేదు."

నక్ష.—"నాకడ ధన మేమియును లేదే?"



రఘు.—"నాకడ నున్నది. ఇప్పుడు నీవు దీర్ఘాలోచన చేయవలదు. ఇప్పుడే నిద్రింపఁబొమ్ము. రేపటిసూర్యోదయమునఁ బ్రయాణము సాగవలయును." అని చెప్పి యతనిప్రత్యుత్తరము నపేక్షింపకయే రఘుపతి వెడలిపోయెను.

ప్రాతఃకాలమున నక్షత్రరాయలు మేలుకొనియెను. అప్పుడు వందిమాగధులు మధురముగా భూపాలరాగము నాలాపించి స్తుతిపాఠకులను పాడుచుండిరి. నక్షత్రరాయలు వెలుపలిసభా

మందిరమునకు వచ్చి కిటికీ తెఱచి చూచెను. పూర్వదిశను సూర్యోదయ మగుచుండెను. అరుణకిరణములు ప్రసరించు చుండెను.

ఉభయతటములందున్న మహావృక్షమునడుమనుండి చిన్న చిన్న పల్లెగ్రామములయొక్క యిండ్ల గుమ్మముల నొరయుచు బ్రహ్మపుత్రానది తనవిపులమగు జలధారలనుదోకొని నిరంతరము ప్రవహించు చుండెను. రాజభవనమున కెదురునదియొడ్డున నొక చిన్న గేహముగానవచ్చుచుండెను. ఒకస్త్రీ యాయింటిగుమ్మమును దుడుచుచుండెను. ఒకపురుషుఁడు వానితో నొకటిరెండుమాటలు మాటలాడి తలపైఁ దనముప్పటి చుట్టుకొని యొకనిడుపగువెదురు కఱ్ఱతుద నొకబుట్ట కట్టుకొని నిండుమనంబున నెక్కడికో వెలువడి పోవుచుండెను. పెద్దపక్షి యొక రావిచెట్టుయొక్క విశాలములగు నాకులజొంపములోఁ గూర్చుండి గానముచేయుచుండెను. పాలపిట్టయు (పచ్చనిపిట్ట) నొకపావురమును సోపానములపై వ్రాలియుండెను. ద్వారముకడ నిలువఁబడి వీథివైపునఁ జూచుచు నక్షత్రరాయు లొకదీర్ఘనిశ్వాసమును విడిచెను. ఈసమయమున రఘుపతి వెనుకనుండి వచ్చి తనచేతితో రాయలను తాఁకెను. రాయలు త్రుళ్లిపడెను. రఘుపతి మెల్లఁగా మధ్యమస్వరమున "ప్రయాణమున కన్నిసామానులును సిద్ధములయినవి." అని చెప్పెను.

నక్షత్రరాయలు చేతులు జోడించుకొని దీనస్వరంబున "మహానుభావా! నన్ను క్షమింపుఁడు. నే నిచ్చటినుండి మఱి

యెచ్చటికిఁ బోవుటకును సమ్మతింప లేకుంటిని. నేనీస్థలమున నిరుపద్రవముగా నున్నాఁడను.

రఘుపతి మఱియేమియుఁ బల్కక నక్షత్రరాయనివదనము నతితీవ్రదృష్టితోఁ దిలకించు చుండెను నక్షత్రరాయలు క్రిందఁజూచుచు "ఎక్కడికిఁ బ్రయాణము?" అని యతిదీనముగా నడిగెను.

రఘు.—"అది నే నిప్పుడు చెప్పలేను."

నక్ష.—"మాయన్నగారికి విరుద్ధమగు నేకార్యమును నేఁ జేయలేను."

రఘు.—(అత్యంతక్రోధంబున మండిపడి) "అన్నగారు నీ కేమి మహోపకారమొనర్చెను? ఏదీ చెప్పుము. నేనును గొంచెము విని యెదను."

నక్ష.—(మొగమును బ్రక్కకుఁ ద్రిప్పికొని కుమ్ముపై బొట్టనవ్రేలితోఁ గాయుచు) "నేనెఱుంగుదును. ఆయనకు నాపై నెంతువాత్సల్య మున్నదో యెఱిఁగలదు."

రఘు.—(పెద్దపెట్టున నవ్వి,) "హరి! హరి!! ఏమి వాత్సల్యము? నేనంతయు నెఱుఁగుదును. ధ్రువుని కే యాటంకము లేకుండ నుత్తరాధికారము నిచ్చుటకై యన్నగారు లేనిపోనినేరములు మోపి నిన్ను రాజ్యమునుండి వెడలనడిచిరి. ఆహా! గురుతరమగు రాజ్యభారముచే నవనీతవిగ్రహానన్యులగు ప్రియసహోదరులు దుఃఖవంతులు కాకపోవుదురు గాక. నీవిప్పుడారాజ్యమున స్వతంత్రుఁడవై ప్రవేశింపఁగలవా యేమి? మూర్ఖుఁడా!"

నక్ష:—(అతిత్వరితముగా) "ఏమీ నే నీపాటిమాటయును దెలిసికొనఁజాలనా ? నాకన్నియును దెలియును; కాని తెలిసియు నేమి చేయఁగలను ? ఉపాయము మాత్రమేది గలదు?"

రఘు:—"దాని యుపాయ మాలోచనలో నున్నది. అందుకొఱకే నే వచ్చినాను. నీకిష్టమైన నా వెంట రమ్ము. లేకున్న నీవెదురు డొంకల యడవియందుఁ గూర్చుండి నీక్షేమమును గోరు తల్లిదండ్రుల నామమును జపించుచుండుము. నేఁ బోవుచున్నాను."

ఇంతవఱకుఁ జెప్పి రఘుపతి పోనుద్యుక్తుఁడాయెను.

నక్ష:—(వేగముగా నతని వెనువెంట నరుగుచు) "నేనును వచ్చుచున్నాను; కాని దివాన్‌జీ రాఁగోరినయెడల నతనిని నాతోఁ దీసికొని వచ్చుట కభ్యంతర మేమున్నది ?"

రఘు:—"నీవెంట నేను తప్ప నింకేవరును రాఁ జనదు."

ఇంటిని విడిచి నక్షత్రరాయని పాద మావలికిఁ బోవ నొల్లకున్నయది. వినోదకరములగు నచ్చటివస్తువుల నన్నిటిని వీడి దివానుగారిని త్యజించి తెలియక రఘుపతి వెనువెంట నెచ్చటికిఁ బోవుట ? కాని రఘుపతి యాతని ముంజేయిపట్టుకొని లాగుకొని పోవుచుండెను. ఇంతియేకాక నక్షత్రరాయులకునంబన భయమునకుఁ దోడుగా నొకవిధమైన కుతూహలము నుదయించెను. కుతూహలమునకు రాఁబోవుఫలమే కారణము.

నావ నంసిద్ధమై యున్నది. నదీతీరమునకు వచ్చి రాయలు, భుజముపై నంగవస్త్రము వేసికొని స్నానార్థమై వచ్చిన

పీతాంబరుని జూచెను. పీతాంబరుఁడు నాతని జూచి నమ్రుఁడై "జయము జయము మహారాజా! నిన్న నెవఁడో యెక్కడనుండియో యొకదుష్టమానవుఁడు వచ్చి పరమానందదమగు వివాహవినోదమున విఘ్నమొనరించె నని విని యుంటిని" అనెను. నక్షత్రరాయుఁ డుదాసీనుఁడై యుండెను. రఘుపతి ధైర్యముగా "అదుష్టబ్రాహ్మణుఁడను నేనే" అని పలికెను.

పీతాంబరుఁడు నవ్వుచు "మీముఖము ముందు మిమ్ము నిందించుట మంచిది కాదు. తండ్రియైనను దనయుఁడైనను నిట్టిపని చేయుచున్నాఁడని తెలిసినను మొగముముందఱ నెవరి నెవఁడును నిందచేయలేఁడు. తమరు మనంబున నేమియు విచారింపకేరు. ఎదుట వచియింపలేక పోయినను బరోక్షమం దేల చెప్పకొనరు? నాకడ నన్నెవఁడు 'రాజు' అనుచుండునో వాఁడే పరోక్షమందుఁ బీతాంబరుఁ డని వ్యవహరించుచుండును. పరోక్షమున నేదియో యనుటయు మొగముముందఱ నేమియు ననకపోవుటయు సమానమే. నేనుమాత్ర మిట్లు తలఁచుచుంటిని. తమ ముఖకమల మింతకాపట్యయుక్తమై యున్నదో నిజమును గుర్తెఱుంగ లేకున్నాము. ఎవని మొగమున నిట్టికాపట్యము కనుపించినను లోకులు వానినను మానింపక మానరు." అని రాయలనుజూచి "మహారాజా! యింత ప్రొద్దున నదీతీరమునకుఁ దాము విచ్చేయుటకుం గతమెద్ది?" అని యడిగెను.

నక్షత్రరాయలు కరుణారసంబున నుదయించిన కంఠస్వరముతో "దివాన్‌జీ! నేనిప్పుడు వెళ్లిపోవుచున్నాను. ఇదే కారణము." అని ప్రత్యుత్తరమిచ్చెను.

పీతా.—"ఏమీ! వెళ్లిపోవుచుంటిరా? ఎచ్చటికి? రాజామండలదేవుని మందిరమునకా?"

నక్ష:—"కాదు! దివాన్‌జీ! మండలదేవుని మందిరమునకుఁ గాదు. మిక్కిలిదూరము."

పీతా:—"మిక్కిలి దూరమా? అయినచోఁ బాయికాఘాటునకు వేఁటాడఁ బోయెదరా ఏమి?"

రాయలొక్కసారి పీతాంబరునివదనమును జూచి విచారభావముతోఁ దలవాంచి కాదని సన్నయొనర్చెను.

రఘు:—"వేళయతిక్రమించు చున్నయది. నావపైఁ గూర్చుండుఁడు" అని ప్రబోధించెను.

పీతాంబరుఁ డతిసందేహముతోడను గోపముతోడను రఘుపతిని బిలకించి "అయ్యా! తా మెవరు? మామహారాజుగారిపై నధికారము సేయుటకై వచ్చితిరా?" అని యడిగెను.

నక్షత్రరాయలు వ్యగ్రమానసుఁడై పీతాంబరుని దనదగ్గఱగా లాగి "ఈయన మాగురువుగారు" అనెను.

పీతా:—"మంచిగురువుగారే. ఆయనను మాదేవీమందిరమున నుండనిండు. నేను బియ్యము, పాలు, అరటిపండ్లు, మున్నగువదార్థములను దెచ్చి యిచ్చెదను. గౌరవపూర్వకముగా నాతనికడఁ బ్రవర్తించెదను. తమ కెచ్చటికేఁగ నేమిపని?"

రఘు:—"కాలము వ్యర్థముగా గతించుచున్నది. అయిన నేఁ బోయెదను."

పీతా:—"తమచిత్తము. ఆలస్య మొనరించినఁ బ్రయోజన మేమి? మహానుభావా! తాము శీఘ్రముగాఁ బాదములను నడపింపుఁడు. నేను మామహారాజుఁ దీసికొని మహాలునకుఁ బోయెదను."

నక్ష:—(ఒక్కసారి రఘుపతిముఖమును జూచి మెల్లఁగా) "కాదు దివాన్‌జీ! నేఁబోవక తీరదు."

పీతా.—"ఐనచో నేనునువచ్చెదను. ఈసేవకుని దమవెంటఁ దీసికొని పొండు. తమరు రాజవీథిని బయలు దేఱుఁడు. రాజుగారెచ్చటికైన నేఁగుచున్న నేమి? దివానుగారు వెంటఁబోవరా?"

నక్ష.—"రఘుపతి మొగము వంక నే చూచుచుండెను."

రఘు.—"ఎవ్వరును వెంట రా వీలులేదు."

పీతా.—ఉదాసీనుఁడై రాయులహస్తమును బట్టుకొని "బాబు! చూడుఁడు. నేను మిమ్ముల రాజుగారని పిలుచుచున్నాఁడను. కుమారునివలెఁ బ్రేమించుచున్నాఁడను. నాకు సంతాన మేమియును లేదు. మీపై నాయధికార మేమియును బనిచేయు లేదు. తాము దయచేయుఁడు. నాబలాత్కారము మిమ్ము నిలుపఁగలదా? కాని నా మనంబున నొకమాట యున్నది. తమరెచ్చటికిఁ బోయెదరు? ఎచ్చట కేఁగినను నేమరణించు కాలమునకు రాఁగలరా? అట్లు వచ్చితిరేని నాయీరాజైశ్వర్యము మీచేతిలోఁ బెట్టి నిర్విచారుఁడ నయ్యెదను. ఇదియే నామనోరథము." అనిచెప్పెను.

నక్షత్రరాయులును, రఘుపతియును నావపైఁ బ్రవేశించిరి. నావ దక్షిణపుదిక్కునకు నడుపఁబడుచుండెను. పీతాంబరుఁడు

స్నానము చేయ మఱచి భుజముపై నంగవస్త్రము వైచుకొనియే తనమందిరమునకుఁ జింతాకులితస్వాంతుఁడై యేఁగెను. గుజురుపాదాగారము నిజముగా శూన్యమైనది. దానియానందోత్సవ మంతయు నంతరించినది. కేవలము మామూలుగా జరుగునుత్సవాదులు జరపఁబడు చుండెను. ప్రాతఃకాలమునఁ బక్షులచహాచహాశబ్దములును, ఆకులకడకడశబ్దములును నదియుందుఁ దరంగములను కరతాళధ్వనులును విశ్రాంతిలేక చెలంగుచున్నవి.

---

## ఇరువదియేడవపరిచ్ఛేదము.

ప్రయాణము దూరదేశమునకు; కొంతవఱకు నది; కొంత వఱకు దట్టమైనయడవి; కొన్నిచోట్ల పలుచనియడవి; ఒకప్పుడు నావమీఁద, నింకొకప్పుడు నడిచి, మఱియొకప్పుడు బండపైన, ఒకసమయమున నెండలో, నింకొకసమయమున వర్షధారలలో, ఒకప్పుడు మబ్బుగా నున్నపగటియందు, వేఱొకప్పుడు భయంకరాంధకారబంధుర మగురాత్రియందు, నక్షత్రరాయులు విడువక ప్రయాణము చేయుచుండెను. ఎన్నియో దేశములు, ఎన్నియో దర్శనీయములగు విచిత్రవస్తువులు, ఎందఱో వింతవింతమనుజులును గాన్పించుచున్నారు. నక్షత్రరాయునిపార్శ్వమున నీడ

వలె నీరసించి యెండవలె తేజోవంత మగు నారఘుపతి యొక్కఁడు మాత్రము వీడక వెంటవెంటనే వచ్చుచుండెను. పగటియందు రఘుపతియే; రాత్రియందు రఘుపతియే. మెలఁకువయు స్వప్నమందున నంతటను రఘుపతి ప్రత్యక్షమై ప్రకాశించుచుండెను. వీథులలో యాత్రాజనములు గల్గియుండిరి. వీథిగొందులను ధూళి యందుఁ బిల్లలాడుకొనుచుండిరి. బజారులలో నవేరుల వర్తకులు వస్తువులను ఖరీదుచేయుచుఁ దిరుగుచుండిరి. గ్రామమందు ముసలివారలు సోగటా లాడుకొనుచుండిరి. రేవులలో నాఁడు వారు నీళ్లు ముంచుకొనుచుండిరి. నావలపై జాలరులు పాటలఁ బాడుకొనుచుఁ బోవుచుండిరి; కాని నక్షత్రరాయల వెనువెంట నుర్బలమైన సన్నని యొడలుగల యారఘుపతిమాత్ర మెప్పుడు నతి జాగరూకతతో నడుచుచుండెను. ప్రపంచమున నలుదెసలను విచిత్రకరములగు నుత్సవములు జరగుచుండెను విచిత్రములగు పనులు చేయఁబడుచున్నవి; కాని యిట్టియాశ్చర్యరహస్యమయ మగు నాట్యశాలామధ్యమునుండి యానక్షత్రరాయుని దుర్భాగ్యదేవత యాతనిఁ దీసికొని పోవుచుండెను. జనసమూహమున్న చోటు లతనికి నిర్జనప్రదేశములగుచున్నవి. జనులుండని వాసస్థలము లతనికి సుఖప్రదములగుచుండెను. నక్షత్రరాయ లలసి తన ప్రక్కన నడుచుచున్నవాఁడితో "ఇప్పు డింక నెంతదూరము పోవలయును?" అనెను. "చాల దూరము!" అని యాతఁడు ప్రత్యుత్తర మొసంగెను. "ఎక్కడికి పోవలయును?" దానికి జబాబులేదు. రాయ లూపిరి తీసికొని నడచుచుండెను. తరువీథులయందలి యాకుల వలన నీడ గలిగి చల్లనై సుఖకరములగు నిండ్లను జూచి యాతఁడు

తనమనమున "అయ్యో! నే నీగృహవాసులలో నొకఁడనై యుండినను బాగుగా నుండును" అనుకొనియెను. సాయంసమయమగునంతన పసులకాపరులు భుజములపై వెదురుదుడ్లనూనుకొని మైదానములనుండి గ్రామమార్గమున ధూళి నెగురఁగొట్టుచు నాలమందలు తమదూడలకై యంబారవములఁ జేయుచుఁ దోఁకలెత్తుకొని వచ్చుచుండ నవి సంతోషముగా నిండ్లను జేరుకొనునప్పుడు నక్షత్రరాయ లదిచూచి "అయ్యో! ఈజనులతోఁ బోయినచో సంధ్యాసమయమున నింటికి వచ్చి శ్రమ దీర్చికొనవచ్చును. ఇట్లైనఁ గొంత బాగుగా నుండును." అనుకొనెను. పగలు రెండుయామముల వేళ నెండలో బుజములపై నాగండ్లు నుంచుకొని వచ్చుచుండిన వ్యవసాయకులగు కాఁపుజనులను జూచి "ఆహా! ఇందున నేమి సుఖము కలదు?" అనుకొనెను. మార్గాయాసమున నక్షత్రరాయులు కాంతియు బలమును జెడి నల్లపడెను. నక్షత్రరాయలు "బాబాజీ! ఇంక నే జీవింపను" అని యలసి పలికెను. రఘుపతి "నిన్నెవ్వరు చనిపోవనిత్తురు?" అనెను. నక్షత్రరాయలు తనమనంబున "రఘుపతి సెలవులేక మరణించుటకైన నాకు స్వతంత్రత లేదు" అని నిశ్చయించుకొనెను. ఒక వనితారత్నము రాయులఁ జూచి "ఆహా! యీతఁ డెవ్వరి బిడ్డఁడో! అయ్యో! యీతని నింటనుండి యెవరు వెడలఁ గొట్టిరి?" అని కనికరమునఁ బలికెను. ఆమాటలు విని నక్షత్రరాయుల హృదయ మవిసెను. ఆతని విశాలనేత్రము లశ్రుజలపూరితము లయ్యెను. ఆవనితారత్నమును దల్లీ! యని పిలుచుచు నామె వెంట యింటికిఁ బోవలయు నని యిచ్ఛగించెను.

రాయలు రఘుపతిమూలమున నెంతకష్టము నొందెనో యాతనికంత స్వాధీనుఁ డయ్యెను. ఆతనివ్రేలిసన్నచే రాయల ప్రవర్తనము జరగుచుండెను. నడువనడువ నదీబాహుళ్యము తగ్గినది. అంత కంతకుఁ గఠినప్రదేశము ముందునకు వచ్చినది. మన్నుట్టినిది. కంకరజాలు. దూదవృక్షల ప్రజలయిండ్లు గానవచ్చు చున్నవి. వేళ మిక్కిలి తక్కువగా నున్నది. నారికేళవనప్రదేశ ములను విడిచి తాళవనప్రదేశముల కాయిరువురు బాటసారులు వచ్చుచుండిరి. నడుమనడుమఁ బెద్దపెద్దవంతెనలు కలవు. సుఖకర ములగు నదీప్రవాహములు గలమార్గము. దూరమునుండు పర్వతరాజములు మేఘము లనుభ్రాంతిని గలుగఁ జేయుచున్నవి. క్రమముగా శాహాశుజావారి రాజధాని యగురాజమహాలు సమీపించు చుండెను.

---

## ఇరువదియేఁమిదవపరిచ్ఛేదము.

ఎట్టులైన నేమి? శాహాశుజా తనరాజధానియగు రాజ మహాలు చేరుకొనెను. పట్టుపడి కారాగారమునుండి తప్పించు కొని వచ్చినది మొదలతఁడు యుద్ధసేనలను క్రొత్తగాఁ గూ ర్చుచుండెను; కాని కోశాగారమున ధనమేమియును లేదు. ప్రజ లు దొంగలవలన సర్వస్వమును గోలుపోయియుండిరి. ఈసమ యమున నౌరంగజేబు దారా యను తనయన్నను జయించి

డిల్లీపాదుషా సింహాసనము నధిష్ఠించెను. శుజా యీవార్తను విని భయపడుచుండెను. యుద్ధమునకుఁ దగినంతసాహస మలవడ లేదు. ఈకారణములచేఁ గొంతకాల మావలఁ ద్రోసికొన నిశ్చయించి శుజా కపటమనస్కుఁడై యౌరంగజేబుకడ కొకదూత నంపించెను. "కన్నులకు సౌఖ్యదాయియై హృదయమున కానంద స్వరూపియై పరమస్నేహితుఁడను భ్రాతృమిత్రుఁడును సహోదరుఁడు నగు నౌరంగజేబు డిల్లీసింహాసనమునందుండి సఫలమనోరథుఁడాయె నని శుజాసంబంధమగు మృతకళేబరమున మరలఁ బ్రాణవాయుసంచారము కలిగినది. ఇట్టి యానందసమయమునఁ గ్రొత్తపాదుషాగారు మరల శుజాకొఱకు బంగాళా రాజ్యశాసన భారము దయచేయించినచో నతనియానందమున కేమియును గొఱఁత కలుగదు." అని వర్తమాన మంపెను. అది విని యౌరంగజేబత్యాదరంబున దూతను బిలిపించి శుజాసేమము నడిగెను. మఱియు నతనిపిల్ల పాపల సేమము నడిగి తెలిసికొనుట యందుఁ దనకుఁ గలయుత్కంఠాతిశయమును వెల్లడించెను. "పూర్వము పాదుషాగారగు షాజహాను స్వయముగ శుజాకు బంగాళా రాజ్యమును శాసించు భారమును దయచేసియే యున్నారు. కావున మరలఁ గ్రొత్తగా మేమేమియు వ్రాసి యీయ నక్కఱలేదు." అని యౌరంగజేబు ప్రత్యుత్తరము నొసంగెను.

ఈసమయమున రఘుపతి శుజాగారి ద్వారమునకుఁ బోయి హాజరు మనవి చేసికొనియెను. శుజాగారు మిగులఁ గృతజ్ఞతయు

గౌరవము నగపఱచుచుఁ దన్ను రక్షించినరఘుపతిని బిలిపించి "నేమముగా నున్నావా?" అని యడిగెను.

రఘు:—"దేవరవారిసన్నిధి నొకవిజ్ఞాపనము చేసికొనవలె నని ప్రార్థించుచున్నాను."

శుజా:—(తనలోఁ దా నాలోచించుకొనుచు) "ఇప్పుడు నురల నేమి విజ్ఞాపనము? ధనము నకుఁగఁనుండినచో నేమియు నా టంకము లేదు."

రఘు:—"నా విజ్ఞాపన మిదియేనా?"

శుజా:—"బ్రాహ్మణోత్తమా! నేను నీయభీష్టమును దీర్చెదను; కాని కొన్నిదినములు తాళుము. ఇప్పుడు ఖజానాలో నధిక ముగా ధనము లేకున్నది."

రఘు:—"ప్రభుసత్తమా! నేను బంగారముకాని వెండియుఁగాని యింకేవిధమైనద్రవ్యముగాని కోరి యుండలేను. నేనిప్పు డు పావఁ దీఱినయూయుధములు కోరుచున్నాను. నావిన్నప మునువిని బాగుగ నాలోచింపఁ బ్రార్థించుచున్నాను.

శుజా:—"మిక్కిలి చిక్కులలోఁ బడియుంటిని. నే నిప్పు డాలోచించుటకుఁ దీఱికలేదు. మీరు మంచిసమయమున వచ్చితిరి."

రఘు:—"ఆర్యా! సమయ మసమయ మనునది యెల్లరకును గలదు. ప్రభువుపాదుషాగారికైనను సరియే పేదవాఁడైన నగు నాకైనను సరియే. సమయాసమయములు కలిగియే

యుండును. మీసమయమును గుఱించి మీరు విచారించు చుండినయెడల నాసమయ మేమగును? నావిన్నపమును మఱియెవ్వరు వినువారు?"

శుజా—(చీకాకుపడి) "మంచిసమయమే. ఇన్నిమాటలు వినుట కంటె నీప్రార్థనయేదో వినుటయే యుత్తమము. చెప్పు మేమి చెప్పెదవో?"

రఘు—"త్రిపురానగరాధీశుండగు గోవిందమాణిక్యరాయలు నిష్కారణముగఁ దనతమ్ముని దేశమునుండి వెడలఁ గొట్టెను."

శుజా—(కుపితుండై) "బ్రాహ్మణుఁడా! పరులకార్యములను జంకఁబెట్టుకొని నాకాలము నెందుకు వ్యర్థపఱిచెదవు? ఈ మాటలన్నియు నాలోచింప నిది సమయముగాదు."

రఘు—"అభియోగి (నేరస్థుఁడు) ప్రస్తుత మిచ్చట హాజరుగా నున్నాఁడు."

శుజా—"అతఁడు తానుగ వచ్చి ప్రార్థించినచో నప్పుడు విచారింపవచ్చును."

రఘు—"వాని నిప్పుడు హాజరు పెట్టవలయునో?"

శుజా—"బ్రాహ్మణుఁ డెట్టులును బంతమును విడువఁడు. సరియే! యొకవారము గడచినతరువాత వానిని దీసికొనిరమ్ము."

రఘు—"ప్రభువువారి సెలవైనచో వాని నిచ్చట రేపటిదినము హాజరుపెట్టఁగలను."

శుజా—(మిగుల చీకాకు నొంది,) "సరియే! రేపు వాని నిచ్చుటకుఁ దీసికొనిరమ్ము. సాయంకాలమయినది." శుజా కొలువు చాలించెను. రఘుపతియు సెలవుగైకొనెను.

నక్ష—"నవాబువారిసన్నిధి కేఁగినప్పుడు నజ రేమి తీసికొని పోవలయును?"

రఘు—"అందులకై నీవు దురపిల్లవలసినదిలేదు." అని రఘుపతి లక్షయేబదివేలరూకలఁ దెచ్చి యాతనియం దుంచెను.

మఱునాఁ డుదయమున రఘుపతి భయపడుచున్ననక్షత్రరాయలఁ దోడ్కొని శుజానవాబువారిదర్బారునఁ బ్రవేశించెను. లక్షయేఁబదివేలరూప్యములు శుజాపాదసన్నిధి నర్పించెను. అప్పుడు శుజాగారివిలాసములు మునుపటివలె ననిష్టములయి యుండలేదు. నక్షత్రరాయనికోరికను దప్పక నెఱవేర్పవలసినదిగా నతఁడు నిశ్చయించుకొనెను. "నీవిప్పు డేమి కోరుచుంటివో చెప్పుము." అని సెలవిచ్చెను.

రఘు—"గోవిందమాణిక్యరాయలను రాజ్యచ్యుతునిఁ జేసి యాతనిస్థానమున నక్షత్రరాయని రాజుగా నియమింపఁ దమ రాజ్ఞాపత్రమును బ్రసాదింపవలయునని ప్రార్థన."

శుజా తనసోదరునిపదవి నాక్రమించుటలో నించుకైన వెనుదీయనివాఁడైనను దత్సమయమున నాతనిహృదయమున నిట్టిపని సేయఁ దగదని మాత్రము తోఁచెను; కాని యిన్నిటికంటె నైతానువలెఁ బట్టినపట్టు వీడనిరఘుపతికార్యమును నెఱవేర్చి యంపించుటయే ముఖ్యమని తోఁచెను. ఇది నెఱవేర్పక

పోయినచో రఘుపతి మరల వచ్చి తన్నుఁ బీడించునని భయపడెను. మఱియొక కారణమును గలదు. లక్షయేఁబదివేలరూప్యములు నజరుగాఁబుచ్చుకొనియు వారిపనిఁజేయకుండుట మంచిపనికాదుకదా. "మంచిది, బ్రాహ్మణోత్తమా! గోవిందమాణిక్యరాయలను రాజ్యచ్యుతుని జేయుటకును, నక్షత్రరాయలకు రాజ్యము దఖలుపఱచుటకును నధికారము నీకే యీఁబడినది. నీవితని నీతోఁ దోడ్కొనిపొమ్ము!" అనెను.

రఘు—"కొంతసేనతోఁ గలిసివెళ్లుట మంచిదనుకొనియెదను."

శుజా—"వద్దువద్దు. అట్లు చెప్పటికిని వద్దు. నేను యుద్ధమునకు మీకిప్పు డనుమతియొసంగలేను."

రఘు.—"యుద్ధమునవలసినఖర్చు వెచ్చములకై ముప్పది యాఱు వేలరూపాయీలు నే సిద్ధపఱచియుంచినాను. మఱియు నక్షత్ర రాయలు నరేంద్రత్వ మొందినతోడనే యొకసంవత్సరము వచ్చురాఁబడి సేనాపతిద్వారా హుజూరువారి కనుపుకొను చున్నాను."

ఈప్రసంగము శుజా కత్యంతోపయుక్తముగాఁ దోఁచెను. మంత్రియు నీవిషయమునఁ దనసమ్మతిని దెలిపెను. ఒకమొగలాయీపటాలమును దోడ్కొని రఘుపతియును నక్షత్రరాయలును వెడలిపోయిరి.

---

నతతో నొకచిన్నతొనఁ దీసి యాబాలికాముణినోట నుంచెను. మఱియు మిక్కిలి ప్రేమతోఁ దలనెగురవైచుచు "తినుము, నీవు తినుము" మని పలికెను. ఆబిడ్డ యాతొనఁ దిని మిక్కిలిసంతోషించి నవ్వుచు 'ఇంకనుదినియెదను' అనెను. ఇవ్విధో ధ్రువుఁడుకొంచెము సంకోచించెను. మైత్రి కిట్టిపనులు మిక్కిలియుపయుక్తము లని ధ్రువుం డెఱుంగఁ డయ్యెను. ధ్రువుండు తనస్వాభావికగాంభీర్య చతురతాగుణంబులతోఁ దలత్రిప్పుచుఁ గ్రీగంటిచూపులు చూచుచు "ఇప్పుడు మఱి తినవలదు. ఎక్కువ తినిన మంచిది గాదు. జబ్బు చేయును. బాబుగారు కొట్టుదరు" అని చెప్పుచు నొక్కసారి వేగముగా మిగిలి యున్నతొనలన్నియు నోటవేసికొని తినెను. ఒక్కమాఱుగా నాబాలికాముఖకమలమున వివర్ణత గానవచ్చెను. ఏడ్పుచున్నచిన్నెలు గానవచ్చుచున్నవి. ధ్రువుం డవ్వి రేడ్చినను విని సహింపలేఁడు., అతఁ డతివేగముగా నాపిల్ల నోదార్చి "రేపి చ్చెదను" అని సమాధానపఱుచుచుండెను.

ధ్రువుండు రాజుగారు రాఁగానే మిక్కిలి సావధానతతోఁ దన క్రొత్తచెలిమికత్తెదెస చూచుచు "దానితో నేమియు మాట్లాడకుము. అది యేడ్చుచున్నది. ఆమెను గొట్టకుము" అనెను. రాజుగారి కాబాలికపై నేవిధమైన యనిష్టము లేకపోయినను రాజుగారిని గౌఁగిలించుకొని తన్నెట్టులైన గోపింపకుండున ట్లొనర్చుట యావశ్యకమని ధ్రువుండు తలచెను. చతురులగు లోకులేవిధమగు శాంతభావము గలిగియుండుమని ధ్రువునికి మంచిమాటలను జెప్పుచుండిరో, చెడుపనులనుండి తొలఁగునట్లు గద్దించుచుండిరో, అటులనే ధ్రువుండు వారల నానందింపఁ జేయుటకై, యుపదేశ

తిరస్కారమును దనప్రవర్తనమందుఁ జూపుట దనకు ముఖ్య కర్తవ్య మని తలంచుచుండెను. రాజుగా రాబాలికను గొట్టలేదు. ధ్రువుండు తాను జెప్పినమాట వ్యర్థము గాలేదని తెలిసికొని యెను. తరువాత నాబాలుఁడధైర్య మవలంబించెను. "భయ పడ నక్కఱలేదు." అని బాగుగ దెలిసికొని యతఁ డతిగాంభీ ర్యముతో నాబాలికామణికి ధైర్యముజెప్ప నారంభించెను.

ఆపిల్లదానికి నేమియు భయము లేదు. ఆబిడ్డ స్వేయ ముగా రాజుగారిదగ్గఱకుఁ బోయి యమితమగు సంతోషమును దనచిఱునవ్వుచేఁ బ్రకటించుచు రాజుగారిచేతికంకణముల నటు త్రిప్పుచుఁ జూచుచుండెను.

ధ్రువుండొక్కతనప్రయత్నప్రయాసముచేత నేలోకమున నీతీరున శాంతిని బ్రేమనునిలుపుచు రాజుగారి మొగముముందఱ సంతుష్టమనస్కుండై మోదుగపూవురంగుగలిగి మిగుల మనో హరముగా వికసించి చిఱునగవు లొలుకు తన ముద్దుమోము నుం చెను. ఇట్టిచిన్ని బాలకుల మనోహరములగు చెయిదము లెవ్వని నాకర్షింపవు? రాజుగా రాతని నేచెయిదములకు లోబడి ప్రేమిం చిరో యట్టి నాబాలుం డాబాలికామణికడను జూపించెను. రాజుగా రాతనిమోమును ముద్దిడికొనిరి. అప్పుడు ధ్రువుండు తనచెలిమికత్తెను జూపించుచు గోమలకంఠస్వరమున "ఆమెమో ముగూడ ముద్దిడుకొనుఁడు." అని వినయముగాఁ బలికెను. ఆబా లునిమాటఁ ద్రోసివేయ శక్యమా? ఇంతలో నాబాలికామణియు నిర్భయముగా నెన్నిదినములనుండియో పరిచయమున్నదానివలె

మెల్ల మెల్లన నడుగులిడుచుఁ జిఱునవ్వు మోమునమ్మి నలంకరింపఁ గా రాజేంద్రుని సమీపించి యాతనికౌఁగిలిని జేరెను. ఇంత ుఱకు ధ్రువునిమనమున నేవిధమైనచంచలతయు, నుద్దండతయు నుద యింపలేదు; కాని యాబిడ్డ తన సింహాసనము నెక్కినంతన మూర్తీభవించి ఘనమై యున్నప్రేమచలింప నారంభించెను. రాజుగారికౌఁగిలిలో నుండుటకుఁ దనకొక్కనికే యధికారము స్థిరమై యుండవలెనని యాతనికి బలమగునభిప్రాయ ముదయిం చెను. ఆబాలకునిమో మరుణసరోజాకృతిని వహించెను. ఒకటి రెండుసారు లాబాలిక నీవలకు లాగెను. తనస్థితి గౌరవముయిన దని తెలిసికొని యాపిల్లను గొట్టుట యనుచిత మని యాబాలుం డెఱుంగలేదని గ్రహించి రాజుగారు జగడము నాఁపవలయునని యెంచి యాతనిని రెండవవైపు తనకౌఁగిలిలోఁ జేర్చుకొనెను. అప్పటికి నాబాలుఁ డల్లరి చేయుచునే యుండెను. రాజుగారు తన్నొక్కప్రక్క నుంచుటచే సగమధికారము పోయిన క్లించి ఆఁబోలు నున్నప్రక్కనుగూడ స్వాధీనపఱచుకొనవలె నని ప్రయత్నించుచుండెను. ఇట్టిసమయములోఁ గ్రొత్తగా నియ మింపఁబడిన రాజపురోహితుఁడు బిల్వనఠాకూరను నాతఁ డచ్చో టికి వచ్చెను. రాజుగా రాబాలబాలికలను ద్రింపి యాతనికిఁ బ్రణామ మొనర్చెను. మఱియు ధ్రువునితో "గురూజీ వారికి నమస్కరింపుము." అని చెప్పెను. ధ్రువున కటులు చేయుట యావశ్యకమని తోఁచలేదు. అతఁడు నాసికాగ్రమున నంగు ళియుంచి తనయసమ్మతినిదెలిపి నిలిచియుండెను. ఆబాలిక తన్ను

రాజుగారు చూచినతోడనే గురూజీవారిపాదముల నంటి నమస్కరించెను.

బిల్వనతాకూరు ధ్రువుని కౌఁగిలియందుంచుకొని నవ్వుచు "ఈ నీచెలికత్తె యెవరు? ఎచ్చటికి వచ్చినది?" అని యడిగెను.

ధ్రువుండు కొంతదనుక నాలోచించి, "నేను గుఱ్ఱముపై నెక్కెదను" అనుచోట నిప్పటికిని ధ్రువుండు అని యుచ్చరించుచుండెను.

పురో.—"వా! వా! నాప్రశ్నమునకును, నీయుత్తరమునకు నేమిసంబంధము?"

ధ్రువునిదృష్టి యాబాలికపైఁ బడెను. దానిగుఱించి కడు సంగ్రహముగ దనమనోగతభావమును బ్రకటించి "అది మంచిది కాదు దానిఁ గొట్టెదను." అని తనచిన్నపిడికిలిని పట్టుకొనుట కుద్యమించెను.

రాజా.—"బాబు! ఏమి చేయుచుంటివి. ఛీ! ఛీ!!"

గట్టిగా నొక్కమాఱూదినచో దీప మాఱిపోయినట్టు లొక్కసారి రాజుగారి నోటినుండి 'ఛీ!' అని వెడలగానే ధ్రువుని ముఖము నల్లఁ బడెను. మొదటఁ గన్నీళ్లాపవలెనని రెండుపిడికిళ్లతోఁ గన్నులు నులుముకొనియెను. దాని యంతకంతకు దన కోమలహృదయమును బట్టఁజాలక పోవుటచే దుఃఖ మాఁగక బోరున నేడువసాగెను. బిల్వనతాకూరాబాలుని బుజ్జగించి తీసి యెత్తుకొని మీఁదికి క్రిందికి నెత్తి దించుచు నలియబెట్టి యుతి

వేగముగా నుచ్చరించుధోరణితో "బాబూజీ ! ఇదిగో, విను విను, నీకొక మంచిశ్లోకముఁ జదివి వినిపించెదను. వినెదవా?

శ్లో. కలహాకటకటాంగం కాఠకాఠిన్యకాట్యం,
కటనకిటనకీటం కుట్మలంఖట్టమట్టం. " అని చదివెను.

(దీనికర్థము.) "ఏబాలుఁడు మిక్కిలియేడ్చుచుండునో వాని యొక్కకలహాము 'కటకటాంగం' అనఁగా చెఱలో బంధించి బాగుగ 'కాఠకాఠిన్యకాట్యం' అను ఆకలహాముయొక్క కఠినత్వమును ముక్కముక్కలుగాఁ గొట్టవలెను. తరువాత నీ 'కటనకిటనకీటం' తీసికొని మూఁడుదినములవఱకు 'కుట్మలం ఖట్టమట్టం' చేయువలెను. అని తాటాతూటముగా నర్థములేని ముక్కల నేవియో కల్పించి బిల్వనతాకూరు బాలునూఱడించెను. ధ్రువునిరోదన మంతగాఁ జల్లారలేదుగాని యీశ్లోకమును జదివి యర్థము చెప్పెడిమధ్య నొక్కసారిగా నాపివేయఁబడెను. మొట్టమొదట నాతఁ డీయాశ్చర్యజనకమగు కటకటలతోఁ గొంచెము భయమంది నిశ్శబ్దముగా బిల్వసతాకూరుముఖమువంకఁ జూచుచుండెను. అంత నాతఁడు తనమొగమును ముద్దిడుకొనుట చూచి భయమునువీడికుతూహాలుఁడై 'మరలచెప్పుము.'అనియడిగెను. పురోహితుఁడును మరల నట్టులె పఠించెను. ధ్రువుం డట్టహాసముగా నవ్వుచు "మరల" అనెను. రాజుగారు, మొదట కన్నీళ్లతోఁ దడిసిన కంఠమును, తరువాత నానందజనకమగు నవ్వుతోఁ గూడికొనిన యధరోష్ఠమును ముద్దిడికొనుటలోఁ దృప్తినొందలేనట్టు లాతనిచర్యలు సూచించుచున్నవి. రాజుగారు

ను, పురోహితుఁడు నాబాలబాలిక లిరువురతో నొకయాట కల్పించికొని యాడుకొనుచుండిరి.

బిల్వ.—"మహారాజా! తమ రీదిఱుకువారలతో నుండి వినోదముగా నుండిరి. రాత్రిందివములు తీక్ష్ణమగు బుద్ధిగలవారి దరి నుండినచో బుద్ధి యంతకంతకంతరించును. చురకత్తి నెక్కువగా సానఁబెట్టుచుండినచో నది క్రమముగా నల్పరూపియై తుద కదృశ్య మగును. ఒక్కపిడిమాత్రము మిగులును."

రాజా.—"నేనెఱిఁగినంతమట్టుకు నాబుద్ధియందు సూక్ష్మత్వమేమియును లేదు."

బిల్వ.—"అయ్యా! అటుల కాదు. సూక్ష్మబుద్ధి కిది యొకటియే లక్షణము; 'మృదువగు పదార్థమును గఠినముగాఁ జేయుట' జగంబున బుద్ధిమంతు లెక్కువగా లేకుండినచో నిందెన్నియో కార్యములు సుకరములై యుండును. ఎంతమంచిగా బోవలయునని ప్రయత్నించెదమో, యంత చిక్కు వెనువెంటనంటును. కుశాగ్రబుద్ధి గలిగియు నరుం డేమిచేయఁగలఁడు? నాకేమియును దోఁపలేదు."

రాజా.—"ఐదువ్రేళ్లతో నీ ప్రపంచమందలి పనులన్నియు బాగుగ జేయఁబడుచున్నవి. కాఁగా నేఁడువ్రేళ్లురావలయునని కోరుట పనిచెఱుపునకుఁగాక మఱి యెందున కగును." అని రాజుగారు ధ్రువుని బిలిచిరి. ఆబాలుఁ డప్పుడు తనతోడిబాలికతో నాడుకొనుచుండెను. రాజుగారి కంఠస్వరమును వినఁబడి

నంత నతిశీఘ్రముగా నాయాటనువీడి పరుగెత్తికొనివచ్చెను. రాజుగా రాతనిఁ దనయొద్దఁ గూర్చుండమని చెప్పిరి. "బాబూ! ధ్రువా! ఏదీ యాక్రొత్తపాట గురూజీవారికి వినిపింపుము. ధ్రువునికేమియు నిష్టములేదు. తనయసమ్మతిని జూపుచు బిల్వనఠాకూరు మొగమువంకఁ జూచుచుండెను. రాజుగారు "నీవాపాటపాడినచో నిన్ను టకటకీమీఁద నెక్కించెదను." అనఁగానే ధ్రువుండు తనయస్పష్టమగు నుచ్చారణతో నీ క్రింది గీతమును బాడెను.

(పాట).— హిందుస్థానిభైరవి - చతురశ్రగతి.

ప. ఎట వెదకెద నిను విడనాడి
అఖిలేశ ఈశ పరమేశ పోవు వడి. నెట.

1. శాస్త్రము లాఱును సరణిఁ జూపినను
క్షణము క్షణమునను మఱతుఁగ
సంయమివాక్యవిమోహమనన్కృత
సంశయంబునను బఱతుఁగ. ఎట.

2. దేవదేవ నినుఁ జేరుకొందు నని
సేవచేయు నామనము
దివ్యసౌఖ్యదంబగునీవాక్రతి
తెంపు నాదు బంధనము. నెట.

3. వివిధనిగమములు వివిధరీతులను
విధివాక్యములఁ జెవి నింపన్
విశ్వసింప నేదను కానొనే
వీరిడి నది విచరింపన్. ఎట.

4. ధైర్యమింతయును లేక మదిని నీ
దరిఁ జేరఁగ నేనెంచన్
దవిలి యన్నియును నష్టవారె సా
ధన మదేమొ నినుఁ గాంచన్. ఎట.

5. సామి నీదుపదరజము దొరకునా
నయుఁ దీరిన నేవంతన్
భూమిరజము నేమాటిమాటికిని
బూయుదు నాయొడ లంతన్. ఎట.

6. రాత్రిందినములు, వృత్తు లన్నియును
రాగమునకు దెసలల్లన్
రాయిడి వెట్టుచు నాదుచిత్తమును
లాగుచు నుందున వెల్లన్. ఎట.

7. ఒక్కడ నేనవి యసంఖ్యాకములు
నోరువ నాతరమౌన
అక్కట యేగతివానికలహముల
నాఁపఁగ నా చల మూన. ఎట.

8. సుఖదాయక మగు ప్రేమను నావయిఁ
జూపు మిప్పుడో దేవ
సులభమార్గమున నిను గనునట్టులు
దలఁచి గావఁగాలేవా. ఎటు.

9. విషయజాలమనుజాలమునం బడి
వెత నొందుచు నేనుంటిఁ
వీతమోహా! భవదీయచరణనం
కేతము గోరుచు నుంటిఁ. ఎటు.

ధ్రువుని యాయస్పష్టోచ్చారణమగుగీతమును విని బిల్వనతా కూరునిహృదయ ముప్పొంగెను. "(ఆశీర్వాదము నిచ్చుచున్నా ను. నీవు దీర్ఘాయుష్మంతుఁడ వగుము." అని యాశీర్వదించి ధ్రువునెత్తి చంక నిడుకొని ముద్దిడుకొని, "ఏదీ మతియొక్క సారి యాపాటఁ బాడుము. అని యాదరముతోఁ బలికెను. ధ్రువుం డలసినట్లు సూచించుచు ననిష్టముతో మిన్నకుండెను. అది చూచి ఠాకూరు తనకనులను మూసికొని, "నీవు పాడకపోయినచో నేనే డ్చెదను" అనెను.

ధ్రువు.—"రేపు పాడెదను. ఏడువవద్దు; నీవిప్పు డింటికి వెళ్లుము. బాబయ్యగారుకొట్టుదురు."

ఠాకూరు నవ్వుచు, "ఈమాట లెంతసుధురములుగా నున్న వి! అని రాజువారివద్ద సెలవుగైకొని యింటి కరిగెను.

మార్గమున నిరువురు బాటసారులు పోవుచుండిరి. ఒకఁడు రెండవవానితో "మూఁడుదినములు వానియింటికిఁ దిరిగితిరిగి బుట్టికొట్టుకున్నను నొకపైసాయైనను వానివలన లభింపలేదు. దారిలో నతఁడు కనుపించెనేని వానితల పగులఁగొట్టక మానను. వాఁడేమి చేయునో చూచెదను." అని పలుకుచుండెను.

వెనుకనుండి బిల్వనఠాకూరు, "అందువలన నేమియు ఫలముండదు. బాబూ! నేమియు నెఱుఁగనట్లగపడుచున్నావు. తలలో నేమియున్నదో లేదోగాని కేవలము దుర్బుద్ధిమాత్రము నిండియున్నది. ఒకనిశిరస్సును పగులఁగొట్టుటకంటెఁ దనశిరముపగులఁగొట్టుకొనుట శ్రేయము. ఏలయన నిట్టులు చేసినచో నెవనికిని జబాబు చెప్పవలసినపూచీలేదు." అని చెప్పెను.

ఆమాటలు వినినంతన యాయిరువురు భయపడి నిశ్చేష్టితులై తరువాత నాతనికి నమస్కరించి నిలువఁబడిరి.

బిల్వ.—"బాబూ! నీవాడిన మాట యుక్తమైనదికాదు."

ఇరువురు.—"ఔనౌను. నిజము మహానుభావా! ఇట్టిమాట నికనెప్పుడును బలుకము." వీధిలో బాలురందఱువచ్చి ఠాకూరువారిని జుట్టుకొని యుండిరి.

బిల్వ.—"బాలకులారా! నేఁటిమూఁడవయామమున నే నిచ్చోటికి వచ్చెదను. బాలురందఱును సంతోషముగా వినుటకైనేఁ డిచ్చో నుపన్యసించెదను. నాయానందమునకై మీరందఱు తప్పక రావలయును. మీరెల్లరు ఖులాసాగా నుండవలెను."

ఠాకూ రప్పుడు పిల్లకాయల నందఱి నొకచోఁ గూర్చి వారి కప్పుడప్పుడు సుబోధములగు మాటలతో రామాయణ భారతాదికథలను ముచ్చటించుచుండును. మధ్యమధ్యను మంచి మంచిపిట్టకథలను జెప్పి వారిని నవ్వించుచుండును. పిల్లవాం డ్రప్పు డల్లరిచేయుచుండినను వారలను మందిరము దరినున్న పూలతోఁటలోనికిఁ దఱుముచుండును. ఆతోఁటలో మంచిపండ్లు గలచెట్లున్నవి. కుఱ్ఱవాండ్రందఱు కోఁతిమూఁకతీరున నొక్క సారిగా నాచెట్లెక్కుచుందురు. ప్రతిశాఖయందును దిరుగుచుఁ బండ్లను దినుచు రాల్చుచు నానందించుచుందురు. ఠాకూరువారు వారి చేష్టలను దిలకించుచు మిక్కిలి సంతసించుచుందురు.

బిల్వనఠాకూరు పరమహంస, సన్యాసి. ఆతఁ డెచ్చటనుం డెడివాఁడో యేదేశ మాతనిజన్మభూమియో యెవ్వరికిని దెలి యదు. బ్రాహ్మణుఁడు, జందెమును బరిత్యజించెను. జంతుబల్యా దులను విడిచి యతఁడు నూతనమార్గమునఁ గాళికాదేవి నర్చిం చు చుండును. ప్రప్రథమమున నచ్చటిజను లాతనియెడ సంశ యము ననమ్మతియును గలిగియుండిరి. ఇప్పుడందఱు నతఁ డన్న మిక్కిలి గౌరవము. జీవబలియం దత్యాదరులై జను లాతని నిర సించుసమయమున నాతనిమాటకు విలువలేక పోయెను. అంత నతఁ డందఱియిండ్లకును బోయి యందఱి తోడను మంచిగా మా ట్లాడుచు వారికెల్లవార్తలు నెఱింగించుచుండెను. అతఁ డే రోగికైన నౌషధ మిచ్చెనేని యత్యాశ్చర్యముగా నది వ్యాధినిబోఁగొట్టి సుఖము నిచ్చుచుండెను. సుఖదుఃఖములయం దతనితో నాలో చింపక యెవ్వరేకార్యమును జేయకుండిరి. తగాదాలలో

నతఁడు మూర్ఖుఁడై యిదమిత్థమని వ్యవహారము పరిష్కరించెనేని యాపరిష్కారము నెవ్వరైన శిరసా వహింపవలసినదే.

---

## ముప్పదియవపరిచ్ఛేదము.

ఈవఱ కెన్నఁడును లేని యాపద యీయేఁడు త్రిపురా నగరమును ముట్టడించెను. ఉత్తరదిక్కునుండి లెక్కలేని యెలుకలదండు గుంపుగుంపులుగా వచ్చి సస్యములపైఁ బడెను. సస్యములను మొదలంటనాశనముచేసి ధాన్యమును దినివేసెను. ఎవరింట నేపాటిధాన్య ముంచుకొనిన నందున నధికాంశము నాహారముగాఁ జేసికొనెను. దేశమందు నలుదెసలను హాహాకారముద్భవించెను. చూడంజూడ దుర్భిక్షము హఠాత్తుగా సంప్రాప్తించెను. జను లరణ్యములకుఁ బోయి ఫలమూలాదులను దెచ్చుకొని తిని జీవింపనయ్యెను. అడవిమాత్రము జీవనాధారమయ్యెను. అందు మనుజులజఠరాగ్నిని జల్లార్చుపదార్థములు లభించుచుండెను. వేఁటకై పోయి వనమృగములను జంపి తెచ్చిన మాంసము బజారులలో నెక్కువవెల కమ్ముఁబడుచుండెను. జను లడవి యందు లేళ్లు, కుందేళ్లు, పందులు, బఱ్ఱెలు మొదలగుమృగములను వేఁటాడి తెచ్చి తినుచుండిరి. ఏనుఁగుదొరకినను జంపక విడువకుండిరి. కొండచిలువలను గూడఁ దినుచుండిరి. ఇంక నరణ్యమున నాహారయోగ్యములగు పక్షులును లేకపోలేదు. చెట్టు

తోఁట్టలయందుండు తేనెపట్టుల పట్టి తేనెటీఁగల ప్రాణములతోఁ గూడఁ ద్రాగుచుండిరి. ఒక్కొక్కచో నదుల నడ్డుకట్టి నీటిలో నొకవిధమైన తీగలను వైచి తీఁగలపై వచ్చుచేపలను బట్టుచుండిరి. కొన్నిచేపల నప్పటి కాహారముగా వినియోగించుచు మఱికొన్నిటి నెండఁబెట్టి నిల్వచేయుచుండిరి. బిల్వనఠాకూ రింటింటికిఁ దిరుగుచుఁ బ్రజలకష్టసుఖములను విచారించు చుండెను. తినఁబడువస్తువులను సంగ్రహించి యెట్లు లుపయోగింప వలయునో తెలుపుచుండెను. వనమందు లభించెడి చిన్నబీజములు గల యొకపదార్థమును వారికిఁ జూపెను. ఆగింజల నగ్నిపై వైచినచోఁ బాలవలె నుండునొకద్రవపదార్థ ముదయించును. ఆవస్తువును సేకరించి కొంచెము తినినచో నతివేగముగా నాఁకలి దీఱును. ఠాకూరుగారు చూపిన యాయాహారపదార్థమును సంపాదించి యాఁకలిదీర్చుకొనుచుండిరి. ఇట్లు లింతదనుక నెట్టులెట్టులో యాహారపదార్థములు లభించుచున్నవి; కాని హాహాకారము మాత్రము తగ్గలేదు. ఏవస్తువులు భుజించినను మామూలుగా దినెడునన్నాదికములతో సాటియగునా? అచ్చటచ్చట దొంగతనములు బందిపోటులు జరుగ నారంభించెను. విషూచి, మశూచ్యాదులు బాధింపదొరకొనెను. ప్రజలందఱొక్కటియై "దేవికి బలిదానము లీయవలదని నిషేధించుటచే నిట్టియుపద్రవములు గలుగుచున్నవి." అని ఘోషింపసాగిరి.

ఠాకూరా మాటలను విని నవ్వి, "కైలాసగిరియందు గణనాథునకును గుమారస్వామికి నొకవివాదము గలిగెను. కార్తి

కేయునినెమలిపై నెక్కి గణనాథుని వాహనము నెలుక త్రిపురా రాజధానియందలి దేవిని బ్రార్థించుటకై వచ్చెను." అని యొక విధమగుభావములో బలికెను. పౌరులామాటపరిహాసమని తెలిసి కొనలేక పోయిరి. "అతఁడు చెప్పినకథానుసారముగా నిదివఱకు వచ్చినమెలుకలగుంపులు మూఁడుదినములలో ధాన్యములను నిర్మూలముగాఁ దిని యెంతశీఘ్రగతిని వచ్చెనో యంతవేగముగాఁ జూడఁగా రాక యంతర్హితము లయ్యెను. ఈమూఁడుదినములలో నీతనిజాడ యెచ్చట నగుపడలేదా?" అని యాలోచించిరి. ఠాకూరగాధములగు తెలివితేటలతో సంచరించుకారణమున నాతని యం దెవ్వరికిని సందేహ ముదయింపలేదు. కైలాసమం దన్నదమ్ములకలహము పాటలుగా నల్లఁబడియెను. స్త్రీలు, పిల్లలు, బిచ్చగాండ్రు మున్నగువా రతిశ్రద్ధతో నాపాటలను వల్లెవేసి పాడ నారంభించిరి. వీథివీథుల, సందు గొందుల నాపాట ప్రతిధ్వని నిచ్చుచు నిండి మ్రోగుచుండెను. ఇంక రాజుగారిపైఁ బ్రజలకు భక్తి తగ్గుటయే కాక యసహ్యతయుఁ బ్రబలెను. ఠాకూ రిచ్చిన సలహాప్రకారము గోవిందమాణిక్యరాయలు దుర్భిక్షముచేఁ బీడింపఁబడు ప్రజల ననుగ్రహించి వారొకవత్సరము చెల్లింపవలసినదస్తు శిస్తులు విడిచి పెట్టెను. అతఁ డొనరించిన సాహాయ్యము వర్ణింపఁదగి యుండెను; కాని ఎండతో జనులు దేవశాపమను భయముచేఁ బురమును వీడి 'చట' యనుగ్రామసమీపమున నున్న కొండప్రదేశమునకుఁ బాఱిపోయిరి. రాజుగారి మనంబునందును నిట్టియపోహము గలుగునంత నతఁడు బిల్వనఠాకూరునిఁ బిలి

పించి "అయ్యా! రాజానర్చెడిపాపములవలనఁగదా ప్రజల కిట్టి యిక్కట్టులు సంభవించుచుండును. దేవి కెప్పుడు నిచ్చుచుండు జీవబలి నీయుపలదని నేఁబావ మొనర్చియుందునా?" దాని కిది శిక్షయై యుండునాయేమి!" అని యడిగెను.

బిల్వన తాకూ రామాటల నొక్కయూపునఁ ద్రోచి పుచ్చి "రాజేంద్రా! దేవీసన్నిధిని నరబలి యిచ్చునప్పుడు నీకును బ్రజలకును నెక్కుడునష్టముగలిగినదా ? లేక యీయానుర్భిక్షము కలుగుటచే నెక్కుడు నష్టమొదవినదా?" అని యడిగెను.

రాజుగా రామాట కేమియును మాఱుచెప్పలేకపోయిరి. కాని యాతనిమనమున నట్టిసందియ మింకను నిశ్శేషముగా పోలేదు. ప్రజ లాతనియెడ నప్రసన్నులై యుండిరి. అతనిపై నానింద మోపి ప్రకటించుచుండిరి. ఆతనిమనమున నీయనుమానమునకుఁ గొంతస్థలము దొరకినది. 'బలి' అనునంతనే తనయందుతనకే యనుమాన ముదయించుచున్నది పావమతిఁ డొకనిట్టూర్పునువిడిచి "నాకేమియుఁ దెలియకున్నది." అని ప్రత్యుత్తరమిచ్చెను.

బిల్వ.—"ఎక్కువగాఁ దెలిసికొనుట కవసర మేమి? అసంఖ్యాకములగు నెలుకలు గుంపుగుంపులుగా వచ్చి ధాన్యమును నశింపఁజేసి పోయినవి. దీనికిఁ గారణము తెలియదు. ఇందువల్ల నేమిప్రమాదము? 'నే నన్యాయమును జేయను. నే నందఱకును సాహాయ్య మొనర్తును.' అని యింతవఱకుఁ దెలిసి నిశ్చయించుకొనినచోఁ జాలును. పైని విధినిర్ణీతమెట్లున్న నట్లగును. అది మనల నష్టపుచ్చవలయునని రాదు."

రాజు—"మీ రిల్లిల్లు దిరుగుచు మీ ద్రవ్యములను నకాలము
న జేసికొనుచుందురు. మీ రెవ్వరి కెంతవఱకు నుపకరింతు
రంతవఱకు ధన్యవాదములను బడయుదురు. ఈయానంద
మున మీచింతలన్నియు మునిఁగి యడుగంటును. నేనవహో రా
త్రములు శిరమునఁ గిరీటమును ధరించి సింహాసనముపైఁ
గూర్చుండిన నిక్కముగఁ గేవలచింతా ప్రవాహమున మునుఁ
గుచు దేలుచుందును. మీస్థితిగతులు చూడంజూడ నాకమి
తానంద ముదయించు చున్నయది."

బిల్వ.—"మహారాజా! నేను దమలో నొకయంశముగనే యు
న్నాను. మీ రీసింహాసనము నధిష్ఠించి యుండనిచో నే నేమి
జేయఁగలుగుదును? మీరును నేనును గలియుటచే నన్ని
పనులును యథానిర్దిష్టముగా జరుగుచున్నవి."

ఇట్లు చెప్పి ఠాకూరు సెలవంది వెడలిపోయెను. రాజు
గారు ముకుటమును దలపై నుంచుకొని యాలోచింపసాగెను.
"నే నీరాజ్యభారమును వహించి చిరకాలమైనది. నేనొనరింప
వలసినపను లెన్నియో కలవు కాని యొకదాని నైనఁ జేయు
నసమర్థుఁడను గాకున్నాను. నావిచారము లన్నియు విడుచుకొని
నిశ్చింతగా నుండెద. నే నీబలిదాననివారణమున నాపైఁ బ్రజ
లకు విశ్వాసము కలుగునట్లొనర్పలేను. నేను రాజ్యమును శాసిం
చుటకు యోగ్యుఁడను గాను." అని మనస్సులో ననుకొనెను.

---

## —⇒ ముప్పదియొకటవపరిచ్ఛేదము. ⇐—

మొగలాయీ సేనతో నక్షత్రరాయలు దారిలో 'తేకుల' అనుచిన్నపట్టణమున విడిసెను. తెల్లవాఱునంత రఘుపతివచ్చి "ఇప్పు డిచ్చటినుండి బయ దేఱవలయును. మహారాజుగారు ప్రయాణమగుటకు సంసిద్ధులై యుందురు గాక" అని పలికెను.

రఘుపతినోటినుండి మహారాజాశబ్దమును వినినంతనే పట్టరానియానంద ముదయించెను. నక్షత్రరాయ లానంతో షముచేఁ బొంగిపోయెను. ఆసేనాసముదాయమం దెల్లెడల 'మహారాజా' అనుశబ్ద మందఱి మొగములనుండియు నాతఁడు వినుచుండెను. అట్టు లనవలయు నని యతఁ డాజ్ఞాపించెను. అతఁ డచ్చట దర్బారున నుండెను గాని నిజముగఁ ద్రిపురానగరమందలి యున్నతసింహాపీఠముననే యుండెనని చెప్పవచ్చును. అట్టియుత్సాహముతో నతఁడు "పురోహితమహాశయా! నేను మిమ్ముల నెప్పుడును విడువను. మీ రెప్పుడు నాదర్బారుననే యుండవలయును. తమ రేమికోరుచున్నారో యది నాకుఁ గొంచెము వినిపింపవలయును." అనుచు నంతలోనే నిశ్చయముగ నాటలాడుకొనుతీరున నొకతాలూకాలోఁ గొంతభాగము రఘుపతికి జాగీరుగా నిచ్చివేసితి ననియెను.

రఘు.—"అయ్యా! నాకేమియు నక్కఱలేదు."

నక్ష.—"అది యేమి? ఆలాగు కాదు. మీ రేమాత్రమైన బరి గ్రహించి తీరవలయును. 'కైలాసరు' అను పేరు గలయొక

పరగణా నేను దమ కిచ్చినాను. మీరు నాచే నిప్పుడే వ్రా యించి తీసికొనవలెను."

రఘు.—"ఈమాట లన్నియు వెనుకనుండి చూచుకొందము గాక."

నక్ష.—"వెనుకనుండి యేమి? నే నిప్పుడే యిచ్చుచున్నాఁడను. 'కైలానరు పరగణాయంతయు మీసొత్తైనది. మీయొద్ద నుండి యొకసురకానియైనఁ గోశాగారమునకు రానక్కఱ లేదు.' అని చెప్పుచు శిరస్సు మీఁది కెత్తి చేఁబడి కూర్చుండెను."

రఘు.—"కాలధర్మ మొందుటకై మూఁడుమూరలస్థల మిచ్చి నచో నే సుఖంతును. నే నంతకంటె నెక్కువ యేమియు నపేక్షింపను." అని చెప్పి రఘుపతి తనపనిమీఁదఁ దా నరిగెను. ఆయనకు జయసింహునామము స్మరణకు వచ్చెను. జయసింహుఁ డుండినచో గౌరవముగా నేది వచ్చినను స్వీకరించి యుండును. జయసింహుఁడు లేనికతేఁ త్రిపురరాజ్యమంతయు రఘుపతి విషయమున నుంటె దమ్మిడంటె నెక్కు వేమియుఁ గాలేదు.

రఘుపతి ప్రస్తుతమున నక్షత్రరాయనికి రాజ్యాభ్యుదయమున మత్తెక్కించఁ బ్రయత్నించుచుండెను. ఆతనిమనమున నంతప్రయత్నము వ్యర్థముగునేమో యనుభయము బాధించు చుండెను. దుర్బలహృదయుఁ డగునక్షత్రరాయలు త్రిపురసింహాసనగిరమున కేఁగిన పిదప యుద్ధము చేయుటయే రాజుగారిసన్నిధిని దన్ను సమర్పించు

కొనకుండ నుండవలయును. ఇంచుకంత మనమున నొక్క-
సారి రాజ్యమన ముదయించినచో మఱియేమియు ప్రమాదము
కలుగదు. రఘుపతి యిట్టిసమయమున నక్షత్రరాయుని బరిహాస
దృష్టితోఁ జూడలేదు. మాటిమాటి కాతని కుత్సాహముఁ గల్పిం
చుచుండెను. అన్నికార్యములయందు నాతని సలహా తీసికొను
చుండెను. మఱియు నాతనియాజ్ఞానుసార మన్నిపనులను జక్కఁ
బెట్టుచుండెను. మొగలాయీసైనికు లంద ఱాతనిని "మహా
రాజాసాహేబ్" అని వచించుచుండిరి. అతనిఁ జూచినంత నతి
యాతురతతో లేచి నిలువఁబడుచుండిరి. పెద్దగాలి వీచిన, వరి
వెన్నులు తలలు వంచునట్లు నక్షత్రరాయలు వచ్చుచుండిన
మొగలాయీసైనికులందఱు వరుసలుదీర్చి తలలు వంచి సలాము
లొనర్చుచుండిరి. సేనానాయకుఁ డత్యాదరాతిశయమున నాత
నికి వంగివంగి సలాము చేయుచుండెను. ఎప్పుడు నాతఁడు విచ్చు
కత్తులవారు బరాబరు లిచ్చుచుండ నున్నతమగు మదగజముపై
రాజచిహ్నములు గలబంగరుహౌదాలోఁ గూర్చుండి ప్రయా
ణము సాగించుచుండెను. అతని వెనువెంట నానందదాయకము
లగువాద్యములు మ్రోగించుచుండిరి. రాచిన్నెలను దెలుపుధ్వ
జమును జేతనిడుకొని పతాకాధారి మున్ముందు నడుచుచుం
డెను. వారేయేగ్రామములను దారిలోఁ జూచుకొని వచ్చు
చుండిరో యాయాగ్రామములందలి జనులు మొగలాయీల
భయమున వీరు రాకముందే తలుపులను దీసి వలసఁ దీయు
చుండిరి. పాప మాబీదపాపలట్లు పరువిడి పోవుచుండుటయు
శూన్యములగు గృహములుండుటయుఁ జూచి నక్షత్రరాయ

లిదియంతయుఁ దనప్రభావమే యని గర్వించి పొంగిపోవు చుండెను. ఆశనిమనమునఁ దాను దిగ్విజయము చేయుచు నరుగు చున్నట్లు తోఁచుచుండెను. చిన్నచిన్నజమీందారులు పలువిధ ములగు కానుకలనుదెచ్చి సన్నిధిని సమర్పించి, సలాములు చేయుచుఁబోవుచుండిరి. వారల నందఱఁ బరాజితులగు వారిఁగా మనరాయలు దలంచుచుండెను. మఱియుఁ బాండవులు దిగ్వి జయమొనర్చి రనుకథ యాతని స్మృతిపథము నలంకరించెను.

ఒకదినము సైనికులందఱొక్కమొగిని నక్షత్రరాయులను దర్శించి సలాము లొనర్చి, "మహారాజా సాహేబ్!" అని సం బోధించిరి. నక్షత్రరాయలు రాజఠీవిగాఁ గూర్చుండెను. "మే మందఱము ప్రభువువారికడ నొకమనవి యొనర్చుకొనవచ్చి నారము. మేము తెలివివీడి మెలంగము. యుద్ధ మొనర్చుటకు మే మేమార్గమున నేగినను సమీపప్రదేశములు కొల్లఁగొట్టుచు బోవుట వాడుకయై యున్నది. ఇందేదైన దోషము కలదా? అటు లేశాస్త్రమున నైన లిఖింపఁబడియుండెనా?" అనిరి.

నక్ష.—తల యూచుచు, "మంచిమాట, మంచిమాట." అనెను.

సైని.—"ఆ బ్రాహ్మణుఁడు మాకాకొల్లకొట్టుటయం దడ్డము వచ్చుచుండెను. మేము తెలియఁజెప్పుటకై వెళ్లియుంటిమి. మేము కొల్లఁగొట్టుటమైన లేము. ఇది యేమియును బాగు గా లేదు."

నక్ష.—(తలయూచుచు), "బాగుగా నున్నది. మంచిది, మంచి ది." (అనుచుండెను.)

సైని.—"మహారాజా సాహేబ్ వారి సెలవైనచో నాపాటుని మాట లక్ష్యము సేయక దారివెంబడిని మామూలుగా గొల్లఁ గొట్టుకొని పోవుచుండెదము."

నక్ష.—"బ్రాహ్మణుం డెవ్వఁడు? వాని కేమి తెలియును? నేను మీకు హుకుము (ఆజ్ఞ) నిచ్చుచున్నాను. మీరు వినోదముగాఁ గొల్లపెట్టుకొని పోవుచుండుఁడు." అని గర్వోద్రేకమునఁ బలికి చుట్టుపట్టుల నెక్కడనైన రఘుపతియుండెనేమో యని నల్గడలఁ గలయఁ బరికించి యెందునుంగానక నిశ్చింతగా నుండెను. రఘుపతి నిట్లు తిరస్కారభావముచే నతిక్రమించి యతఁడు తనమనమున నతిసంతోషముగా నవ్వుకొనెను. ప్రభుత్వమదము మద్యమువలె నతనిసర్వాంగములను నిండుకొనియెను. అతఁ డీజగమంతయు నూతనదృష్టితోఁ జూచుచుండెను. మనోకల్పితమగు నాకాశవిమానముపై నతఁ డధిష్ఠించి యీపుడమినంతయు నవి క్రిందిభాగమున మేఘములవలె మలినమై యుండెనని యతఁడు తలఁచుచుండెను. ఒకప్పు డారాజ్యములు రఘుపతిని హాడ నాలుంగసంకటి మఠములో దిగఁబడియుండెను. అతఁ డత్యంతమదపంకనిర్మగ్నుఁడై గోవిందమాణిక్యరాయలపై మిక్కిలి క్రుద్ధుండై యుండెను. మఱియు మనంబున నిట్లెంచుచుండెను, "ఏమీ నన్ను రాజ్యమునుండి వెడల నడచునా? నన్నొకప్రాకృత మానుజునిరీతి కచ్చేరియందు నిలువఁబెట్టునా? ఈమాఱు చూచెద నెవఁడెవనిని వెడలఁగొట్టునో? ఈపర్యాయము

త్రిపురానగరవాసులందఱు నక్షత్రరాయల ప్రతాపమును గురుతెఱుంగుదురుగాక!" రాయలు గర్వోద్రేకమున నుబ్బుచుండెను. దీనులు నిరపరాధులగు గ్రామవాసులపై దారిలో నాసైనికు లొనరించు దురాచారములును, వారిసర్వస్వమును దోఁచుకొనుటయును రఘుపతి కేమియు నిష్టము లేకుండెను. అతఁడు మిక్కిలి విచారించుచుండెను. ఈదురాచార మెట్టులైన మాన్పింపవలె నని యాతఁ డెంతయో ప్రయత్నించెను; గాని మొగలాయిదండు రాయల నెలవంది యీపేదపాఱుని మాట పాటి చేయరైరి. తుద కాతఁడు నక్షత్రరాయలను సమీపించి "నిరపరాధిజనముల నిట్లేల బాధింపవలెను." అని యడిగెను.

నక్ష.—"అయ్యా! ఈలౌకికవ్యవహారములు పాపము మీ రేమెఱుంగుదురు? యుద్ధసమయములయందు వీరి యుత్సాహమును భంగపఱచి యాటంకపఱచుట మంచిపనికాదు."

నక్షత్రరాయలమాటలను విని రఘుపతి కొంతసంతసించెను. ఒక్కమాఱుగా రాయల కిట్టిమహాత్మ్యాభిమాన ముదయించుటఁ జూచి యతఁడు తనలోఁ దాను నవ్వుకొని, "రాజేంద్రా! నేనందులకు మనవిచేయలేదు. ఇప్పు డీగ్రామములయందలి ప్రజలను మీరు కొల్లఁగొట్టించినచోఁ దమకు రాజ్యము వచ్చినపిదప వీరి నోదార్చుట కష్టము. మఱియు వీరందఱిప్పుడు త్రిపురానగరమును గొల్లపెట్ట నుద్యోగింతురు." అని పలికెను.

నక్ష.—"ఇందులో నేమి ప్రమాద మున్నది? అదియే నాకో రిక. నక్షత్రరాయులను దేశమునుండి వెడలనడిచినందువలన నిట్టి యిక్కట్టు వచ్చె నని త్రిపురానగర మంతయుఁ దెలిసి కొనవలయును. ఈవిషయమున దమ కేమియును దెలియదు. మీకీవ్యవహారములు తెలియుటకు మీ రెవ్వడైన యుద్ధము చేసి యుంటిరా? లేకున్న మీ కెట్లు తెలియును?"

ఈవాక్యములను విని రఘుపతి తనయత్నము ఫలించె నని మనంబున సంతసించి యాతనిమాటలకుఁ బ్రత్యుత్తర మీయక యే యచ్చటనుండి వెడలిపోయెను. నక్షత్రరాయ లొక బొమ్మవలె నుండక కొంతజాబుదర్పములతో నుండె నని సంతోషించుచుండెను.

---

## ముప్పదిరెండవపరిచ్ఛేదము.

'త్రిపురారాజధానియందు దెలుకలదండు వచ్చి యుపద్రవ మొనర్చినమాసము శ్రావణము. పొలములలో నొక మొక్కజొన్నలు మాత్రము ఫలించినది. కొంతభూములలో వరిచేలు వెన్నువేసెడికాలమై యున్నది. మూఁడుమాసము లెట్టులో గడచెను; మార్గశిరమాసము వచ్చి పంట కోఁతకు సిద్ధమైనప్పటి నుండియుఁ బ్రజలమనంబుల నానందము నెలకొనియెను. రైతులు,

స్త్రీలు, బాలురు, యౌవనులు, వృద్ధులతోఁ గలసికొని చేతు లలోఁ గొడవళ్లుంచుకొని వారివారి సస్యములకుఁ బోయిరి. ది క్కులి మోటుకోనము నగుపఱచు తమసంబోధనములతో నొకరి నొకరు పిలుచుకొనుచుండిరి. కొందఱు స్త్రీలు దారిలోను, మైదా నములందునను వరుసలు తీర్చి పాడుచుండిరి. రాజుగారిపై నం తకు ముందు కలిగినయసహ్యత దూరమయ్యెను. రాజ్యమందం తట శాంతి యల్లుకొనియెను. ఇట్టిసమయమున "నక్షత్రరాయ లు త్రిపురారాజ్యము నపహరింపవలయునని యసంఖ్యాకమగు సేనాసముదాయమును గూర్చుకొని త్రిపురానగరము సరిహ ద్దునకు వచ్చియుండెననియు నతికఠినముగాఁ బ్రజలను దోఁచు కొనుటకును, బాధించుటకు నుత్తరు విచ్చి సైన్యమును విడిచెనని యును' దెలిసి దేశమంతయు నట్టుడికిన ట్లుడుకసాగెను. ఈస మాచారము రాజుగారి హృదయమునఁ గత్తిపోటువలె నాటెను. ఆదినమంతయు నావిచారమున మునిఁగి యుండెను. ఉండియుండి యొక్కసారి కొత్తరీతిగా నక్షత్రరాయ లాతనిపై దాడి వెడ లెనని యతని మనమున దిగులొందెను. అతఁడు నక్షత్రరాయుని సహజసుందరమగు ముఖకమలము తనకన్నులకుఁ గట్టినట్టులు చూచుచుండెను. నేను వెంటనే నక్షత్రరాయలు మితిలేని సేనాస ముదయముతోఁ జుట్టుకొని ఖడ్గహస్తుఁడై తన్నుపరాభవించుటకై వచ్చినట్టు లతనిమనమునఁ దోఁచుచుండెను. తానసహాయుండై యుద్ధరంగమున నక్షత్రరాయుని సమ్ముఖమున నిరాయుధుండై నిలువఁబడినట్టులును, నక్షత్రరాయునిసైనికులు వేలకొలఁదిగా నాయుధహస్తులై తాఁకి తనరక్తపానము జేయుచున్నట్టు

లను దలంచుకొనుచుండెను. అప్పు డతఁడు ధ్రువునిఁ జేరఁదీసి "ధ్రువుఁడా! నీవుగూడ నీముకుటమునకై నాతో యుద్ధమునకు డీకొందువా?" అని యడిగెను. కిరీటము తలనుండి తీసి భూమిపై విసరివైచెను. దానియందలి పెద్దముత్తియ మొకటి తెగిపడెను. ధ్రువుండు ధైర్యముగా, "నే దీనిని దీసికొనియెద" నని యనెను.

రాజుగా రామకుటమును ధ్రువునితలపై నిడి యతని నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని, "బాబూ! ఇది తీసికొనుమి! నే నెవరితోడను కయ్యము సేయనొల్లను." అని చెప్పి యాతనికై నాలింగన మొనర్చుకొనియెను. తరువాత దినమంతయు "ఇది కేవలము నాపాపఫలము?" అనుకొనుచుఁ దనయాత్మలో నతఁడు వివాద మొనర్చుచుండెను. ఇది పాపఫలమే కాకుండెనేని ప్రియసోదరుం డన్నపైఁ గత్తిగట్టునా అని తలంచుకొనుచు నాతఁడు కొంత ధైర్యముతో నుండెను. తుదకతఁ డిది యంతయు నీశ్వరునిప్రేరణ మనుకొనియెను. ఈశ్వరుని దర్బారునుండి యిట్టి యాజ్ఞ వచ్చియుండెనని నిశ్చయించెను. "ఆతనియాజ్ఞ నుల్లంఘింప నక్షత్రరాయలకు శక్య మగునా" అని నమ్ముకొని ఛిన్నాభిన్నమై యున్న తనమనమున నతఁడు గొంత సంతస మొందుచుండెను. అతఁడు పాపమును దనతలపై నిడుకొనుట కిష్టపడెను. అందువలన నక్షత్రరాయలపై నుండి యెంతయో పాపభారము తొలఁగింపఁబడెను. ఇంతలో బిల్వనఠాకూరువచ్చి "రాజేంద్రా! ఏమి యిట్టిసమయమున మీనమేషములను లెక్కించుచు నా కాళముదవంక జూచుచున్నాఁడవు."

రాజా.—ఇది యంతయు నాపాపఫలము గాని వేఱొండు కాదు.

బిల్వ.—కొంచెము కోపించి, "మహారాజా! ఈమాటలు వినినంత నాహృదయ మవియు చున్నయది. దుఃఖము పాపమునకు ఫలమే. ధర్మమునకు నొకప్పుడు దుఃఖమే ఫలమగు చున్నది. ఎందఱో ధర్మాత్ములు దుఃఖమునందే తమజీవితములను వెళ్లించిరి. ధర్మమునకు సుఖము ఫలము కాదు, ధర్మమునకు ఫలము ధర్మమే." అనెను. రాజుగారిందున కేమియుఁ బ్రత్యుత్తర మీయరైరి.

బిల్వ.—ప్రభువా రేపాప మొనర్చియుండిరి. ఎందువలన నిట్టి దుఃఖము సంప్రాప్తించెను?

రాజా.—నాతమ్ముని దేశమునుండి వెడల నడచితినిగదా!

బిల్వ.—తమరు తమ్మునిఁ గాదు. అపరాధిని దేశమునుండి వెడలఁ గొట్టితిరి.

రాజా.—ద్రోహియైనను దమ్ముని వెడలఁగొట్టుట పాపకార్యమే. ఆపాపమునకు ఫల మెంతయైన ననుభవింపక తీరదు. దుర్యోధనాదులు దుష్టచిత్తులైనను వారలను జంపి పాండవులు శాంతిపూర్వకమగు రాజ్యము సుఖముగా ననుభవింపలేకపోయిరి. పిదప నాపాపమునకు ప్రాయశ్చిత్తముగా నశ్వమేధ మొనర్చిరి. పాండవులు యుద్ధమొనర్చి జీవితులై రాజ్యలాభ మొందిరి. పాండవులచే గౌరవులు చంపఁబడియు వారిరాజ్యమును హరించిరి. (అనఁగా) బంధువియోగముచే వ్యధితమానసులై

పాండవులు రాజ్యసుఖముల ననుభవింపలేకపోయిరి. నేను నక్షత్రరాయులను దేశమునుండి వెడలఁగొట్టితిని. నన్ను వెడలఁగొట్ట నతఁడు సన్నద్ధుండై వచ్చియుండెను.

బిల్వ.—ధర్మరాజాదులు పాపప్రాయశ్చిత్తమునకై కౌరవులతో యుద్ధమొనర్పలేదు. వారు రాజ్యము నొందుటకే కయ్యమొనర్చిరి. ప్రభువువారు పాపశాంతికై తమ సుఖదుఃఖములను లెక్కింపక ధర్మమును బాలించిరి. ఇందున పాపమే గలదో నేనెఱుంగఁజాలకున్నాఁడను. తమరు పాపమున ప్రాయశ్చిత్తము సేయ నిశ్చయించినచో నేబ్రాహ్మణుడను, సన్నిధి నేయున్నాను. నన్ను దానముచే సంతుష్టునిగాఁ జేయుఁడు. అదియే యాపాపమునకుఁ బ్రాయశ్చిత్తమగును.

రాజా.—రాజుగారు కింకర్తవ్యతామూఢులై యూరకుండిరి.

బిల్వ.—అయ్యా! ఏది యెట్లున్నను దమరిప్పుడు యుద్ధసన్నద్ధులై యుండవలయును. విలంబమొనర్పుట తగదు.

రాజా.—నేను యుద్ధము చేయను.

బిల్వ.—ఇది యెట్లుగును. తమరు విచారించుచుఁ గూర్చుండియున్నారు. నేనిప్పుడే సేనలను సిద్ధపఱుప నేఁగుచున్నాను. ఈసమయమునఁ బ్రజలెల్లరు తమపత్రమునుండి మీఱుటఁ బోయియున్నవారు. ఇప్పుడు మనసైన్యమంతయుఁ గూడుట దుర్ఘటముగాఁ దోఁచుచున్నది." అని చెప్పుచుఁ బ్రత్యుత్తరము నపేక్షింపక యతఁడు వెడలిపోయెను.

హఠాత్తుగా ధ్రువునిమనంబున నేదియో జ్ఞప్తివచ్చి రాజు గారిని సమీపించి యాతని వదనమునందు దృష్టి నిలిపి, "నాన్న గారూ! బాబుగారెక్కడ నున్నారు?" అని యడిగెను.

రాజు.—"బాబు వచ్చియున్నాఁడు." (కన్నులశ్రుజలములచే నిండుకొనియెను.)

---

## ముప్పదిమూఁడవపరిచ్ఛేదము.

బిల్వనఠాకూరుని తలపైఁ బెద్దకార్యభారము పడియుండెను. అతఁడచట గ్రామసమీపముననున్న పర్వతప్రదేశములకు వివిధములగు కానుకలొసఁగి దూతల నంపెను. గారోయుఁ గూకీ జాతి ప్రభువునకుఁ దన సైన్యముతో రాజుగారికి సాహాయ్యమొనర్పవలయునని వర్తమాన మంపెను. యుద్ధసమాచారమాట వినినంత వారందఱుఁ బండువలె నెంచి సంసిద్ధులగుచుండిరి. కూకీజాతియందుఁ బ్రధానపురుషులగువారికి యుద్ధసూచకములగు నెత్తిపాగాగుడ్డలను వస్త్రములోఁ జుట్టిపెట్టించి దూతలచేఁ బ్రతిగ్రామమునకు నంపెను. చూడం జూడ సేనలు గుంపు గుంపులుగాఁ జటగ్రామపర్వతము నుండి త్రిపురాపర్వతమునకు వచ్చుచుండెను. వారి నేనియమముచేతను నాటంకపఱుపఁ గష్టసాధ్యమై యుండెను.

ఠాకూరు త్రిపురానగరప్రాంతగ్రామములకు స్వయముగా నేఁగి బలవంతులను వయోవంతులను వెదకి వెదకి తెచ్చి

సేనల బూరించుచుండెను. అతఁడెమరుగ మొగలాయీలపై దమ సైన్యములు దలపడిపోవ నిష్టములేక మొగలాయీలు సమతలమును దాఁటి ప్రయాణకఠినములగు పర్వతప్రాంతములకు వచ్చినంత గుప్తముగా గొండకు నాలుగుమూలలనుండియుఁ దమ ఫౌజును బురికొల్పినచో వారు సులభముగా జయింపఁ బడుదురని నిశ్చయించుకొని యుండెను. అతఁడు తన విజయమునకై నదులను బెద్దపెద్దశిలలచే నడ్డుగట్టించి మొగలాయీ సేన లానదీప్రాంతములకు వచ్చినంత నాగట్టుల దీయించి వారలను బ్రవాహము పాలొనర్ప యత్నముల నొనర్చెను.

ఇక్కడ నక్షత్రరాయలు గ్రామములను గొల్లపెట్టుచుఁ ద్రిపురాపర్వతప్రాంతములకు సైన్యసమేతుఁడై వచ్చి చేరెను. సస్యము లన్నియుఁ గోయఁబడి ధాన్యము లిండ్లు చేరుటచేఁ ద్రిపురానగరమందలి వ్యవసాయదారులందఱు యుద్ధమునకుఁ సన్నద్ధులై యుండిరి. పూరింపఁబడినజలరాశివలె నడ్డుపెట్టినను నిలువక సైన్యములు యుద్ధమొనర్పఁ గృతనిశ్చయములై యుండెను.

మాణిక్యరాయలు, "నేను యుద్ధ మొనర్పను." అని పలికెను.

బిల్వ.—"ప్రభుసత్తమా! ఏమి యిట్లు దమ రధైర్యవాక్యముల నాడఁ జొచ్చిరి?"

రాజా.—నేను రాజ్య మొనర్ప ననర్హుఁడను. కావుననే యిట్టి లక్షణము లన్నియుఁ గన్పట్టుచున్నయవి. ప్రజలకు నాయం

దలి యనురాగ మంతరించినది. అకాలమున బహుజనఘోష భీషణమగునీయుద్ధము సంభవించినది. ఇవియన్నియును జూడ రాజ్యమునువిడువఁ బరమేశ్వరునియాజ్ఞయైనట్లు దోఁచుచున్నయది.

బిల్వ.—ఇదియెన్నఁడును భగవంతునియాదేశము కానేరదు. అతఁ డీరాజ్యభారమును నీభుజములపై నిడెను. ఎంతదనుక రాజ్యకార్యములు నిర్వివాదముగా జరగుచుండెనో యంతదనుక మీరు మీసహజకర్తవ్యమును నెఱవేర్చితిరి. రాజ్యకార్యము లిప్పుడు భారవంతములగుటచే వాని విడిచి దూరముగానుండి యివియన్నియు స్వాధీనములగుటకై యీశ్వరుని యాజ్ఞయని పలుకుచు జనులను గష్టముల పాలొనర్చి మీరు సుఖవంతులై యుండఁ గోరుచుంటిరి. కష్టసుఖముల యందు సమవర్తియై మెలంగవలదా?

తానూహించి యీమాటలు మాణిక్యరాయులమనమున నాటినవి. [illegible]డు మౌన [illegible] బిల్వ కొంతసేపూరకుండి తుద కధీరుఁడై, "ఓ సోదరా! నక్షత్రరాయలు నన్ను జంపి రాజ్యము నాక్ర[illegible]మింపవలయునని గోరుచున్నారా?" అని పలికెను.

బిల్వ.—నిజముగా నది యట్లు జరుగునేని దానివిషయమున నే నింతమాత్రము విచారింపను. కాని మీరు మీకర్తవ్యమును విడిచి పలాయనులైనచో నవశ్యము మాకందఱకుఁ బట్టరాని దుఃఖము కలుగక మానదు.

రాజా.—అట్లయిన నాతమ్మునిఁ జేతులారఁ జంపవలసినదేనా?

బిల్వ.—అవశ్యాచరణీయవిషయమున సోదరసోదరీవిచార మనావశ్యకము. భారతీయుద్ధమున శ్రీకృష్ణభగవానుఁ డర్జునున కేమి యుపదేశమిచ్చెనో జ్ఞాపకమున్నదా ?

రాజా.—నేను ఖడ్గహస్తుఁడనై నాతమ్ముని జంపవలయు ననియేనా మీయభిప్రాయము ?

బిల్వ.—ఆ! ఔను.

ధ్రువుండు హఠాత్తుగా వచ్చి, "ఛీ యామాటఁ బలుకబోకుము." అని యాడుకొనుచుండెను. వారిద్దఱియన్యోన్యసంభాషణ విని ధ్రువుండు, "వీరిద్దరికిని గలహము వచ్చెననియు, గావుననే వీరు నిర్జనప్రదేశమున నుండిరనియు దలంచుకొని "ఛీ! ఆమాటఁ బలుకబోకుము." అని వారించెను.

ఆమాట విని బిల్వనఠాకూరునకుఁ బట్టలేని యానందము గలిగెను. అతఁడు నవ్వుచు నాబాలకు నెత్తుకొని ముద్దులాడెను. రాజుగారికి మాత్రము నవ్వురాలేదు. కాని యాబాలకునిముఖమున నీశ్వరుం డట్లనిపించెనని నిశ్చయించుకొనెను. అతఁడు నిస్సృష్టముగా, "నేను రక్తపాత మొనర్పలేను. ఆప్రసంగమైన వినలేను. నేనెప్పుడును యుద్ధము చేయను." అని తన నిశ్చయమును జెప్పెను.

ఠాకూరు కొంతసేపు మాటలాడకుండెను. తుద కాతఁడు "అయ్యా! తాము యుద్ధముచేయక మఱియేమి చేయుదురు? నక్షత్రరాయలను గలిసికొని యుద్ధప్రసంగమును వారింపయత్నించెదరా?" అని యడిగెను.

ఠాకూరుని యీమాటకు మాణిక్యరాయ లెంతయు సంతోషించెను.

బిల్వ.—"ఈవిషయమై యొకయుత్తరమును వ్రాసి నక్షత్రరాయలకడ కంపవలయును." తుద కీమాటయే యంగీకరింపఁబడెను.



## ముప్పదినాల్గవపరిచ్ఛేదము.

నక్షత్రరాయలు సేనలతోడఁ ద్రిపురానగరమును సమీపించుచుండె. అతని నడ్డుపెట్టువా రెవరును లేరైరి. త్రిపురానగర సంబంధములగు యేయేగ్రామముల కతఁడు వచ్చుచుండెనో నాయా గ్రామముల ప్రజలందఱతని రాజ్యత్వము నంగీకరించుచు గౌరవించుచుండిరి. అడుగడుగున నతఁడు రాజమర్యాదల నందుచుండెను. అంతకంత నతనికిఁ దృష్ణ యధికమగుచుండెను. నలుగడల నున్న చిన్నచిన్నపల్లెలును బెద్దగ్రామములు నన్నియుఁ దనవే యని యతఁ డనుకొను చుండెను. అధికారిత్వము వ్యాపించునంత నతఁడు తాను మిక్కిలి ప్రతాపవంతుఁడ నని గర్వించుచుండెను. మొగలాయీసేనలేవి ఎప్పుడుకోరిన నది తత్క్షణమందే జరగుట కతఁ డాజ్ఞ యిచ్చుచుండెను. ఆసైన్యమును దనసైన్యమే యని యువారందఱుఁ దనయాజ్ఞానువర్తులై నిరంతరము దన్ను గొలుచు చుందురనియు నతఁడు దలఁచుచుండెను. వారల కేవిషయమున

నేకొఱంతయు రానీయఁగూడ దని నిశ్చయించుకొనెను. వారలు త్రిపురానగరమున కేగినపిదప “నక్షత్రరాయలు సామాన్యుఁడు కాఁ డనియు మిక్కిలి యౌదార్యవంతుఁ డనియు దానకర్ణుం డనియు నతిచాకచక్యము గలవాఁ డనియు దన్నుఁ బ్రశంసింపవల యు ననితలంచి వారియిష్టానుసారము మెలంగుచుండెను. వినోద ముగాఁ గొల్లపెట్టుటయందు వారి నుత్సాహపఱచు చుండెను. వారిమధురములగు సంభాషణములను బొగడ్తలను విన్నంత నతనిమనస్సు కరగి నీరగుచుండెను. కాని వారు పిదపఁ దన కేమి యపకృతియొనర్తురో యని మాత్రము భయపడుచుండెను.

రఘు.—మాణిక్యరాయని సేన లేవియు యుద్ధసన్నద్ధముగా నున్నట్లు తోఁపదు.

నక్ష.—“భయభీతులై యుండిరని తోఁచుచున్నది.” అని పెద్ద పెట్టున నవ్వసాగెను. రఘుపతియు నవ్వుట కేమియుఁ దగి నంతకారణము లేకుండినను రాయల ప్రీతికొఱకు నవ్వు తెచ్చుకొనియెను.

నక్ష.—నక్షత్రరాయలు సహాయువారిసేనలఁ దీసికొని యెత్తి వచ్చె ననుట సాధారణమైనమాట కాదు.

రఘు.—అయ్యో! చిత్తగింపుఁడు! ఈసారి యెవరి నెవ్వరు దేశమునుండి వెడలనడుతురో?

నక్ష.—“నేఁ దలఁచినచో దేశనిర్యాసనమొనరింతును. ఖైదునఁ బెట్టి బంధింతును. ఉరితీయింతును. కాని నేనింక నేమియు

నిశ్చయింపలేను." అని చెప్పుచు నతఁడేమో తెలిసిన వానివలె గౌరవించుకొనుచుండెను.

రఘు.—"మహారాజేంద్రా! మీరింతయాలోచింప నవసరము లేదు. ఇంకను వేళ కావలసినంతయున్నది; కాని మాణిక్య రాయలు యుద్ధ మొనర్పకయే మిమ్ముఁ బరాజితులఁ జేయు నేమో యని భయపడుచున్నాఁడను."

నక్ష.—"అ దెట్టులగును?"

రఘు.—"మాణిక్యరాయలు తనసైన్యమంతయు నొకచో నుంచి భ్రాతృవాత్సల్య మమితముగాఁ గనఁబఱుచుచు నాలింగన మొనర్చుకొని "నాపిన్నతమ్ముఁడా! ర మ్మింటికి రమ్ము! వచ్చి వెన్నయుఁ జక్కెరయుఁ దినుము." అని తప్పక పలుకఁ గలఁడు. ప్రభువుగా రప్పుడు కన్నుల నశ్రులుగార్చుచు "అన్నయ్యా! తమ సెలవున కభ్యంతర మేమున్నది? ఇదిగో నిప్పుడే వచ్చుచున్నాను. ఆలస్య మొనరించినందునఁ బ్రయోజన మేమి?" అని వినయమును జూపించుచు బంగరుజోడు తొడుగుకొని యన్నగారి వెనువెనుకఁ దలవంచుకొని పెంపుడుకుక్కవలె నరుగుదురు. ఈవినోదమును గన్గొని మొగలాయీలు నవ్వుకొనుచు వారిరాజ్యమునకుఁ బోవుదురు. కష్టనిష్ఠురములపాలై యీవెఱ్ఱిబ్రాహ్మణుఁడు హాస్యాస్పదుఁ డగుటయే యీప్రయానమునకు ఫలితమై పరిణమించును."

ఈపరిహాసవాక్యము లాతనినోట విని నక్షత్రరాయ లధైర్యపడెను. ప్రయత్నించియు మొగమున నగవు నలంకరింపఁ

జేసికొనలేకపోయెనో. అతఁడు "ఏమీ! మాణిక్యరాయలు నన్నొక బాలునివిధమునఁ దలంచుకొనియుండెనుగావలయు నిట్లో నర్చుటకు? ఇట్టు లెప్పుడును జరుగదని తలంపుఁడు" అనెను.

ఆదినమున మాణిక్యరాయలొక యుత్తరము వ్రాసి నక్షత్ర రాయని కొకదూతచే నంపించెను. ఆవార్తావహుఁడు నక్షత్ర రాయని దర్బారునఁ బ్రవేశించెను. ఆయుత్తరము రఘుపతి చేతిలోఁ బడియెను. అదివిప్పి యాతఁడు చదువుకొనియెను. "రాజా గోవిందమాణిక్యరాయ లతిప్రేమాతిశయభావమున దర్శనమునకై ప్రార్థించుచుండెను." అని.

రఘుపతి నక్షత్రరాయల నాయుత్తరమును జూడనీయఁ డయ్యెను. మఱియు నాదూత కిట్లు ప్రత్యుత్తర మిచ్చి యంపించెను. "రాయలువారింత శ్రమఁ దీసికొని యింతదూరము దయ చేయునవసరము లేదు. మహారాజానక్షత్రరాయలు తనసైన్య మును దీసికొని ఖడ్గము నొరఁదీసి యతిశీఘ్రగతిని దమ్ముఁ గలిసి కొనఁగలఁడు. పాప మింతలోఁ దమ్ముని విరహము నోరువలేక యలజడిఁ బొందుచుండిరి కాఁబోలును. ఎనిమిదివత్సరము లెట్లు భ్రాతృవిరహమును సహించియుండిరో?" అని.

రఘుపతి నక్షత్రరాయలను గలిసికొని, "మాణిక్య రాయలువారు రాజ్యమునుండి వెడలఁగొట్టఁబడిన చిన్నతమ్ముని కత్యంతప్రియపూర్వకముగా నొకలేఖ నంపియున్నారు." అని చెప్పెను.

నక్షత్రరాయ లత్యంతహేళనభావముతో నవ్వుచు "ఏమేమీ! నిజముగా నుత్తరము నంపి యుండిరా? ఏదీ

యెక్కడ నున్నది? ఒక్కసారి కన్నులకరవు దీఱఁ జూచికొని యెద." అని యుత్తరమునకై చేయి చాఁచెను.

రఘు.—ఆయుత్తరము నేలినవారికిఁ జూపింప నవసరము లేదను కొనియెదను. చదివి వెంటనే యది చించి పాఱవైచితిని. వచ్చినమాటతో "యుద్ధముచేయుట దక్క నీయుత్తరమునకు వేఱొండు ప్రత్యుత్తరము లేదని చెప్పి యంపించితిని."

నక్ష.—చిఱునగవుతో "గురూజీ! యుద్ధము చేయుట దక్క నీయుత్తరమునకు వేఱొండు ప్రత్యుత్తరము లేదని మంచి జవాబునే పంపించితిరే."

రఘు.—"గోవిందమాణిక్యరాజు లీప్రత్యుత్తరమును విని యిట్టులనుకొనును. "రాజ్యమునుండి నాచే వెడలఁగొట్టఁబడి నక్షత్రరాయ లవ్వు డేమియు ననక కన్నులిదారిని బోయి తిరిగి రాజ్యమునకు వచ్చునప్పుడు నేఁడిట్టి బలవద్వైరియై వచ్చియున్నాఁడు" అని.

నక్ష.—"ఆహా తనతమ్ముఁడు సామాన్యుఁడు గాఁడని యిప్పుడాతఁడు తలంచును. తనకు లొంగి యున్నప్పుడిల్లు వెడలఁ గొట్టుటయును దనపీఁటమీఁదికి వచ్చినప్పుడు తమ్ముని రమ్మనుటయునా? అది యంతయు నిప్పుడు పనికిరాదు." అని యతఁడతిసంతోషమున నవ్వసాగెను.

---

## —⇒ ముప్పదియైదవపరిచ్ఛేదము. ⇐—

నక్షత్రరాయుని యాక్రూరమైనప్రత్యుత్తరము గోవింద మాణిక్యరాజులమర్మముల నొంచెను. ఈమాట విని విచార రాజగారు యుద్ధమునకు డీకొందురని బిల్వనఠాకూరు తలంచెను.

మాణి.—"ఈ జవాబు నక్షత్రరాయుని నోటినుండి వెడలినది కాదు. ఇది నిశ్చయముగాఁ బురోహితమహాశయునిదై యుండును. నక్షత్రరాయలముఖమున నిట్టిమాట యేనాఁటి కిని బయలు దేఱదు."

బిల్వ.—"మహారాజావారితలం పిప్పు డెట్టులున్నది?"

మాణి.—"నే నొక్కసారి నక్షత్రరాయుని నెట్టులయినఁ జూడఁ గలిగినచో నీచిక్కులన్నియు నొక్కమాఱుగాఁ దీర్చివేయఁ గలను."

బిల్వ.—"ఆతనిఁ జూడలేకపోయినచో?"

మాణి.—"రాజ్యమును విడిచి నే నెచ్చటికైనఁ బోవుటయే."

బిల్వ.—"బాగుగా నున్నది. నేనొక్కసారి ప్రయత్నించి చూచెదను గాక!"

పర్వతోపరిభాగమున నక్షత్రరాయనిశిబిరము వేయఁబడి నది. నాలుగుదెసల నంధకారబంధురమగు కారడవి. ఒక్కచో వెదురుపొదలచే నిండినవనము. మఱియొకచోఁ బేఁపచెట్లవనము. ఇంకొకచో రెల్లుతో నిండియుండినవనము. నానావిధము

లగులతావితానములచేఁ బుడమి గప్పఁబడియున్నది. సైన్య సమూహము, వనగజములు మొదలగునడవిమృగములు సంచ రించుతావులను గుఱుతించి యెట్టులెట్టులో యతికష్టముగా బర్వ తారోహణ మొనర్చెను. ప్రొద్దించుకమాత్రము గలదు. భగ వానుం డగునాదిత్యదేవుఁ డాపర్వతపశ్చిమభాగమునఁ దిగి యెను. పూర్వభాగము చీఁకటులపాలుగావలసివచ్చెను. సూర్యుఁ డస్తమించుటచేఁ గలిగినచీఁకటియు వృక్షచ్ఛాయలు నేకమై యించుక వెలుఁగుగా నున్న వేళ యైనను వనాంతర్భాగము నం తయు మున్ముందుగ నంధకారబంధురత్వము నొందించినవి. దినాంతభాగమున సంధ్యాసమయమున ధరణినుండి తేజస్సెట్టు లపహృతి మగుచున్నదో యట్టులే వేఁడిమియు నశించుచున్నది. తేనెటీఁగల మధురమగు ఝుంకారము నిశ్శబ్దముగా నున్నయాన మయమున గానశ్వాసము నంగీకరించి సుఖంపఁజేయుచుండెను.బిఁవ్వ న తాకూరు నక్షత్రగాయనిశిబిరమున కేతెంచుటయు దివాకరుఁ డస్తాద్రి నలంకరించుటయు నొక్కముహూర్తమున నైనవి. పడ మరదెస నాకసమున సువర్ణచ్ఛాయలశిఖలు లంటుచున్నవి. అం తంత కభివృద్ధి నొంది యవి యింకను గానిపించుచునే యున్నవి. ఆదిక్కున నమతల మగుపర్వతప్రదేశమున నాకుపచ్చరంగు పూసినట్టులున్న వనతరుచ్ఛాయ, బంగరుతీఁగలవంటిశిఖలకు నొం దుటచేత నది స్థిరతరమ్మగునొక తేజస్సుచే సాంద్రమై ప్రకృతి నను రంజించుచున్నది. మఱునాఁడు వా రీప్రాంతమును వీడవలసివచ్చె ను. కొందఱు ముందునకుఁ బ్రయాణము సాగించిరి. రఘుపతి యొకపౌజును దీసికొని మార్గము నిరాఘాటముగా నుండున ట్లొన

ర్పుటకై ముస్ముందు కాలువిసరి కొంత దవ్వరిగెను. ఇంకను నక్ష త్రరాయలను గలిసికొనుటకు మరల లేదు. ఇట్టిసమయమున కాదు మఱెట్టిసమయమందైనను నక్షత్రరాయలను జూడవలయు ననుమనుష్యప్రకృతి కానిదర్శన మంతయుకరము గాకున్నను సన్న్యాసి సర్వసంగపరిత్యాగి కావున ఠాకూరువారు చిన్నరాయ లను జూడఁ బోవుట కాటంకము లేకపోయెను. పని గలిగి చనిన వాఁ డూరకయుండునా? నక్షత్రరాయలను సమీపించి "రాజ! మీయన్నగారు జ్ఞాపకార్థమై వ్రాసినపత్రికానుసల్లిఁకొఁ దమ పేరును దెలుపుచు నన్ను మీకడ కంపినారు. చిత్తగింపుఁడు." అనియుత్తరము నొసంగెను. చిన్నరాయలు కంపముచేఁ దిన్నగాఁ బ్రసరింపని తనచేయిచాఁచి యాపత్రిక నందుకొనియెను. దానిని విప్పిచదువ నుద్యుక్తుఁడయ్యెను; కాని లజ్జాభయము లాతనియు ద్యమమున కంతరాయమును గల్పించినవి. మాణిక్యరాయలును, రఘుపతియు నతనిహృదయమునుండి వేఱయి యున్నంతకాల మతఁడు నిశ్చింతగా నుండెను. నిజముగ నిప్పు డాతఁడెట్టు లన్న గారిని జూడఁ గాంక్షింపకుండఁ గలఁడు? మాణిక్యరాయలమూర్తి యొక్కసారి తనయెదుటికి వచ్చి నిలిచి యుండెను. ఇందుచే నతఁడు లజ్జితుండై తనలోఁ దాను విచారింపసాగెను. "రఘు పతియే నేనాసవేళమున నుందునేని యీదూత నిట్లు నాకడకు రానిచ్చునా?" యేమేమో యాలోచించి కొంతతడవు పోయిన పిదప నుత్తరమును విప్పెను. గోవిందమాణిక్యరాఁడు లాయు త్తరమున నతని నిందించు నొక్కమాటయైన వ్రాసియుండలేదు. చిన్నరాయలు లజ్జింపవలసిన దొకమాటయు నందు లేదు.

మాణిక్యరాయలు మితిమించినప్రసంగ మేమియు నందు వ్రాయ లేదు. మాణిక్యరాయలు మించిప్రసంగముగావించువాఁడు కాఁడని యాయుత్తరమును జదివినమనుష్యప్రకృతికిఁ దోఁచకపోదు. మఱియు నేనానిపహాముతో వచ్చి తనపై దాడి వెడలుననుసూచా రము లేవియు నందులేనేలేవు. జ్ఞానమువచ్చినప్పటి నుండియు నా యన్నదమ్ముల కెట్టిభావ మన్యోన్యముగా నుండెనో యట్టి భావ మిప్పట్టున నెట్టులైనఁ బుట్టక తీఱినది కాదు. తన్మాత్రికానుత ల్లికయం దంతట ప్రేమయు విషాదమును దానై తాండవించుచున్నవి. స్నేహమందును విషాదమందును నీసన్మాత్రమైన నెక్కువ తక్కువలు నిర్ణయింప శక్యము కాకున్నది. ఈ ప్రేమావిషాదములతో నిండియుండుమాటలు నత్రరాయుల హృదయమున గట్టికొప్పిని గలిగించినవి. పత్రికాపఠనానంతర మాతనిమనస్సు మెల్ల మెల్లన నూటిపోయినది. ఆవఱకాతనిహృదయమునందుగల జాతిమూవరణము చూర్ణమై రాలిపోయెను. మాఖమున నుదాసీనత్వ మనుపీడ కాఁచినది. చేతులను వణఁకుదయించెను. తోడ్తో నుత్తరముగూడ వణఁకుచున్నది. చిన్నరాయలు లాయుత్తరమును గొంతసేపు తనయుత్తమాంగమున నిడికొనెను. మాటిమాటికద్దానిఁ జదువఁజొచ్చెను. ఆయుత్తరము నలంకరించుచున్న యన్నగారి యాశీర్వాదము మిక్కిలి చలువగలసుధాసప్రవాహమువలె నంతప్తమగుచుండు చిన్నరాయలహృదయమునుపైఁ బ్రవహింపఁజొచ్చెను. అతఁ డెంతయో కాల మట్లు నిశ్చలుండై నంజకెంజాయచేఁ బ్రకాశించుచున్నమారస్థమగు వనస్థావిపైఁ

దనదృష్టిని నిగిడించెను. నల్లదలను శాంతిమయమగు సంధ్యానిశ్శబ్ద ముగా నున్ననముద్రమువలె శోభించుచుండెను. చూడంజూడ నాతనికన్నులు వికసించి యాకర్ణాంతత నంగీకరించినవి. అశ్రు జలము పూరితమై ప్రవహింపసాగెను. లజ్జచేతను బశ్చాత్తాపము చేతను ఖిన్నుండై రెండుచేతులతో మొగమును గప్పుకొని రోద నముచేయుచు "నే నీరాజ్యము నభిలషింపను. అన్నగారు నాయప రాధమును మన్నించి తమపాదపద్మములు శరణముగ నొసంగు దురుగాక. నన్ను సన్నిధిం జేర్తురుగాక. విడిచియుండలేక పోవు దురుగాక."

ఠాకూరేమియుం బలుకలేదు. మౌన మవలంబించి నిండు మనంబుతోడను స్నేహపూరితము లైనచూడ్కులతోడను నక్ష త్రరాయులముఖమును చూడసాగెను. తుదకారాయలు కొంత సేపటికి సావధానమనస్కుం డయ్యె. అప్పుడు ఠాకూరు "మీ యన్నగారు మిమ్ములను జూడం గోరియున్నారు. బయలుదేఱి యాతనిం గలసికొనుండు. ఇప్పుడు మఱియాలస్య మొనరింప వలదు" అని ప్రబోధించెను.

నక్ష.—"ఇట్టిదుష్టచిత్తుని నన్నాయన క్షమియింతురా?"

బిల్వం—"ఆతండు యువరాజుగారిపై నొకించుకయు వాత్సల్య మును విడిచియుండ లేదు. ఎక్కువ రాత్రియైనచో దారి లోఁ బ్రమాదము సంభవించును. వడిగలయుత్తమాశ్వ మొండు సిద్ధము చేయఁబడినది. పర్వతముదిగువ మిమ్ములఁ

దోడ్కొని పోవ నన్నగారియాంతరంగికుఁ డొకఁడు నిరీక్షించి యున్నాఁడు."

నక్ష.—"నేను మాటలాడక బయలు దేఱుచున్నాను. నేనలలో నేఁ బోవునట్లు తెలియనీయను. ఇప్పుడాలస్య మొనర్చిన నేమి ప్రయోజనము? ఇచ్చటనుండి యెంత వేగము వెల్వడిన నంతియోగ్యముగా నుండును."

బిల్వ.—"ప్రభువారు బాగుగా నాలోచించినారు."

"నేను త్రిశిఖరపర్వతముపై శివునిఁ బూజించుటకై యీ యతితోఁ బోవుచున్నాఁడను." అని నక్షత్రరాయ లశ్వము నధిరోహించి సన్న్యాసిని వెంటని బయలు దేఱెను. పరిచరు లాతని ననుసరింప నుద్యుక్తులయ్యు నాతనిచే నివారింపఁబడి నిలిచి పోయిరి.

ఇప్పుడు వెలువలకు వచ్చిరి. గుఱ్ఱముల డెక్కలనుండి పుట్టిన కటకటధ్వనియు, సైనికులకోలాహలధ్వనియు నింతలో వినవచ్చెను. నక్షత్రరాయలు మిగుల లజ్జించెను. చూచుచుండఁగనే రఘుపతి సైన్యసమేతుఁడై యెట్టయెదుటఁ గన్పట్టెను. చూచి చూచుటలో నతఁ డాశ్చర్యపడి "మహారాజేంద్రా! ఎక్కడికీప్రయాణము?" అని యడిగెను. రాయ లేమియును జెప్పలేక పోయెను. నక్షత్రరాయ లూరకుండుటఁ జూచి ఠాకూరు "మాణిక్యరాయలతో మాటలాడుటకై వచ్చుచుండిరి" అని ప్రత్యుత్తర మొసంగెను.

రఘుపతి ఠాకూరు నాపాదమస్తక మొక్కసారి చూచెను. భ్రూలత లల్లుకొనసాగెను. తదనంతరము తన్ను దానే శాంతి పఱచుకొని, "నేఁ డిట్టిసమయమున మాయేలికను మేము విడువ నంగీకరింపము. ఇంత యాతురతనొందఁ గార్యమేమి? రేపు ప్రాతఃకాలమున బయలు దేఱి వచ్చెదరు. మహారాజావారియిష్ట మేమి?" అనెను.

నక్షత్రరాయునికి భయజ్వర మంకురించినది. రఘుపతి యెదుట గట్టిగా మాట్లాడవశమా? మెల్ల మెల్లన "ఔను. ఉదయమునఁ బోయెదను. ఇప్పుడు రాత్రియైనది" అని పలికెను.

బిల్వనయతీంద్రుని యాశాలతి లొక్కసారి తెగి ముక్క ముక్క లయినవి. వారినమ్ముఖమును వీడి తనపరివారముతో నా రాత్రియచ్చటనే వేగించెను. ఉదయమగునంతఁ జిన్నరాయుల కడ కేఁగఁ బ్రయత్నించెను గాని ద్వారపాలకులచే నాఁపివేయఁ బడెను. రాయులశిబిరమునకు నలుగడల నట్టికట్టడగట్టు చేయఁ బడియెను. ఏదెననుండియు నాతని దర్శింపఁ బోవుటకు దారి లేదు. తుదకు రఘుపతికడ కరిగి "ప్రయాణ సమయము సమీ పించెను. యువరాజుగారికి వర్తమాన మంపుఁడు." అని చెప్పెను.

రఘు.—"మహారాజావా రిప్పుడు బయలు దేఱరు. ఈనిశ్చ యము మీఁదనే యాతఁడుండెను." అని జబాబు చెప్పెను.

బిల్వ.—'నేనొక్కసారి వారితోఁ గలియవలెనని కోరుచున్నాను.'

రఘు.—"మఱి మీకు దర్శనము లభింప నేరదు. వారే యిట్లు చెప్పిపంపిరి."

బిల్వ.—"మహారాణా మాణిక్యరాయలవారి యుత్తరమునకుఁ బ్రత్యుత్తరము నొందఁ గోరుచున్నాను."

ర—"ఉత్తరమున కిదివఱకొకసారి ప్రత్యుత్తరమీయఁబడినది."

బి.—"నక్షత్రరాయలనోటనుండి యీమాట విన సిచ్ఛగించుచుంటిని."

రఘు.—"అందున కేమియు నుపాయము గానరాదు."

ఠాకూరు సమాచారమునంతయుఁ దెలిసికొనెను. కాలక్షేపము, వాక్యవ్యయముదక్క ఫలిత మేమియుఁ గానరాలేదు. అతఁడు తిరిగిపోవుచున్నసమయమున రఘుపతి నుద్దేశించి, "బ్రాహ్మణోత్తమా! నీవు సర్వమును నాశనము చేయఁగోరుచుంటివా? ఇది బ్రాహ్మణధర్మము కాదు."

---

## ముప్పదియాఱవపరిచ్ఛేదము.

నక్షత్రరాయలశిబిరమునుండి ఠాకూరు తిరిగి వచ్చునరికి మాణిక్యరాయలు తనకు సాహాయ్యము చేయుటకై కూర్పఁబడిన మాకీజాతివారికిఁ గొంతధనమిచ్చి సెలవిచ్చి పంపివేసెను. వారందఱు యుద్ధముప్పుడు కాదని తెలిసికొని మార్గమందలి చిన్నగ్రామములు దోఁచుకొనుచు స్వదేశనివాసస్థలములను జేరిరి. త్రిపురాబలగమును రాజుగారియాజ్ఞానుసారము తమతమ

యునికిపట్టులఁ జేరుకొనియెను. యుద్ధప్రయత్నమును దెచ్చుటను గానరావు. బిల్వనగురూజీ యిదియంతయుఁ జూచి విహ్వలుం డై యిది యేమి? ఇట్లొనర్చి రని మాణిక్యరాయల నడిగెను.

రాజా.—"నే నిప్పుడు బయలు దేఱి పోవుచున్నాను. నాతమ్మునికి రాజ్యమును విడుచుచున్నాను."

బిల్వ.—"దిక్కుమాలినప్రజల నితరుల పాల్జేసి మీరు పలాయితులగుటకు నిశ్చయించితిరా? ఇట్లు తాము కాందిశీకులై పలాయనసూత్రమును బఠింతురని మున్నెన్నఁడు నే నను కొనలేదు. తల్లి తనబిడ్డను సవతితల్లిబారి కప్పగించి నిశ్చింతగా నుండఁ గోరుట ధర్మమగునా?

రాజా.—"తమరు సెలవిచ్చుచున్నయంత మీాపలుకే నామనంబునుండి జారిపోయినది. క్షమింపుఁడు. నాకిప్పుడు మఱేమియును జెప్పవలదు. నానిశ్చయమునుండి నన్ను చలింపఁ జేయుఁ బ్రయత్నింపవలదు. 'నేను రక్తపాత మొనర్పను' అని నే నీవఱకొనరించిన ప్రతిజ్ఞను విని యుందురుగదా! అట్టి ప్రతిజ్ఞాభంగమునకు నే నహింపఁజాలను."

బిల్వ.—"సరియే. ఆలాగైన నయ్యా! తా మిప్పు డేమిచేయ నిశ్చయించియున్నారు?"

రాజా.—"గురూజీ! వినుఁడు. నానిశ్చయమునంతయుఁ దమకువిశద పఱచుచుకొనియెదను. నేను ధ్రువునిదోడ్కొని వనమున కేఁగుచున్నాను. నాజీవిత మంధకారబంధురముగాఁ బోఁచుచున్న

యది. నే నెన్నియో పను లొనర్ప వలయు నని మనంబున నిశ్చయించుకొంటిని గాని యవి నేఁటివఱకును నెఱవేర్పలేక పోయితిని. జీవప్రకృతికి గతించినకాలభాగము తిరిగి వచ్చుట యసంభవముగదా? అదృష్టదేవత తమ్మొద్దనుఁ జాఱవై చినదని తలంచుచున్నాను. ఒక్కసారి గుఱి తప్పిపోయినచోఁ దరువాత వేలకొలఁదిగా నుపాయము లొనరించినను మఱి గుఱి కుదురనేరదు. అంతియే, నాజీవనప్రారంభకాలమున నేలక్ష్యము చెదరిపోయినదో నాలక్ష్య మిప్పుడు వెదకినను గానరాదు. నేనెప్పుడు జాగరూకతతో మెలంగి నారక్షణకై తగినకట్టుబాటుల నొనరించుకొనవలసినదో యట్టినసమయ మున నొడ లెఱుంగలేకపోతిని. మునిఁగిపోవుచు నిప్పుడు రక్ష కావలయు నన నెట్లు లభించును? సముద్రమున దిరుగఁబడిన మనుజు లెట్లు తెప్పలను జీవనాధారముగాఁ జేసికొందు రట్లు నేనును బాలుండగు ధ్రువుని నాజీవనాధారునిగాఁ జేసి కొనుచున్నాను. ధ్రువసహాయముననే నే నెట్టులయిన దరిఁ జేరఁ గలను. నేను మొదటనుండియు వానికి మనుష్యునికిఁ గావల సినముఖ్యకర్తవ్యములను నుపదేశించి నిజమగుమనుష్యుని జేయుటకుఁ బ్రయత్నించెదను. వానితో నన్నును సంస్కరిం చుకొని మనుష్యజన్మమును సార్థకత్వ మొందించెదను. గురు వర్యా! ఇప్పటికింకను మనుష్యపదవాచ్యత్వమున కర్హుండను గాకున్నాను. రాజునై చేసెడిదేమి."

రాజుగారు చివర చెప్పినయీమాట మిక్కిలి రొత్తి చెప్పుటచే ధ్రువుండది విని రాజుగారిభుజములపైఁ దలరాయుచు

"నేను రాజును" అనెను. ఠాకూరాతని నెత్తి ముద్దాడి తనయొడి లోఁ గూర్చుండఁబెట్టుకొనియెను. చాలసేపు ధ్రువునిముఖలక్షణములఁ బరికించుచు రాజుగారితో "ఏమి! అరణ్యమున నెప్పుడైనను మనుష్యత్వలాభము నందఁగలరా ? వనమందొక్కపాదమే ధర్మపరిపాలనముండును. తద్ద్వారా లౌకికజ్ఞానము సంపాదింపఁబడునా? కొంతవఱకు నజ్ఞానమే సంపాదింపఁబడును. మనుష్యుఁడు తనమనుష్యసంఘములో నుండినచో సంస్కరింపఁబడుటలో సందేహము లేదు.

రాజా.—"నే నరణ్యమునకుఁ బోవుచున్న దెందులకు: మనుష్యులలో నుండి వేఱుగానుండుటకే, జనసంఘములోనుండి యన్నివిషయముల సంబంధమును త్యజింపలేను. ఈనియమము కొన్నిదినములుమాత్రమే యని యెఱుంగుఁడు."

ఇక్కడ నక్షత్రరాయలు సేనాసమేతుఁడై రాజధాని సమీపించెను. ప్రజల ధనధాన్యములఁ దోఁచుకొనుచుండెను. ఇట్టి కష్టముల ననుభవించుప్రజలు మాణిక్యరాయలను నిందింప సాగిరి. "ఈయుపద్రవము లన్నియు నీమాణిక్యరాయలపాపము వలనఁ దటస్థించిన" వని చెప్పుకొనుచుండిరి. రాయ లొక్కసారి రఘుపతిని బిలిపించెను. రఘుపతియు వచ్చె. అప్పు డాతఁడు అయ్యా! నిష్కారణముగాఁ బ్రజల నెందుకు బాధించెదరు. నేను నక్షత్రరాయునికై రాజ్యమును వీడిపోవుచున్నాను. మొగలాయీలకు సెలవిచ్చి యంపివేయుము.

రఘు.—చిత్తము! ప్రభువువారియనుమతి ననుసరించెదము. తా

మెప్పుడు రాజధానిని వీడి విజయము చేయుదురో నే నప్పుడే కొలుగలు సేనలకు సెలవిచ్చి యంపి వేయుదును. త్రిపురా గొల్లఁగొనుట నాకిష్టములేదు.

మాణిక్యరాయ లాదినముననే రాజధానివిడిచి పోవ వలసొచ్చెను. తనరాజవేషమును మార్చి కాషాయవస్త్రములను ధరించెను. నక్షత్రరాయుని కొకముంచియాశీర్వాదపత్రమును వ్రాసెను. రాజ్యమందలి కర్తవ్యాంశముల గుఱించి యందు విపులముగా లిఖింపఁబడెను. పిదప ధ్రువునిఁ దనతొడలపై నుంచుకొని "బాబూ! ధ్రువ! నాతో వనమునకు వచ్చెదవా?" అని యడిగెను.

ధ్రువుం డాతనికంఠమునకుఁ జేతులుపైనవైచి, "ఆహా! నేను వనమునకు వచ్చెదను." అని జవాబిచ్చెను.

అనంతరమున ధ్రువుని వనమునకుఁ దీసికొనిపోవ నాతని తాతయగు కేదారుని యనుమతిఁ బొందవలయు నని హఠాత్తుగా రాజుగారికిఁ దోఁచెను. అంతట నాఁడు కేదారేశ్వరుని బిలిచి "అయ్యా! నీయిష్టపడినచో ధ్రువుని నాతోఁ దీసికొని పోవుచున్నాను." అని చెప్పెను.

ధ్రువుండు రేయింబవళ్లు మాణిక్యరాయలయొద్దనేయుండెడివాఁడు. కేదారేశ్వరునికడ కేఁగుట కతని కెప్పుడు నలవాటు కాదు. కావుననే రాజుగారు తనయొద్ద ధ్రువు నుంచుకొనుట కేదారున కనిష్టమని తలంపలేదు. రాజుగారిమాట విని కేదారేశ్వరుఁడు "అయ్యా! బాలుని మీసన్నిధిని వీడి నే నెట్టు లుండఁగలను." అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఆమాట వినినంతన రాజుగారియాశ పటాపంచలై పోయినది. నిజముగ నాతనిపైఁ బిడుగుపడినట్టు లయినది. కొంతవడి కూరకుండి కేదారునితో "నీవు గూడ నాతోఁ గలిసిరమ్ము" అని పలికెను.

కేదా.—"లేదు మహారాజా! అరణ్యమునకుఁ బోయి యుండుట నా కనుచితమని తోఁచుచున్నది."

రాజా.—(అధీరుండై) "నే నరణ్యమున నివసింపను. కావలయు నంతపరివారమును ధనమును జేకొని యొద్దియైనఁ బట్టణమున నే వసింప నిశ్చయించితిని."

కేదా.—'నేనీ దేశమునువిడిచి యన్య దేశమునకుఁ బోవఁజాలను.'

రాజుగారు దానితో నింక నేమి మాట్లాడియుఁ బ్రయోజన మిసుమంతయు లేదని తెలిసికొని పెద్దనిట్టూర్పు విడిచి యూరకుండెను. ఆతనియాశలన్నియు మన్నుగలిసి పోయెను. ఆతనిమనమున నానిమనమున సర్వప్రకృతియు వికృతిగా తోఁచెను. ధ్రువుఁ డాతనిసమీపమున నానందముగా నాడుకొనుచుండెను. రాజేంద్రుఁ డాబాలుని జూచుచుఁ గొంత కాల యాపన మొనరించుచుండెను. ఆయన నేత్రము లశ్రుజలములతో నిండుకొనుటచే దృష్ట్యవరోధ మొదవెను.

ధ్రువుం డారాజేంద్రుని చేయిపట్టి లాగుచు "నీవుగూడ నాతో లా(రా)" అని పలుకఁ జొచ్చెను. అంత నారాజచంద్రుని పరిపూర్ణ మగుహృదయముకరిగి యశ్రురూపము నొంది కన్నుల నిండుకొనియెను. "అతఁడు మిక్కిలి శ్రమపడి కన్నీ రాఁపుకొనెను.

పిదప నాతఁడు మనస్సు విఱిగి "ధ్రువుఁడా ! నీవిచ్చటనుండుము. నేనొక్కఁడను బోయెదను" అనెను. జీవితావశిష్టభాగమున మిక్కిలివిశాలమై కంటకావృత మైనయొకమార్గ మొకనిమున ములో మెఱపుఁదీఁగవలె నాతనిదృష్టికి గోచరించెను.

కేదారేశ్వరుఁడు ధ్రువునియాట మాన్పి "రమ్ము ! నా వెనువెంట రమ్ము" అని యాబాలునిచేయిఁ బట్టుకొని యీడువ సాగెను. బాలకుం డేడ్చుచు "నేను రాను" అని పలికెను. రాజుగా రులికిపడి ధ్రువునివంక మొగమును ద్రిప్పి చూచెను. ధ్రువుఁడు పరుగెత్తికొని వచ్చి రాజుగారిని నంటి పట్టుకొని యతివేగ ముగా నాతని ముణుకులసందునఁ దనముఖము నుంచి మఱుఁగు పడియెను. రాజుగా రాతని ఱొమ్ముమీఁది కెత్తి కౌఁగిలించుకొని యెను. ఆతనివిశాలహృదయము పగిలె ననుకొనవచ్చును. గాని ధ్రువునిగాఢాలింగనమునఁ గలిగినచల్లఁదనము కొంతవఱకు కాఁపి యుండును. అతఁ డట్లు లాబాలు నెత్తుకొని యాత్మభవనమున నట్టిటుఁ బచారుచేయుచుండెను. బాలుం డాతనిభుజముపైఁ దల నిడికొని శాంతిభావము నవలంబించి యుండెను. ప్రయాణసమ యము సమీపించెను. రాజుగారిభుజముమీఁద బాలుఁడు నిదు రించెను. ఎట్లులో గుండె రాయి చేసికొని నిద్రించుచుండు బా లుని గేదారేశ్వరునిచేతఁ బెట్టి ప్రయాణోన్ముఖుం డయ్యెను. ఆహా ! ఋణానుబంధ మెంతలోఁ దెగినది.

---

## ముప్పదియేడవపరిచ్ఛేదము.

నక్షత్రరాయలు సైన్యముతోఁ బూర్వద్వారమునుండి లోని కేఁగి కోటలోఁ బ్రవేశించెను. ఇట గోవింద మాణిక్యరాయలు తగుమాత్రము ధనమును లెక్కవారల నౌకరులను దోడ్కొని పశ్చిమద్వారమునుండి కోటదాఁటి యావలఁ బ్రవేశించెను. పుర జనులు శంఖధ్వనులతోడను, వివిధము లగుమేళతాళములతోడను, జయజయధ్వనులతోడను నక్షత్రరాయుని నెదురుకొని స్వాగత మిచ్చి తమయానందమును బ్రకటించిరి. మాణిక్యరాయ లశ్వము నెక్కిపోవుచుండెను యాదిక్కున నతని సమ్మానింపవలె నని యొకనికిని దోఁచినది కాదు. వీథి కిరుదెసలనున్న యిండ్ల నుండి స్త్రీలు బయటికివచ్చి యాతనిఁ దిట్టసాగిరి. వారంద ఱాతని పాపమువలననే తమ కన్నము లేక దుఃఖింపవలసివచ్చెనని తలఁచిరి. దీనులును వయోవృద్ధులగు నేరి కాభయంకరదుర్భిక్షదినము లలో రాజుగారి కందానుండి భోజనపదార్థములు లభించుచుం డెనో, వారును, స్వయముగా రాజుగారే వారికి ధైర్యము చెప్పు చుండెనో వారును మాత్రము దుర్బలములై యసియాడుచున్న తమచేతులెత్తి రాజునకు దీవన లొసంగిరి. మఱియు నాతని గుఱించి మిక్కిలి దుఃఖించిరి. పిల్లకాయ లందఱు తల్లులను వీడి గుమిగూడి, చేతులను దట్టుచు మాణిక్యరాయుల వెనువెంట బయలు దేఱిరి. రాజుగా రీమాటలనన్నిటిఁ బాటిసేయక తిన్నగా ముందునకుఁ జూచుచు మెల్లమెల్లనఁ బోవసాగెను. అప్పు డొక

వ్యవసాయదారుఁడు(రయితు) తనపొలమునుండి వచ్చుచుండెను. ఆతఁడు త్రోవలో రాజుగారిని జూచుచు నెక్కుడు భక్తితో నాతనికిఁ బ్రణామమొనర్చెను. రాజుగారిహృదయము కరఁగి ద్రవీభూతమాయెను. ఆతఁడు గుఱ్ఱము వడి తగ్గించి నిలువఁజేసి యా కృషీవలునితో "అన్నా! నాకిప్పు డిక్కడనుండి ముందుపోవుటకు దారి చెప్పుము" అని యడిగెను. రాజుగారి యాయవస్థను జూచి యాతఁడు మిక్కిలి విచారించెను. తననంతానమువలెఁ జూచుకొనుచున్న ప్రజలనుండి యాతఁడొక్కఁడు నట్లుపోవుచుండుటఁ జూచినచో జాలి కలిగిన ప్రతిమనుజుని హృదయమును నీఱగుననుటలో నతిశయోక్తియేమున్నది? అంత నాకాఁపేమియుఁ బలుకలేక భక్తిపూర్వకముగాఁ బ్రభువునకుఁ జేతులు మోడ్చి కడసెలవు పుచ్చుకొనియెను. రాజుగారివెనుక గుంపుగుంపులుగా నల్లరిపిల్లకాయలు గుమిగూడి చప్పట్లు చఱచుచుఁ బరిహాసింపఁ బ్రారంభించిరి. అట్లా బాలకు లల్లరి చేయుచుండుటఁ జూచి యాకృషీవలుండు వారినిఁ దఱిమి కొట్టి పంపెను. రాజుగారు వానిని వారించెను. తుద కాతఁ డావీథిలో నేగుచుఁ గేదారేశ్వరుని గృహమును సమీపించెను. తిరిగి తూర్పుదెసఁ జూచునంతఁ దెల్లవాఱువేళ యైన దని తెలిసికొనియెను. వాకిళ్లు తుడుచుటకు గ్రామపునౌకరులు వచ్చుచుండిరి. మంచు నీడవలెఁ గప్పియుండెను. ఆమంచును దెరుల్చుకొని బాలసూర్యుకిరణజాలములు వెల్వడుచున్నవి. కేదారేశ్వరునియిల్లు పొడగనినంత రాములకు హాసీని ధ్రువునిఁజూచిననాఁటి యాసాథసాహసము నందలి యాప్రాతఃకాలము స్మరణకువచ్చెను. నాఁడు వర్షాకాలము

వాన కురియుచుండెను. విదియనాఁటిశశికలతో సదృశమై వాడి
యున్న యాబాలిక హాసీ తెలివి తప్పి శయ్యపై నొకప్రక్కను
బరుండి నిద్రించుచుండెను. కిశోరావస్థయందుండు ధ్రువుఁ డా
బాలిక పడుచున్న బాధ నెఱుంగక యామెచీర చెఱఁగుచేఁ దన
మొగమును గప్పికొని యొకప్పు డాబాలికావతంసము ముద్దు
మోము చూచుచుండుటయు మఱియొకప్పు డింతకుఁ దగిన
బలము గలిగి గుండ్రములగు నాతనిచిన్న చేతులతో మెల మెల్లఁగ
నామె ముఖమును నిమురుచుంటయు మున్నైనవి రాజుగారి
కొక్కటొక్కటిగా జ్ఞప్తికివచ్చినవి. నిజముగా నేఁటియుదయ మా
నాఁటిదుర్దినప్రాతఃకాలమై మాఱినది. ఏతనయదృష్టము నేఁడు
తన్ను రాజ్యచ్యుతునిఁ జేసి యవమానపఱిచి గృహమునుండి
యావలకు వెడలఁగొట్టెనో యాయదృష్ట మీచిన్నయింటిద్వార
ముకడ నానాఁటి ప్రాతఃకాలమును స్మరణకుఁ దెచ్చెననియు, ఆస్థాన
మందున నాయదృష్టముతోఁ దనకు మొదటనే పరిచయముకలి
గినదనియు ననుకొనుచుండెఁ గాఁబోలు! కావుననే యాతఁ డా
యింటిదరికి రాఁగానే యన్యమనస్కుండై యచ్చటఁ గొంతద
నుక నిలువఁబడియెను. ఆసమయమున నతనివెంబడి వచ్చిన పరి
చారకులు తప్ప మఱియెవ్వరు నచ్చట లేరు. తనువెంట వచ్చు
నల్లరిపిల్లకాయల నాకృషీవలుం డదలించి పంపించి యుండెను
గదా! వా రాకృషీవలుండు దూరముగాఁ జనినంతనే మరలి
వచ్చి చేరిరి. మొదటివలెనే యల్లరి చేయుచుండిరి. అది చూచి
యన్యమనస్కుండై యున్నయారాజర్షి సావధానుండై మెల్లమెల్ల
నశ్వమును నడిపించుచుండెను. ఒక్కమా టాబాలకుల కలకల

ధ్వనినుండి యవ్యాజమధురమై యపరిచిత మగు నొకస్వర మా తనికర్ణముల నానందింపఁజేసెను. ఇదియేమని యతండు వెనుకఁ దిరిగి చూచువఱకు రెండుచేతుల నెత్తుకొని ధ్రువుండు నవ్వుచుఁ బరువెత్తుకొని వచ్చుచుండెను. కేదారేశ్వరుం డింటికడలేఁడు. అతఁడు క్రొత్తరాజును దర్శించి తనకుఁ గలభక్తిని బ్రకటింపఁ బోయి యుండెను. ఇంటిలో నొకముసలిదాసిమాత్ర ముండెను. మాణిక్యరాయలు వెంటనే యశ్వమునుండి దిగియెను. ధ్రువుం డాతని యుత్తరీయపుఁజెఱఁగును బట్టుకొని ముఖమును గప్పుకొని యెను. మొట్టమొదటఁ దగిన యానందప్రవాహము కొంత తగ్గిన పిదప ధ్రువుండు "నేను గుఱ్ఱ(ఱ్ఱ)ముమీఁద నెక్కెదను." అనె ను. రా జాబాలకుని గుఱ్ఱముపై నెక్కించెను. గుఱ్ఱ మెక్కినంత నాబాలుఁడు రాజేంద్రునికంఠమును గౌఁగిలించుకొనియెను. ఆసమయమున నుండు రాజుగారిచేష్టలను జూచి ధ్రువుండు నిదురఁ బోయి లేచినవానివలె కలఁతనొంది తనమనంబున వితర్కించు కొనియెను. ధ్రువుఁడు పూర్వమువలె రాజును దనదెసకుఁ ద్రిప్పి కొని యాతనిజుట్టుకొని యాతనికంఠమునఁ దనకంఠమును జేర్చి యాతనియప్రసన్నతను మాన్పఁ బ్రయత్నించెను; కాని విఫల ప్రయత్నుఁడై చిన్నఁబోయి తనచేతులతో మోమును గప్పికొని మాటలాడకుండెను. రాజు ధ్రువునియంతరాత్మ నెఱిఁగి మాటి మాటికి నాతని మోమును దిలకించు చుండెను. చివరకు రాజు వివశుఁడై "ధ్రువా! నేను వెళ్లుచున్నాను." అని చెప్పెను. ధ్రువుం డామాటను విని యాతని మొగమువైపుఁ జూచి "నేనును వచ్చుచున్నాను" అనెను.

రాజు.—"నీవెచ్చటికి వచ్చెదవు ? నీకు సంతోషముగా నున్న చోటనే యుండుము."

ధ్రువు.—"అబ్బ ! నీతోడనే వచ్చెదను."

అనుసయమునసే యింట నుండుమునలిది, వటవట వాఁగుచు నచ్చోటికి వచ్చెను. ఆమె గట్టిగా ధ్రువుని రెట్టఁబట్టికొని "రమ్మిచ్చటనుండి" అని లాగెను.

ధ్రువుండు భయపడెను. అతఁడు రెండుచేతులతో రాజుగారిని బట్టికొని యాతనిమొగముచాటున నుండెను. మఱియుఁ దనచిన్నిమోము నాతనిఱొమ్మునఁ గీలుకొల్పి యుంచెను. రాజుగారు ధైర్యమును వీడి యిట్టు లనుకొనియెను. "ప్రాణరక్షణము లగు హృదయనాడుల నెట్టులో వదలించుకొని పోవుచుంటినిగాని యీబాలునిచేతుల నెట్లు వదలించుకొని పోఁగలను? నేఁ డివియు వదలించుకొని పోవలసివచ్చెను. అని యాతనిచేతు లెట్టులెట్టులో మెల్లమెల్లన విడిపించుకొని బలవంతముగా నాతని నాదాసీహస్తగతుని జేసెను. ధ్రువుండు బిగ్గరగా నేడ్చుచు మాటిమాటికి "నేనును వచ్చెదను." అని యనుచుండెను. రాజుగారు మఱివెనుదిరిగిచూడక గుఱ్ఱము నెక్కిరి. కావులు నడలించి యతివేగముగాఁ బరువెత్తించుకొనిపోయెను. అతఁ డక్లెంతదూరము ముందున కేఁగుచుండె నంత దూరమువఱకు ధ్రువుని రోదనధ్వనియు, రెండుచేతు లెత్తుకొని "నేనును వచ్చెదను" అనుమాటయును వినవచ్చుచునేయుండెను. రాయలకన్నులనుండి బాష్పవర్షము కురియసాగెను. అతఁడు దారితెన్ను లెఱుంగలేక

పోయెను. నిజముగ సూర్యుని ప్రకాశమును ప్రపంచమంతయు నాతని కన్నీళ్లలో మునిఁగిపోయెను. గుఱ్ఱము దాని యిష్టము వచ్చినట్లు నడుచుచుండెను.

మార్గమం దొకచో మొగలీచసూనసముదాయము వచ్చుచుండెను. ఆసైన్య మాతని గుఱుతించి నవ్వసాగెను. రాజుగారు వారియజ్ఞతను దలంచి తనసేవకులను జూచి చిఱునవ్వు నవ్వెను. రాజుగారి సభాసదులలో నొకఁ డామార్గమున హయారూఢుం డై యెచ్చటికో పోవుచుండెను. అతఁ డీసమాచారమును గనిపెట్టి గుఱ్ఱమును బరుగెత్తించుకొని రాజులను సమీపించెను. వచ్చి యాతండు రాజుగారితో "మహారాజేంద్రా! ఈ యవమానమును నేసహింపలేకున్నాను. ప్రభువారి దీన దశఁ జూచి యీ ప్రాకృతజనులు పరిహసింప నారంభించిరి. మంచిది. తమరు నాఖడ్గమును శిరోవేష్టనమునకుఁ జేకొనుఁడు. దయయుంచి కొన్నినిమిషములు మాత్రము తా మిచ్చట నిలిచి చూచుచుండుఁడు. నేనిప్పుడే నాపరివారమును దోడ్కొని వచ్చి యీనరాధములకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనరించెదను." అని గంభీరముగాఁ బలికెను.

రాజా.—"నాయనగాయా! అక్కఱలేదు. నాకీకరవాలముతోను ఖడ్గముతోను నేమిప్రయోజనము? ఈసైన్యము నన్నేమి చేయఁగలదు? నే నింతకంటె నధికమగు నవమానము నైనను సహింప సిద్ధముగా నున్నాను. నే నొఱఁదీసినకత్తి చేఁబూని యీలోకమందలిమనుష్యుల యాదరముఁ గొందనిశ్చ

యింపలేను. లోకమున సామాన్యజన మెట్టులు మంచిదిన ములలోను జెడుదినములందును మానావమానములను సుఖ దుఃఖములను సహించి యనుభవింతురో నేను నట్టులే స హింపఁగలను. మఱియు నోనయనరాయా! చూడుము. తమ్ముఁ డును బంధుగులును నాయెడ శత్రుత్వమును వహించియున్న వారు. ఆశ్రితగణము కృతఘ్నతను జూపించుచుండెను. ప్రజ లు నన్నుఁజూచినంతఁ దలలువంచి నమస్కరించుచుండిరో, వా రిప్పుడు దలయెత్తి నన్నుఁ జూడకున్నారు. ఒకప్పు డిట్టి మాటలు నాకు నసహ్యములుగా నుండెడివి; గాని యిప్పు డిట్టివి సహించుటయే సుఖదాయక మని తలంచుచుంటిని. నానే మము గోరినవా రెవ్వరో నే నెఱుంగుదును. కావున నయన రాయా! నీవిప్పుడు మరలి పొమ్ము. నక్షత్రరాయని సమ్మాన పూర్వకముగా వృద్ధికిఁ దేఁ బ్రయత్నింపుము. నాయెడ నీ వెట్టి గౌరవముతో మెలఁగుచుంటివో నాతమ్మునియెడ నట్టి గౌరవముతో మెలంగఁగలవు. మీరందఱుఁ గలిసి నక్షత్ర రాయని మంచిమార్గమునఁ బ్రవర్తించులాగొనర్పుఁడు. అతఁడును బ్రజాగణముపై దయ యుంచి వారిక్షేమమును విచారించుచుఁ బాలింపఁ గలఁడు. మిమ్మునందఱ విడిచిపోవు నీతుదిసమయమున నే నొక్కటి ప్రార్థించుచున్నాను. మీ రెల్లరు పొరపాటుకై నామాట నెప్పుడును ద్రోసివేయ వలదు. ఇది మఱవ వలదు. మంచిది. నేఁబోయి వత్తునా!"
అని బోధించి మాణిక్యరాయ లాసభాసదులతో సమూ ల్యము లగువాజ్మణుల వ్యవహారమొనర్చి తా నగ్రేసరుం

డమ్యెను. నయనరాయలు నతనికిఁ బ్రణామ మొనర్చి యశ్రు జలముచే నాతని పాదములకుఁ బాద్య మిచ్చి సెలవుఁ గైకొని యథేచ్ఛంజనియెను.

రాజుగా రచ్చటినుండి ప్రయాణమును సాగించి గోమతీ తీరమందున్న కచ్చేరీనమీపమునకు వచ్చునంత నరణ్యమును విడిచి బిల్వనతాకూ రచ్చటికి వచ్చి "జయము మహారాజా! జయము" అనెను. రాజుగా రశ్వమును దిగి యతనికి నభక్తిగ నమస్కరించెను.

బిల్వ.—"మహారాజా! నేను దమకడ సెలవొందుటకై యిట్లు వచ్చినాను."

రాజా.—"ఆర్యా! తాము నాతమ్మునికడనుండి యతనికి మంచి మంచియుపదేశము లిచ్చుచు రాజ్యమునకు హిత మొనర్పఁ బ్రయత్నింపుఁడు."

బిల్వ—తీఁను ప్రభుత్వము లేనితఱి నచ్చట నేమి చేయుటకును నా కర్హత లేదు. నే నిప్పు డిచ్చటనుండి యేపనియొనర్చుటకును శక్తుండను గాను.

రాజా.—సరియే. తా మెచ్చటి కేఁగినను నాయందుఁ బరిపూర్ణ మగునను గ్రహ ముంపవలయునని నా ప్రార్థన. దుర్బల మగు నాహృదయమందునను మిమ్ముఁ జూచినంత నధికతర మగు బల ముదయించుచున్నయది.

బిల్వ:—నా కెక్కడ నేమి ప్రయోజనముకలదో నేను వెదకుచుఁ బోవుచుండెన. మీమీఁద నాపేమ యెంతయో కొంత

తగిలియే యుండునని మీరు నిశ్చయించుకొని యుండుఁడు. నేఁ దమతో నరణ్యమునకువచ్చి యెవరి కేమి యుపకారము గావింపఁ గలను ?

రాజా.—సరియే, "నాకు ముందు కాలు సాగింప ననుజ్ఞ యిండు" అని పలికి తిరుగ నాతనికి నమస్కరించెను. ఇరువురు తమతమ దారులను బట్టిపోయిరి.

---

## ముప్పదియెనిమిదవపరిచ్ఛేదము.

నక్షత్రరాయలు తనపేరు "ఛత్రమాణిక్యరాయలు" అని మార్చుకొని మిక్కిలి పటాటోపముతో రాజసింహాసనము నధిష్ఠించెను. కోశాగారములో ధన మంతగా లేదు. ఈ కారణమున ప్రజలసర్వస్వహారణ మొనర్చి యార్జించినధన మంతయు మొగలాయీల కొనంగి వారి నంపివేసెను. ఛత్రమాణిక్యరాయ లతిదుస్సహ ములతిదారుణములగు దుర్భిక్షదారిద్ర్యములతో రాజ్యపాలనమున కారంభించెను. నలుదెసలనుండియుఁ బ్రజల రోదనధ్వనులును దిట్లును వినవచ్చుచుండెను. గోవిందమాణిక్యరాయలు గూర్చుండెడి యాసనమును, శయనించు హంసతూలికయు, ప్రేమించుపరిజనము మున్నగునవి యుండి యుండి యాతనికవమానకరములై పరిణమించినవి. గోవిందరాయలసంబంధ మగుప్రతివస్తువును నాతనికన్నుల వేధింపసాగెను.

అతఁడు మెల్లమెల్లన నావస్తువుల నన్నిటిని దనదృష్టిపథమునుండి దాఁటింపఁ జేసెను. అన్నగారివాడుకలో నుండెడి యన్నివస్తువులను నశింపఁజేసెను. అన్నగారికిఁ బ్రేమాస్పదులగు సేవకులందఱిని దప్పించి వెడలఁగొట్టెను. పూజ్యుఁడగు సహోదరుని పేరివాననమాత్రము నైన నతఁ డిప్పుడు సహింపలేకుండెను. గోవిందమాణిక్యరాయుల వృత్తాంత మేదైన వచ్చెనేని యాతనికర్ణేంద్రియము బహు జాగరూకతతోఁ బనిచేయుచుండెను. తన్ను లక్ష్యముగా నిడికొని సభాసదులు గోవిందరాయుల చర్చను నడిపించుచుండిరని యతఁడు తలంచుచుండెను. లోకులందఱుఁ దన్నే రాజుగా నమ్మి పరిపూర్ణమగు గౌరవము తనకీయలేరని యాతఁడు మనంబున నెంచుచుండెను. ఏతత్కారణమున నతఁడు లోకులతో నన్యాయముగా విరోధించుచుండెడివాఁడు. అకారణముగా నుద్భవించు నాతనికోపమునకు వెఱచి సభ్యులెవ్వరు నెదురాడ సాహసింప కుండిరి. అందఱు భయభ్రాంతులై యుండవలసి వచ్చెను. ఛత్రరాయులు రాజ్యకృత్యముల నెఱవేర్చుపద్ధతి యెఱుఁగఁడు. ఎవ్వరైన నాతనికి నుచితమగు సలహా నీయవచ్చిరేని "ఏమీ యీమాత్రము మాకుఁ దెలియదా?" అని వారిని ధిక్కరించుచుండెను. మమ్మంత జ్ఞానహీనులఁగాఁ దలంచుచుండిరా? "సలహా నీయవచ్చిన తగుమనుష్యులు తలలువంచుకొని పోవుచుండిరి. అంద ఱతని రాజ్యార్హుఁడు కాఁడనియు నన్యాయముగా రాజ్యము నపహరించె ననియుఁ దలంచి అపేక్షించుచుండిరని ఛత్రరాయులు తెలిసికొనియెను. ఇందువలన నతఁడు

మిక్కిలి కోపించి బలవంతముగా నందఱను వశపఱచుకొని రా
జాధిరాజుగా నుండవలయునని ప్రయత్నించుచుండెను. స్వేచ్ఛ
గా రాచకార్యములను జరపుచు నన్నిచోట్లను దనయేకాధిపత్య
మును జాటింపసాగెను. తనకేమి చేయవలెనని బుద్ధి పుట్టిన నది
చేయుటయే. ఎవరి నుంచవలయు ననుకొనిన వారినుంచుటయే.
ఎవరిని జంపింపవలయు నన్నఁ జంపించుటయే కాని వే
ఱొండు తలంపు లేదు. ఇందుకు నిదర్శనముగా నెవరు సంస్థా
నమునఁ గాలుపెట్టుటకైన ననర్హులో వారే సమ్మానార్హులుగా
నుండిరి. ఎవరుచంపననర్హులో వారప్పుడే చంపఁబడుచుండిరి. ఏ
యపరాధమున కేదండన విధింపవలయునో పాప మాతని కేమి
యుఁ దెలియదు కావుననే యించుకనేరము చేసినవారలు కఠిన
శిక్షలకుఁ బాల్పడు చుండిరి. కఠినశిక్షకర్హులగునేరస్థులు క్షమించి
విడువఁబడుచుండిరి. అనుచితమగు నాతని ప్రవర్తనచేఁ బ్రజలు
మిక్కిలి దుఃఖించుచుండిరి. దుర్భిక్షకారణంబున దీను లనేకు లాఁ
కటిచే మరణించుచుండిరి; కాని ఛత్రరాయని క్రొత్తయుత్సవముల
కిప్పటికి నంతము లేకున్నది.అనుదినము నృత్యగానములచే వినో
దించుచు, నానావిధము లగుభోజ్యము లనుభవించుచు రాజ్య
కార్యభారము నొకరులపైఁ బెట్టి తాను రాత్రిందివములు విష
యసుఖములయం దనురక్తుండై చెలంగుచుండెను. గోవిందరా
యలవఱ కింతకుముం దుండెడిరాజులలో నెవ్వరును సింహాస
నాసీనులై యిట్టులు రాజధర్మములను విడిచి మయూరమువలెఁ
బురివిప్పుకొని యపూర్వమగు నృత్యము నొనర్పలేదు.

ప్రజ లన్ని దెసల నుండి తమయప్రసన్నతను బ్రకటించు చుండిరి. అందువలన ఛత్రరాయ లెంతయు మండిపడుచుండెను. అది యంతయు రాజభక్తిలేని ప్రజలవిశ్వాసహీనతగా నతఁడు దలంచుచుండెను; గాని తనప్రవర్తనయే దానికిఁ గారణ మని యూహింపలేకపోయెను. ఆతఁడు ప్రజలయప్రసన్నతను దుర్గుణముగా నిరూపించి వారినిఁ బలుకడగండ్లపా లొనర్చుచు వెలి పించుచు వారినోళ్లను మూయించుచుండెను. రాజ్య మంతయు ఘోరాంధకారవ్యాప్త మగురాత్రివలెనే నిశ్శబ్దమై యుండెను. శాంతస్వభావుండగు నక్షత్రరాయలు ఛత్రమాణిక్యనామమును జేకొనినంతలో నిట్లు వ్యవహరించుట కేమియు నాశ్చర్యపడవల సినయవసరము లేదు. ఇట్టి దుర్బలహృదయుం డగుమనుజుండు ప్రభుత్వము నొందినచో నిట్టులే యుద్ధతుఁడును స్వేచ్ఛావిహారియు నగును. ఇట్టి దుర్బలహృదయు లగువార లెందఱు రాజులై ప్రజలను తమదురాచారములచేఁ గష్టముల నొందించి యుండలేదు?

రఘుపతి యభీష్టము నెఱవేఱినది. అతనిహృదయమున వీఁడు తీర్పవలసిన నగరబహిష్కారవాసన యిప్పుడు నశించినది. ఏమనియుందవు? తాను జేయుచేసికొనెనో యది పూరించియే విడిచిపెట్టును. కావుననే ప్రతిహింసాభార మతనిమనమునుండి మెల్లమెల్లన జాఱిపోయి దూరమయ్యెను. అతఁ డనేకకపటోపాయములచే విఘ్నములను ఖండించు నొక్కసాధనముండే వృత్తుండై తనలోఁ దానానందము ననుభవించెను. సరి, యింతకంటె నధికతరమయి

లోకమున నుతేజియు నాతని సుఖింపఁ జేయునదిలేదను నీయుద్దే
శ్యమే బలమై తుద కాతనికి నిలిచెను.

తనమనోరథ మీడేఱినతరువాత నతఁడు తనమందిరమున కేఁగెను. అచ్చోట నెవ్వరును లేరు. జయసింహుఁ డీప్రకృతిని విడిచి పోయె నని యాతఁడు బాగుగా నెఱింగి యుండియు నిప్పు డాతఁడు క్రొత్తగా జయసింహుఁడు లేఁడని తెలిసికొనియెను. ప్రప్రథమమున నాతఁ డింక జయసింహుఁ డున్నాఁ డనియే తలంచెను గాని కొంతసేపటి కాతఁడు లేఁడని జ్ఞప్తికిఁ దెచ్చుకొనియెను. ఒక్కమాఱుగాఁ బెద్దగాలివీచుటచేఁ గవాటము తెఱువఁ బడియెను. అతండు త్రుళ్లిపడి వెనుకఁ దిరిగి చూచెను; కాని జయసింహుఁడు రాలేదా? జయసింహుం డేగతి నుండెనోవాఁడో యచ్చటనుండు ననుతలం పాతనిమనమున నుదయించెను. అతం డెంతయో ప్రొద్దిట్టులనే యాలోచించుచుండెను. భయభ్రాంతుఁడై యాగది దొరకేఁ బోయెను. తుద కెట్టులో భయపడుచు నాగది వెనుకభాగమున చూచెను. అచ్చటను జయసింహుఁడు గానరాఁ డయ్యెను. రఘుపతి సంధ్యాకాల మయ్యె నని తెలిసికొని సాహసించి మెట్టులలో యాగదిలోని కేఁగెను. సమాధి చేసినయింటివలె నాయిల్లు నిద్రపోవుచున్నట్లు చూపట్టెను. ఆయింటిలో నొకకొయ్య పెట్టెయు నొకమూలనుండెను. ఆపెట్టెక్రింద జయసింహుని గిన్నె యొకటి ధూళిచే నిండియుండెను. గోడపై జయసింహుఁడు చేతితోఁ జిత్రించిన యొకకాళీవిగ్రహ మున్నదుది. గదిమూలయొక్క

తూర్పుమూలను ధాతునిర్మితమగు నొక దీపపునెమ్మియు నం దొక ధాతునిర్మితమగు దీపపుబుడ్డియు నుండెను. వర్షముచే నా దీప మార్పఁబడియుండెను. మరల దానివెలిఁగించు దిక్కులేక పోయెను. చచ్చినదోమలచే నాబుడ్డి కప్పఁబడియుండెను. నెమ్మి దగ్గఱ నున్నగోడ మసిపాఱియుండెను. ఈవస్తువులు తప్ప మఱి యేదియు నాగదిలో లేవు. రఘుపతి మిక్కిలిబలముగా నిట్టూ ర్పువిడిచెను. ఆనిట్టూర్పుచే నాగృహ మంతయుఁ బ్రతిధ్వనిం చెను. చీఁకటిపడుచున్నది గావున నం దేమియు గానవచ్చుటలేదు. ఉండియుండి యేదియో యొకయంత్రము టిక్కుటిక్కుమని ధ్వని చేయు చున్నట్లు వినఁబడుచుండెను. తలుపుతెఱవఁబడి యుండుటచేఁ జల్లనిగాలి యాగదిలోఁ బ్రవేశించు చుండెను. రఘుపతి పెట్టెమీఁదఁ గూర్చుండి వణఁకఁ జొచ్చెను.

రఘుపతి యాశూన్యమందిరమున నట్టులే యొకమాస మొక్కఁడును కాలము గడపెను; కాని యిట్లు లాతఁ డింక నెక్కువదినములు గడపలేకపోయెను. తనపాపోహత్యమున కతఁ డొకనమస్కారముపెట్టి విడిచెను. ఒకనాఁ డతఁడు రాజసభకుఁ బోయి దాను నెలకొల్పిన ఛత్రరాయ లెట్లు రాజ్యమును బా లించుచుండెనో చూచెను. అవిచారము, అత్యాచారము, అశాం తియు నేకమై ఛత్రమాణిక్యరాయలరూపము నొంది రాజ్య మును బాలించుచున్న ట్లతఁడు తెలిసికొనెను. పాప మతఁడు రాజ్యమునందు శాంతిని నెలకొలుపవలయునని ప్రయత్నించెను. రాజునకు ధర్మమార్గ ముపదేశించెను. అప్పుడుదౌర్భాగ్యఛత్రుం

డగు నాఛత్రరాయ లాతనిఁజూచి "రఘుపతీ! నీవు రాచకార్యములలో నెందుకు జోక్యము కలుగఁజేసికొందువు. ఈలౌకికవ్యవహారములు పాపము నీకేమి తెలియును?" అనిపలికెను. ఆమాటలు విని రఘుపతి తలవంచుకొని యూరకుండెను. మునుపటి యానక్షత్రరాయ లీతఁడు కాఁడని తెలిసికొనెను. రఘుపతియందు ఛత్రరాయలవారి కసూయ యంతకంత కధికమయ్యెను. "దాను నన్ను రాజునుగాఁ జేసితి ననుకొని కాఁబోలు నీపాటుఁ డిట్లు నన్నాదరించుచున్నాఁ" డని తలంచి యారాయలు మిక్కిలి కోపము నొందెను. రఘుపతిని జూచినంతన యాతనికనుబొమలు ముడివడెను. తుద కాఁతఁ డొకదినమున స్పష్టముగా రఘుపతితో "అయ్యా! పురోహితులుగారూ! తాము మందిరంబున కరిగి యచ్చటికార్యములను జూచుకొనుఁడు. రాజదర్బారున మీ కొనరింపవలసినపని యేదియును లేదు" అని చెప్పెను. ఆహా! కృతజ్ఞత యన నిట్టు లుండవలయును, పాప మాతఁడు తన్నుఁ దానే మఱచి యున్నాఁడు. ఇంతలోకము నెట్టు లెఱుంగఁ గలఁడు? రఘుపతి నెట్లుమన్నింపఁ గలఁడు? ఐశ్వర్య మెట్లు దుర్బుద్ధికంతము త్తత గలిగించును. ఆమాటలు విని తీవ్రముగ కోపముతోఁ గన్నుల నిప్పులు రాల్చుచు రఘుపతి యాతనివంకఁ జూచెను. ఆతఁడు మాఱుమొగము పెట్టుకొని యచ్చటనుండి లేచి వెళ్లిపోయెను.

---

శ్రీ వేమన గ్రంథాలయము
అద్దంకి (ప్ర)

## ముప్పదితొమ్మిదవపరిచ్ఛేదము.

నక్షత్రరాయ లేదినమున రాజ్యమునకు వచ్చెనో యాదినముననే కేదారేశ్వరుఁ డాతనిసన్నిధికి హాజరు మనవికై పోయెను; కాని యెంత ప్రయత్నించియు నతఁడు రాజసమ్ముఖమును బడయఁజాలక పోయెను. దౌవారికులచే నర్ధచంద్రప్రయోగము లంది యంది యతఁడు విసిగి దెబ్బలు తినితిని యాతని ముక్కున నూపిరిమాత్రము నిలిచెను. తుదకుఁ దెలివితెచ్చుకొని యచ్చటనుండి వెడలిపోయెను. గోవిందరాయలరాజ్యకాలమున నీతఁడు ప్రతిదినమును షడ్రసోపేతములగు భోజనములచేఁ దృప్తినొందుచు యథేచ్ఛముగా రాజాంతఃపురమున నానందముగా దినములు నిముసములవలెనే గడుపుచుండెడివాఁడు. అప్పుడు యువరాజు నక్షత్రరాయలతో నిప్పుడును మనస్సు గలసి వర్తించుచుండెడివాఁడు. అహా! ఎవ్వని కే కాలమున కేగతి పట్టునో తెలియదు గదా! పాప మిప్పు డీకేదారేశ్వరుండు రాజభవనములోఁ గొన్నిదినములనుండియుఁ దనకు సంబంధము లేకపోవుటచేఁ దనజీవననిర్వహణ మొనరించుకొనుటయే కష్టముగా నున్నది. అతఁడు గోవిందమాణిక్యరాయలవారిపల్లవచ్ఛాయయం దుండునప్పు డంద ఱతనికి భయపడుచు నతని నెంతయో గౌరవించుచుండెడువారు; కాని యిప్పు డతని నెవ్వఁడును బలుకరింపఁడు. పూర్వము రాజగారికడ నెవ్వరి కేమిపనియున్నను జను లీకేదారేశ్వరునికడ కరిగి లాలించుచుండెడివారు. ఇప్పు డెవ్వరు నాతనితో మాట లైననాడరునరికదా యతనివైపు

లేటిపాటిం జూడనైనం జూడరు. ఈయవమానమునకుం దోడ్తో నతం డన్నమునకుం గష్టపడవలసివచ్చెను. ఇప్పు డాతని కెట్టులైన రాజభవనమునం బ్రవేశింపవలయు నని కోరిక. అందుం బ్రవేశమే కలిగినచో నతండు పూర్వపుస్థితియం దుండనగు నని తలంచుచుండెను.

అతం డొకదినమున సమయమును గనిపెట్టి నిందుకోలువున నుండు ఛత్రమాణిక్యరాయలసన్నిధి కరిగెను. అతండు పట్టరాని తనయానందమును గనంబఱుచుచు నవ్వుచు మిక్కిలి యుత్సాహముతో నరేంద్రునికట్టెదుట నిలువంబడి యుండెను. ఆతనిం జూచునంత రాయలు మండిపడెను. "ఎందు కిట్లు నవ్వుచుంటివి? నీవు నాతోం బరిహాసము లాడుటకు వచ్చితివా?" అని గద్దించి యడిగెను.

సభలో నున్నవా రందఱు వానిని గోపించిరి. ఆనిమిషమునసే వికసించియున్న యాతనిదంతపంక్తిపైం దెఱపడెను. అతండు నోరు మూసికొనియెను.

ఛత్ర.—"నీ కేమైనం జెప్పికొనవలసిన యంశమున్నచో శీఘ్రముగాం జెప్పి వేసి వెళ్లి పొమ్ము."

కేదారేశ్వరుండు వక్తవ్యాంశమును మఱచిపోయెను. అతం డిన్నిదినములనుండి యేది మనవిచేసికొనవలయు నని తలంచెనో యది మనస్సులోనే యుండిపోయెను. "నీమనవి చేసికొనవలసినయంశ మేదియు లేనిచో నీవిచ్చటినుండి పొమ్ము" అని మరల రాయలు పలుక నింకం దటాలున నేదియైనం జెప్పవలయు నని కేదారేశ్వరుండు తలంచెను. ఆతనికన్నుదోయియందును

మొగమునందును, కంఠస్వరమందును, నొక్కమాఱుగాఁ బరిపూర్ణమార్పును నొంది కరుణారసము నిండిపోయెను. "మహారాజేంద్రా! ఏమి? తాము ధ్రువుని మఱచితిరా?" అని పలికెను.

ఆపలుకు వినినంత ఛత్రరాయులకోపాగ్ని ప్రజ్వరిల్లెను. మూర్ఖుఁ డగు కేదారుఁ డాతనిభావమును గుఱుతింపలేక మరల "ఆబాలుఁడు ప్రభువువారిని 'బాబూ! బాబూ!' అని పిలుచుచు నిప్పటికి నేడ్చుచునే యున్నాఁడు." అని విన్నవించెను.

ఛత్ర.—"నీజాతి యేదో యెఱుంగరాదు. నీతమ్మునిబిడ్డ నన్ను బాబుబాబని పిలుచుచున్నాఁడు. నీవు వాని కిట్లు బోధించుచుంటివా?" అనెను. కేదారేశ్వరుఁడు చేతులు జోడించుకొని "రాజేంద్రా!" అనునంతలో రాయలు "ఎవఁడురా? అక్కడ? వీనిని ధ్రువుని నిప్పుడే నారాజ్యమునుండి వెడలఁగొట్టి యావలకుఁ బంపివేయుఁడు." అని కఠినముగా నాజ్ఞాపించెను.

ఒక్కమాఱుగా ద్వారికులయర్ధచంద్రప్రయోగము లెన్ని కేదారునికంఠమునఁ బడియెనో కాని తెప్పవేయుకాలమున నతఁడు వీథిలోఁ బడెను. రాజభటు లాతనికిఁ జేతితోఁ గొన్నికట్నము లిచ్చి తిరిగి దర్బారునఁ బ్రవేశించిరి. ధ్రువునిఁ దోడ్కొని కేదారుం డాక్షణమందే త్రిపురానగరమును వీడి కాలుసాగించెను.

---

## నలువదియవపరిచ్ఛేదము.

రఘుపతి మరల మందిరమునకు వచ్చెను. అతండు వచ్చునరికి భక్తిపూర్వక మగుమనస్సుతో నెవ్వరును వస్త్రములు మున్నగునవి పట్టుకొని యెదురుచూచువారు లేరైరి. శిలామయ మగు మందిరము మాత్రము నిలిచియున్నది. అందునఁ జైతన్యముయొక్క వాసనయైనను లేదు. అతఁడు గోమతీతీరమున కేఁగి తత్తీరమున నున్న తెల్లరాలమెట్లపైఁ గూరుచుండెను. ఆమెట్ల కెడమవైపున జయసింహునిచేఁ బెంపఁబడినవృక్షరాజ మొకటి కలదు. దానియందుఁ గుసుమము లసంఖ్యాకములై వెలుఁగొందుచుండెను. ఆపుష్పములను జూచినతోడనే రఘుపతికి సుందరమగు జయసింహుని వదనారవిందమును, స్వచ్ఛమైన హృదయమును కౌటిల్య మెఱుంగని జీవనమును దలంపువాఱినవి. సింహసదృశ పరాక్రమముగలిగియు, హరిణకిశోరమువలె బెదరుగలిగియుండు జయసింహుం డాతనిహృదయమునఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడు రఘుపతిహృదయమునం దంతట సర్వధా తనయధికారమును జూపుచున్నాఁడు. రఘుపతి పూర్వము జయసింహునికంటెఁ దానే జ్ఞానవంతుఁ డనుకొనుచుండెను; కాని యిప్పు డాతఁడు తనకంటె జయసింహుం డెన్నిరెట్లో జ్ఞానమున నధికుం డని తలంచుచుండెను. తనయందు జయసింహునికిఁ గలనిశ్చలమగు భక్తిని దలంచి యాతనిపై రఘుపతికిఁ గలిగినప్రేమ యింతయుంతయని చెప్ప నలవిగాదు. తనజీవితమున నేమియు నతని కిప్పు

డాన లేదు. జయసింహునితోఁ గలిసి తానొనరించినయకృత్యములను దలంచుకొనిన రఘుపతికి గుండియ లవియుచున్నవి. అతఁడు తనలోఁ దాను "హాయిహాయి! నేను మంచిగా జయసింహుని వంచించి యవమానించినాను. ఇట్టిపని యొనర్చిన నేనొకయోగ్యుఁడనా?" అని విచారింపఁ జొచ్చెను.

"జయసింహుం డొక్కసారి యొక్కనిముసము నాకగపడినచో నాదోషము నొప్పుకొని క్షమింప వేఁడుకొందును." అతని సంబంధము లగుమాటలన్నియుఁ దలంపునకు వచ్చుచున్నవి. జయసింహునిజీవనమంతయు నాతనిహృదయమునఁ బ్రకాశించుచున్నయది. ఉదారమగు జయసింహునిచరిత్రను దలంచుకొని యాతఁడు విదేహభావమును ధరించి జగడములను దంటాలను మఱచిపోయెను. లౌకికసంబంధ మగునొకపెద్దభార మాతనితలపైఁబడి రాత్రిందివము లతని నలజడి పెట్టి యిప్పుడాభారము జాఱివేఱయ్యెను. అతనివలన రాజ్యమునొందిన నక్షత్రరాయ లిప్పుడాతని నవమానించెను. అది తలంపునకు వచ్చినను నాతనికిసుమంతయు నహంకార ముదయింపలేదు. మానావమానముల నాతఁ డిప్పుడు సమానములుగాఁ దలంచుచుండెను. మానావమానములను మాటయన్న నతనికి నవ్వు వచ్చుచుండెను. ఏపని చేసిన జయసింహునియాత్మ యెంతయు సంతసించునో యాపనిని మాత్రము చేయఁగోరు చుండెను. నల్గడలను దృష్టిని బరుగెత్తించెను; కాని యేమియు నాతనికి గోచరింపలేదు. ఎటుచూచినను శూన్యముగానే తోఁచుచున్నది. శూన్యమగుమందిరమో

యాతనిఁ గలంచినది. నిజముగా నామందిరమునందే యాతని ధ్యానము లుడిగినవి. అతఁ డెద్దియైన నొకమహాకార్య మొనరించి హృదయతాపమును జల్లార్చుకొనఁ గోరుచుండెను; కాని శూన్య మగు నామందిరముఁ గాంచినంతనే పంజరమున బంధింపఁబడిన పక్షివలె నాతనిహృదయ మస్థైర్య మొందెను.

రఘుపతి యచ్చటనుండి లేచి మందిరోపవనప్రాంతమున నేమియుఁ దోఁపక యటునిటుఁ దిరుగుచుండెను. మందిరములో నున్న నిర్జీవప్రతిమలపై నాతని కసహ్యము కలిగెను. ఇప్పు డాతఁ డాప్రతిమలను సేవించుచుఁ గాలమును పుచ్చుట వ్యర్థమని తెలిసి కొనెను. సుమారు రెండుయామముల రాత్రియైన తరువాత నతఁ డొకరాతితోఁ జెకుముకిఁ గొట్టి యగ్ని పుట్టించి దీపమును వెలిఁగించెను. ఆదీపముతో నామందిరమును బ్రవేశించెను. పదు నాలుగు దేవతాప్రతిమలు సమానభావముగా నిలువఁబడి యుండెను. నిరుటియాషాఢమందలి కాలరాత్రియందు దీపపు వెలుతురున భక్తునికళేబరమునకు నెదురుగ రక్తప్రవాహమధ్య మున జ్ఞానహీన మగు నచేతనపదార్థమువలె నాతఁ డెట్లు నిలిచి యుండెనో నేఁడు నట్లే నిలువఁబడియుండెను. రఘుపతి తటాలున "కల్ల! ఇదియంతయుఁ గల్ల! హా ప్రియశిష్య! జయసింహా! నీయ మూల్యమగు హృదయరక్త మెవరి కర్పించితివి? ఇచ్చట నే దేవతయులేదు. ఏ దేవతయును లేదు. ఈరఘుపతిపిశాచమే నీరక్తపాన మొనరించెను" అని పలుకుచు రఘుపతి కాళీదేవి ప్రతిమ నాసన మునుండి లాగి పెల్లగించెను. మందిరద్వారమున నిలువఁబడి తన శక్తికొలఁది నాప్రతిమను దూరముగా విసరివైచెను. చీఁకటిలో

కాళీవిగ్రహము కాలమిట్టపై నుండి ధ్వనిచేయుచు దొర్లిదొర్లి గోమతీనదీప్రవాహమునఁ బడియెను. ఏయజ్ఞానమను రాక్షసి శిలావిగ్రహరూపము నొంది యిన్నిదినములనుండి రక్తమును ద్రావుచుండెనిదో యయ్యది నేఁడు గోమతీనదియడుగున వేల కొలఁదిగ నున్న రాలనుగలిసికొనెను; కాని యాయవిద్యారాక్షసి మనుజుల కఠినహృద్రూపములగు నానసములను మాత్రము విడువలేకపోయెను. రఘుపతి దీపమార్చి మందిరమునుండి వెలు వడి రాజమార్గమునఁ బ్రవేశించెను. ఆతఁడారాత్రియే త్రిపురా రాజధాని వీడి తన కిష్టము వచ్చినచోటికిఁ బోయెను.

---

## నలువదియొకటవపరిచ్ఛేదము.

బిల్వనఠాకూరు కొన్నిదినములనుండియు నవాఖాలీ మండలాంతర్గతమగు నిజామనుపురంబున వసియించి యుండెను. అచ్చట భయంకరరూపము నొంది మారీ ప్రవేశించెను. ఫాల్గుణమాసాంతమున నొకదినము మిగిలి యున్నది. దినమంతయు మేఘము లంబరమును గప్పియున్నవి. నడుమనడుమఁ గొంచెముకొంచెముగాఁ జినుకులు పడుచున్నవి. సాయంకాలమున వర్షము కురియ నారంభించెను. మొదటిజామంతయుఁ దూర్పుగాలి విసరెను. రెండవజామున నుత్తరపుదెస నీశాన్యము నుండి జోరుగా గాలి వీవఁ జొచ్చెను. దానికిఁ దోడ్తో వానయు జోడించెను. చాలసేపు మిక్కిలి జోరుగా వర్షము కురిసినపైన వది కొంతవఱకు శాంతించెను. అంతలో వఱద వచ్చుచుండె నని జనులకోలాహలము మితిమీఱి వినవచ్చుచుండెను. కొంద ఱిండ్ల

పైభాగముల నెక్కిరి. కొంద ఱున్నతప్రదేశముల కేఁగి నిలిచిరి. కొందఱు వృక్షముల నెక్కిరి. మఱికొందఱు దేవతామందిరోపరి భాగముల నధిష్ఠించిరి. రాత్రి యంధకారబంధురమై యుండెను. కొంచెముకొంచెముగాఁ బ్రవాహము వచ్చుచుండెను. వఱద వచ్చుచుండుశబ్ద మంతకంటె నెక్కువగా వినవచ్చెను. ఆశబ్దమును విని గ్రామసులందఱు భయభ్రాంతులైరి. చూడంజూడ వెల్లువ లెల్లకడల వ్యాపించి వచ్చుచుండెను. ఒక్కసారిగాఁ బెద్ద తరంగము వచ్చెను. దానివెనుక నింకొకపెద్దతరంగము వచ్చెను. రెండవతరంగము రాఁగానే గ్రామమునఁ బండ్రెండడుగులయెత్తున నీరుక్రమ్మెను. సూర్యోదయ మయ్యెను. నీటివడి కొంచెము తగ్గెను. ఎప్పటికిని గ్రామమంతయు నీటిలో మునింగియే యుండెను. గ్రామములోఁ గొన్నియిండ్లు మాత్రమే నిలిచెను. తక్కినవన్నియు నీటిలోఁ దన్మయత్వము నొందెను. మనుష్యులయలికిడి వినవచ్చుట లేదు. ఇతరగ్రామములనుండి మనుష్యులు నిండ్లును బ్రవాహమునఁ బడి వచ్చుచుండెను. చూతన్యగ్రోధాదిమహా వృక్షములు పెల్లగింపఁ బడియెను. కొన్నిచెట్లు ప్రవాహమునఁ బడి కొట్టుకొనివచ్చుచుండెను. గోడలు విఱుగఁ బడినయిండ్లపై కప్పులితరగ్రామములనుండి వెల్లువతో నెన్నియో రాఁజొచ్చెను. అవి యచ్చటచ్చటఁ గ్రిందుమీఁదై పడియుండెను. ఎన్నియో కుండలు నీటిపై నటు నిటు నీఁదులాడుచుండెను. గ్రామమంను మిక్కిలి చిన్నయిండ్లు పెద్దపెద్దచెట్లు పడుటచేఁ గూలిపోయెను. ఆకారణముచేఁ బ్రవాహమునఁ బడినజనులు చెట్లపై కెక్కి ప్రాణసంరక్షణము గావించుకొనిరి. మఱికొందఱు

దీనులు పాపము! రాత్రియంతయు నీటిలో నీఁది యీఁది బొంగు వెదుళ్లు రా వానిని బట్టుకొని శ్రమతీర్చుకొనుచుఁ జనుచుండిరి. కొందఱిశరీరములు దెబ్బలచేఁ జిమగఁగొట్టఁ బడియెను. వఱద నిశ్శేషమైన తరువాత జీవించియున్న వారు క్రిందికి వచ్చి మృత కళేబరములయందుఁ దమవారిని వెదకులాడుచుండిరి. వఱదనుండి వచ్చిన యితరగ్రామస్థుల శవములు పోల్చుకొనరాకుండెను. ఆశవ ములకెవ్వఁడు నగ్నిసంస్కారము చేయలేదు. గుంపుగుంపులుగా గ్రద్దలును రాబందులును వచ్చి వానిని బీకుకొని తినుచున్నవి. కుక్కలు నక్కలన్నియుఁ జచ్చుటచే నీపక్షులకు రెండవవానితో జగడమున కవసరములేకపోయెను. ఆగ్రామమునఁ బండ్రెం డిండ్లుమాత్రము లెక్కకు మిగిలినవి. అందునకుఁ గారణ మవి యున్నతప్రదేశములందుఁ గట్టఁబడుటయే. కావున నందున్న ప్రజల కేమియు వెల్లువవలన హాని గలుగలేదు. అందలిప్రజ లుండుట కెందఱి కిండ్లుమిగిలెనో యంద ఱుండిరి. తక్కిన వా రుండుటకుఁ దావులేక వేఱుచోటికిఁ జనిరి. ఈజలప్రవాహమును యమున విదేశములందున్నవారు తిరిగి వచ్చి పడిపోయిన తమ గేహములను గ్రొత్తగాఁ గట్టుకొనుచుండిరి. నారాంశ మే మనఁగాఁ బట్టణమంతయుఁ గ్రొత్తగా నిర్మింపఁబడుచున్నది. పట్టణ మింకను మంచిస్థితియం దుండలేదు. మృతకళేబరములు కుళ్లుటచే దుర్గంధముగుని రింక నచ్చటచ్చట నిలిచియుండుటవల నను జెడుగాలి వీచుచుండుటవలనను మఱియు ననేకకారణ ములవలన గ్రామమందుఁ గలరా ప్రవేశించెను. అది మొట్టమొ దట పతానులమహాలున నుద్భవించెను. ఒక్కమాఱు గ్రామమం

తయు నావరించెను. మృతులగువారిని సంస్కరించుటకును నన్యోన్యము సాహాయ్య మొసర్చుటకును వీలు చిక్కలేదు. హిందువులు "మునలుమానులు గోవులను జంపెడిపాప మనుభవింపఁబడుచున్నది." అని యనుచుండిరి. జాతీయశత్రుత్వ కారణమున జాతి చెడుదు మనుభయముచేతను హిందువులలో నొక్కఁడైనను వారికి గంజియైనఁ బోయలేదు. మఱి యేవిధ మగుసాహాయ్యమైనను జేయలేదు. ఆహా! యేమి యీమూర్ఖత? ఏమి యీపాడుజాతి మాహాత్మ్యము? పరమేశ్వరునిసృష్టికిని దృష్టికి నందఱము సమానులమనుబుద్ధి యేల కలుగదో! జాతి మనము కల్పించుకొనినదియా? పుట్టుకతో వచ్చినదియా? ఈ పాడుజాతిమూలమున నొకతల్లిబిడ్డలైనహిందువులకును మహమ్మదులకు నన్యోన్యకలహము లుత్పన్నములై ప్రజలను వేధించి తినుచున్నవి. బిల్వనతాకూరీగ్రామమునకు వచ్చుటఁ కీరీటిగా భీభత్సమై యున్నది. తాకూరు వారికడనున్నశిష్యులు భయపడుచుండిరి. కలరాభయమున వారాతని విడిచి పోవ నుద్యుక్తులైరి. వారిభయమునుగుఱుతించి యతఁడు వారలకు సెలవిచ్చి యంపివేసెను. అతఁడు స్వయముగా రోగశయ్యలందు దొర్లుచుండిన ఘతానులకుఁ దనచేతులతో సేవచేయ నారంభించెను. వారికిఁ బథ్యము, పానము, మందును వేళ కిచ్చుచు సంరక్షించుచుండెను. చచ్చినవారలను బాతిపెట్టుటకై తగిన యేర్పాటులను జేసెను. హిందువు లందఱు నాహిందూసన్న్యాసియొక్క యనాచారమును జూచి యాశ్చర్యపడుచుండిరి. తాకూరువారి నావిషయమునఁ గొందఱు ప్రశ్నించిరి. అతఁడు "నేను సన్న్యాసిని.

నాకేదియు జాతి లేదు. నాది మనుష్యజాతి. మనుష్యుఁడు చనిపోవు చున్నప్పుడు జాతివిపక్షయెక్కడిది?. మఱియు నీశ్వరసృష్టియందు మనుజుఁడు మనుజుని ప్రేమను గోరుచుండినచో జాతివిచారణ మెందులకు?” అని జబ్బాబు చెప్పుచుండెను. హిందువు లాతని నిర పేక్షాయుక్తమగు పరోపకారబుద్ధిని జూచి యతనిపై నసూయ వహించుటకుఁ గాని, యతని నిందించుటకుఁ గాని సాహసింపలేక పోయిరి. బిల్వనయతి చేయుచున్న దకార్యమో కర్తవ్యమో వారికిఁ దెలియలేదు.

శాస్త్రజన్యజ్ఞాన మంతగా లేకుండుటచే నచ్చటిహిందు వులు కొంత సంశయించుచు “ఇపని బాగులేదు” అనుచుండిరి; కాని వారిహృదయమున విరాజిల్లు నొకపురుషుఁడు “అది యవశ్య కర్తవ్యము” అని వారికి బోధించుచుండెను. బిల్వనయతీంద్రుఁడు వారు మంచియన్నను జెడు గన్నను నది లెక్కగొనక స్వకర్త వ్యమును నిర్వర్తించుకొనుచుండెను. మరణాసన్నులగు పఠానులు యతీంద్రునికి సలాము లొనర్చుచుఁ దమకృతజ్ఞతను గనఁబఱు చుచు నతని దేవునిగా భావించు చుండిరి. యతీంద్రుఁడు పఠా నుల చిన్నచిన్నబిడ్డలను గలరాగా నుండుస్థలములనుండి తప్పించి హిందువులకడకు వారిని దోడ్కొని పోయెను. హిందువులందఱు నాతనిమతమునకు విరుద్ధులుగాన నాబాలకులకు నిలువనీడ నైన నిచ్చినవారు కారు. అప్పు డాతన్నాశ్రయసి వారలఁ బాడుపడి యున్న యొకగృహమున నుంచెను. పాప! మాఘటానుబాలకు లాయింటియందున్న వారు. యతిపతి యుదయమున లేచి యా బాలకుల కాహారమును గూర్చుటకై బిచ్చమెత్తఁ బోవుచుండెను;

కాని బిచ్చము పెట్టెడిదాత యెవఁడు? దేశమం దన్న మెక్కడ నున్నది? ఎందఱో ప్రజ లాహారము లేక యాఁకలిచేఁ జుట్టుకొని చనిపోవుచుండిరి. ఆగ్రామమున నొకముసల్మాను జమీందారుండెను. ఆతనియి ల్లక్కడి కెంతయో దూరమున నున్నది. ఠాకూ రాజమీందారునిసన్నిధి కరిగెను. ఎట్టులో యాతనిఁ బ్రసన్ననిగాఁ జేసి యాతనివలనఁ గొన్నిరూకలఁ దీసికొని బియ్యము కొని జాగ్రత్తపఱిచెను. ఆతఁ డిప్పుడు రోగులకు సేవచేయుచుండుటయు వారిపథ్యపానములకుఁ గావలసినవస్తువులను సంపాదించుటయు, నప్పుడప్పుడు తీరుబడి కలుగునప్పు డాబాలకుల కడ కేఁగి వారితో నాడుకొనుటయుఁ బ్రొద్దుపుచ్చుటకు మార్గములుగా నేర్పఱచుకొనియెను. ఆపిల్లకాయ లాతనిఁ జూచినంతనే గొల్లున లేచి కోలాహలము చేయుచుందురు. సంజవేళ నాబాలకులయింటిపైపునకు వెళ్లినచో వేనవేలు చిలుక లందుఁ జేరి పలుకుచున్నవని వినువార లనుకొందురు. ఠాకూరువారికడ నొక చిత్రతరమగువాద్యము గలదు. అతఁ డెప్పుడు విశ్రాంతిఁ దీసికొనునో యప్పు డద్దాని వాయించుచు గాన మొనర్చుచుండును. ఎప్పు డాతఁడు పాటప్రారంభించునో యప్పుడే యాబాలకులందఱొక్కసారి వచ్చి యాతని చుట్టును గూరుచుందురు. కొందఱు శ్రద్ధగా నాతనిగానమును వినుచుందురు. మఱికొంద ఱాసారంగమున నుండుతీవలను లాగుచుందురు. కొంద ఱాతనివలెఁ బాడవలయునని వెఱ్ఱిమొఱ్ఱిగాఁ బాడనారంభింతురు.

తుదకు ముసల్మానులగృహములను విడిచి యాకలరా దేవత హిందువులగృహముల నలంకరించినది. గ్రామమం దొకవిధ

మగునరాజకత్వ ముద్భవించెను. చోరభయముల కంతములే కుండెను. ఎవనిచేతి కేది దొరకిన నది యపహరించుకొనిపోవు చుండెను. మునలుమానులు కట్టుకట్టి యల్లరి చేయ నారం భించిరి. వారు హిందూరోగులను శయ్యలనుండి దూరముగాఁ బాఱవైచుచు గుడ్డలు పాత్రలు మొదలగుపదార్థము లేవి చిక్కినను శక్తివంచన యెఱుంగక తీసికొనిపోవుచుండిరి. ఠాకూరువా రాసమాచారమునువిని మునల్మానులయాగడము నాటంక పఱిచెను. వా రాతనిమాట హృదయముల సమ్మానించుచుండిరి. ఎవ్వఁడు నాతని యాజ్ఞమీఱిప్రవర్తింప సాహసింపరైరి. ఠాకూరు వా రిట్టు లాగ్రామమును గాపాడుటలో నుండిరి.

ఒకనాఁడు తెలతెలవాఱుచుండ నొకబాలకుఁడు పరుగెత్తు కొని వచ్చి యతీంద్రునితో "అయ్యా! పరదేశీయుఁడగు నొక బాటసారి రావిచెట్టుక్రిందను బడియుండెను. అతనిచేష్టలనుజూచి నచో నతనికిఁ గలరా యంకురించినట్లు తోఁచుచున్నది. అతఁడు జీవించుట కష్టము. అతనిదగ్గఱ నొకచిన్న బాలుఁ డున్నాఁడు." అనిచెప్పెను. ఠాకూరు వెంటనే యతనికడ కరిగెను. తెలివి తప్పి పడియున్న కేదారేశ్వరుని జూచెను. ధ్రువుం డిసుకలో నాతనికడ నిద్రించుచుండెను. కేదారునిప్రాణము కంఠగతమైనది. మరణకాల మాసన్నమైనది. మార్గాయాసముచేతను నాఁకలిచేతను నతఁడు మిక్కిలి దుర్దశయందున్నవాఁడు. ఇట్టిసమయమున నీయూరు వచ్చినతోడనే కలరాజాడ్యము గూడ నంకురించి యతనిచైత న్యమును హరించెను. ఠాకూరుశక్తి వంచనలేక యుపచారము

లోనర్చెను; కాని యేయౌషధము నేమియుఁ గ్రియగట్టలేదు. కొంతసేపట్టులుండి యాచెట్టుక్రింద నాతఁడు ప్రాణముల విడిచెను. ధ్రువునియవస్థచూచి ఠాకూరునకుఁ గలిగినదుఃఖ మింతంతన రాదు. చాలసేపటినుండియు నేమియు నాహారపదార్థము దొరకకపోవుటచే నాధ్రువుండు ఆఁకలితోఁ నేడ్చి సొమ్మసిలి నిద్రించుచుండెనని లక్షణజ్ఞుండగు యతీశ్వరుఁడు తెలిసికొనెను. ఆబాలకు నతిజాగ్రత్తతో నందిట నిడుకొని మునల్మానుబాలు రుండు గృహమును జేరెను.

---

## —— నలువదిరెండవపరిచ్ఛేదము. ——

చటగ్రామ మిప్పుడ డరాకానురాజ్యమునఁ జేరియున్నయది. "మాణిక్యరాయులు రాజ్యచ్యుతుండై యీగ్రామమునకు వచ్చెను." అని విని యరాకానురాజు వినయసంపన్నుండై యాతనికడ కొకదూత నంపి "తాము మరల రాజ్య మేలు నిచ్చతో నుండిన నాసింహాసనము మీకిచ్చి నేను నాసేనతో మీకుఁదగిన సాహాయ్య మొనర్పఁగలను" అనియుఁ గబురంపెను. మాణిక్యరాయు లాదూతతో "నేను సింహాసనము నపేక్షింపను" అని చెప్పెను.

దూత —"మహారాజా! కొన్నిదినములు తాము వచ్చి యరాకాను రాజధానియం దుండుదురుగాక."

రాజా. —" నేను రాజధానియందుండుటయు నిచ్చగింపలేను. చట గ్రామమున నెచ్చోటనైన నొకగృహము దొరకినచో నే నరాకానుప్రభుప్రముఖమునఁ దగిలియుందును."

దూత. —"మహాప్రసాదము. స్వామీ! తా మచ్చట నుండుట శ్రేయ మని తోఁచిన నచ్చటనే యుండుఁడు. ఈరాజ్యము స్వకీయమని భావించుకొనుఁడు." అని చెప్పి పోయెను. అరాకానుప్రభు సేవకు లందఱు తన్నెఱుఁగకుండుట చూచి వారు తన్నవచరించుచున్నను వారితోఁ గలిసి యుండుట కాతని కిష్టములేకపోయెను. తనలోఁ దాను "నన్నరాకానురాజను మానించి తనభటుల నాకడనుంచెనా?" అని యాలోచించెను.

మయానీనదీతీరమున మాణిక్యరాయలు తనకుటీరమును నిర్మింపఁజేసెను. నదీజలములు సజ్జనమనంబులవలె స్వచ్ఛతరములై యుండెను. ప్రవాహమంతగా విస్తృతమైనది కాదుగాని పాషాణశకలంబులపై నుండి కలకలశబ్దమును జేయుచు మిక్కిలి వేగముగాఁ బ్రవహించుచుండెను. ఈనదికిరుకెలంకులనీలవర్ణమగు పర్వత మొండు నిలిచియుండెను. ఆకొండయందలి నల్లనిరాలపై నుండి క్రిందివఱకు విచిత్రతరములగు రంగులతో లతలొప్పారుచుండెను. వివిధములగు పక్షులకు నివాసములగు తీవజొంపము లందం దలరారుచుండెను. భగవానుండగు భాస్కరుం డుదయించినది మొదలంబరమునఁ గొంతసేపు ప్రయాణముచేసినఁ గాని యానదీదేవతను దనకరసహస్రముచే గిలిగింతలు పెట్టలేకుండెను. దానిచే నాపర్వతశిఖరములయౌన్నత్య మింత యని

మనమూహింప వచ్చును. పర్వతోపరిభాగమున నానావిధము లగుపత్త్రిసంతానము భిన్నభిన్నములగు నారామములలో నలరారుచుండు పుష్పములచేతను, నాకులచేతను శోభాయమానమగు నందందుఁ దిరుగుచుండెను. అచ్చటచ్చట నాయేటియిరుదరులదనుక దట్టమగునడవి వ్యాపించి యుండెను. శాఖాహీనమై మిగులపొడవగు నొకతెల్లమద్దిచెట్టు కొండపై నుండి వంగి యుండెను. దానినీడ క్రింద నుండుచంచలమగునదీజలమునఁ దాండవించుచుండెను. పెద్దపెద్దలతలా చెట్టును జుట్టుకొని మెల్ల మెల్లన నుపరిభాగమును జేరుకొనుచున్నవి. ఆకొండప్రక్కనుండు ఘనారణ్యంబునఁ గదళీవన మొండు జూపట్టుచుండెను. అక్కడక్కడఁ జిన్నచిన్న సెలయేటులు లతివేగముగాఁ బ్రవహించుచు నానదీజలంబున నైక్య మొందుచుండెను. గిరిశిలాశకలంబులపై నుండి క్రిందికి వచ్చుచుండుప్రవాహజర్ఝరధ్వని పర్వతమునంటి ప్రతిధ్వని చేయుచుండెను.

గోవిందమాణిక్య రాయ లానదీతీరమునఁ జల్లనినీడయందు ఝర్ఝరశబ్దమువలనఁ గలిగినయానందము ననుభవించుచు నాగిరి క్రిందిభాగమునఁ దనశాంతికుటీరమున నివసించుచుండెను. శాంతిసుఖము హృదయమున నించుచుండెను. ఏకాంతమునఁ బ్రకృతిసంబంధమయి శాంతిమయమయిన ప్రేమ నల్లడలనుండియుఁ బ్రవహించి యాతని హృదయమునఁ బ్రవేశించి యాతని మానసికములగు నన్నితాపములను హరించుచుండెను. ఆతఁ డిప్పటినుండియు రాజర్షి యని వ్యవహరింపఁబడుట మన కానంద

దాయకముగదా. ఆరాజర్షి మెల్లమెల్లనఁ దనహృదయగహ్వరము నుండి క్రోధలోభమోహాదికములగు దుర్దోషములఁ బాఱఁ దోలుచుండెను. ఆయనహృదయద్వారమును దెఱచెను. అందు స్వచ్ఛమగు ప్రకాశమును, జల్లనివాతపోతమును బ్రవేశపెట్టి యందలియంధకారమును, తాపమును నిశ్శేషముగాఁ దఱిమి వేసెను. ఒకచేతితో నాతనివలన నుపకారగ్రహణ మొనరించుచు నింకొకచేతితో నాతనియెడఁ గృతఘ్నతాకృత్యములఁ జేయు వారిని దనచే సన్మానింపఁబడి తన్నవమానించువారిని, వారి ప్రసంగమునంతయు నాతఁ డొక్కనిమునములో మఱచెను. తద్గిరివాసిని యగుపురాతనప్రకృతి యవిరతకార్యకారిణియై యుండుటయు, చింతారహితమై, శాశ్వతమై, శాంతిమయమై యొప్పారుచుండు తన్నవీనతయును జూచి యతం డటులనే తాను నూతనమై, చింతారహితమై, శాంతిమయమై, యలరారు చుండు స్వరూపము నొంద బ్రయత్నించుచుండెను. కోరికలేని తనప్రేమ నాతఁడు లోకమున దశదిశలను వెదఁజల్లెను. తనవాసనా విషయముల విసర్జించి యామహాత్ముండు బద్ధాంజలియై "ఓజగ దీశ్వరా! నీవు ప్రశంసార్హుఁడవు సంపచ్ఛిఖరమునుండి పడుచున్న నన్ను నీవు నీసందిటం బట్టి యిట్టి యానందమయమగు ప్రదేశ మున దించితివి. నే నాశిఖరమునుండి పడి ఛిన్నాభిన్నములు కావల్లయునని తలంచితిని గాని నీదయవలన నది తప్పి బ్రతికి తిని. నేరాజునై యున్నప్పుడు నీమహత్త్వ మేమియు గుఱు తింపలేకపోతిని. నే నిప్పుడు లోకము నందంతట వ్యాపించి యుండు నీమహత్త్వమును జూచుచున్నాఁడను." అని యనెను.

ఆతఁడు ముందు మతేమియుఁ బలుకలేకపోయెను. ఆతనికంఠము స్తంభీభూతమయ్యెను. కందోయి యశ్రుజలములను స్రవించుచుండెను. కొంతసేపటి కతఁడు మరల ధైర్యము నవలంబించి "పరాత్పరా! నాజీవనాధారుం డగుధ్రువు నెడఁ బాయఁ జేసితివి. అతనిప్రేమానుబంధ మిప్పటికిని నన్ను లాగుచున్నయది. నీవు నాసేవమునకే యిట్టి చిత్రపుబంధమును గల్పించితివని నే నెఱింగినను నాబాలునివిషయమునఁగల మోహ మప్పుడప్పుడు నన్నలంచుచున్నది. నే నాబాలకుని ప్రేమచే నాకర్తవ్యాంశములనన్నిటిని మఱచి నాప్రాణము లాతనిపై నిడికొనియుంటిని. నీవు నన్నపాయమునుండి తప్పించితివి. నే నాధ్రువుని నాపుణ్యఫలపుంజముని తలంచి పెంచుకొంటిని. పుణ్యమునకు ఫలము పుణ్యమే యగు నని నీ వాతని నెడఁబాపి నా కిట్టిబోధ నొనఁగితివి. నీ యాశీస్సు ప్రభావమువలన నే నాధ్రువుని పుత్రవిరహదుఃఖమును సుఖమని నమ్మి నీయనుగ్రహఫల మనుభవించుచుంటిని. దేవా! వేతనస్వరూపమగు కామ్యఫలమును గోని సేవకునిరీతిని నేనేదియును జేయను. నేను నిజముగ నీప్రేమానుబంధమునఁ గట్టఁబడి నీసేవమాత్రమే చేయుదను.

ఏకాంతప్రదేశమున నే శాంతిమయమగు ప్రకృతి స్నేహధారానంచయ మొనర్పుచున్నదో యాప్రకృతిజనసమాజమున నింటింటను నదీరీతినిఁ దత్ప్రేమనుఁ బ్రవహింపఁ జేయుచున్నదని మాణిక్యరాయలు తెలిసికొనెను.

ఎవఁ డట్టిప్రేమాప్రవాహమున మునుంగుచుండునో వానినంతాపము శాంతించుచుండును. ఆతని కృష్ణయు నిమున

మున నుపశమిల్లును. ఎవఁ డాప్రేమూప్రవాహమును స్పృశిం పఁడో యాతనికిఁ బ్రకృతిసంబంధమగు నెద్దానితోడను సంబంధము కలుగదు. మాణిక్యరాయలు తనమనంబున నేను నిచ్చట సంపాదించిన శాంతిమయమగు ప్రేమను జనసమూహమున వినియోగించుట కేఁగి కృతార్థుఁడ నయ్యెదను." అని యాలోచించి యాయాశ్రమమును విడిచి బయలు దేఱెను.

రాజ్యమును విడిచి సర్వసంగపరిత్యాగ మొనరింపవలయు ననుమాట చెప్పుటవలెఁ జేయుట సుగమముకాదు. రాజకీయ వేషమును బరిత్యజించి కాషాయవస్త్రముల ధరించుటయు నంత సహజముకాదు. రాజ్యపరిత్యాగ మొకప్పుడు చేయవచ్చునుగాని జిఱుతతనమునుండి మన కలవడినయభ్యాసములను వీడుట మాత్ర మంత సులభసాధ్యముకాదు. ఆయభ్యాసముల నొక్కమాఱుగా విడుచుట కష్టము. ఉత్కటమగుతృష్ణావేగము నొంది వ్యసనములు మనబుద్ధియందు దగుల్కొనియుండును. వ్యసన మహాశక్తికి యథావసరమున మనోరథపూర్తి గావింపనిచో మనరుధిరమునే పానముచేయుట కారంభించును. గోవిందమాణిక్యరాయ లెంతపటి కాజనవిరహితమగు శాంతికుటీరమున నుండె నంతకాలము సోమరివలె కాలుచాఁచుకొని కూర్చుండెనా? ఈసంగతి యెవరికిని దెలియదు. లేదు లేదు. నిజముగ నతఁడు క్షణక్షణమున నాబాల్యసంచితప్రవర్ధితములగు నభ్యాసములతో హోరాహోరిగాఁ బోట్లాడుచుండెను. తనకుఁ జిన నలవాటుపడిన యొకవస్తువు దొరకనప్పు డధైర్యమొందుచు వెనువెంటనే ధైర్యమును దెచ్చుకొని తన్నుఁ దా ధిక్కరించుకొనుచుండెను. అతఁడు తనమనస్సంబంధము లగుతృష్ణాలతా

నహ స్రములకు దోహద మేమియుఁ జేయక మొదలంట నశింపఁ జేయుచుండెను. ఆరాజర్షి యనుక్షణమును వ్యసనములతోఁ బోరాడి విజయమును గైకొని సుఖించుచుండెను. పొగరుపోతు గుఱ్ఱమును మిక్కిలి జోరుగాఁ బరువెత్తించి దాని నలియఁ గొట్టి రౌతు తనస్వాధీనము చేసికొనున ట్లతఁ డభ్యస్తపదార్థాభావంబునఁ దనయధీరహృదయమును నభావరూపమయి శూన్యమగు మైదానమున నిరంతరము పరువెత్తించి శాంతింపఁ జేయుచుండెను. ఆయభ్యాసములకారణమున నతఁడు కొన్నిదినములవఱకు స్థైర్యము నవలంబింపలేకపోయెను గాని తుదకు విజయమంది సుఖించెను.

ఆరాజర్షి పర్వతప్రదేశమును విడిచి సముద్రముయొక్క దక్షిణతీరమును జేరెను. అతఁడు వాసనాసంబంధమగు పారతంత్ర్యమునంతయు వీడి తనమనమును స్వాధీనపఱచుకొని యానందము ననుభవించుచుండెను. ఇంతవఱకును విఘ్న మొనరించువా రెవరును నతనికడలేరు. శాంతికుటీరమును విడిచి యతఁ డేగినను దరువాత నెట్టిబాధయు నతఁ డొందలేదు. ఆతఁ డంతటనిండియుండుప్రకృతిరూపమును జూచి తాను గూడ నాప్రకృతియం దొకపరమాణువై యుంటి నని తలంచెను. అతఁడు పచ్చని చెట్లయందును, లతలయందును, 'సువర్ణచ్ఛాయలు గలసూర్యకిరణములయందును,' నపారమగుప్రకృతిశోభను జూచుచుండెను. నవ్వుట, మాటలాడుట, లేచుట, కూర్చుండుట, కదలుట, తిరుగుట మొదలగు మనుష్యచేష్టలనుజూచి యానంద మొందుచుం

డెను. అతని కెవ రగపడినను వారిని బిలిచి మాట్లాడి సుఖమను భవించుచుండెను. ఎవరు తన్ను పేక్షింతురో వారియం దెక్కుడు గా నభిమానమును జూపింపసాగెను. బలహీనులకు సహాయము నర్పుటకును, దుఃఖవంతులకు సాధ్యానుసారమగు నుపకారము చేయుటకును నతనిమానసమం దభిలాషవిశేషరూపముల జాగ్రత్త వహించుచుండెను. తనకున్న బలమును సుఖమును బరోపకార మందే నియమించెను. ఆయన కిప్పుడు స్వకీయములగు కార్యము లేవియునులేవు. ఏపదార్థమందును గావలయునని కోరికయును లేదు. జంగమస్థావరాత్మకమగు నీప్రపంచమునఁ జూడఁదగినవై యెవ్వరికి నేమి చూడఁ బడవో యట్టివన్నియును దనస్వరూపము లను ధరించి యాతనిదృక్ప్రాంతంబున నంచరింపసాగెను. అతఁ డప్పు డిరువురుబాలకులు వీథిలో గూర్చుండి యాడుకొనుటఁ జూచినను అన్నదమ్ములు, పితాపుత్రులు, తల్లిపిల్లలు నొక్కచోఁ గూర్చుండియుండుటఁ జూచినను, వారు ధూళిచేఁ గప్పఁబడినను, దరిద్రులైనను, దీనులైనను నాతఁడు వారియం దవ్యాజమై యతి విస్తారమగు మనుష్యహృదయసముద్రమున నొక్కటియై యపా రమై యుండుప్రేమను జూచి సంతసించుచుండెను. తల్లి పిల్ల నెత్తుకొనియుండుటఁ జూచినచో నాతల్లిని భూతభవిష్యములం దండఁటి బాలురకును దల్లియగునాదిశక్తియనియె తలంచు చుండెను. చిత్త మొక్కటియై యుండునంగడికాం డ్రిరువురు మధురముగా సంభాషించుచుండ నాతఁడు చూచినచో లోక మునుండు నంద ఆట్టిమైత్రితో నుండున ట్లొనర్పవలయు నను కొనుచుండెను. అతఁడు పూర్వ మీభూమిని మాతృహీనగాఁ జూచుచుండెను గాని యిప్పు డీభూమికిఁ జిరకాలమునుండియుఁ

గ్రిందిభాగము నావరించికొని దీనినెత్తుకొనియుండు ప్రకృతి తల్లియై యుండె నని తలంచెను. లోకమున దుఃఖము, శోకము, దారిద్ర్యము, వివాదము మున్నగునవిచూచుచున్న నతని మానస మేమియుఁ జలింప కుండెను. అతఁ డెవనిదుఃఖమును జూచినను దుఃఖించుట మానుకొనెను. పెక్కువిధములగు శుభ లక్షణము లగుపడినను నెట్టియశుభములుగా నివి పరిణమించునో యని మిక్కిలి దుఃఖించుచుండెను.

సుఖదుఃఖమయమగు నీసంసారమున సుందరుండును సుకుమారుండునగు నొకబాలకునితీరునఁ బ్రేమోల్లసితమగు వినోదమునం దేదిన మైక్య మొంది ప్రఫుల్లభావమునఁ జెలంగునో, హా హా! మనజన్మావధిలో నభూతపూర్వమై స్వాధీనత గలయట్టిసుదిన మొక్కండైన లభించునే. మనలనందఱ నేదిన మెడఁబాయఁ జేయలేకుండునో, ఎవరును మనలనే సాంసారికసుఖములచేతను వంచింపఁజేయఁజాలరో మనల నెవ్వరు నెచ్చటను బంధింపఁజాలరో యట్టిదినమెప్పుడైన లభించునే? మనల నానందింపఁ జేయుటకే దిన మపూర్వ మగువీణియతంతువులను మేళవించి వాయించునో యట్టిదిన మెప్పుడైనఁ జూడఁగలుగుదుమో అటుపూర్వమగు వసంతర్తువు శోభ లెల్లెడల నిండియుండునో మఱియును నపూర్వమగు యౌవనానందమందున లోకమంతయు భరితమై యుండునో యట్టిసుదిన మెప్పుడు తటస్థించునోగదా ఏదినమున సర్వదారిద్ర్యదుఃఖములు చల్లచల్లన జాఱిపోవునో, యట్టిసుదినము వచ్చును. నవీనస్వాధీనతోత్సవంబున ననివార్యస్వాతంత్ర్యసామ్రాజ్యమందు నట్టిదిన ముదారహృదయుఁ డగుమన రాజర్షికి సంప్రాప్తించెను.

చటగ్రామమునకు దక్షిణదిగ్భాగంబున రామనగర మింకనుఁ బదిక్రోసులదూరముననున్నది. మనరాజర్షి యానగరమార్గమును బట్టిపోవుచు సాయంకాలమున కింక ముందుగనే 'యలమ్ఖాలు' అనుచిన్నపట్టణమును జేరుకొనియెను. రాజమార్గమున నరుగు నాతనికొకయింటినుండి యొక బాలకునిరోదనధ్వని వినవచ్చెను. మిక్కిలి కనికరవుహృదయముగలవాఁడగు నాతని మానస మా రోదనధ్వనిచేఁ గరఁగిపోయెను. వెంటనే యాతఁ డాయింటిలోనికరి గెను. యౌవనవంతుండగు నొకపురుషుఁడు దీనుఁడై మిక్కిలిచిక్కి యున్న యొకబాలుని బుజమున నుంచుకొని యాయింటివసా రాలో యటునిటుదిరుగుచుండెను. పాపమా బాలుండు గడగడ వడంకుచు నుండి యుండి యేడ్చు చుండెను. ఆయౌవనవురు షుఁ డాబాలకునిఱొమ్మున నానుకొని యోదార్చుచు బుజ్జగించు చుండెను. ఇట్టిసమయమున మనరాజర్షి యు వారిని సమీపించెను. ఆపురుషుఁ డీతనిజూచి చకితమనస్కుఁడై "స్వామీ! ఈకుఱ్ఱవాని నాశీర్వదింపుఁడు." అని దీనముగా నాతనిఁ బ్రార్థించెను. రాజర్షి తాను గప్పికొనినకంబళిని దీసివైచి యాపిల్లవానిశిరస్సును బా గుగ మీఁదికెత్తి చూచెను. ఆపిల్లవాఁడును దలయెత్తి కాషా యాంబరధారి యగురాజర్షిని నొక్కసారి చూచెను. ఆబాలుని నేత్రములక్రిందిభాగము వాచి యుండెను. పాప మాబాలకుని ముఖమునఁ గన్నులుతప్ప మతేమియుఁ గానరాకున్నవి. అతఁడు రాజర్షినిఁ జూచినతోడనే యొకమాఱు వాఁడుపాఱి తెల్లనగు తన పెదవులను గదల్చుచు నేదియో మాటలాడెను గాని యుచ్చార ణము స్పష్టముగా లేకుండుటచే మనకేమియు వినిపించుట లేదు.

తరువాత నాబిడ్డఁడు తనజనకునిభుజములపై దనయుత్తమాంగము నుంచుకొని మాటలాడక పరుండెను. ఆపురుషుఁడు తన బిడ్డను దించి మాణిక్యరాయలకు నమస్కరించి పవిత్రమగు నాతనిపాదధూళిని, జేతితోఁ దీసి యాకుఱ్ఱనిశిరమునందును మస్తకమునందును బూసెను. అంత నారాజర్షి యాబాలకు నెత్తుకొని యాపురుషునితో,

రాజర్షి.—"అయ్యా! యీబాలుని తండ్రి యెవరు ? ఆతని నామ మెద్ది?"

పురు.—"స్వామీ! ఈతనితండ్రిని నేనే. నానామము యాదవుఁడందురు. యాదవుఁడు కన్నుల నీరు గార్చుచు 'స్వామీజీ! దైవము పంతము పట్టినట్లు నాబిడ్డల నొక్కొక్కరిని దనపొట్టను బెట్టుకొనియెను. ఇంతదనుక నీబాలుం డొక్కఁడుమాత్రము మిగిలెను' అనిచెప్పి యతఁడు వేడినిట్టూర్పులు విడువసాగెను."

రాజ.—"అయ్యా! నేటిరాత్రి నేనతిథినై యిచ్చట నుండెదను. నేనేమియు భుజింప నొల్లను. కావున నావిషయమున భోజన ప్రయత్నమేమియును జేయకుము. నే నీరాత్రినుండుట కంగీకరించినచోఁ జాలును" అనెను.

మాణిక్యరాయ లారాత్రి యచ్చటనే యుండెను. ఆతనితోనుండు నౌకరు లాయూరిలో నొకధనికునిగృహమున కేఁగి యాతిథ్యము నొందిరి. తెల్లవారెను. కాలచక్ర మెంతలోఁ దిరుగుచున్నదో చూడంజూడ నప్పుడే సాయంకాలమైనది.

ఆయింటికిఁ బెంకులచేఁ గప్పఁబడిన యొకపైకప్పు కలదు. దాని మీఁదనుండి యావిరి మీఁదికెగయుచుండెను. గవాక్షముల నుండి వంటయింటిపొగ వెలువడి తిన్నగా నంతటను వ్యాపింపక గిరగిరతిరుగుచు సమీపమున నుండుకోనేటియందును మైదానమందును జక్కఁగా నల్లుకొనుచుండెను. తరులతాసంతానములయందు నిందిందిరములు ఝుమ్మని రొదచేయుచుండెను. గాలివీచుట మానుకొనెను. ఆ కల్లాడలేదు. ఆయింటి కావలి ప్రక్కను వెదురుపొదలచే నిండియుండు చిన్నవనమొండు కలదు. ఆపొదయం దొకపక్షికూర్చుండి "టర్, టర్," అని శబ్దము చేయుచుండెను. మనరాజర్షి దీపపు వెలుతురున మలినమైయుండు నాచిన్నబాలునిమోమును జూచుచుండెను. అతఁడు తనకంబళిని బాగుగఁ గప్పుకొని యాబాలకుని కడనే కూర్చుండి యాతనితో విచిత్రతరములగు కథలను జెప్పుచు వినిపించుచుండెను. సంధ్యాకాల మతిక్రమించెను. నక్క లఱవసాగెను. ఆ బాలకుఁడాముచ్చటలను వినుచు జ్వరబాధనుమఱచి నిద్రించెను. ఆయింటికి చేరుగుననున్న యొకగృహమున కేఁగి రాజర్షియు శయనించెను. కాని యాతని కారాత్రి నిద్దుర రాలేదు. రాత్రియంతయు నాతఁడు ధ్రువునిమాట దలంచుచుండెను. అతఁడు తనలోఁదాను ధ్రువునికి మాఱుగా బాలురనందఱను నాతనితో సమానులుగాఁ జూచుకొందును అని యనుకొనెను.

మనరాజర్షి యాలోచనలో నుండఁగనే కోడికూఁత వినవచ్చెను. పక్షులకలధ్వనులు శ్రవణానంద మొనర్చుచు జనులను

మేలుకొల్పుచుండెను. అరుణోదయమయ్యెను. బాలుండు నిద్ర నుండి లేచి తనతండ్రితో "నాన్నగారూ! ఏదియో వాద్యధ్వని వినఁబడుచున్న దదియేమి?" రాజర్షి వారిసంభాషణమును వినుచుండెను.

తండ్రి.—బాబూ! ఆవాయించుచున్నది డోలు.

బాలుఁడు—ఎందు కట్ల వాయించుచున్నారు?

తండ్రి.— రేపు పూజామహోత్సవము జరుగుననిచాటుచున్నారు.

బాలు.—రేపు పూజయా? ఆపూజఁ జూచుటకై నాకేమైన నీయరా ?

తండ్రి.—ఏమీయఁగలను దండ్రీ ?

బాలు.—నాకొకయెఱ్ఱటిశాలువనీయరు?

తండ్రి—నాయనా! నేనుశాలువు నెచ్చటసంపాదింపఁ గలను? నాతండ్రీ! నాకడనేమియును లేదు.

బాలు.—మీదగ్గఱ నేమియును లేదా?

తండ్రి.—అవునుతండ్రీ! నాదగ్గఱ నేమియును లేదు. నీవే నాకుండు సర్వస్వమును అని చెప్పుచు దుఃఖముచే హృదయమవియ నొక్కనిట్టూర్పు విడిచెను. రాజర్షి యానిట్టూరువు రోదను వినియెను.

తరువాత నాచిన్నబిడ్డఁ డేమియును బలుకలేదు. తండ్రి ఊమ్ము నానుకొని పరుండెను.

తెల్ల తెల్లవాఱుచుండఁగనే మనరాజర్షి లేచి యింటివారికైనఁ దనప్రయాణమును జెప్పకయే తనయశ్వము నారోహించి

రామనగరమార్గమున బయలుదేఱి పోయెను. అతఁడు పగ లేమియు భుజింపలేదు. మంచి నీరైనను ద్రాగలేదు. మఱియు నొకనిముసమైన విశ్రమింపలేదు. మార్గమున నొకచిన్ననది య గపడెను. అతఁడు గుఱ్ఱముమీఁదనుండియే నదిని దాఁటెను. దిన మణి తిలకుసూటిగా వచ్చువేళ కాతఁడు రామనగరమును జేరెను. అతఁ డానగరమున నెక్కువ తడవు జాగుసేయక తానువచ్చిన పని చూచుకొని యింకఁ బ్రొద్దుగ్రుంకక పూర్వమే మరల యాద వునియిల్లు చేరెను. యాదవుని నేకాంతమునకుఁ బిలిచి తన కవ్వులో నుండి యెఱ్ఱనిశాలువు నొకదానిఁ దీసి యాతనిచే నిచ్చి "పూజాసమయమున నీచిన్నికొమరున కి" మ్మని చెప్పెను. యాదవుం డేడ్చుచు నాతనిపాదములపైఁబడి "అయ్యా! తామే యిద్దానిఁ దమచేతులతో నాబిడ్డని కీయుఁడు" అని పలికెను.

రాజు.—"వలదు. నే నీయను. నే నిచ్చుటచే నేమిఫలము? నీవు నాపేరైన నాబాలునితోఁ జెప్పకుము. నే నాబాలుని వదనారవిందమున నానందోదయమును మాత్రము చూచి పోయెదను." అని చెప్పెను.

రాజర్షి యానందముచే వికసించిన యాచిన్నిబిడ్డని ముద్దు మోమును జూచి తనదారిని తా నేఁగెను. అతఁడు తనలోఁ దానిట్లు దుఃఖించెను. "ఆహా! నే నెందులకును బనికిరానివాఁడనై తిని. కొన్ని యేండ్లవఱకుఁ గేవలరాజ్యోపభోగపరతంత్రుఁడనై యుంటిని. ఏమియు నిట్టిసమయమున నుపకరించు విద్య నభ్య

సింపనైతిని. ఏయుపాయముచే నీసుకుమారకుమారునకు రోగ
నివృత్తిచేయవలయునో నే నెఱుంగను. ఉపాయమెఱుంగక
"కిం కర్తవ్య" తామూఢుఁడనై దుఃఖించుట మాత్రమునేర్తును.
బిల్వనఠాకూ రీసమయమున నున్నచో దీనుఁడగు నీబాలకు నా
తఁడు తప్పక సంరక్షించియుండును. హా! ఈశ్వరా! నే నెప్పుడైన
బిల్వనఠాకూరునివంటి పరోపకారపారీణుఁడనై యుందునా.

మాణిక్యరాయలు తుద కొకనిశ్చయమును జేసికొని
యెను. "నే నిప్పు డటునిటుఁ దిరుగుచుఁ గాలమును వ్యర్థపఱుప
నొల్లను. జనసమూహమునఁ బ్రవేశించి నాకుఁ దోఁచినతీరునఁ
గర్తవ్యమును నిర్వర్తించుచుందును." అని,

రామనగరమునకు దక్షిణపుదిక్కున రాజపుత్రులలోనవాం
తరభేదము గల 'మగ' లనువా రొకచిన్నదుర్గమును బాలిం
చుచుండిరి. ఈదుర్గము రాకానుదేశపురాజునకు లోఁబడియుం
డెను. మనరాజర్షి యాదుర్గమును జేరి రాజుగారియాజ్ఞ నొంది
యాదుర్గమున నివసించెను.

గ్రామములో నుండెడిబాలకు లందఱు నిప్పుడు మనరా
జర్షిని జుట్టుకొని యాకోటలో నున్నారు. అతఁడు వారలనందఱ
నొకచోఁ జేర్చి యొక పెద్దపాఠశాల నేర్పఱిచెను. అప్పు డప్పు
డతఁ డాబాలురకు బాగుగ విద్యనభ్యసింపఁజేయుచు నప్పుడప్పుడు
వారితో నాడుకొనుచుండెను. ఒకప్పు డా బాలకులతో గలిసి
వారియిండ్ల కేగుచుండుటయుఁగలదు. ఏబాలునికైన నొక్కించుక
నుస్తిగా నున్నచో నాతఁడు స్వయముగా వానియింటికిఁ బోయి

వానిఁ జూచుచుండెడి వాడుకయుఁ గలదు. బాలకు లందఱు స్వర్గమునుండియే వచ్చిరా? దేవబాలకులా? అనునది యసంభవము. మనుష్యులకును రాక్షసులకును భేదమేమియో వారి కీవఱకును దెలియదు. వారియందు స్వార్థపరత్వము, క్రోధము, లోభము, ద్వేషము, హింసాబుద్ధియును బ్రబలముగా నున్నవి. ఇంటికడఁ దల్లిదండ్రులు వారికి జిఱుతతనమునుండియు మంచి శిక్షనిచ్చిరేమో యనుకొనుదమన్న నదియుఁ బూజ్యమే. ఈ కారణములచే మనరాజర్షి యాబాలకులకు విద్యనిచ్చి మంచి దారిని నడిపించి వారల వృద్ధివఱుప బద్ధకంకణుండై యుండు టత్యంతావశ్యక మని తలంచెను. అట్టి మహామహుల యుద్యమము లంతరాయము లెఱుంగక కొనసాగి లోకము నుద్ధరించుగాక. నిర్జనముగా నుండెడి దుర్గ మిప్పుడు మగబాలకులజాతితో నిండి యుండెను. కోటలోపల నలువదితొమ్మిది వాయువులును నలువదినాలుగు తత్త్వములును గలిసి యొక్కచో నుండెను. మాణిక్యరాయ లీసామగ్రినంతయు నొక్కచోఁ జేర్చి ధైర్యాతిశయమున నాబాలకులనందఱను అన్వర్థ మనుష్యశబ్దవాచ్యులనుగాఁ జేయ నమకట్టెను. మనుష్యజన్మ మెట్లు శ్రేష్ఠమైనదో ప్రాణము లైననొడ్డి ప్రయత్నపూర్వకముగా నేనా శ్రేష్ఠత్వము నెట్టులు రక్షింపవలయునో మాణిక్యరాయలు బాగుగ నెఱుంగును. ఆతండు నలుదిక్కుల మనుష్యకర్తవ్యపరాయణతను జూడ నిచ్చగించుచుండెను.

అసంఖ్యాకము లగుఫలములతో నిండుకొని యుండు మనుష్యత్వము సార్థక్యము నొందుగాక యని యతఁడు నిరంతరము దలంచుచుండెను. తనజీవితశేషమును నిముసమున కర్త

వ్యయమునందే వినియోగింప నతఁడు నిశ్చయించికొనియుండెను. కావుననే యతఁడు కష్టములను విఘ్నములను సహించి యుండఁ గలిగెను. తనపని యింకను బూర్తిఁ జేయలేకపోతి నని యాతఁ డప్పుడు విచారించుచుండెను. బిల్వనఠాకూ రిట్టిసమయమునఁ దనకు సహాయుఁడై యుండినచో దనమనోరథ మచిరకాలమున సిద్ధించు ననుకొనుచుండెను.

ఈతీరుననా రాజర్షి నత్రముం డొందఱికో భృత్యులను సంపాదించి వారితో నుత్సాహముగాఁ గాలమును బుచ్చుచుండెను.

---

## నలువదిమూఁడవపరిచ్ఛేదము.

ఇక్కడ శాహాశుజా తనతమ్ముఁడగు నౌరంగ జేబుఫాదుషా వారి సేనలచే నోడింపఁబడి పలాయనమాత్రముచుబంధింప నుద్యుక్తుండై యుండెను. అలహాబాదుసమీపమున యుద్ధముం దతనికిఁ బరాజయము కలిగెను. అతఁడు శత్రుసేనలచేఁ బూర్తిగ నోడింపఁ బడుటచే నట్టివిపత్సమయమునందుఁ దనపక్షమువారిని గూడ నమ్మఁజాల కుండెను. అతఁ డట్లవమానింపఁబడి నశంకితుఁ డగుటచే మాఱువేషమును ధరించి ప్రాకృతపురుషునిరీతి నొక్కఁడును పాఱిపోయెను. శుజాయెచ్చటి కేఁగినను శత్రుసేనలు విజయపతాకతో నాతనివెన్నంటి తఱుముచుండెను. అతనివెనుకనే శత్రువులగుఱ్ఱపుడెక్కలు తగిలి తిరుగుచుండెను. తుద కతఁ డెట్టులో పాట్నాయనుపట్టణమును బ్రవేశించెను. అచ్చటికిఁ జేరి మరల

తనసవాబువేషమును ధరించి దానచ్చటఁ బ్రవేశించినట్లు తన వారికందఱికిఁ గబురంపెను. అతఁడు పాట్నా చేరునంతలో నారంగజేబుని తనయుండగు మహమ్మదు సైన్యసమేతుండై పాట్నా సమీపించెను. ఆసమాచార మెఱింగి శుజా పాట్నాను వీడి ముంగేరునకుఁ బయలుదేఱిపోయెను.

ముంగేరునందుఁ గొందఱుసిపాయీలును మఱికొంత గుఱ్ఱపుబలము నచ్చటచ్చటినుండివచ్చి యాతనిని గలిసికొనెను. అతఁడచ్చోటను గొంతక్రొత్తసైన్యమునుగూర్చెను. తెలియాగఢీ కోటను సికలీగఢ కోటను మరమ్మత్తు చేయించి నదీతీరమునఁ బర్వతముపై గట్టిగోడ నొకదానిని బెట్టించి యొకవిధముగాఁ జింతారహితుండై యుండెను.

ఈసమయములో నారంగజేబు చతురుఁడగుమీరజుమ్లా యనుసేనాధిపతిని దనకుమారుం డగుమహమ్మదుఫాదుషాకు సహాయార్థ మంపెను. మహమ్మదు తనప్రయాణము నెల్లరకుఁ దెలియఁజేయుచు సేనాసహితుండై వచ్చి ముంగేరుకోటకు సమీపమున విడిసెను. మీరజుమ్లా రహస్యముగా మఱి యొక్కత్రోవను ముంగేరునకుఁ బ్రయాణము సాగించెను. శుజా మహమ్మదుతో నొకవిధముగాఁ బోరుచున్నంత మాటా మాటి ప్రయాణములతో మీరజుమ్లా యసంఖ్యాకమగుసైన్య ముతో వసంతపురమును బ్రవేశించెనని తెలియవచ్చెను. శుజా భయపడి వేగముగాఁ దనసైన్యమును దీసికొని ముంగేరును విడిచి రాజమహాలునకుఁ బలాయితుఁడయ్యెను. అతనిపిల్ల లచ్చ

టనే యుండిరి. ఫాదుషా సేన లప్పటికిని బావ మాతని వీడక వెను వెంటనే రాజమహాలునకు వచ్చుచుండెను. శుజా శత్రుసైన్యము లతో నాలుదివసము లహోరాత్రములు ఘోరముగాఁ బోరా డెను. తుదకాతఁడికఁ దనరక్షణ కుపాయాంతరమేదియుఁ గానక నాఁడు భయంకర మగునర్ధరాత్రమునఁ దనబిడ్డలను దగినధన మును దీసికొని నది దాఁటి తోండాయనుగ్రామమును బ్రవేశిం చెను. వెంటనే యచ్చటిదుర్గమును మరమ్మత్తు చేయించుప్రయ త్నములో నుండెను.

వర్షఋతువు ప్రవేశించెను. వర్షోదకముచే నదీశాఖలు నిం డెను. ఫాదుషా సేనలు ముందటికి మఱి తఱమి రాలేక పోయెను.

ఈయుద్ధమునకుఁ బూర్వము ముహమ్మదుఫాదుషాగారికి శుజాకుమారిత నిచ్చి వివాహమొనర్ప నిశ్చయింపఁబడెను. కాని యీయుద్ధము ప్రారంభించినంత నుభయపక్షములవారు నామాట మఱచిపోయిరి.

వర్షము లవిచ్ఛిన్నముగాఁ గురియుచుండుటచే యుద్ధముచే యుటకు వీలు లేకపోయెను. మీరజుల్లా రాజమహాలునకుఁ గొంత దూరమున ముందుగాఁ దనసేనలతో విడిసెను. ఈసమయమున దోండాగ్రామమునుండి యొక యశ్వారోహుకుండు వచ్చి మాట లాడక ముహమ్మదువారిచేతిలో నొకయుత్తరము నుంచెను. ఫాదు షావారాయుత్తరమును విప్పి చదువుకొనెను. శుజానవాబువారి కుమారిత యాయుత్తరమును వ్రాసెను. 'ఫాదుషాసాహెబ్!

నాయదృష్టమే యిట్లుమాఱెను; నేనెవరిని మనంబున వరియించి నాహృదయము నర్పించితినో, ఏ మహాత్ముఁ డుంగరముల మార్చించి నాపాణిని గ్రహింపనిశ్చయించియుండెనో యామహానుభావుండు నేయొర వెలికినఖడ్గమును జేఁబూని నాతండ్రిశిరమును ఖండింప నుద్యుక్తుండై వచ్చియుండెను. నే నిది చూడవలసినదేనా? నన్నుస్వాహా యొనరించుకొను నుత్సవ మిట్లు మాఱిపోయెనా? ఈపనికే యింతయాడంబరమా? ఇందువలన నేఁడు మా రాజమహాలున నెత్తురుటేరులు ప్రవహింపవలయునా? ఏమీ? ఈసంతోషముతోడనే పాదుషా ముహమ్మదువారు ఢిల్లీనుండి ఖడ్గపాణులై దయచేయించిరా? ఇదియా పరిపూర్ణమగుప్రేమకుఁ బ్రతిఫలము" అని వ్రాయఁబడియుండెను.

ఈయుత్తరమును జదువుకొనినంతనే ముహమ్మదువారికిఁ గాలిక్రిందినున్న గిరిపోయెను. అతనిహృదయము భేదిల్లెను. అతఁడు గడగడ వడంకసాగెను. ఆననమున నుండలేకపోయెను. అతఁ డానిముసములోఁ దాను పాదుషాయగుదు ననువాసకును, తండ్రిగారి యనుగ్రహమునకును దిలాంజలియొసంగెను. అతండు తననూతనయౌవనప్రజ్వలిత మగునగ్నియందుఁ దనలాభనష్టములను వివేచించుశక్తి నాహుతిగా నొసర్చెను. పలువిధములగు తనతండ్రిచేయుపను లన్యాయపూరితములనియుఁ గఠోరములనియుఁ దెలిసికొనెను. తనతండ్రిగారి కపటపుఁబూరితములును, కఠోరములును, నీతివిరహితములు నగువిరుద్ధకార్యములను గుఱించి యతఁ డింతకు మున్నుండే తండ్రిగారియెదుట తనయభిప్రాయమును వ్యక్తపఱచుచుండెడివాఁడు. ఇదికారణముగా

నౌరంగజేబును సీతనిపైఁ దనయసంతుష్టిని బ్రకటించుచుండెడి వాఁడు. ముహమ్మదుఫాదుషా తనసేనాధ్యక్షులలో నుత్తముఁ డగువాని నొకనిఁ బిలిపించి తండ్రిగారి నిర్దయత్వమునను కుటిలత్వమునను, అత్యాచారితయందును తనకుఁ గలభేదమును బ్రకటించుచు, "నాపెద్దతండ్రిగారితోఁ గలిసికొనుటకై నే నిప్పుడు తోండాగ్రామమునకుఁ బోయెదను. మీరెల్లరు స్వచ్ఛమగు హృదయధర్మముతో నన్నభిమానించినచో నావెంట రండు" అని పలికెను.

"మహాప్రసాదము స్వామీ! తామానతిచ్చినది యథార్థము. రేపు తెల్లవాఱునంత నీసైన్యములో నర్ధభాగము ప్రభువువారివెంట తోండాగ్రామమునకు వచ్చుటకై సిద్ధముగా నున్నది" అని యాసేనాధ్యక్షుఁడు వినమ్రుఁడై సలామొనర్చి యతని నభినందించెను. ఆదినముననే ముహమ్మదుఫాదుషా నదిని దాఁటి శుజానవాబువారి సేనానివేశమును బ్రవేశించెను.

తోండాగ్రామమునం దంతట సానందము వెల్లివిరియుచుండెను. ఎల్లరు యుద్ధమనుమాటయే మఱచిపోయిరి. ఇన్నిదినములు పురుషులే పసిబాలులయందు రాత్రిందివములు వ్యగ్రులై యుండిరి. ఇప్పుడు శుజావారిగృహంబున నంగనలకును నూపిరి తీయుటకైనఁ దీరికలేక పనిపాటులు జరుగుచుండెను. శుజానవాబు మిక్కిలి ప్రేమతోను సంతోషముతోను ముహమ్మదునకు స్వాగత మొసంగెను. అనవరతము ప్రవహించురక్తపాత మొక్కసారిగా నాఁగిపోయెను. మహానందముగా శుజానవాబుగారి కూఁతునకును ముహమ్మదుఫాదుషాకును పెండ్లియైనది.

ఈద్వివాహోత్సవము సమాప్తి కొందినంతలో ఫాదుషాగారిసేనలు వచ్చుచున్నట్లు తెలియవచ్చెను.

ముహమ్మదు శుజావారిసేనానివేశమును జేరినంతనే సేనాధ్యక్షుండగుమీరజుమ్లా కాసంగతి తెలిసెను. ఫాదుషావారి సైన్యములో నొక పదాతియైనను ముహమ్మదుననుసరించి వెళ్లలేదు. ముహమ్మదు కోరి విపత్సముద్రమునఁ దానుగాఁ బడెనని సైన్యమంతయు నిశ్చయించుకొనియెను. ఆతనివెంబడిఁబోవుట వట్టివెఱ్ఱిపని యనియును వారు దలంచిరి.

ఫాదుషావారిసేనలలో నధికాంశము రణభూమినిఁ దమ్ముఁ జేరునని శుజాయును ముహమ్మదును నమ్ముకొనియుండిరి. ఆయూనతోడనే వారుగ్రరణరంగమున నుఱుకుటకు సంసిద్ధులై యుద్ధభూమికి వచ్చిరి. అతనిం గాంచినతోడనే ఫాదుషాగారి సేనలలో నొకపటాలము ముహమ్మదును సమీపించుచుండెను. అతఁ డది చూచి మిక్కిలి సంతోషించి యుప్పొంగెను. కాని వారు తుపాకులను గాల్చుచుఁ దనపై యుద్ధమునకు డీకొనుట చూచి యప్పుడు జ్ఞాననేత్రమును విప్పెను. అప్పు డేమి తెలిసియు నేమి ప్రయోజనము? ఏమి చేయఁగలఁడు. ఏమి చేయుటకును సమయము కాదు. శుజాసైన్యము లింతవఱకుఁ బలాయనపరాయణత్వమునం దాఱితేఱి యుండుటచే మరల వారామార్గమునే యవలంబించిరి. శుజా పెద్దకుమారుఁడు యుద్ధమునఁబడియెను.

శుజా యారాత్రియే తనపిల్లపావలను, నల్లుని దోడుకొని మిక్కిలివేగముగా నేగు నావపైఁగూర్చుండి ఢాకానగరమునకుఁ బాఱిపోయెను. మీరజుమ్లా ఢాకావఱకు వారిని వెన్నంటి తఱు

ముట యంత యావశ్యకముగా నెంచలేదు. అతఁడు తానాక్ర మించినదేశమున శాంతిని నెలకొల్పు ప్రయత్నమున నుండెను.

దుఃఖకరములగు నాదివసములలో నట్టివిపత్తిసమయమున మిత్రవర్గ మొక్కసారిగా శుజావక్షమున విముఖులైరి. అప్పుడు ముహమ్మదు తనధనప్రాణసమ్మానాదులను తృణీకరించి శుజావక్షము నవలంబించి యుండెను. ఇక్కారణమున శుజాహృదయము మైనమువలె గరఁగి పోయెను. అతఁడు మనఃపూర్వకముగా ముహమ్మదును బ్రేమించెను. ఈసమయమున నౌరంగజేబుచేఁ బంపఁబడిన యొకచారుఁ డొకయుత్తరముతోఁ గూడ ఢాకానగరమునఁ బట్టువడియెను. ఆయుత్తరము శుజాచేతిలోఁబడెను. ఔరంగజేబు ముహమ్మదునకు వ్రాసినలేఖ యది దానిలో నిట్లు వ్రాయఁబడియుండెను. "నాకన్నుల నానందింపఁజేయు ప్రియకుమారా! ముహమ్మదుషాదుషా! నేనెందులకు నిన్నంపితినో నీవాపనిని బూర్తిచేయలేకపోయితివి. నాయాజ్ఞను నీవు పాలింపక స్వచ్ఛముగు నాకీర్తికిఁ గళంకమును దెచ్చితివి. కపటపూరితమగు కామినీవిలాసమునకు లోనై కర్తవ్యాంశమును మఱచితివి. ఇంక ముందెపుడైనను దీమొగలాయిసామ్రాజ్యశాసనభారమును వహింపఁదగిననీవు కాంతానయనోపాంతవర్తివై యనామధేయుండవై యుండవలసినందుకు నాకుఁగలఖేద మింతింతని చెప్ప నలవికాకున్నయది. గతించినదానికి వగచిన నేమిప్రయోజనము. ఎప్పుడు నీవీశ్వరునినామమును వచించుచు శపథముచేసి పశ్చాత్తప్తుండవై నీనేరము నొప్పికొంటివో యప్పుడే నిన్నుఁ దప్పుక్షమియించినాఁడను. నీవచ్చట నెందుల కింతదనుక డాఁగియుం

టివో యావనిఁ బూర్తిచేసి వచ్చితివేని పరిపూర్ణమగు నాయను గ్రహమునకుఁ బాత్రుఁడ వయ్యెదవు." అని.

ఆయుత్తరమును జదివినంతనే శుజాహృదయము దల్లడి ల్లెను. ఆతనిపైఁ బిడుగుపడినట్లయ్యెను. ముహమ్మదు మాటిమా టికి తాను దండ్రికడ నెవ్వుడు నేమియును క్షమింపవేఁడికోలేద నియు, నిది యంతయు నతనికపటచాతుర్య మనియును జెప్పెను. కాని శుజాకు సందేహముతీరలేదు. మూఁడుదినము లట్టులే యాతఁ డాలోచించుచుండెను. తుదకు నాల్గవదివసమున నాతఁడు "ప్రియముహమ్మదు కుమారా! వినుము. మాకు నమ్మకము లే కున్నయది. కావున నీవలన భయమందుచుంటిమి. నీవు నీప్రియు రాలిని దోడ్కొని నీయిచ్చవచ్చినచోటికరుగుము. నీతోఁ గలిసి యుండుటచేఁ మామనములం దనుమానము బలమగుచున్నది. నేను నాకోశాగారమును దీయించెదను. నీకు వలసినధనమును రత్నములను దీసికొని బయలుదేఱుము" అని చెప్పెను.

ముహమ్మదు మిక్కిలి దుఃఖించుచు వారిని వీడిపోయెను. అతని ప్రేయసి యతనితో నరిగెను.

శుజా తనమనంబున "ఇప్పుడు మఱి నేను యుద్ధ మొన ర్పను. చటగ్రామముకడ నోడయెక్కి మక్కాకు వెళ్లిపోవుదును" అని నిశ్చయించుకొనెను. తరువాత నతఁడు వేషమును మార్చు కొని ఢాకానగరమును వీడి మక్కానగరమునకు బయలు దేఱెను.

---

## నలువదినాల్గవపరిచ్ఛేదము.

వర్షాకాలమం దొకదినము మూఁడవయామమున నొక ఫకీరు మువ్వురు కుమారులను, యౌవనవంతుండను నొకనొకరును దీసికొని రాజర్షియుండుదుర్గముదెసకు వచ్చుచుండెను. కుమారు లలసిన ట్లగపడుచున్నారు. వర్షము జోరుగాఁ కురియుచుండెను. గాలియు దానికిఁ దీసిపోక వంతమువేసినట్లు బరాబరుగా వీచుచుండెను. ఆఫకీరుతో నడుచుచున్నపుత్రులలోఁ గడసారివానికిఁ బదమూఁ డేండ్లకంటె నెక్కువ వయస్సు లేదు. ఆబాలుఁడు చలిచే గజగజ వణకుచు "బాబూ! నేనిప్పుడు మఱినడువఁజాలను" అని వినువారికి జాలికలుగునట్లు రోదనముఁ జేయనారంభించెను. ఫకీ రేమియు మాఱువలుకక యాపిల్లవానిని దనదగ్గఱకుఁ దీసికొనెను. అందఱికంటెఁ బెద్దవాఁడు తనతమ్ముని గదుముచు "దారిలో నిట్లేడ్చిన నేమిఫలము నోరు మూయుము. ఊరక తండ్రిగారి సధైర్యవఱుపకుము" అని భయము చెప్పెను. అప్పుడా చిన్నపిల్లవాఁడు భయపడి యేడ్చుటమాని యూరకుండెను. రెండవవాఁడు "మన మెచ్చటికి పోవుట" యని తండ్రిగారి నడిగెను. "దవ్వులఁ గాన్పించుచున్న దుర్గమునకుఁ బోవుచున్నాము" అని ఫకీరు జవాబుచెప్పెను.

బాలు.—అక్కడ నెవరున్నారు.

ఫకీరు.—రాజ్యచ్యుతుండైన యొకరాజిచ్చట సన్న్యాసిగాఁ గాలక్షేపము చేయుచున్నాఁడని వినికి.

బా.—బాబాజీ! రాజు, సన్న్యాసి యగుటకుఁ గారణమేమై యుండును ?

ఫకీరు—"అదియేమో నేనెఱుంగను; కాని యీతనితమ్ముఁ డితనిఁ బరాభవించి దేశమునుండి వెడలఁగొట్టెను. అతఁడు వీని రాజ్యమును, సుఖమును, ఫలమును, సంపత్తు నంతయు నపహరించెను. ఇతఁడు దీనుఁడై యచ్చటచ్చటఁ దిరుగుచున్నవాఁడు. ఈతనికడఁ గాషాయాంబరములు దప్ప యితరమేమి యుండును. ఉండుటకై చీఁకటికొంప యొకటిమాత్ర ముండును. తనయున్నదమ్మునితో విరోధించిన యీదీనుని కేమియు శరణము లేదు." అని పలుకుచు ఫకీరతివేగముగాఁ దనపెదవులను గఱచుకొని హృదయావేగము నాఁపుకొనెను.

పెద్దకుమారుఁడు.—"ఈ సన్న్యాసి యేదేశమునకు రాజుగా నుండెనో ?"

ఫకీరు.—"ఆసంగతి దెలియదు."

పెద్ద.—"మన ముండుట కీతఁడు స్థలమీయునిచో!"

ఫకీరు.—"చెట్టునీడను విశ్రమింతము. మన కిప్పు డంతకంటె వేఱేమియు శరణము లేదు."

ప్రొద్దు గ్రుంకకముందే రాజర్షియును ఫకీరును గలిసికొనిరి. వారొకరి నొకరు చూచుకొని భయమునొందిరి. రాజర్షి తదేకదృష్టితో ఫకీరును జూడసాగెను. అతఁడు నిజముగ ఫకీరుగాఁ గన్పడలేదు. స్వార్థముతో నిండియుండు వాననావేగములను హృదయమునుండి పాఱఁదోలి పరిశుద్ధమగు చిత్తముతో నీశ్వ

రుని భజించినచో నొకవిధమగు తేజము ముఖమండలము నాశ్రయించియుండును. అట్టిదేమియు ఫకీరుని ముఖమున మచ్చునకైనఁ గానరాలేదు. ఫకీరు ఖిన్నుఁడై యున్నట్లును భయపడియున్నట్లు నాతనిముఖలక్షణములు చెప్పక చెప్పుచున్నవి. ఆతనిహృదయమున నున్నయాశావాసనలు ప్రజ్వలితములగు నేత్రములచే నగ్నిజ్వాలలను పానము చేయుచుండెను. ఆతనిమనస్సున నణఁగియున్న హింసాపిశాచము తన్నుఁ దానే కోసి కోసి తినుచుండెను. ఆతనివెంటనున్న ముగ్గురుకుమారుల మఱుఁగుపడియున్న దేహచ్ఛాయలను జూచినను నొకవిధమగు గౌరవముతోఁ గూడుకొనియున్న వారిసంకోచభావములను గుఱుతించినను, వారాగర్భశ్రీమంతులనియు, మిక్కిలి గాగాబముచేఁ బెండఁబడిరనియు అంతఃపురమును విడిచి నేలపై నడుగిడియుండరనియు దోఁచకమానదు. నిజముగఁ దొలుదొల్త వీరు భూమిపై నడుగుపెట్టిరి. కాలుగదల్పఁ గాలివ్రేళ్లయందు ధూళి యంటుచున్నది. ఇంతకుముందు వీరెప్పుడును నడకయందనుభవము గలిగియుండలేనట్లు పొడఁగట్టుచున్నది. ధూళిధూసరిత మగుపృథ్వియొక్క దరిద్రావస్థయందు నిజముగ ననుక్షణమును వీరికిఁ గసటర మందయించుచుండెను. పంకమును గోడిరాలను దలంచుకొని వారు మాటిమాటికిని భూమిని నిందించుచుండిరి. భూమియును వారియందీర్ష్య వహించినదివోలె మార్గమున వారిని మిక్కిలి బాధించెను. వారేయేవిషయములచే బాధింపఁబడుచుండిరో యవియన్నియును దమపై శత్రుత్వము వహించె ననుకొనుచుండిరి. బిచ్చమునకై తమమలినవస్త్రములనుఁ జూచుకొనివచ్చు

దరిద్రులను జూచి వారికి మిక్కిలి యసహ్యముగా నుండెను. పసిపట్టి వెన్నంటివచ్చుశునకములకు లోకులు తమకడనుండు తినుబండములను దూరముగా విసరివేయునట్లు తమ్ము వెంట నంటివచ్చు బిచ్చగాండ్రయసహ్యావేషమునకు రోసి పిడికిళ్లతో రూపాయిలను దీసి దూరముగా విసరివేయుచుండిరి. లోకుల నీచావస్థయును, చినిగిపోయిన ముఱికిగుడ్డలును జూచి లోకములో నెట్టి దీను లున్నవా రని తెలిసి వారచ్చెరువు నొందసాగిరి. ఇట్టి వీ రివ్వి డీలోకమున సుఖమునకును గౌరవమునకును దూరులై యుండుట విచారకరము. అది ప్రకృతిసంబంధమగు దోషమే. మనరాజర్షి వారిట్లు కష్టములపా లగుట కంతగా విచారింప లేదు. వారిలక్షణములను జూచినతోడనే యాతఁడు "వారు సంపూర్ణముగా సుఖములను రోసి విసర్జించి స్వతంత్రముగా లోకమున కుపకార మొనర్ప నిలువెకలలేదనియును, తమ యాసలు ఫలింపవందున నోపమునవి యిలువిడిచి వచ్చిరనియు దలంచెను. ఏదికావలయునన్న నీలోకమున నేల లభింపదు" ఫకీరునిమనంబున నుండుసుద్దేశ్య మిదియే, కాని, లోకమునం దనయదృష్టమువలన లభించినదానితోఁ దృప్తినొందియుండ నతని కిష్టము లేదు. లోకము వానికేమియు సౌఖ్యము నీయ లేదు. ఇకార్యకారణమున లోకముతో విరోధించి దాని నగ్రాహ్యముగాఁదలంచి పరిత్యజించి యీఫకీరు నిజముగ లోకమునుండి వేఱయ్యెను.

ఫకీరు రాజర్షిని జూచినంత నతని మొదటియభిప్రాయము మాఱెను. అతనిని రాజని పిలువవలెనో! సన్యాసి యని పిలువ

వలెనో! యాతఁడు నిశ్చయింపలేకపోయెను. ఆఫకీరున కేమియుఁ బాలుపోకుండెను. రాజర్షి విలువగల వస్త్రాభరణములను గిరీటమును ధరించియుండలేదు. దేహమంతయును బూడిద పూసికొని నేలపైఁ బరుండి తనసాధుత్వమునకు గర్వించుచుండలేదు. ఫకీ రారాజర్షి వేషమును జూచి యిట్టు లనుకొనెను. ఇతఁడు నిజముగ వైరాగ్యముతో సర్వస్వమును ద్యజించెను. ఐన సీతని నైశ్వర్యమెచటఁ బాయలేదు. ఈతఁ డనుభవింప నిచ్ఛయించినచో నన్నియుఁ దమంతటఁ దాము వచ్చిచేరును. ఈతఁ డెట్టు లాత్మార్పణ మొనరించెనో యట్టులే లోకమంతయు సీతనిసేవయందు దన్ను దాను సమర్పించుకొని యున్నది. రాజునకుఁ గలపటాటోపము లేవియు లేకున్నను నితఁడు రాజని పిలువ నర్హుండే. అలాగుననే యీతఁడు లోకసంబంధము లగు నవశ్యకృత్యములు నిర్వర్తించుచున్నను సన్న్యాసి యని పిలువ నర్హుండె. అని యీకారణములంబట్టి యతని నెట్లు పిలువవలయునో తెలియదయ్యెను.

రాజర్షి వచ్చిన యా యతిథులకెంతయు గౌరవమున స్వాగతమిచ్చి యచ్చటనుండి విధ్యుక్తముగ వారిని సేవించెను; కాని వా రారాజర్షి యొసంగుసపర్యల నేలకో యనాదరముగ స్వీకరించిరి. వారు నిజముగ సిగ్గువడియుందురేమో. ఆయతిథులు తమ కేయేవస్తువులు కావలసియుండెనో రాజుగారి కెఱింగించిరి. రాజుగారు పెద్దకుఱ్ఱవానితోఁ బ్రీతిపూర్వకముగా "దారినడుచుటచేత మీ రలసిన ట్లగపడుచున్నారు" అనెను.

ఆపెద్దకుమారుఁడు రాజర్షి కుచితమగునుత్తర మీయక
మౌనముతో ఫకీరునిదగ్గఱఁ గూర్చుండెను. రాజర్షి యు నంతతో
విడువక స్నేహదృష్టిప్రసారంబులు వారలపై బఱపుచు రిచ్చ
వడుచు "మీసుకుమారశరీరములు దారినడుచుట కర్హములు
కావు. మీరందఱుఁ గొన్నిదినము లీదుర్గమున నిలువుండు. నేను
మిమ్ముల నతిగౌరవముగా నుంచెదను. ఏవిధమైన కష్టమునకు
మిమ్ములఁ బాల్పడ నీయను." అని పలికెను.

రాజుగారి యీమాటకుఁ బ్రత్యుత్తర మీయవలయునో?
లేక కూడదో! ఉచితమైనచో నేమని ప్రత్యుత్తర మొసంగ
వలయునో యాకుఱ్ఱవాని కేమి తెలియును. ఇతరులతో నెట్లు వ్యవ
హరింపవలయునో వారి కెఱుక లేదు. ఆముగ్గురు కుమారులు
నూరక ఫకీరునివైపు చూచుచు నాతనికడఁ గూర్చుండిరి. "త
మ్మీకాషాయాంబరధారి నిజముగ దన యుపవిత్రముగు చేయి
చాచి తనపై వీడ్చుకొనఁగోరు చున్నాఁడేమో యనుకొనిరి.

ఫకీరు గంభీరస్వరముతో "సరియే మేము తమదుర్గమున
గొన్నిదినము లుండఁగలము." అని పలికెను. ఫకీ రారాజర్షి
వర్యుని మిక్కిలి కొనియాడెను. "నీవు నన్ను "శుజా" గా నెఱిం
గితి వేని నాయందలియీ యాదరమును నిముసములో నాఱిచి
విచారమున మునుంగుదువు."అని తనలోఁదా ననుకొనియెను.

ఆకుమారత్రయము రాజర్షితో నెట్టుప్రసంగము చేయుట
కును జంకుచుండిరి. ఫకీరు నొక్కమాఱుగా నిరపేక్షుఁడై యూర
కుండెను. తరువాత నాఫకీరు రాజుగారితో "అయ్యా! తా

మొకప్పుడు మహారాజ్యపదవి నలంకరించిరని వింటిమి. మీ రేరాజ్యమునకు రాజుగా నుండిరి" అని యడిగెను.

"త్రిపురారాజ్యమునకు" అని రాజర్షి ప్రత్యుత్తర మిచ్చెను.

ఆకుమారత్రయము త్రిపురా యనఁ జిన్నరాజ్య మను కొనిరి. వా రారాజ్యముపే రెప్పుడును వినియుండలేదు. ఫకీరున కేదియో జ్ఞప్తికి వచ్చెను. "తాము రాజ్యచ్యుతులగుటకుఁ గారణమేమో నేను తెలిసికొనవచ్చునా;" అని మరల నడిగెను.

రాజర్షి కొంతదనుక మాటలాడలేదు. తరువాత నతఁడు "బంగాలీనవాబువారగు శాహశుజాప్రభువు నన్ను రాజ్యము నుండి వెడలనడిచెను" అనెను. అతఁడు నక్షత్రరాయుల నేమియు ననలేదు.

ఆమాట వినునంత నాకుమారత్రితయ మదరిపడి ఫకీరుని ముఖమును జూచుచుండిరి. ఫకీరునిముఖము వెలవెలఁ బోయెను. ఆతని కేదియో పూర్వప్రసంగము తలంపునకు వచ్చెను. తుద కాతఁడు సాహసించి "మాకును దెలియును. మీ యనుజన్ముఁడే మిమ్ములను రాజ్యమునుండి వెడలఁగొట్టెను. మీ రాజ్యము నాతఁ డవహరించి మిమ్ము సన్న్యాసిగా నొనరించి నాఁడు.

రాజర్షి యచ్చెరువొంది "సాహెబుగారూ! తా మీ యుదంతము నెట్లెఱింగితిరి?" అని యడిగెను. మఱియుఁ దనలోఁ దా నాలోచించి ఆశ్చర్యమున కేమున్నది. ఈతఁ డెవరివలననో వినియుండును" అని యనుకొనెను.

ఫకీరు "నాకేమియును తెలియదు. నే నట్లూహించి యడిగినాను."

ఆరాత్రి ఫకీరు తనముగ్గురుపుత్రులఁ దోడ్కొని నిదురింపఁబోయెను. ఫకీరున కారాత్రి యంతయు నిదుర రాలేదు. అతఁడు మేల్కొని యుండియుండి దుస్స్వప్నములను గనుచుఁ దుల్లిపడుచుండెను.

మఱునాఁ డుదయమున ఫకీరు రాజర్షితో "అయ్యా! మాకొక యావశ్యకముగుపని గలిగినది. కావున మేమిచ్చట నెక్కువదినము లుండుటకు వీలులేదు. నేఁడు మే మిక్కడినుండి సెలవుఁ దీసికొనుచున్నాము."

రాజర్షి.—అయ్యా! "ఈబాలు రలసియున్నవారు. వారిని గొన్నిదినములు విశ్రమింపనిండు. తరువరి మీ రాయిచ్చవచ్చి నప్పుడు మీరరుగుదురుగాక" అని పలికెను.

ఈమాటలు చెవిసోఁకినతోడనే యాముగ్గురుకొమరుల కును గొంచెము కోపమంకురించెను. అందున పెద్దవాఁడు తండ్రిదెసఁజూచి "మే మంత చిన్నబిడ్డలము కాము. అవసరము వచ్చినప్పుడు మే మెట్టికష్టముల నైన సహింపఁగలము." అని వచించెను.

రాజర్షివర్యుని స్నేహపూరితములగు వాక్కు లాకుమార త్రయమున కేలనో రుచింప వయ్యెను. వారా రాజర్షిచే నన్నా వఁబడుచు నచ్చటనుండ నిష్టపడలేదు. కారణమేమియో మన తెలియును?

ఫకీరునాపుట కింతకంటె నెక్కుడుగాఁ జెప్పుట నమంజ సముగా నుండదని రాజర్షి నత్తయుఁ దూరకుండెను. ఫకీరు బయలుదేఱుటకు సన్నాహ మొనర్చుకొనుచుండ నప్పటికి మఱి యొకయతిథి విచ్చేసెను. ఆయతిథినిఁ జూచి రాజర్షియు ఫకీరును మిక్కిలి భయమందిరి. ఫకీరునిముఖ మెండబాఱెను. అప్పుడు తనకర్తవ్యమేమో యతఁడు మఱచిపోయెను. వడంకుచు నటు నిటుఁ జూచుచుండెను. రాజర్షి వచ్చినతనయతిథికిఁ బ్రణమిల్లెను. అతిథి యెవరని సంశయింప నక్కఱ లేదు. అతఁడు మనకుఁ బూర్వ మత్యంతపరిచితుండగు రఘుపతియే. రఘుపతి జయ మగుఁ గాకయని మాణిక్యరాయలను ఆశీర్వదించెను. జయమా ణిక్యరాయ లచ్చెరువంది రఘుపతితో "గురువర్యా తాము నక్షత్రరాయలుకడనుండియేనా వచ్చుట? క్షేమవిశేష మే మైనఁ గలిగెనా యేమి?" అని యడిగెను.

రఘు.—నక్షత్రరాయలు క్షేమముగా నున్నాఁడు. ఆతనివిషయ మున మీరేమియు విచారింప నవసరము లేదు. (ఆకాశము వంక చేతులెత్తి) జయసింహుఁడు నన్ను మీకడకంపెను. అతఁ డిప్పు డీలోకమున లేడు. ఆతనిహృదయమున నున్న యాశయము పూర్తిచేయనిచో నాకు సుఖ మెక్కడిది. నే నెప్పుడును నీవెనువెంటనే యుండి నాకు సాధ్యమైనంతవఱకు నీకిష్టమగు పనిపాటలయందుఁ దోడు చూపెదను. మాణిక్య రాయలకుఁ గొంతసేపటివఱ కాతనియాశయము బోధపడ నదికాదు. "ఈరఘుపతికి వెఱ్ఱి యెత్తలేదు కద" అని యా డనుకొనెను. కాని యాతనిమాట కేమియు జవాబీయ

రఘు.—నే నీప్రపంచమునందు సంశయములన్నియుఁ దిలకించి నాను? కాని నాకు దేనియందును సుఖమగపడలేదు. హింస యందును సుఖములేదు. రాగద్వేషములయందును సుఖము శూన్యమే. ఇంకఁ బ్రభుత్వమునొందినను సుఖము పూజ్యమే. తామేవృత్తి నవలంబించియుండిరో దానియందుమాత్రము సౌఖ్యముకలదు. నేను మీతో విరోధించితిని. మిమ్ము దుఃఖము నొందించితిని. హాయిగనే నీవఱకు మిమ్ము నాకడ బలినీయం దలంచితిని. కాని నేడు సంపూర్ణమగు నాశయముతో మీకాత్మార్పణ మొనరించుచున్నాను.

రాజ.—తాము నాకెంతయో యుపకార మొనర్చితిరి. నాశత్రుచ్ఛాయవలె నన్ను వెన్నాడి శత్రుపంజరమునుండి నన్నుఁ దప్పించితిరి.

రఘుపతి.—యీమాటలను వినకయే "మహారాజా! నే నిన్ని దినములనుండియు బ్రాణికోటుల హింసించి రక్తపాత మొనర్చుచు నే హింసాపిశాచిని సేవించుచుంటినో యది నా హృదయరక్తము నిప్పుడు పీల్చుచున్నది. రుధిరపిపాస గల జడత్వమును మూర్ఖత్వమును విడిచిపెట్టి నే నిప్పు డిట దేవు సన్నిధి కరుదెంచినాను. ఆపిశాచ మిప్పుడు ప్రభువువారి నగర మందలి దేవమందిరమున లేదు. అదిప్పుడు రాజదర్బారునఁ బ్రవేశించి సింహాసనముపై నెక్కి కూర్చుండి యున్నది."

రాజ.—దేవమందిరమునుండి యాపిశాచి దూరమైనది. కావున నది క్రమక్రమముగా మనుష్యులహృదయములనుండియు

దూరమగును" (అని యనుచుండ వెనుకనుండి పూర్వపరి చిత మగు నొకస్వరమున నొకమాట వినవచ్చెను) కాదు. "మహాప్రభూ! మనుష్యహృదయమే దానికి యథార్థమగు మందిరము. ఈమందిరమున ఖడ్గము పదనెక్కుచుండును. మఱియు నచ్చోటనే శతసహస్రసంఖ్యాకములగు ప్రాణుల హింసయు నగుచుండును. దేవమందిరమం దన్ననో యొకవిధ మగు దాని యభినయముమాత్రము జరుగుచుండును" అని.

గోవిందమాణిక్యరాయ లచ్చెరువంది వెనుక దిరిగినంత నవ్వుచుఁ బ్రసన్నమైన బిల్వనదేవునిమూర్తి కానవచ్చెను. దిగ్గన లేచి యానందబాష్పజలములచే నాతనియడుగుదమ్ములఁ గడుగుచుండెనో యనఁ బ్రణామ మొనర్చి "నేఁడు నాయానంద మునకు మేరలేదు" అని పలికెను.

బిల్వ:—ప్రభువువారు స్వకీయాంతఃకరణమును జయించి లోక మునంతయు జయించినారు. అందుచే నేఁడు మీాగుమ్మము కడ శత్రువులు మంత్రులందఱును గలిసి సమానభావముతో నిలిచియున్నవారు.

ఇవి యన్నియును వినుచున్న ఫకీ రొక్కింత ముందునకు వచ్చి "మహారాజేంద్రా! నేను మీాకుఁ దలంపరానిదురాతిని (శత్రువును)నాజీవితమునుఁగూడ నేఁడు మీాహస్తమున నర్పించు చున్నాఁడను." అని రఘుపతిని వ్రేలితోఁ జూపించుచు "ఈ బ్రాహ్మణుని నేనెఱుంగుదును. నేనే శుజా యనువాఁడను. బంగాలీదేశనవాబును నేనే. నిరపరాధులగు మిమ్ము నిష్కార

ముగా దేశమును వెడలఁగొట్టించినాను. ఆపాపఫలము వెంటనే యనుభవించినాను. తమ్ము హింసింపవలయునను నాపిశాచ గుణము నారుధిరమును పానము చేయుచు నేఁడు కంఠమును బట్టుకొని వెన్నంటి తిరుగుచున్నయది. నారాజ్యమున నేఁ గాలు పెట్టుటకైన నాకుఁ జోటులేదు. నే నిప్పుడు మాఱువేషమును వేసికొని యుండఁజాలను. నన్ను మీరాకర్షించుకొని మీసంరక్షణములో నుండఁ గోరుచున్నాఁడను." అని చెప్పెను. గోవిందమాణిక్యరాయ లాఫకీరు (శుజా) కంఠమును గౌఁగిలించుకొని "నేఁడు నాభాగ్యము నేమని వర్ణింపఁగలను." అని యానందమునఁ దేల్చెను.

రఘు.—"మహారాజేంద్రా! మీతో శత్రుత్వమువహించుటలో లాభము కలదు. నేను మీతో విరోధించిపోవుటచేతనే నేఁడు మరల మీసాన్నిధ్య మందితిని. లేకున్న మిమ్ము నెప్పుడైన నిట్టులు గలిసికొనఁగలనా?"

బిల్వ.—నవ్వుచు "నిజము! నిజము! ఉరిలోఁ దగుల్కొని యెవ్వఁడైన దానినుండి తప్పించుకొనవలె నని ప్రయత్నించినచో నాతనికంఠము మఱింత బిగిసికొనును" అనెను.

రఘు.—నేనిప్పుడు నిర్ద్వంద్వుఁడనై యున్నాఁడను. నాకేమియు దుఃఖము లేదు. నే నిప్పుడు శాంతినొందియున్నాను.

బిల్వ.—శాంతిసుఖము తనహృదయమునందే యుండును. లోకులు దానిని వెదకరు. నిజముగ మృత్పాత్రమునం దీయమృతమును బరమేశ్వరుండు నింపి యున్నాఁడు. కాని యిది

యమృత మని యెవరికిని నమ్మకము లేదు. శ్రీపిడిగలన నది వచ్చి పోయినచోఁ దగువాత నెన్నాళ్లకో యామధాయధురము లభించును. ఇట్టి మహాపురూపమావస్తువు నిక్కడ నైన నిట్టి పాత్రమునందే యుంచెదరు.

ఇవనుంగునను గీతిలర్వ్వనులను జేయునఁ గొందఱు బాలకులు దుర్గములోనికి వచ్చిరి. రాజుగారు తాకూరువారితో "స్వామీ! చిత్తగింపుఁడు; వీరందఱు నా ధ్రువులు." అని చెప్పి బాలకులకై వు వ్రేలినత్తి చూపించెను.

ఠాకూ.—మీరొక్క ధ్రువునికి మాఱుగా నిందఱి ధ్రువులను సంపాదించితిరి. ఆధ్రువుండును మిమ్ము గావలేనుండి. నే నిప్పు డాబాలుని దెచ్చి మీకొప్పఁజెప్పెదను" అని పలికి యాతఁడు దానలకుఁ బోయి కొంతసేపునకు ధ్రువునిఁ జంకఁ బెట్టుకొని మఱలివచ్చెను. అతఁడు రాజుగారియొడిలో వానిఁ గూర్చుండఁబెట్టెను. రాజుగారు ధ్రువునిఁ గౌఁగిలించి మూర్ధ మాఘ్రాణించి చుబుకంబు పుణుకుచు "ధ్రువా" అని పిలిచెను. అట్టిసమయమున రాయలహృదయముగాని, యాబాల కునిమనము గాని యెట్లులుండునో వర్ణింప నాతరముగాదు. అది హృద్య మనుభవైకవేద్య మని నాయభిప్రాయము.

ధ్రువుండేమియుఁ బలుకలేదు. మాటలాడక రాజేంద్రుని గళమునఁ దనశిరము నుంచుకొని వండుకొనియెను. చాలదినము లనుండియుఁ జూడక పోవుటచే నిజముగ నాబాలుని చిన్న హృదయమునఁ గొంచెము నొప్పియు సంకోచమును గలిగియు

వచ్చును. అది యిప్పుడు ప్రత్యక్షమై పలుకనీయలేదు. ఆపిల్ల -ఁడు రాజేంద్రునికంఠమును బిగ్గరగాఁ గౌఁగిలించుకొని తన మోమును దాఁచుకొనియెను.

రాజ.—"ఇంకనన్నియుఁ దీఱినట్లే! కాని నక్షత్రరాయలు న న్నొక్కసారి యన్నా యని పిలిచినఁ జాలును."

శుజా.—"మహారాజా! ఇంక లోకులందఱు నన్నదమ్ములతీరున మంచిగ వ్యవహరింతురుగాని తనయున్నదమ్ములు మాత్ర మన్నా! దమ్ముఁడా! యని వ్యవహరింపరు." శుజాహృదయమున దమ్ముఁ డనువ్యవహారము కత్తివలె గ్రుచ్చుకొను చుండెను.

---

# ఉపసంహారము.

---

ఇంక నిచ్చట( దెలిసికొన( దగినదొకటి గలదు.
శుజా యని తెలిసెను. ఆతని వెనుక నుండు ముప్వురును గు
లని యంతవఱకు వ్యవహరింప(బడుచున్నారు గాని
వేషములను వేసికొనినవారు శుజానవాబువారికుమా
రాజర్షి వారితో మాటలాడునప్పటిచర్య స్మరించుకొని
నిది బలపడును. శుజా అల్లు(డగుమహమ్మదుని జాయా
ముగా నంపించి మక్కాకు బ్రయాణమై పోవ నిశ్చయి
కొనినట్లు మన కీవఱకు( దెలిసియున్న యంశమే గదా!
డనుకొన్నట్లు చటగ్రామపు రేవునకు మాత్రము వచ్చెను. అ
నతని యభాగ్యతయోయన విపరీతముగ వర్షము కురి
అందుచే నొకపడవయైన నాతనికి లభింపకపోయెను. త
హతాశుండై యక్కడనుండి తిరిగి వచ్చుదారిలో మన
గారితో నీదుర్గమున వారికి( బరిచయము గలిగినది. తరు
శుజా కొన్నిదినములాదుర్గమున నివసించియుండెను. కొని
ముల తరువాత ఫాదుషాసేన లాతని వెదకుచు వచ్చుచున
తెలియవచ్చెను. గోవిందమాణిక్యరాయలాసంగతి విని
లకు( బల్లకీలు మొదలగు కావలసిన సన్నాహములను జత
తగుపరివారము నిచ్చి మిక్కిలి గౌరవముగా( దనమిత్రు
నరాకానురాజుకడకు వారితో నంపెను. శుజా యక్కడి
యరుగుచున్నప్పుడు మాణిక్యప్రభువునకు బహుమూల్య
తనఖడ్గమును కానుకగా నిచ్చెను. ఇంతలో రాజుగారును రఘ



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B152 |
| పుస్తకం పేరు | రాజర్షి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 317 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8 |
| లేని పేజీలు | I TO XVI |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | S.Deeksha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |